**తాత్పర్యము :** సునందయను నది యొడ్డున జేరి ఒక్కపాదము భూమిపైన మోపి నిలువబడి నూఱు సంవత్సరములు ఘోరమైన తపస్సు జేయుచు నీమాట చెప్పెను.

**మనురువాచ :** మనువు వచించెను

**శ్లో॥ వాసుదేవో వసత్యేష సర్వదేహేష్వనన్యదృక్।**
**యే న చేతయతే విశ్వం విశ్వం చేతయతే న యమ్॥** 9

**ప్రతిపదార్థము :** యేన=ఏ పరమాత్మునిచే, విశ్వమ్=జగము, చేతయతే=చైతన్యము గలదగుచున్నదో, విశ్వమ్=లోకము, యమ్=ఎవనిని, న చేతయతే=ఎఱుగదో, అనన్యదృక్= ఇతరులచే చూడబడనివాడై, ఏషః=ఈ వాసుదేవుడు, సర్వదేహేషు=ఎల్ల దేహములందు, వసతి=అంతర్యామియై యున్నాడు.

**తాత్పర్యము :** ఈ విశ్వమునంతటి నెవరు చేతనవంతముగా జ్ఞానముగలవానినిగాజేయు చున్నాడో, ఈ విశ్వమెవనిఁజేతనవంతునిగా జేయలేదో (ఎవని నెఱుంగలేదో) ఆ వాసుదేవుడితరులకు జూడ శక్యముగాని వాఁడెల్లప్రాణులందు శరీరములందు అంతర్యామి రూపముననున్నవాడు. స్వయముగానే చిద్రూపుడు.

**శ్లో॥ యో జాగర్తి శయానేఽస్మి న్నాయం తం వేద వేద సః** 10
అందుకు కారణము

**ప్రతిపదార్థము :** అస్మిన్=ఈ జీవరాశి, జగము, శయానే=నిద్రావస్థ నొందినప్పుడు, యః =ఎవడు, జాగర్తి=సాక్షియై యున్నాడు, అయమ్=విశ్వము, జీవరాశి, తమ్=ఆ, వాసుదేవుని, న వేద=ఎఱుంగడు, సః=అతడు, వేద=ఎఱుంగును.

**తాత్పర్యము :** ఈ విశ్వమంతయు (జీవరాశియందు) నిద్రావస్థను పొందినపుడు ఎవడు సాక్షియై వెలుగొందునో ఆ వాసుదేవుని ఈ జీవలోక మెఱుంగలేదు. అతడు జీవరాశి నంతయు నెఱుంగుచున్నాడు.

**శ్లో॥ ఆత్మావాస్యమిదం విశ్వం యత్కిఞ్చిజ్జగత్యాం జగత్।**
**తేన త్యక్తేన భుఞ్జీథా మా గృధః కస్యస్విద్ధనమ్॥** 11

ఆ వాసుదేవుడు జగదారాధ్యుడని తెల్పుచు లోకమునకు హితమునుపదేశించు చున్నాడు.

**ప్రతిపదార్థము :** ఇదమ్ విశ్వమ్=ఈ విశ్వమున, ఆత్మ+ఆవాస్యమ్=పరమాత్మ సర్వత్ర నెలకొని ఉన్నాడు, జగత్యామ్=ఈ జగత్తులో, యత్ కించిత్=ఏదైతే ఉన్నదో, ఆ, జగత్=భూత జాలము, తేన=ఆతని చేతనే, త్యక్తేన=ఇవ్వబడినదానిచే, భుంజీథాః=భోగములను అనుభవింప వలెను. కస్యస్విత్‌ధనమ్=వేరెవ్వరి యొక్క ధనమునైనను, మాగృధః=గ్రహింపవలదు.

తాత్పర్యము : ఈ జగత్తులోని భూతజాలము సర్వత్ర నెలకొనియున్న పరమాత్మచే ఇవ్వబడిన దానిచేతనే భోగములను అనుభవింపవలెను. వేరెవ్వరి యొక్క ధనమైనను గ్రహింపవలదు.

శ్రీః

# శ్రీమద్భాగవతమహాపురాణమ్

## అష్టమస్కన్ధః

**ఆంధ్రప్రతిపదార్థతాత్పర్యములు**

**శ్రీ చదలువాడ జయరామశాస్త్రి**

### ప్రథమోఽధ్యాయః

**రాజోవాచ :** పరీక్షిన్మహారాజు వచించెను.

శ్లో॥ స్వాయమ్భువస్యేహ గురో వంశోఽయం విస్తరాచ్ఛ్రుతః।
యత్ర విశ్వసృజాం సర్గో మనూనన్యాన్ వదస్వ నః॥ 1

**ప్రతిపదార్థము :** హేగురో=ఓ గురుదేవా!, యత్ర=ఏ వంశమున, విశ్వసృజామ్=పుత్రపౌత్రాది రూపము అగునదున్నదో, స్వాయంభువస్య=స్వాయంభువ మనువు యొక్క, వంశః అయమ్= ఈ వంశము, ఇహ=ఇచట, విస్తరాత్=విస్తృతముగ, శ్రుతః=వింటిని, నః=మాకు, మనూన్ అన్యాన్=ఇతర మనువులను గూర్చి, వదస్వ=వివరింపుము.

**తాత్పర్యము :** ఓ గురుదేవా! ఏ వంశమున, పుత్రపౌత్రాది రూపమగున దున్నదో, స్వాయంభువమనువు యొక్క వంశము ఇచట విస్తృతముగ వింటిని. మాకు ఇతర మనువులను గూర్చి వచింపుము.

**శ్లో॥ మన్వన్తరే హరేర్జన్మ-కర్మాణి చ మహీయసః।**
**గృణన్తి కవయో బ్రహ్మంస్తాని నో వద శృణ్వతామ్॥** 2

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ మహాత్మా, మన్వన్తరే=మన్వన్తరమున, కవయః=పండితులు, మహీయసః=మహత్తముడగు, హరేః=శ్రీహరి యొక్క, జన్మకర్మాణి=జన్మకర్మములను గూర్చి, గృణన్తి=కీర్తించుచున్నారో, శృణ్వతామ్=వినదలచిన, నః=మాకు, తాని=వాటిని, వద= చెప్పుము.

**తాత్పర్యము :** ఓ మహాత్మా! మన్వన్తరమున పండితులు మహత్తముడగు శ్రీహరి యొక్క జన్మకర్మములను గూర్చి కీర్తించుచున్నారో, వినదలచిన మాకు వాటిని చెప్పుము.

**శ్లో॥ యదస్మిన్నన్తరే బ్రహ్మన్ భగవాన్ విశ్వభావనః।**
**కృతవాన్ కురుతే కర్తా హ్యతీతేఽనాగతేఽద్య వా॥** 3

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ మహాత్మా!, విశ్వభావనః=విశ్వపాలకుడగు, భగవాన్= భగవంతుడు, అద్య=నేడు, యస్మిన్ అన్తరే=ఈ మన్వన్తరమున, కృతవాన్ కురుతే=కర్మలను చేయుచున్నాడు. యత్=ఏ కర్మలు, అతీతే=గతకాలముననను, వా+అనాగతే=రాబోవు కాలముననను, కర్తా=చేయుచున్నాడో గదా!

**తాత్పర్యము :** ఓ మహాత్మా! విశ్వపాలకుడగు భగవంతుడు నేడు ఈ మన్వన్తరమున కర్మలను చేయుచున్నాడైనచో గతకాలముననను రాబోవు కాలముననను చేయుచున్నాడు గదా!

**ఋషిరువాచ :** ఋషి వచించెను

**శ్లో॥ మనవోఽస్మిన్ వ్యతీతాః షట్ కల్పే స్వాయమ్భువాదయః।**
**ఆద్యస్తే కథితో యత్ర దేవాదీనాం చ సమ్భవః॥** 4

**ప్రతిపదార్థము :** అస్మిన్ కల్పే=ఈ శ్వేత వరాహకల్పంలో, స్వాయంభువాదయః =స్వాయంభువుడు లోనగు, మనవః=మనువులు, తే షట్వ్యతీతాః=ఆ ఆఱుగురు గడచిరి, ఆద్యః =మొదటివాడైన స్వాయంభువమనువు, కథితః=చెప్పబడెను, యత్ర=ఏ మన్వంతరము నందు, దేవాదీనామ్=దేవతలు లోనగువారి, సంభవః=జన్మము, కథితః=చెప్పబడెనో

**తాత్పర్యము :** ఈ శ్వేతవరాహ కల్పమందు ఇప్పటికి ఆఱుగురు మనువులు ఉండిరి. వారిలో మొదటి రాజగు స్వాయంభువమనువును గూర్చియు, ఆ మన్వంతరమందు జనించిన దేవతలు లోనగువారిని గూర్చి నీకు చెప్పియున్నాను.



**శ్లో॥ ఆకూత్యాం దేవహూత్యాం చ దుహిత్రోస్తస్య వై మనోః।**
**ధర్మజ్ఞానోపదేశార్థం భగవాన్ పుత్రతాం గతః॥** 5

**ప్రతిపదార్థము :** తస్య మనోః వై=ఆ స్వాయంభువ మనువు యొక్క, దుహిత్రోః=పుత్రికలైన, ఆకూత్యామ్=ఆకూతియనునామె యందు, దేవహూత్యామ్=దేవహూతియనునామెయందును, భగవాన్=భగవంతుడు, ధర్మజ్ఞాన+ఉపదేశార్థమ్=ధర్మమును, జ్ఞానమును ఉపదేశించుట కొఱకు, పుత్రతామ్=క్రమముగా యజ్ఞమూర్తి, కపిలుడు అను పుత్రభావము, గతః=పొందెను.

**తాత్పర్యము :** ఆ స్వాయంభువ మనువు కూతుర్లైన ఆకూతియందు, దేవహూతియందు భగవంతుడు జగమునకు ధర్మమును, జ్ఞానమును ఉపదేశించుటకు క్రమముగా ఆకూతియందు యజ్ఞమూర్తి అనియు, దేవహూతి యందు కపిలుడనియు నవతరించె.

**శ్లో॥ కృతం పురా భగవతః కపిలస్యానువర్ణితమ్।**
**ఆఖ్యాస్యే భగవాన్ యజ్ఞో యచ్చకార కురూద్వహ॥** 6

**ప్రతిపదార్థము :** కురూద్వహ !=కురుశ్రేష్ఠుడా !, భగవతః=భగవంతుడైన, కపిలస్య=కపిలుని యొక్క, అనువర్ణనమ్=అనువర్ణించుట, పురా=పూర్వము, కృతమ్=తెలియజేయబడినది, అధునా=ఇప్పుడు, యజ్ఞః=యజ్ఞదేవుడు/యజ్ఞముఖుడైన, భగవాన్=భగవంతుడు, యత్+ చకార=ఏమి యొనర్చెనో, ఆఖ్యాస్యే=దానిని చెప్పెదను.

**తాత్పర్యము :** ఇంతకుముందు నీకు కపిల భగవానుని గూర్చిన వృత్తాంతమును వర్ణించి చెప్పియున్నాను. ఇప్పుడిక యజ్ఞనామధేయుడై యవతరించిన భగవంతుడు కావించిన కృత్యములను గూర్చి చెప్పెదను వినుము.

**శ్లో॥ విరక్తః కామభోగేషు శతరూపాపతిః ప్రభుః।**
**విసృజ్య రాజ్యం తపసే సభార్యో వనమావిశత్॥** 7

**ప్రతిపదార్థము :** శతరూపాపతిః=శతరూపయను నామె భర్త, స్వాయంభువుడు, ప్రభుః =ప్రభువు, కామభోగేషు=కామభోగములయందు, విరక్తః=విరక్తుడై, రాజ్యమ్=రాజ్యమును, విసృజ్య=విసర్జించి, సభార్యః=భార్యతో గూడి, తపసే=తపము చేయుటకు, వనమ్= అరణ్యమును, ఆవిశత్=ప్రవేశించెను.

**తాత్పర్యము :** శతరూపభర్తయై, ప్రభువైన స్వాయంభువమనువు కామసుఖములందు విరక్తి చెందినవాడై, భార్యతో గూడి, తపస్సు చేయుట కొరకు కానకేగెను.

**శ్లో॥ సునన్దాయాం వర్షశతం పదైకేన భువం స్పృశన్।**
**తప్యమానస్తపో ఘోరమిదమన్వాహ భారత॥** 8

**ప్రతిపదార్థము :** భారత=ఓ భరతవంశీయుడా !, సునందాయామ్=సునందయను నదీ తీరమున, ఏకేన పదా=ఒక్కపాదముతో, భువం స్పృశన్=భూమిని తాకుచు, వర్షశతమ్= నూఱేండ్లు, ఘోరమ్=దారుణమైన, తపః=తపమును, తప్యమానః=తపించుచు, ఇదమ్=ఈ మాటను, అన్వాహ=చెప్పెను.

**తాత్పర్యము :** ఇట్లు వేదాంతార్థములనుచ్చరించుచు చిత్తమునేకాగ్రము చేసియున్న స్వాయంభువుని జూచి ఇతడిప్పుడే నిద్రలేచి వివశుడై యున్నాడని తలంచినవారై అసురులు, రాక్షసులు ఆయననుఁదినుటకు పరుగెత్తుకొని వచ్చిరి.

**శ్లో॥ తాంస్తథావసితాన్ వీక్ష్య యజ్ఞః సర్వగతో హరిః।**
**యామైః పరివృతో దేవైర్హత్వాశాసత్ త్రివిష్టపమ్॥** 19

**ప్రతిపదార్థము :** యజ్ఞః=క్రతు ఫలప్రదుడను యజ్ఞుడై అవతరించి, సర్వగతః=సర్వవ్యాపకుడు అయిన, హరిః=విష్ణువు, తథా=ఆ ప్రకారము, అవసితాన్=నిశ్చయమనస్కులైన, తాన్=ఆ యసురాదులను, వీక్ష్య=చూచి, యామైః=యాములను, దేవైః=దేవతలతో (స్వపుత్రులు), పరివృతః=కూడుకొని, హత్వా=వారిని జంపి, త్రివిష్టపమ్=స్వర్గమును, అశాసత్=పాలించెను.

**తాత్పర్యము :** సర్వవ్యాపకుడైన విష్ణుడు యజ్ఞుడనుపేర నవతరించి అట్లు స్వాయంభువుని బొరిగొనబోవు అసురులను, రక్కసులను జూచి తనకు పుత్రులైన యాములను దేవతలతో కలసి వారలను జంపి స్వర్గమును బాలించెను. స్వయముగా ఇంద్రుడయ్యెనని యర్థము.

ఈ విషయమై ప్రతి మన్వంతరమును మన్వాదులు ఆఱుగురు వేఱువేఱుగా అగుచుండిరి. అదియెట్లగునో సూతుడు ద్వాదశ స్కంధమునందుఁజెప్పగలడు.

**(శ్లో॥ మన్వన్తరం మనుర్దేవాః మనుపుత్రాః సురేశ్వరః।**
**ఋషయోఽంశావతారాశ్చ హరేః షడ్విధముచ్యతే॥)**

ప్రతి మన్వంతరమున మనువు, మనుపుత్రులు, ఇంద్రుడు, నీ విష్ణువు అవతారము ఆఱు విధములు చెప్పబడుచున్నవి. వారియందు ఆద్యుడు స్వాయంభువమనువు. ప్రియ వ్రతోత్తానపాదులు మనుపుత్రులు, యమాదులు, దేవతలు, మరీచి ప్రముఖులు, సప్తర్షులు, యజ్ఞుడు, హరియవతారము. ఇంద్రుడతడే. ఆ మన్వంతరము పంచవిధమగుచున్నది. అది చతుర్థస్కంధమున నిరూపించాడు.

**శ్లో॥ స్వారోచిషో ద్వితీయస్తు మనురగ్నేః సుతోఽభవత్।**
**ద్యుమత్సుషేణరోచిష్మత్ప్రముఖాస్తస్య చాత్మజాః॥** 20

రెండవ మనువు మొదలు ఆఱుగురు మనువుల గురించి చెప్పుచున్నాడు.
**స్వారోచిషుడని గజేంద్రమోక్ష ప్రశ్న పర్యంతము.**

**ప్రతిపదార్థము :** ద్వితీయః=రెండవవాడగు, మనుఃతు=మనువు అయితే, అగ్నేఃసుతః=అగ్ని కుమారుడు, స్వారోచిషః=స్వారోచిషుడు, అభవత్=ఆయెను, ద్యుమత్+సుషేణ+రోచిష్మత్+ ప్రముఖాః=ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు లోనగువారు, తస్య=ఆ మనువు యొక్క ఆత్మజాః=కుమారులు.

**తాత్పర్యము :** రెండవ మనువు అగ్నిపుత్రుడు స్వారోచిషుడాయెను. అతని పుత్రులు ద్యుమంతుడు, సుషేణుడు, రోచిష్మంతుడు లోనగువారు.

**శ్లో॥ తత్రేన్ద్రో రోచనస్త్వాసీద్ దేవాశ్చ తుషితాదయః।**
**ఊర్జస్తమ్భాదయః సప్త ఋషయో బ్రహ్మవాదినః॥** 21



**శ్లో॥ యం న పశ్యతి పశ్యన్తం చక్షుర్యస్య న రిష్యతి।**
**తం భూతనిలయం దేవం సువర్ణముపధావత॥** 12

ఓయీ ! అతఁడు ఈ విశ్వమంతా వ్యాపించియున్నవాఁడైయుండియు, కన్నులు లోనగు, నింద్రియములకు ఏల గోచరించడు అన్నచో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** పశ్యంతమ్=సర్వమును దర్శించు, యమ్=ఏ ఈశ్వరుని, న పశ్యతి=మనసు గాని, చక్షురింద్రియముగానీ దర్శింపలేదో, ఏలయన, అతడు చక్షురింద్రియాదులకు గోచరింపని వాడగుట వలన ప్రమాతను (చూచువానిని) ప్రమాణము (చక్షురింద్రియ వర్గము) గోచరించుకొనజాలదు అని భావము.

అట్లే శ్రుతి:చక్షుషశ్చక్షుశ్రోత్రస్య శ్రోత్రమ్ (అతడు కంటికిఁగన్ను, చెవికిఁజెవియై యుండువాడు.)

ఓయీ ! అట్లయిన ఘటము నశించినతోడనే దేవదత్తునికి, ఆ ఘట విషయమైన చక్షుజ్ఞానమువలె, ఈశ్వరునికిని స్వరూపవిషయజ్ఞానము నశించునన్నచో ఆ విషయమై చెప్పుచున్నాడు.

యస్య=సర్వమును దర్శించు ఏ పరమేశ్వరుని వలన, చక్షుః=చక్షురింద్రియ జ్ఞానము, న రిష్యతి=నశించదో, ఇంద్రియ గోచరములైన ఆయా పదార్థములయాకారమున జనించిన ఇంద్రియ వృత్తికి మాత్రమే నాశము గలుగును గాని స్వతస్సిద్ధమైన జ్ఞానమునకు నాశము గలుగదు. సవిత యొక్క ప్రకాశము ప్రకాశ్యమగు వస్తువు నశించినంతనే నశించదు గదా ! అని భావము.

భూతనిలయమ్=సర్వ భూతములు వాస స్థానముగల, తమ్=ఆ, దేవమ్=దేవుని, సర్వాంతర్యామియైన వాని, సువర్ణమ్=శోభిల్లుచు, జగమును తపింపజేయుచునుండు ఆ సంగుని, ఉపధావత=భజింపుడు.

**తాత్పర్యము :** సర్వమును దర్శించు నే పరమేశ్వరుని మనస్సుగాని, చక్షుస్సుగాని చూడలేదో, ఎవని చక్షుస్సుదర్శనాది జ్ఞానము ఎప్పుడును నశించదో, ఎవడు సర్వమునందు అంతర్యామియై నివసించుచున్నాడో, అట్టి శోభాయమానుని ఇంద్రియప్రవర్తకుని అసంగుని దేవుని భజింపుము.

**శ్లో॥ న యస్యాద్యన్తౌ మధ్యం చ స్వః పరో నాన్తరం బహిః।**
**విశ్వస్యామూని యద్యస్మాద్ విశ్వం చ తదృతం మహత్॥** 13

ఆ పరమేశ్వరుని రూపము నిత్యమని నిశ్చయించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య=ఎవనికి, ఆద్యన్తౌ మధ్యఞ్చ=మొదలు, నడుమ, చివరలను, న=లేవో, స్వః=తనవాడు, పరః=ఇతరుడు, న=లేరో, అంతరమ్=లోపల, బహిః=వెలుపలకి, న=లేవో, విశ్వస్య=ప్రపంచమునకు, యత్=ఏ పని వలన, అమూని=ఆదిమధ్యాంతరములు గలవో, విశ్వంచ=ఈ విశ్వమును, యస్మాత్=ఎవని వలననో, తత్=అది, ఋతమ్=నిత్యమైన, మహత్=పరిపూర్ణమైనబ్రహ్మము.

**తాత్పర్యము :** ఎవనికి ఆదిమధ్యాంతములు లేవో, ఎవనికి తనవాఁడు, పరుఁడు అనువారు లేరో, ఎవనికి లోపల, వెలుపల అనునది లేదో, ఎవని వల్ల ఈ విశ్వమునకు సృష్టిస్థితి లయములు గలుగుచున్నవో ఎవనినుంచి యీ విశ్వము సంభవించెనో అతడు సత్యమై, పరిపూర్ణమైన బ్రహ్మమై యున్నాడు.

శ్లో॥ స విశ్వకాయః పురుహూత ఈశః సత్యః స్వయంజ్యోతిరజః పురాణః।
ధత్తేఽస్య జన్మాద్యజయాత్మశక్త్యా తాం విద్యయోదస్య నిరీహ ఆస్తే॥ 14

ఓయీ ! విశ్వమాపరమేశ్వరుని రూపమైనచో ఆయనకెందులకు జననాదులు లేవు. అట్టి స్థితిలో స్వప్రకాశ్యముగాని, జగజ్జన్మాదికమునకు కర్తయగుటచే వికారమును పొందుటచే ఇతడు సత్యస్వరూపుడై పరిపూర్ణుడగుట యెట్లు సంభవించును అన్నచో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము:**సః=ఆ పరమేశ్వరుడు, విశ్వకాయః=విశ్వమే శరీరముగ గలవాడు, పురుహూతః =పెక్కు నామములు గలవాడు, ఈశః=నియామకుడు, సత్యః=సత్యస్వరూప ప్రకాశుడు, సర్వస్య=సమస్త జగమునకు, గోప్తా హి=రక్షకుడు, అజః=నిర్వికారుడు, పురాణః=సనాతనుడు, అట్టులున్నవాడు, అస్య=ఈ విశ్వము యొక్క, జన్మ+ఆది=జన్మాదికము, ఆత్మశక్త్యా=తనశక్తి యైన, అజయా=మాయచేత, ధత్తే=ధరించుచున్నాడు, తామ్=ఆ మాయను, విద్యయా= నిత్యసిద్ధమైన విద్యచే, జ్ఞానముచే, ఉదస్య=తొలగించి, నిరీహః=నిష్క్రియుడై, ఆస్తే=ఉండును.

**తాత్పర్యము :** ఆ పరమేశ్వరుడు విశ్వము శరీరముగగలవాడు, పెక్కు నామములు గలవాడు, నియామకుడు, సత్యస్వరూపుడు, స్వప్రకాశుడు, సర్వజనమునకు రక్షకుడు, నిర్వికారుడు, సనాతనుడు అయి తన అజ అయిన మాయచే ఈ విశ్వజన్మాదికములను ధరించుచున్నాడు. నిత్యసిద్ధ విద్యయగు జ్ఞానముచే ఆ మాయనుండి తొలగి నిష్క్రియుడైయున్నాడు.

శ్లో॥ అథాగ్రే ఋషయః కర్మాణీహన్తేఽకర్మహేతవే।
ఈహమానో హి పురుషః ప్రాయోఽనీహాం ప్రపద్యతే॥ 15

**ప్రతిపదార్థము :** అథ=దీనివలన ఈశ్వరుడు కర్మకర్తృత్వాదికమును త్యజించి, నైష్కర్మ్యమున వర్తించుచున్నాడు. ఆకారణమున, అగ్రే=మొదట, ఋషయః=ఋషులుసైతము, అకర్మహేతవే =మోక్షము కొఱకు, కర్మాణి=కర్మలను, ఈహంతే=కోరుచున్నారు. పురుషః=పురుషుడు, ఈహమానః హి=కర్మలను జేయగోరువాడే అయినను, ప్రాయః=తఱచుగ, అనీహామ్= వాంఛలేకపోవుటను, ప్రపద్యతే=పొందుచున్నాడు.

**తాత్పర్యము :** ఈశ్వరుడు కర్మకర్తృత్వాదికమును త్యజించియు, యెట్లో నిష్క్రియుడై యున్నాడు. అట్లే తొల్త ఋషులు మోక్షము కొరకు కర్మలను వాంఛించుచున్నారు. అట్లే సహజముగా పురుషులు కర్మఫలవాంఛగలవాడైనను క్రమముగా అట్లే వాంఛలేనివాడగుచున్నాడు.

శ్లో॥ ఈహతే భగవానీశో న హి తత్ర విషజ్జతే।
ఆత్మలాభేన పూర్ణార్థో నావసీదన్తి యేఽను తమ్॥ 16

ఓయీ ! సర్వ వాంఛలను కోరుచున్నవాడై కర్మలతో గూడి పట్టుపురుగువలె బద్ధుఁ డగుచున్నాడు అను విషయమై చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడు, ఈశః=జగదీశ్వరుడు, ఈహతే=సృష్టిచేయుచు, జీవులను నియమించగోరుచున్నాడు, ఆత్మలాభేన=ఆత్మానందముచే, పూర్ణార్థః=పరిపూర్ణుడు కావున, తత్ర=వానియందు, న విషజ్జతే=ఆసక్తుడు కాడు. యే=ఎవరు, తమ్=ఆ పరమేశ్వరుని, అను=అనుసరింతురో వారు, న+అవసీదంతి=నశించరు.



**తాత్పర్యము :** షడ్గుణైశ్వర్య సంపన్నుడు భగవంతుడు జగన్నియామకత్వమును వాంఛించుచు జీవులనుఁబ్రేరేపించువాడైనను ఆత్మానందమునఁబరిపూర్ణుడగుట వలన వానియందు ఆసక్తుడు కాడు. ఎవరా భగవంతుని ఆశ్రయించుదురో వారు నశించరు.

శ్లో॥ తమీహమానం నిరహఙ్కృతం బుధం-నిరాశిషం పూర్ణమనన్యచోదితమ్।
నౄఞ్ శిక్షయన్తం నిజవర్త్మసంస్థితం-ప్రభుం ప్రపద్యేఽఖిలధర్మభావనమ్॥ 17

ఆ భగవంతునాశ్రయించినవారు చెడరు. కాబట్టి ఇట్లు లోకమునను గ్రహించుట కొరకు విశ్వము సృజించుటలోనగువాని నెవడు చేయుచున్నాడో శ్రీరామకృష్ణాదులగు నవతారములచే వేదోక్తమైన ధర్మమున నెవడు వర్తించుచున్నాడో ఆ దేవుని శరణుఁబొంద గోరుచున్నాను.

**ప్రతిపదార్థము :** నిజవర్త్మసంస్థితః=నరావతారమునకు అనురూపమైన మార్గమునందు జక్కగా నుండువాడును అందువలన, ఈహమానమ్=కర్మనాచరించువాడు, (అట్లున్నను జీవులకంటే విలక్షణత్వమును జెప్పుచున్నాడు), అనన్యచోదితమ్=ఇతరులచేఁబ్రేరేపింపబడనివాడు కావుననే నిరహంకృతమ్=అహంకారము లేనివాడు, పూర్ణమ్=ఆప్తకాముడు, (పరిపూర్ణుడు కావున), నిరాశిషమ్=ఆశలు లేనివాడు, బుధమ్=సర్వజ్ఞుడు, ప్రభుమ్=ఇతరులచే నియుక్తుడు కాక స్వయముగ నిగ్రహానుగ్రహ సమర్థుడును, నౄన్=నరులను, శిక్షయంతమ్=తన ఆచార మార్గమును బోధించుచు నడిపించువాడు, (అదియెందులకు), అఖిలధర్మభావనమ్=సమస్త ధర్మములను ప్రవర్తింపజేయువాడునగు, తమ్=ఆ పరమేశ్వరుని, ప్రపద్యే=శరణుపొందు చున్నాడు.

**తాత్పర్యము :** మానవుడై యవతరించి తదనురూపమగు మార్గమున నెలకొన్నవాడు సత్కర్మల నాచరించువాడు, కర్మఫలాసక్తిలేనివాడు కావున కర్తృత్వాదికములను, అహంకారము లేనివాడు, ఆప్తకాముడు, పరిపూర్ణుడు కావున ఆశలేనివాడు, ఇతరులచే నియుక్తుడుకాడు కనుక స్వయం ప్రభువును సర్వమును తెలిసినవాడు మానవులను వారివారికి దగిన ఆచారములను ప్రవర్తింప జేయువాడు సమస్త ధర్మములను బ్రవర్తింపజేయువాడునగు పరమేశ్వరుని శరణుపొందు చున్నాడు.

**శ్రీశుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ ఇతి మన్త్రోపనిషదం వ్యాహరన్తం సమాహితమ్।
దృష్ట్వాసురాయాతుధానా జగ్ధుమభ్యద్రవన్ క్షుధా॥ 18

**ప్రతిపదార్థము :** ఈ విధముగా, మంత్రోపనిషదమ్=వేదమంత్రములందు, ఉపనిషత్తుల యందును చెప్పబడిన యర్థమును, వ్యాహరంతమ్=ఉచ్చరించువాడు, సమాహితమ్=చిత్త సమాధానముగలవాడునైన స్వాయంభువ మనువును, దృష్ట్వా=చూచి, నిద్రనుండి మేలుకాంచి వివశుడైయున్నవానివలె నున్నాడని తలంచుచున్నవారై, అసురాః=అసురులు, యాతుధానాః =రాక్షసులు, క్షుధా=ఆకలి కారణముచే, జగ్ధుమ్=ఆ మనువును భుజించుటకు, అభ్యద్రవన్= పరుగెత్తుకొని వచ్చిరి.

**ప్రతిపదార్థము :** యత్ర యత్ర=ఏయే కథయందు, ఉత్తమ శ్లోకః=పుణ్య యశస్వియగు, భగవాన్=భగవంతుడు, హరిః=విష్ణువు, గీయతే=పేర్కొనబడుచున్నాండో, తత్+కథా=ఆ కథ, (తత్+కథాసు=ఆ కథలలో,) సుమహత్=మిక్కిల దొడ్డది, పుణ్యమ్=పవిత్రము, ధన్యమ్=ఉత్తమము, స్వస్తి+అయనమ్=శ్రేయస్సులకు మార్గము, శివమ్=శుభకరమైనది.

**తాత్పర్యము :** ఏ యే కథయందు పవిత్రయశము గల విష్ణువు భగవానుడు కీర్తింపబడు చున్నవాడో ఆ కథ మిక్కిలి దొడ్డది, పవిత్రమైనది, ఫలప్రదము, శ్రేయములకు మార్గము, శుభకరమైనది అగును.

**శ్రీ సూత ఉవాచ :** శ్రీ సూతుడు వచించెను.

**శ్లో॥ పరీక్షితైవం స తు బాదరాయణిః ప్రాయోపవిష్టేన కథాసు చోదితః।**
**ఉవాచ విప్రాః ప్రతినన్ద్య పార్థివం ముదా మునీనాం సదసి స్మ శృణ్వతామ్॥ 34**

**ప్రతిపదార్థము :** విప్రాః=ఓ బ్రాహ్మణులారా!, ఏవమ్=ఈ ప్రకారము, ప్రాయోపవిష్టేన=మరణ నిశ్చయుడైయున్న, పరీక్షితా=పరీక్షిత్తు చేతను, కథాసు=హరికథలయందు, చోదితః=ప్రేరేపింపబడినవాఁడై, పార్థివమ్=రాజును, ప్రతినంద్య=అభినందించి, ముదా=సంతోషముతో, శృణ్వతామ్=వినుచున్న, మునీనామ్=మునులయొక్క, సదసి=సదస్సునందు, ఉవాచ స్మ=ఇట్లు వచించెను.

**తాత్పర్యము :** ఓ బ్రాహ్మణులారా! ఈ ప్రకారము మరణనిశ్చయుడైన పరీక్షిత్తు తన్ను హరికథలను గూర్చి ప్రస్తావింప విని శుకుడు రాజును అభినందించి మునులెల్లరు వినుచుండ ఆ సభయందు ఇట్లు వచించెను.

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కంధే ప్రథమో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధమున ప్రథమాధ్యాయము.





**ప్రతిపదార్థము :** ఆమన్వంతరమున, ఇంద్రః=ఇంద్రుడు, రోచనః=రోచనుడనువాడు, ఆసీత్=ఆయెను. దేవాశ్చ=దేవతలు, తుషిత+ఆదయః=తుషితుడులోనగువారు, సప్త ఋషయః=సప్తఋషులు, బ్రహ్మవాదినః=వేదవిదులుగా, ఊర్జస్తంభాదయః=ఊర్జస్తంభుడులోనగువారైరి.

ఆ స్వారోచిష మన్వంతరమందు రోచనుడనువాడు ఇంద్రుడు, తుషితాదులు దేవతలు, ఊర్జస్తంభుడులోనగువారు సప్తర్షులైరి.

**శ్లో॥ ఋషేస్తువేదశిరసస్తుషితా నామ పత్న్యభూత్।**
**తస్యాం జజ్ఞే తతో దేవో విభురిత్యభివిశ్రుతః॥ 22**

**ప్రతిపదార్థము :** వేదశిరసః=వేదశిరుడను, ఋషేః తు=ఋషికి, తుషితా నామ=తుషితయను, పత్ని=భార్య, అభూత్=ఉండెను. తస్యామ్=ఆమెయందు, దేవః=భగవంతుడు, జజ్ఞే=పుత్రుడై పుట్టెను, విభుః ఇతి=విభుడని, అభివిశ్రుతః=ప్రసిద్ధి చెందెను.

**తాత్పర్యము :** ఆ కాలమున వేదశిరుడను ఋషికి తుషితయను భార్యయందు విష్ణువు విభుడను పుత్రుడై జన్మించి ప్రసిద్ధికెక్కెను.

**శ్లో॥ అష్టాశీతిసహస్రాణి మునయో యే ధృతవ్రతాః।**
**అన్వశిక్షన్ వ్రతం తస్య కౌమారబ్రహ్మచారిణః॥ 23**

**ప్రతిపదార్థము :** యే=ఎవరు, ధృతవ్రతాః=ధరించిన నియమము కల, మునయః=మునులు, అష్ట+ఆశీతి సహస్రాణి=ఎనుబది ఎనిమిది వేలమందిగలరో, ఆ, కౌమార బ్రహ్మచారిణః =కుమార బ్రహ్మచారి అయిన, తస్య=ఆ విభువు యొక్క వ్రతమ్=ఆచార నియమమును, అన్వశిక్షన్=అనుష్ఠించిరి.

**తాత్పర్యము :** ఎనుబదిఎనిమిది వేలమంది (88,000) మునులు వ్రతనిష్ఠులై కుమార బ్రహ్మచారియైన ఆ విభుని యాచారమనుష్ఠించిరి.

**శ్లో॥ తృతీయ ఉత్తమో నామ-ప్రియవ్రతసుతో మనుః।**
**(పా)పవనః సృఞ్జయో యజ్ఞహోత్రాద్యాస్తత్సుతా నృప॥ 24**

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, తృతీయః=మూడవవాడైన, మనుః=మనువు, ఉత్తమః =ఉత్తముడనువాడు, ప్రియవ్రతసుతః=ప్రియవ్రతసుతుడు, పావనః=పావనుడు, సృంజయః =సృంజయుడు, యజ్ఞః=యజ్ఞుడు, హోత్రాద్యాః=హోత్రుడులోనగువారు, తత్ సుతాః=ఆ ఉత్తముని కుమారులు.

**తాత్పర్యము :** మూడవ మనువు ప్రియవ్రతుని పుత్రుడు ఉత్తముడు. పావనుడు, సృంజయుడు, యజ్ఞుడు, హోత్రుడులోనగువారు ఆతని పుత్రులు.

**శ్లో॥ వసిష్ఠతనయాః సప్త ఋషయః ప్రమదాదయః।**
**సత్యా వేదశ్రుతా భద్రా దేవా ఇన్ద్రస్తు సత్యజిత్॥ 25**

**ప్రతిపదార్థము :** వసిష్ఠతనయాః=వసిష్ఠ మహర్షి పుత్రులు, ప్రమద+ఆదయః=ప్రమదుడు లోనగువారు, సప్తఋషయః=సప్తఋషులైరి, సత్యాః=సత్యులు, దేవశ్రుతాః=దేవశ్రుతులు,

భద్రాః=భద్రులు, దేవాః=దేవతలైరిః, ఇంద్రః తు=ఇంద్రుడు మాత్రము, సత్యజిత్=సత్యజిత్తు అనువాడు (ఇంద్రుడయ్యెను).

**తాత్పర్యము :** ఆ ఉత్తమ మన్వంతరమున వశిష్ఠుని పుత్రుడు ప్రమదుడులోనగువారు సప్తర్షులైరి. సత్యులు, దేవశ్రుతులు, భద్రులు అనువారు దేవతలైరి. సత్యజిత్తు అనువాడు ఇంద్రుడయ్యెను.

**శ్లో॥ ధర్మస్య సూనృతాయాం తు భగవాన్ పురుషోత్తమః।**
**సత్యసేన ఇతి ఖ్యాతో జాతః సత్యవ్రతైః సహ॥ 26**

**ప్రతిపదార్థము :** ధర్మస్య=ధర్మునికి, సూనృతాయామ్=సూనృతయను భార్యయందు, భగవాన్=భగవంతుడు, పురుషోత్తమః=విష్ణువు, సత్యవ్రతైఃసహ=సత్యవ్రతులనువారితోకల్సి, సత్యసేన ఇతి ఖ్యాతః=సత్యసేనుడని ప్రసిద్ధుడై, జాతః=జనించెను.

**తాత్పర్యము :** ధర్మునికి సూనృతయను భార్యయందు విష్ణుభగవానుడు, సత్యసేనుడని ప్రసిద్ధుడై సత్యవ్రతులను తోబుట్టువులతో పుట్టెను.

**శ్లో॥ సోఽనృతవ్రతదుశ్శీలా-నసతో యక్షరాక్షసాన్।**
**భూతద్రుహో భూతగణాం-స్త్వవధీత్ సత్యజిత్సఖః॥ 27**

**ప్రతిపదార్థము :** సః=ఆ సత్యసేనుడు, సత్యజిత్+సఖః=సత్యజిత్తునకు, ఇంద్రునికి సఖుడై, అనృతవ్రతదుశ్శీలాః=అసత్య ప్రవర్తకులైన దుష్టస్వభావులును, అసతః=చెడ్డవారును అగు, యక్షరాక్షసాన్=యక్షరాక్షసులను, భూతద్రుహః=ప్రాణిహింసకములగు, భూతగణాన్=భూతములనుపేర గణములను, రాక్షసుల తెగను, అవధీత్=వధించెను.

**తాత్పర్యము :** ఆ సత్యసేనుడైన భగవానుడు సత్యజిత్తునకు సఖుడై, అసత్యప్రవర్తకులైన దుస్స్వభావులును, దుష్టులును అగు యక్షరాక్షసులను ప్రాణిహింసనాచరించు భూతములను వధించెను.

**శ్లో॥ చతుర్థ ఉత్తమభ్రాతా-మనుర్నామ్నా చ తామసః।**
**వృషా (పృథు) ఖ్యాతిర్నరః కేతు-రిత్యాద్యా దశ తత్సుతాః॥ 28**

**ప్రతిపదార్థము :** అథ=ఆ తర్వాత, చతుర్థః=నాలుగవవాడైన, మనుః=మనువు, ఉత్తమ భ్రాతా=ఉత్తముని సోదరుడు, తామసః=తామసుడని, నామ్నా=పేరుతో ప్రసిద్ధికెక్కిన వాడయ్యెను. వృషా=వృషుడు, ఖ్యాతిః=ఖ్యాతి, నరః=నరుడు, కేతుః=కేతువు, ఇతి (ఆద్యా)=వారు మొదలగువారు, తత్ సుతాః=ఆతని పుత్రులు, దశ=పదిమంది గలిగిరి.

**తాత్పర్యము :** నాలుగవ మనువు, ఉత్తముని భ్రాత తామసుడనువాడు, ఆతని పుత్రులు వృషుడు, ఖ్యాతి, నరుడు, కేతువులోనగువారు పదిమంది కలిగిరి.

**శ్లో॥ సత్యకా హరయో వీరా-దేవాస్త్రిశిఖ ఈశ్వరః।**
**(జ్యోతిర్ధామా) జ్యోతిర్వ్యోమాదయః-సప్త ఋషయస్తామసేఽన్తరే॥ 29**

**ప్రతిపదార్థము :** తామసే+అంతరే=తామసుని మన్వంతరమున, సత్యకాః=సత్యకులు,



హరయః=హరులు, వీరాః=వీరులు, దేవాః=దేవతలు, త్రిశిఖః=త్రిశిఖుడనువాడు, ఈశ్వరః =ఇంద్రుడు, జ్యోతిర్వ్యోమాదయః=జ్యోతిర్వ్యోముడులోనగువారు, సప్తఋషయః=సప్త ఋషులు అయిరి.

**తాత్పర్యము :** ఆ తామసుని మన్వంతరమున సత్యకులు, హరులు, వీరులు, దేవతలు, త్రిశిఖుడనువాఁడింద్రుఁడు, జ్యోతిర్వ్యోముఁడులోనగువారు సప్తర్షులైరి.

**శ్లో॥ దేవా వైధృతయో నామ విధృతేస్తనయా నృప।**
**నష్టాః కాలేన యైర్వేదా విధృతాః స్వేన తేజసా॥ 30**

విశిష్ట పరాక్రములైన నితరులగు సురలను చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, విధృతేః=విధృతి అనునామె యొక్క, తనయాః=సుతులు, వైధృతయః నామ=వైధృతులని ప్రసిద్ధులు, దేవాః=దేవతలైరి. యైః=ఏ వైధృతులచే, స్వేన తేజసా =తమ తేజముచే, కాలేన=కాలక్రమమున, నష్టాః=నష్టములైన, వేదాః=వేదములు, విధృతాః=ధరించబడిననో.

**శ్లో॥ తత్రాపి జజ్ఞే భగవాన్ హరిణ్యాం హరిమేధసః।**
**హరిరిత్యాహృతో యేన గజేన్ద్రో మోచితో గ్రహాత్॥ 31**

**ప్రతిపదార్థము :** తత్ర+అపి=ఆ మన్వంతరమందున, భగవాన్=భగవంతుడు విష్ణువు, హరిమేధసః=హరిమేధునికి, హరిణ్యామ్=హరిణి అనుభార్యయందు, హరిః ఇతి=హరియని, ఆహృతః=పిలువబడువాడు, జజ్ఞే=పుట్టె, యేన=ఏ హరిచే, గజేంద్రః=గజరాజు, గ్రహాత్=మొసలినుండి, బంధమునుండి, మోచితః=విడిపింపబడినవాడయ్యెను.

**తాత్పర్యము :** ఆ మన్వంతరమందు భగవంతుడు విష్ణువు హరిమేధుఁడనువానికి హరిణియను భార్యయందు హరియను పేరుగల పుత్రుడై జన్మించి మొసలిచేఁబట్టువడిన గజరాజును బంధవిముక్తుని జేసెను.

**పరీక్షిదువాచ :** పరీక్షిత్తు వచించెను.

**శ్లో॥ బాదరాయణ ఏతత్తే శ్రోతుమిచ్ఛామహే వయమ్।**
**హరిర్యథా గజపతిం గ్రాహగ్రస్తమమూముచత్॥ 32**

**ప్రతిపదార్థము :** బాదరాయణ=ఓ బాదరాయణ కుమారా !, హరిః=విష్ణువు, యథా=ఏ ప్రకారము, గ్రాహగ్రస్తమ్=నక్రముచే పట్టుకొనబడిన, గజపతిమ్=గజపతిని/కరిరాజును, అమూముచత్=విడిపించెనో, ఏతత్=ఈ విషయము, తే=నీ వలన, వయమ్=మేము, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామహే=కోరుచున్నాము.

**తాత్పర్యము :** ఓ బాదరాయణ పుత్రా ! హరి యెట్లు గజరాజును మొసలి పట్టునుండి విడిపించెనో ఆ కథను నీ వలన వినగోరుచున్నాము.

**శ్లో॥ తత్కథా సుమహత్ పుణ్యం ధన్యం స్వస్త్యయనం శివమ్।**
**యత్ర యత్రోత్తమశ్లోకో భగవాన్ గీయతే హరిః॥ 33**

**శ్లో॥ ద్రాక్షేక్షురమ్భాజమ్బుభిర్బిదర్యక్షాభయామలైః।**
**బిల్వైః కపిత్థైర్జమ్బీరైర్వృతో భల్లాతకాదిభిః॥ 14**

**తాత్పర్యము :** ద్రాక్షలు, చెఱకు, అరటి, నేరళ్ళు, రేగులు, తాండ్ర, కరక, ఉసిరికలు, మారేడు, వెలగ, నిమ్మ, జీడి తిను వృక్షముల చేతను కూడుకొని యున్నది.

**శ్లో॥ తస్మిన్ సరస్సువిపులం లసత్కాఞ్చనపఙ్కజమ్।**
**కుముదోత్పలకహ్లారశతపత్రశ్రియోర్జితమ్॥ 15**

**ప్రతిపదార్థము :** తస్మిన్=ఆ కొండయందు, సువిపులమ్=విశాలమైన, లసత్‌కాంచన పంకజమ్ = వికసించిన బంగారు తామరలు గలది, కుముదోత్పలకల్హారశతపత్రశ్రియా=తెల్ల కలువలు, నల్ల కలువలు, ఎఱ్ఱ కలువలు, నూఱు రేకులు గల తామరలు అనువాని కాంతి చేత, ఊర్జితమ్=వెలుగొందు, సరః=సరస్సు కలదు.

**తాత్పర్యము :** ఆ కొండయందు ఒక గొప్ప సరస్సు కలదు. దానియందు పూచిన పసిడి తామరలు, తెల్లకలువలు, నల్లకలువలు, ఎఱ్ఱకలువలు, నూఱురేకులుగల తామరలు అనువాని కాంతిచే నా కొలను వెలుగొందుచుండును.

**శ్లో॥ మత్తషట్పదనిర్ఘుష్టం శకున్తైశ్చ కలస్వనైః।**
**హంసకారణ్డవాకీర్ణం చక్రాహ్వైః సారసైరపి॥ 16**

**ప్రతిపదార్థము :** ఆ సరస్సు, మత్తషట్పదనిర్ఘుష్టమ్=మదించిన తుమ్మెదల రొదగలదియు, కలనిస్వనైః=అవ్యక్త మధురములైన కూతలుగల, శకుంతైః=పక్షులచేతను, చక్రాహ్వైః=జక్కవల చేతను, సారసైః అపి=బెగ్గురు పక్షులచేత కూడినదై, హంసకారండవ+ఆకీర్ణమ్=అంచలు, కన్నె లేడులు అనువానితో కూడినవి,

**తాత్పర్యము :** మఱియు ఆ సరస్సు మదించిన తుమ్మెదల రొదగలదై అవ్యక్తమధురములైన కూతలు గల పక్షులతో, అంచలు, కన్నెలేళ్ళు, జక్కరలు, బెగ్గురుపక్షులు అను నీటి పక్షులతోను విరాజిల్లుచుండును.

**శ్లో॥ జలకుక్కుటకో యష్టిదాత్యూహకులకూజితమ్।**
**మత్స్యకచ్ఛపసఞ్చారచలత్పద్మరజఃపయః॥ 17**

**తాత్పర్యము :** దండాన్వయము – నీటి కోళ్ళు, చీఁకు కొక్కెరలు, కూకురు గుడ్డంగి (భరత పక్షి) అను వాని అవ్యక్తమధురమైన కూతలు గలదియు, చేపలు, తాబేళ్ళు అనువాని సంచారముచే చెలించు తామరల పుప్పొడితో గూడిన నీరుగలదై యొప్పెను.

**శ్లో॥ కదమ్బవేతసనలనీపవఞ్జులకైర్వృతమ్।**
**కున్దైః కురవకాశోకైః శిరీషైః కుటజేఙ్గుదైః॥ 18**

**తాత్పర్యము :** దండాన్వయము – కదంబ, ప్రబ్బలి, వట్టివేరు, బట్టకడప, పొగడలను వృక్షములతో మొల్లలు, గోరంటలు, అశోకములు, దిరిసెనలు, కొండమల్లెలు, గారచెట్లు లోనగువానితో కూడియుండెను.

**శ్లో॥ కుబ్జకైః స్వర్ణయూథీభిర్నాగపున్నాగజాతిభిః।**
**మల్లికాశతపత్రైశ్చ మాధవీజాలకాదిభిః।**
**శోభితం తీరజైశ్చాన్యైర్నిత్యర్తుభిరలన్ద్రుమైః॥ 19**

## ద్వితీయోఽధ్యాయః

**శ్రీశుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

ఈ నాలుగవదగు తామస మన్వంతరమందు గజేంద్రుని మోక్షణము రెండు మూడు అధ్యాయములచే వర్ణింపబడును. రెండవ అధ్యాయమందు గజేంద్రుడు కరేణువులతో జలక్రీడలాడునపుడు దైవవశమున మొసలిచే పట్టుపడి హరిని స్మరించుటయు చెప్పబడును.

**శ్లో॥ ఆసీద్గిరివరో రాజంస్త్రికూట ఇతి విశ్రుతః।**
**క్షీరోదేనావృతః శ్రీమాన్ యోజనాయుతముచ్ఛ్రితః॥ 1**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, త్రికూటః ఇతి విశ్రుతః=త్రికూటమను ప్రసిద్ధి చెందిన, శ్రీమాన్=అత్యంత మనోహరమైన, గిరివరః=పర్వతరాజము, క్షీరోదేన+ఆవృతః=పాలకడలిచే చుట్టబడినదై, యోజనాయుతః=పదివేల యోజనములు, ఉచ్ఛ్రితః=పొడవుగలది, ఆసీత్=ఆయెను.

**తాత్పర్యము :** త్రికూటమను పర్వతరాజము గలదు. ఆ పర్వతమును పాలసముద్రము చుట్టియుండి దాని పొడవు పదివేల యోజనములు గలిగియుండెను.

**శ్లో॥ తావతా విస్తృతః పర్యక్ త్రిభిః శృంగైః పయోనిధిమ్।**
**దిశః ఖం రోచయన్నాస్తే రౌప్యాయసహిరణ్మయైః॥ 2**

**ప్రతిపదార్థము :** తావతా=ఆ పదివేల యోజనములచేత, పర్యక్=చుట్టు, విస్తృతః=వైశాల్యము గలది, రౌప్య+ఆయస+హిరణ్మయైః=వెండి, ఉక్కు, బంగారుమయములైన, త్రిభిఃశృంగైః= మూడు శృంగముల చేత, పయోనిధిమ్=ఆ పాలకడలిని, దిశఃచ=దిక్కులను, ఖమ్= ఆకాశమును రోచయన్=ప్రకాశింపజేయుచు, ఆస్తే=ఉన్నది.

**తాత్పర్యము :** ఆ పర్వతము చుట్టుకొలతయు పదివేల యోజనములు గలిగి వ్యాపించి యుండును. దానికి రజతలోహ సువర్ణమయములైన మూడు శిఖరములాపాలకడలిని దిక్కులను ప్రకాశింపజేయుచుండును.

**శ్లో॥ అన్యైశ్చ కకుభః సర్వా రత్నధాతువిచిత్రితైః।**
**నానాద్రుమలతాగుల్మైర్నిర్ఘోషైర్నిర్ఝరామ్భసామ్॥ 3**

**ప్రతిపదార్థము :** రత్నధాతువిచిత్రితైః=రత్నముల చేతను, గైరికాది ధాతువుల చేత వింతవైన, అన్యైః చ=ఇతరములైన శృంగములచేత, సర్వాః కకుభః=అన్ని దిశలు, నానాద్రుమలతాగుల్మైః =వివిధములైన వృక్షములు, లతలు, చిన్నపొదలను వాటి చేతను, నిర్ఝరాంభసామ్=సెలయేళ్ళ ప్రవాహములయొక్క, ఘోషైః=ధ్వనుల చేతను ఒప్పు చుండును.

**తాత్పర్యము :** ఆ శిఖవరము రత్నముల చేత, గైరికాది ధాతువుల చేతను, విచిత్రములైన ఇతర శృంగముల చేతను, అన్ని దిశలు వివిధములైన వృక్షముల చేతను, లతల చేతను, చిన్న గుబురు చెట్ల చేతను, సెలయేళ్ళ ప్రవాహ ధ్వనుల చేతను బ్రకాశించుచుండును.

శ్లో॥ సదావనిజ్యమానాఙ్ఘ్రిః సమన్తాత్ పయఊర్మిభిః।
కరోతి శ్యామలాం భూమిం హరిన్మరకతాశ్మభిః॥ 4

**ప్రతిపదార్థము :** పయ ఊర్మిభిః=ఆ పాల తరంగములచే, సదా=ఎల్లప్పుడూ, సమంతాత్=అంతట, అవనిజ్యమాన+అంఘ్రిః=కడుగబడుచున్న క్రింది ప్రక్కనున్న, ప్రత్యంత పర్వతములు గలదై, హరిత్, మరకత+అశ్మభిః=పసరువన్నె గరుడపచ్చలను మణులచే, భూమిమ్=ఆ ప్రాంతభూమిని, శ్యామలామ్=ఆకుపచ్చచాయగలదానిని, కరోతి=చేయుచుండును.

**తాత్పర్యము :** ఆ పర్వతము పాదప్రాంతముననున్న చిన్న చిన్న పర్వతములు ఆ పాలకడలి పాలతరగలు నిరంతరమంతట కడుగుచుండును. ఆ గిరి పసరువన్నె గరుడ పచ్చలను మణుల కాంతులచే ఆ ప్రాంతభూమిని ఆకుపచ్చవన్నెగలదానినిగాఁజేయుచుండును.

శ్లో॥ సిద్ధచారణగన్ధర్వవిద్యాధరమహోరగైః।
కిన్నరైరప్సరోభిశ్చ క్రీడద్భిర్జుష్టకన్దరః॥ 5

**ప్రతిపదార్థము :** క్రీడద్భిః=క్రీడించుచున్న, సిద్ధచారణగంధర్వవిద్యాధరమహోరగైః=సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, దొడ్డ పన్నగముల చేత, కిన్నరైః=కిన్నరుల చేత, అప్సరోభిః=అప్సరసలచేత, జుష్టకందరః=గుహలందు నివశించుచు క్రీడించుచుందురు.

తాత్పర్యము : ఆ పర్వతమునందు సిద్ధులు, చారణులు, గంధర్వులు, పన్నగులు, కిన్నరులు, అప్సరసలు గుహలయందు క్రీడించుచుందురు.

శ్లో॥ యత్ర సఙ్గీతసన్నాదైర్నదద్గుహమమర్షయా।
అభిగర్జన్తి హరయః శ్లాఘినః పరశఙ్కయా॥ 6

**ప్రతిపదార్థము :** యత్ర=ఏ త్రికూటగిరియందు, సంగీతసన్నాదైః=కిన్నరుల సంగీతము యొక్క శ్రావ్యమైన నాదములచే, నదత్ గుహమ్=ప్రతిధ్వనించు గుహలు కలదానిని, అమర్షయా=సహనము లేకపోవుటచే, పరశంకయా=శత్రువులైన సింహములు గావించు గర్జనలను సందియముచే, శ్లాఘినః=పొగడదగిన, హరయః=సింహములు, అభిగర్జంతి=బిగ్గరగా గర్జనలు చేయుచుండునో.

**తాత్పర్యము :** ఆ త్రికూట పర్వతములు కిన్నెర సంగీత ధ్వనులు శ్రావ్యములై వెలయగా ఆ ధ్వనులు గుహలందు ప్రతిధ్వనించుచుండును. ఆ ప్రతిధ్వని విని ఉత్తమ జాతి సింహము శత్రుసింహముల గర్జనలను శంకచే సహనము లేనివై బిగ్గరగా గర్జించుచుండును.

శ్లో॥ నానారణ్యపశువ్రాతసఙ్కులద్రోణ్యలఙ్కృతః।
చిత్రద్రుమసురోద్యానకలకణ్ఠవిహఙ్గమః॥ 7

**ప్రతిపదార్థము :** నానా=వివిధములైన, అరణ్యపశువ్రాత=వన్యమృగముల సమూహముచే, సంకుల=సందడి గల, ద్రోణీ+అలంకృత=లోయలచే అలంకరించబడినదియు, చిత్ర=వివిధములైన, ద్రుమ=వృక్షములు గల, సుర+ఉద్యాన=దేవతల ఉద్యానవనములు, కలకంఠ విహంగమః=మధుర కంఠముగల పక్షులు కలదైయుండెను.

**తాత్పర్యము :** ఆ పర్వతము వివిధములైన వన్యమృగముల సందడితోడి లోయలు గలదై రకరకములైన వృక్ష సంతతిగల దేవతల యుద్యానములును, పక్షులును గలదియునై యుండెను.



శ్లో॥ సరిత్సరోభిరచ్ఛోదైః పులినైర్మణివాలుకైః।
దేవస్త్రీమజ్జనామోదసౌరభామ్బ్వనిలైర్యుతః॥ 8

**ప్రతిపదార్థము :** అచ్ఛోదైః=స్వచ్ఛమైన ఉదకములుగల, సరిత్+సరోభిః=నదుల చేతను, కొలనుల చేతను, మణివాలుకైః=మణులను ఇసుకగల, పులినైః=ఇసుక తిన్నెల చేత, దేవస్త్రీ=దేవాంగనల యొక్క, మజ్జన=స్నానముచేనైన, ఆమోద=పరిమళముచే, సౌరభ=సువాసన గల, అంబు=నీరు, అనిలైః=గాలితోను, యుతః=కూడుకొనియున్నది.

**తాత్పర్యము :** ఆ కొండ తేటనీరు గల సెలయేళ్ళచేతను, కొలంకుల చేతను, మణుల ఇసుక తిన్నెల చేతను, దేవాంగనలు స్నానము చేయుటచేనైన పరిమళమువలనను, నీటితోను, గాలితోనూ గూడియున్నది.

శ్లో॥ తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః।
ఉద్యానమృతుమన్నామ ఆక్రీడం సురయోషితామ్।
సర్వతోఽలంకృతం దివ్యైర్నిత్యం పుష్పఫలద్రుమైః॥ 9

**ప్రతిపదార్థము :** నిత్యపుష్పఫలద్రుమైః=ఎల్లప్పుడు పూచిన పువ్వులు, ఫలించిన పండ్లు గల వృక్షముల చేత, సర్వతః=అంతట, అలంకృతమ్=అలంకరించబడిన, ఉత్తమములైన, తస్య=ఆ త్రికూటము యొక్క, ద్రోణ్యామ్=లోయయందు, మహాత్మనః=మహాత్ముడు, భగవతః=భగవంతుడైన, వరుణస్య=వరుణుని యొక్క, ఉద్యానమ్=ఉద్యానము, ఋతుమత్+నామ=ఋతుమంతమను పేరుగలది, సురయోషితామ్=దేవతాస్త్రీలకు, ఆక్రీడమ్=క్రీడోద్యానమై యుండినది.

**తాత్పర్యము :** ఆ త్రికూటగిరియందు మహాత్ముడైన వరుణ భగవానుని యుద్యానవనము ఋతుమంతమను పేరుగలది దేవతాస్త్రీలకు క్రీడోద్యానమై వెలసెను.

శ్లో॥ మన్దారైః పారిజాతైశ్చ పాటలాశోకచమ్పకైః।
చూతైః ప్రియాళైః పనసైరామ్రైరామ్రాతకైరపి॥ 11

**ప్రతిపదార్థము :** ప్రియాళైః=ద్రాక్షల చేత, ఆమ్రాతకైః=అంబాళములనే విప్పచెట్లచే; మందారముల చేత, పారిజాతముల చేత, కలిగొట్టులు, అశోకములు, చంపకములు, చూతములు, మామిడి, ద్రాక్షలు, పనసులు, అంబాళములు అను వృక్షముల చేత ఆ గిరి అలంకరింపబడియుండెను.

శ్లో॥ క్రముకైర్నారికేలైశ్చ ఖర్జూరైర్బీజపూరకైః।
మధూకైః శాలతాలైశ్చ తమాలైరసనార్జునైః॥ 12

**తాత్పర్యము :** పోకలు, నారికేళములు, ఖర్జూరములు, మాదీఫలములు, విప్పలు, తాడులు, మద్దులు, చీకటి చెట్లు, వేగిసలు తెల్లమద్దులు అనువాని చేతను,

శ్లో॥ అరిష్టోదు(డు)మ్బరప్లక్షైర్వటైః కింశుకచన్దనైః।
పిచుమర్దైః కోవిదారైః సరళైః సురదారుభిః॥ 13

**తాత్పర్యము :** కుంకుడు, అత్తి, జువ్వి, మఱ్ఱి, మోదుగు, గంధపు చెట్లు, వేప, కొండగోగు, సరళము, దేవదారు లోనగు వృక్షములచేతను,

**ప్రతిపదార్థము :** తథా=ఆ ప్రకారము, ఆతురమ్=వెతకులోనైన, యూథపతిమ్=ఏనుగుల కధినాథుడైన ఆ గజమును, బలీయసా=బలిష్ఠమైన మొసలిచేత, తరసా=వడితో, వికృష్యమాణమ్=నోటిలోపలికి లాగబడుచున్న వానిని జూచి, కరేణవః=ఆడేనుంగులు, పరే=ఇతరములైన, గజాః=ఏనుగులు, దీనధియః=దిగులొందిన బుద్ధిగలవై, విచుక్రుశుః=రోదనము చేసెను. పార్ష్ణిగ్రహాత్=మడిమను బట్టిన మొసలి పట్టునుండి, తారయితుమ్=ఈవలికిఁదప్పించుటకు, న+అశకన్=శక్తిలేనివయ్యెను.

**తాత్పర్యము :** అట్లు వెతగుందిన గజనాథుని జూచి కరేణులు, ఇతరగజములు దీన భావమును బొందినవై మొసలిపట్టునుండి యా గజేంద్రుని దప్పింప శక్తిలేనివై యేడ్చెను.

**శ్లో॥** నియుధ్యతోరేవమిభేన్ద్రనక్రయోర్వికర్షతోరన్తరతో బహిర్మిథః।
సమాః సహస్రం వ్యగమన్ మహీపతే సప్రాణయోశ్చిత్రమమంసతామరాః॥ 29

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారముగా, నియుధ్యతోః=మల్ల యుద్ధము గావించు, అంతరతః=లోపలికిని (మొసలి), బహిః=వెలుపలికి (గజము), మిథః=పరస్పరము, వికర్షతోః=లాగుచున్న, సప్రాణయోః=ప్రాణములతో గూడిన, ఇభ+ఇంద్రనక్రయోః=గజరాజమునకు, మకరమునకు, సమాః=ఏండ్లు, సహస్రమ్=ఒక వేయి, వ్యగమన్=కడచెను, అమరాః=దేవతలు, చిత్రమ్=వాని తీరును చిత్రముగా, అమంసత=తలంచిరి.

**తాత్పర్యము :** ఇట్లు మొసలి నీటి లోపలికి, ఏనుగు నీటి వెలుపలికిని లాగుచు, ప్రాణములు వీడక పోరాడుచుండు ఆ యేనుగు మొసళ్ళకు అట్లే వేయి యేండ్లు గడచెను. అది చూచి వేల్పులెల్లనిది మహాచిత్రమని తలంచిరి.

**శ్లో॥** తతో గజేన్ద్రస్య మనోబలౌజసాం కాలేన దీర్ఘేణ మహానభూద్ వ్యయః।
వికృష్యమాణస్య జలేఽవసీదతో విపర్యయోఽభూత్ సకలం జలౌకసః॥ 30

**ప్రతిపదార్థము :** అంత, వికృష్యమాణస్య=మొసలిచే లాగబడుచూ, జలే=నీటియందు, అవసీదతః=వాశిల్లుచున్న, గజేంద్రస్య=ఆ గజరాజుయొక్క, దీర్ఘేణ కాలేణ=చాలా నిడివి జెందిన కాలముచే, మనోబలౌజసామ్=ఉత్సాహశక్తి, శరీరము, సత్వము, ఇంద్రియ పటుత్వము అనువాని యొక్క, వ్యయః=నాశము, మహాన్=అధికము, అభూత్=అయ్యెను, జలౌకసః=నీటి పట్టున గల మొసలికి, సకలమ్=ఆ మనోజవములన్నియు, విపర్యయః=అందుకు వ్యతిరేకమై, మహత్=అధికమై, అభూత్=అయ్యెను.

**తాత్పర్యము :** అంత మొసలి దన్ను నీటిలోనికి మఱిమఱి లాగుచుండు వాశిల్లుచున్న ఆ యేనుంగుల మేల్బంతికి చాలాకాలము అగుసరికి ఉత్సాహశక్తి, శరీరబలము, ఇంద్రియ పటుత్వము చాలా తగ్గిపోయెను. నీటి ఉనికి గాంచిన మొసలికి ఇవన్నియు పెచ్చు పెరిగెను.

**శ్లో॥** ఇత్థం గజేన్ద్రః స యదా ప సఙ్కటం ప్రాణస్య దేహీ వివశో యదృచ్ఛయా।
అపారయన్నాత్మవిచక్షణే చిరం దధ్యావిమాం బుద్ధిమథాభ్యపద్యత॥ 31

**ప్రతిపదార్థము :** ఇత్థమ్=ఈ ప్రకారము, స గజేంద్రః=ఆ గజరాజు, యదా=ఎప్పుడు, ప్రాణస్య=ప్రాణమునకు, సంకటమ్=విపత్తును, ఆప=పొందెనో, దేహీ=జీవుడు, యదృచ్ఛయా=



**ప్రతిపదార్థము :** కుబ్జకైః=గొజ్జంగులచేత, స్వర్ణయూథీభిః=బంగారు వన్నెల అడవి మొల్లల చేత, నాగపున్నాగజాతిభిః=నాగకేసరములు, పొన్నలు జాజుల చేత, మల్లికాశతపత్రైః=మల్లెలు, మెట్టతామరలచే, మాధవీజాలకాదిభిః=పూవుల గురువిందెలు, చిన్న కడవ చెట్లులోనగు వానిచే, తీరజైః=గట్టున మొలిచిన, నిత్యర్తుభిః=ఎప్పుడునన్ని ఋతుధర్మములు గల, ద్రుమైః=వృక్షముల చేత, అలమ్=మిక్కిలి, శోభితమ్=ప్రకాశించునదైయుండెను.

**తాత్పర్యము :** గొజ్జంగులు, బంగరువన్నె అడవిమల్లెలు, నాగకేసరములు, పొన్నలు, జాజులు, మల్లెలు, మెట్ట తామరలు, పూవుల గురువిందెలు, చిన్న కడవలులోనగు గట్టున మొలిచిన చెట్ల చేతను మిక్కిలి శోభిల్లుచుండెను.

**శ్లో॥** తత్రైకదా తద్గిరికాననాశ్రయః కరేణుభిర్వారణయూథపశ్చరన్।
సకణ్టకాన్ కీచకవేణువేత్రవద్ విశాలగుల్మం ప్రరుజన్ వనస్పతీన్॥ 20

**ప్రతిపదార్థము :** తత్ర=ఇట్లు సర్వము ప్రకాశించుచున్న ఆ వనమందు, తద్గిరి కానన+ఆశ్రయః=ఆ త్రికూట పర్వతకాననమునాశ్రయించినవాడగు, వారణయూథపః=గజరాజు, కరేణుభిః=ఆడేనుగులతో కూడి, సకంటకాన్=ముండ్లు తాళ్ళు కూడినది, కీచకవేణువేత్రవత్=మ్రోగుచున్న బొంగు వెదురులు బెత్తపు చెట్లు గల, విశాలగుల్మమ్=పెద్ద పొదవుగలదైన, వనస్పతీన్=మఱ్ఱి, రావిలోనగు పెద్ద వృక్షములుగల కానన మందు, చరన్=సంచరించుచు, ప్రరుజన్=విరచుచు.

**తాత్పర్యము :** ఆ పర్వతకాననము నాశ్రయించిన ఒక గజము ఆడేనుగులతోడి గూడి ముండ్లు తాళ్ళుగలదై మ్రోగుచున్న వెదుళ్ళు బెత్తపు చెట్లు కలదై పెద్ద పెద్ద పొదవుగలదైన మఱ్ఱి రావిలోనగు పెద్ద వృక్షములను విరచుచు ఆ కాననమందు సంచరించుచు...

**శ్లో॥** యద్గన్ధమాత్రాద్ధరయో గజేన్ద్రా వ్యాఘ్రాదయో వ్యాళమృగాః సఖడ్గాః।
మహోరగాశ్చాపి భయాద్ ద్రవన్తి సగౌరకృష్ణాః శరభాశ్చమర్యః॥ 21

**ప్రతిపదార్థము :** యత్+గంధమాత్రాత్=ఏ గజరాజు ఉద్ధతిమాత్రముననే, హరయః=సింహములు, గజేంద్రాః=ఇతరములగు మదపుటేనుగులు, వ్యాఘ్రాదయః=పులులులోనగు, వ్యాళమృగాః=దుష్టమృగములు, ఖడ్గాః=ఖడ్గమృగములు, మహోరగాశ్చ=గొప్ప సర్పములు, సగౌరకృష్ణాః=తెల్లనిచారలుగల, నల్లనిమచ్చలు గల, శరభాః=ఎనిమిది కాళ్ళు గలిగి సింహములను జంపు శరభమృగములు, చమర్యః=సవరపు మెకములును, భయాత్=భయము వలన, ద్రవంతి=పరుగెత్తిపోవును.

**తాత్పర్యము :** ఏ గజరాజు ఉద్ధతిని గాంచినంతననే భయపడి సింహములు, పెద్ద ఏనుగులు, పెద్ద పులులులోనగు దుష్టమృగములు, ఖడ్గమృగములు, దొడ్డ సర్పములు, తెల్లచాఱలు నల్ల దుప్పులు, ఎనిమిది కాళ్ళుగల శరభమృగములు, సవరపు మెకములు పారిపోవును.

**శ్లో॥** వృకా వరాహా మహిషర్క్షశల్యాః గోపుచ్ఛసాలావృకమర్కటాశ్చ।
అన్యత్ర క్షుద్రా హరిణాః శశాదయశ్చరన్త్యభీతా యదనుగ్రహేణ॥ 22

**ప్రతిపదార్థము :** వృకాః=తోడేళ్ళు, వరాహాః=అడవిపందులు, మహిష+ఋక్ష+శల్యాః=అడవి దున్నలు, ఎలుగుబండ్లు, ముండ్ల పందులు, గోపుచ్ఛసాలావృకమర్కటాఃచ=పెద్ద తోకలు

గల కోతులు, నక్కలు, కోతులు, హరిణాః=జింకలు, శశాదయః=డేగలు, యత్+అనుగ్రహేణ=ఏ గజరాజు అనుగ్రహము చేత, అన్యత్ర=ఆ గజరాజు దృష్టిపథమును తప్పించి, క్షుద్రాః=అల్పమృగములు, అభీతాః=భయములేనివై, చరంతి=సంచరించుచున్నవి.

**తాత్పర్యము :** తోడేళ్ళు, అడవిపందులు, అడవిదున్నలు, ఎలుగుబండ్లు, ముండ్లపందులు, పెద్దతోకలుగలకోతులు, నక్కలు, కోతులు భయపడి పరిగెత్తును. అల్పజంతువులైన జింకలు, డేగలులోనగునవి ఆ గజరాజు అనుగ్రహమును నొందినవి. ఆ గజరాజు దృష్టిని తప్పించుకొని భయములేనివై సంచరించుచుండును.

**శ్లో॥ స ఘర్మతప్తః కరిభిః కరేణుభిః వృతో మదచ్యుత్ కలభైరనుద్రుతః।**
**గిరిం గరిమ్ణా పరితః ప్రకమ్పయన్నిషేవ్యమాణోఽలికులైర్మదాశనైః॥ 23**

**ప్రతిపదార్థము :** సః=ఆ గజేంద్రుడు, ఘర్మతప్తః=రవికిరణములచే తాపమునొందినవాడై, కరిభిః=ఏనుగులతో, కరేణుభిః=ఆడేనుగులతో, వృతః=కూడుకొన్నవాడై, మదచ్యుత్=మదోదకమును స్రవింపజేయుచున్నవాడై, కలభైః=ఏనుగు గున్నలతో కూడి, గిరిమ్=ఆ పర్వతమును, గరిమ్ణా=తన భారముచే పరితః=అంతటను, ప్రకంపయన్=వడకించుచున్నవాడై, మద+అశనైః=మదోదకమును భుజించు, అళికులైః=తుమ్మెద మొత్తముచే, నిషేవ్యమాణః=సేవింపబడుచున్నవాడై, అనుద్రుతః=వడివడి పోయెను.

**తాత్పర్యము :** ఆ మిన్న యేనుగు వేసఁగి వెట్టకుఁదాపము పొంది దాహముగొన్నవాడై, ఏనుగులు, ఆడేనుగులు, ఏనుగు గున్నలు తన్నుఁ జుట్టురాగా తన దేహభారము వలన ఆ పర్వతమునంతను వడికించుచు మదోదకమును గ్రోలు తుమ్మెదలు తన్ను సేవింపగా వడివడిపోయెను.

**శ్లో॥ సరోఽనిలం పఙ్కజరేణురూషితం జిఘ్రన్ విదూరాన్మదవిహ్వలేక్షణః।**
**వృతః స్వయూథేన తృషార్దితేన తత్ సరోవరాభ్యాశమథాగమద్ ద్రుతమ్॥ 24**

**ప్రతిపదార్థము :** మదవిహ్వలేక్షణః=మదముచే వివశములైన కన్నులు గల ఆ గజరాజు, విదూరాత్=దూరము నుండియే, పంకజరేణురూషితమ్=తామరల పుప్పొడి కలసిన వన్నె మారి, సరః+అనిలమ్=కొలంకు గాలిని, జిఘ్రన్=మూర్కొనుచు, తృష+ఆర్దితేన=దప్పిచే నలగుచున్న, స్వయూథేన=తన కరుల మొత్తముతో, వృతః=కూడుకొన్నవాడయి, అథః=అంత, తత్=ఆ, సరోవరాభ్యాశమ్=సరోవరము సమీపమును గూర్చి, ద్రుతమ్=వడిగా, ఆగమత్=పోయెను.

**తాత్పర్యము :** మదమున కన్నులు వివశములు కాగా ఆ గజరాజు తామరల పుప్పొడి కలసిన కొలంకుగాలిని దూరము నుండియే మూర్కొనుచు దప్పిగొని తన యేనుగుల మొత్తము దన్నుకూడిరాగా, ఆ మేలైన కొలంకు చెంతకు వడివడిపోయెను.

**శ్లో॥ విగాహ్య తస్మిన్నమృతామ్బు నిర్మలం హేమారవిన్దోత్పలరేణువాసితమ్।**
**పపౌ నికామం నిజపుష్కరోద్ధృతమాత్మానమద్భిః స్నపయన్ గతక్లమః॥ 25**



**ప్రతిపదార్థము :** తస్మిన్=ఆ సరస్సునందు, విగాహ్య=మునింగి, హేమ+అరవింద+ఉత్పలరేణువాసితమ్=పొలదామరలయు, నల్లకలువలయు, పరాగము వాసన గొట్టు(నట్టిదై) చున్నదై, నిర్మలమ్=తేటయైన, అమృత+అంబు=అమృతము వంటి నీటిని, నికామమ్=తనివితీర, పపౌ=త్రాగెను, నిజ పుష్కర+ఉద్ధృతమ్=తన తొండముతో పీల్చి పైకెగురబడినదాని నీరు తాపముచే, అద్భిః=ఉరములచే, ఆత్మానమ్=తన మేనును, స్నపయన్=తడుపుచు, గతక్లమః=పోయిన తాపము గలవాడయ్యెను.

**తాత్పర్యము :** ఆ గజరాజు ఆ కొలంకునందు మునిగి బంగరు తామరలయు, నల్ల కలువలయు, పుప్పొడి తావివలచునదై తేటగించినదై, అమృతము వంటి నీటిని తన తొండముతో పీల్చి యెత్తి తనివిదీర గ్రోలెను. ఆ చల్లని నీళ్ళతో తన మేనంతయుఁదడిపి బడలికను దీర్చుకొనెను.

**శ్లో॥ స్వపుష్కరేణోద్ధృతశీకరామ్బుభిర్నిపాయయన్ సంస్నపయన్ యథా గృహీ।**
**జిఘ్రన్ కరేణూః కలభాంశ్చ దుర్మదానాచష్ట కృచ్ఛ్రం కృపణోఽజమాయయా॥ 26**

**ప్రతిపదార్థము :** యథా గృహీ=గృహస్థుడువలె ఆ గజరాజు, స్వపుష్కరేణ=తన తొండముతో, ఉద్ధృతశీకరాంబుభిః=పైకిగ్రహించబడిననీటితుంపరలచే,కరేణూః=ఆడేనుగులను, దుర్మదాన్=పొగరుబోతులైన, కలభాన్=ఏనుగుగున్నలను, నిపాయయన్=తనివితీర త్రాగించుచు, సంస్నపయన్=మేనులెల్లఁదడుపుచు, జిఘ్రన్=మూర్కొనుచు, అజమాయయా =విష్ణుమాయచే, కృపణః=దీనుడై, కృచ్ఛ్రమ్=చాలా కష్టముగా, ఆచష్ట=తలంచెను.

**తాత్పర్యము :** ఆ గజపతి గృహస్థుడట్లు తన తొండముతో జలములను గైకొని ఆడేనుంగులను పొగరుగొన్న గున్నయేనుంగులను ద్రాగించుచు వాని మేనులు తడియ నీరు చల్లుచు వానిని మూర్కొనుచు నుండి పదంపడి విష్ణుమాయచే దీనుడై కష్టమున నిట్లు తలంచెను.

**శ్లో॥ తం తత్ర కశ్చిన్నృప! దైవచోదితో గ్రాహో బలీయాంశ్చరణే రుషాగ్రహీత్।**
**యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో యథాబలం సోఽతిబలో విచక్రమే॥ 27**

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా !, తత్ర=ఆ సరస్సునందలి, బలీయాన్=బల్లిదమైన, కశ్చిత్=ఒకానొక, గ్రాహః=మొసలి, దైవచోదితః=దైవప్రేరణమున, రుషా=క్రోధముతో, చరణౌ=ఆ గజము పాదములను, అగ్రహీత్=పట్టుకొనెను, యదృచ్ఛయా=తనకు తానే వచ్చి, ఏవమ్=ఈవిధముగా, వ్యసనమ్=దుఃఖమును, గతః=పొందినదైన, గజః=ఏనుగు, యథాబలమ్=ఎంత బలమున్నదో, సః=ఆ మకరము, అతిబలః=మిక్కిలి బలముగలదై, విచక్రమే=ఆక్రమించెను.

**తాత్పర్యము :** ఆ కొలనియందున్న ఒకానొక బల్లిదమైన మొసలి విధివశమున నేతెంచి కినుకమెయి యాగజరాజు పాదములు గఱచి పట్టుకొనెను. ఉన్నట్లుండి తనకుతానై వచ్చి దుఃఖమును పొందినవాడైన ఆ గజరాజు బలమెంతగలదో ఆ బలమునంతను మించినదై మిక్కిలి బలముగల ఆ మొసలి ఆక్రమించెను.

**శ్లో॥ తథాతురం యూథపతిం కరేణవో వికృష్యమాణం తరసా బలీయసా।**
**విచుక్రుశుర్దీనధియోఽపరే గజాః పార్ష్ణిగ్రహాస్తారయితుం న చాశకన్॥ 28**

లెల్లరు, సర్వహేతుషు=వానికి కారణమైన మహదహంకారతన్మాత్రాది పంచమహాభూతములు, కాలేన=కల్పాంతకాలముచే, కృత్స్నశః=సర్వవిధముల, పంచత్వమ్=నాశనమును, ఇతేషు= పొందినదగుచుండగా, తదా=అప్పుడు, గహనమ్=దురవగాహమై, గంభీరమ్= అనంతమై, తమః=తామసికమైన, మాయాంధకారము, ఆసీత్=ఆయెను. తస్య=ఆ యంధకారమునకు, పారే=ఆవల, ('ఆదిత్యం వర్ణం తమసః' అని శ్రుతి) యః=ఎవడు, అభివిరాజతే=ప్రకాశించునో.

**తాత్పర్యము :** మహాప్రళయమునందు భువాదిచతుర్దశభువనములు, బ్రహ్మేంద్రాది పాలకులును వానికిఁగారణమైన మహదహంకార తన్మాత్ర పంచభూతాదులును పూర్తిగా నాశనము బొంది తామసికమై మాయాంధకారము దురవగాహమై అనంతమై వ్యాప్తముకాగా ఆయంధకారమునకు ఆవలనెవడు ప్రకాశించుచున్నాడో-

**శ్లో॥ న యస్య దేవా ఋషయః పదం విదుర్జన్తుః పునః కో - ర్హతి గన్తుమీరితుమ్।**
**యథా నటస్యాకృతిభిర్విచేష్టతో దురత్యయానుక్రమణః స మావతు॥ 6**

**ప్రతిపదార్థము :** యస్య=ఎవని యొక్క, పదమ్=స్థానమును, దేవాః=దేవతలు, ఋషయః =ఋషులు, న విదుః=తెలుసుకొనలేరో, పునః=మరి, జంతుః=ఆ దేవ ఋషులకు తర్వాతి వాడైన ప్రాణి, కః=ఎవడు, గంతుమ్=తెలుసుకొనుటకు, ఈరితుమ్=తలంచుటకు, అర్హతి= తగునో, నటస్య=నాట్యము చేయువాని, ఆకృతిభిః యథా=పలు రూపులచేతనువలెను, విచేష్టితః=పలువిధములుగా ప్రవర్తించువాడును, దురత్యయ+అనుక్రమణః=దుర్గమమైన చరిత్రము గలవాడగు, సః=ఆ భగవానుడు, మా=నన్ను, అవతు=రక్షించును.

**తాత్పర్యము :** ఎవని కలరూపును వేల్పులు గాని, మునులు గాని యెఱుంగలేరన్న కేవలము మొన్న మొన్న పుట్టినవాడు భగవత్తత్త్వమెఱుంగదగినవాడగునో, నాట్యము చేయు నట్టువవలె పలు వేషభాషలు (అవతారములు, తత్కృత్యములు) గలిగి ఎఱుంగుటకు శక్యముగాని ప్రవర్తనము గల దుర్గమమైన చరిత్రము గల భగవంతుడు నన్ను రక్షించును.

**శ్లో॥ దిదృక్షవో యస్య పదం సుమఙ్గళం విముక్తసఙ్గా మునయః సుసాధవః।**
**చరన్త్యలోకవ్రతమవ్రణం వనే భూతాత్మభూతాః సుహృదః స మే గతిః॥ 7**

తమేవం విద్వానమృత ఇహ భవతి నాన్యః పంథా విద్యతే - యనాయ.

ఆ పరమేశ్వరుని తెలిసుకొనుటవలనే సంసారగతిని దాటుచున్నాము. అదిగాక మోక్షమును పొందుటకు వేరు మార్గము లేదు అను శ్రుతిని ఆశంకించి ఆ పరమేశ్వరు నెఱుంగు జ్ఞానోపాయము చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య=ఏ పరమేశ్వరుని యొక్క, మంగళమ్=నిత్యోత్సవమైన పదం, స్థానమును, దిదృక్షవః=చూడగోరినవారై, మునయః=మునులు, విముక్తసంగాః=అన్ని విషయములందు ఆసక్తివీడినవారై, సుసాధవః=చక్కని సాధువులవలె, ఆలోకవ్రతమ్= బ్రహ్మచర్యాది వ్రతం, అవ్రణమ్=భ్రష్టముకాని దానిని, చరంతి=ఆచరించుచూ, భూతాత్మభూతాః=ఎల్ల ప్రాణులందు ఆత్మద్రష్టలుగానై, సుహృదః=ఎల్ల ప్రాణులందు స్నేహ ముద్ర గలవారైన, సః=ఆ పరమేశ్వరుడే నాకు, గతిః=శరణు అగుగాక !



విధి చెయ్దిమున, వివశః=పరవశుడై, ఆత్మవిచక్షణే=తన బంధవిముక్తి వితానువై, అపారయన్ =అంతము పొడగానక, చిరమ్=తడవుకాలము, దధ్యౌ=ఆలోచించెను. అథ=తర్వాత, ఇమాం బుద్ధిమ్=ఈ బుద్ధిని, ఈ తలంపుని, అభ్యపద్యత=పొందెను.

**తాత్పర్యము :** ఇట్లా గజేంద్రుడు ప్రాణ సంకటమునకు గుఱియై ఆ ప్రాణి విధిచేతకు అధీనుడై తన బంధమోక్షమునకు అంతముగానక చాలాకాలము, ఆలోచించి కడకట్టి బుద్ధి కలవాడయ్యెను.

**శ్లో॥ న మామిమే జ్ఞాతయ ఆతురం గజాః-కుతః కరిణ్యః ప్రభవన్తి మోచితుమ్।**
**గ్రాహేణ పాశేన విధాతురావృతో౽ప్యహం చ తం యామి పరం పరాయణమ్॥ 32**

**ప్రతిపదార్థము :** జ్ఞాతయః=బంధువులైన, ఇమే=ఈ, గజాః=ఏనుగులు, ఆతురః=ఆపదలో బడిన, మామ్=నన్ను, మోచితుమ్=విడిపించుటకు, న=చాలవు, కరిభిః=ఆడ ఏనుగులు, కుతః=ఎట్లు, ప్రభవంతి=చాలును, గ్రాహేణ=మొసలి/నోటిన/రూపున/పొందిన, విధాతుః =విధి యొక్క, పాశేన=పాశముచే, వృతః=చుట్టబడియున్న, అహమ్ చ=నేను, తమ్=ఆ, పరమ్=పరమేశ్వరుని, పరాయణమ్=బ్రహ్మాదులచే ఆశ్రయభూతుని, శరణమ్=శరణమును, యామి=పొందెదను.

**తాత్పర్యము :** ఈ బంధువులైన గజములు, ఈ కరేణువులు వీరెట్లును నన్ను బంధము నుండి విడిపించుటకు సమర్థులు గారు. నేను అశక్తుడను. మొసలి రూపున విధి పాశము నన్ను గట్టివైచినది. నేను ఆ పరమేశ్వరుని బ్రహ్మాదులకు ఆశ్రయుని శరణు పొందెదను.

**శ్లో॥ యః కశ్చనేశో బలినో౽న్తకోరగాత్ ప్రచండవేగాదభిధావతో భృశమ్।**
**భీతం ప్రపన్నం పరిపాతి యద్భయాన్మృత్యుః ప్రధావత్యరణం తమీమహి॥ 33**

**ప్రతిపదార్థము :** యః కశ్చన+ఈశః=ఏ యొక్కనొకడు జగమునకుఁబ్రభువై యున్నాడో, బలినః=బల్లిదుడై, ప్రచండవేగాత్=తీవ్రమైన వేగముగలవాడై, అభిధావతః=పైకి కలియ పరువెత్తివచ్చిన, అంతక+ఉరగాత్=యముడను సర్పము నుండి, భీతమ్=భయము పొందిన వాడైన, ప్రపన్నమ్=శరణుపొందిన వాడిని, యః=ఎవడు, పరిపాతి=రక్షించుచున్నాడో, యత్+భయాత్=ఎవని భయముచే, మృత్యుః=మృత్యువు, ప్రధావతి=పరుగెత్తుచు నియమమున ప్రవర్తించునో, తమ్=ఆ పరమేశ్వరుని, అరణమ్=శరణమును, ఈమహి=పొందెదను.

**తాత్పర్యము :** ఎవడు సర్వజగదీశుడో, తీవ్ర వేగమున బైకి గలియబరుగెత్తి వచ్చిన అంతకుడను సర్పము నుండి భయపడి తన్ను శరణుఒడ్డిన వాని రక్షించుచున్నాడో, ఎవ్వని భయమున మృత్యువు సైతము జాగ్రత్తతో తన కృత్యమును గావించునో ఆ పరమేశ్వరుని శరణు పొందెదను.

ఈ పరబ్రహ్మము యొక్క భయముచే వాయువు వీచును, సూర్యుడుదయించును. ఆ భయముచే నింద్రాగ్నులు ప్రవర్తించును, ఆ భయముచే మృత్యువు ప్రవర్తించును.

ఇతి శ్రీ మద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే ద్వితీయో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవత మహాపురాణమునందు అష్టమ స్కంధమున ద్వితీయాధ్యాయము.

## తృతీయోఽధ్యాయః

ఈ అధ్యాయమునందు గజేంద్రునిచే స్తుతించబడి హరివచ్చి గ్రాహముఖము నుండి ఆ గజేంద్రునుద్ధరించెను. అతనికి దేవలుని శాపమును దీరెను అనునవి వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం వ్యవసితో బుద్ధ్వా సమాధాయ మనో హృది।**
**జజాప పరమం జాప్యం ప్రాగ్జన్మన్యనుశిక్షితమ్॥** 1

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము ఆ గజేంద్రుడు, బుద్ధ్వా=బుద్ధిచే, వ్యవసితః =నిశ్చయమును బొందినవాడై, మనః=మనస్సును, హృది=హృదయమునందు, సమాధాయ= ఉంచి, ప్రాగ్జన్మని+అనుశిక్షితమ్=పూర్వ జన్మమునందు, ఇంద్రద్యుమ్నుడను పేరుతో నున్నవాడై అభ్యసించబడిన, పరమమ్=ఉత్తమమైన, జాప్యమ్=స్తోత్రమును, జజాప=జపించెను.

**తాత్పర్యము :** ఇట్లు గజేంద్రుడు బుద్ధియందు నిశ్చయించుకొన్నవాడై, మనస్సునందు, నిగ్రహము గల హృదయమునందు నిల్పి పూర్వజన్మమునందు అభ్యసించబడినదైన ఉత్తమమైన విష్ణుస్తోత్రమును గావించెను.

**గజేన్ద్ర ఉవాచ :** గజరాజు వచించెను.

**శ్లో॥ ఓం నమో భగవతే తస్మై యత ఏతచ్చిదాత్మకమ్।**
**పురుషాయాదిబీజాయ పరేశాయాభిధీమహి॥** 2

గ్రాహముచే బట్టుబడినందున శరీరము వంచి నమస్కరించుటకు శక్యము కానందున తనకు ఆ భగవత్ జ్ఞానము సంభవించుటకు విశేషించి స్తుతించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యతః=ఏ చిద్రూపుని వలన, ఏతత్=ఈ దేహాదికము, చిత్+ఆత్మకమ్= చేతనముగా నగుచున్నదో, అట్లే, యేన చేతయతే విశ్వమ్ అని వచించెనో అందుకు హేతువు, పురుషాయ=కారణస్వరూపమై ఎల్ల ప్రాణుల శరీరములందు ప్రవేశించినవాడు, ప్రకృతి పురుషులు కారణమై యుండుట ప్రసిద్ధమైనదో చెబుతూ ఆదిబీజాలు – ఆదియనగా ప్రకృతి, బీజము పురుషుడు, ఈ యిరువురి రూపమైనవాడు అట్లు శరీరములఁబ్రవేశించు పరమేశ్వరుడునగు వానిని, అభిధీమహి=ధ్యానించెదను. భగవతే=షడ్గుణైశ్వర్యసమృద్ధిగల తస్మై=ఆ విష్ణువునకు, పరేశాయ=పరమేశ్వరునకు, ఓం నమః=ప్రణామపూర్వకముగా నమస్కారములు.

**తాత్పర్యము :** జ్ఞానాదిషడ్గుణైశ్వర్యసంపన్నుడగు ఆ విష్ణువునకు బ్రణామపూర్వకముగా నమస్కారము చేయుచున్నాను. ఎవని వలన ఈ ప్రాణి సముదాయము చేతనము (జ్ఞానం) గలదగుచున్నదో, ఎవడెల్ల ప్రాణుల శరీరములందంతర్యామిరూపమునఁ బ్రవేశించి యున్నాడో, ఎవడు ప్రకృతి పురుషుల రూపమైయున్నాడో, ఎవడు పరమేశ్వరుడో ఆ విష్ణువును ధ్యానించెదను.

**శ్లో॥ యస్మిన్నిదం యతశ్చేదం యేనేదం య ఇదం స్వయమ్।**
**యోఽస్మాత్ పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయమ్భువమ్॥** 3



పరమైశ్వర్యమును వివరించుచు చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్మిన్=అధిష్ఠానమైన ఎవనియందు, ఇదమ్=ఈ జగము నిల్చియున్నదో, యతః చ=ఎవని ఉపాదానము వలన, ఇదమ్=ఈ జగము ఉద్భవించుచున్నదో, యేన= ఏ కర్తచే, ఇదమ్=ఈ జగము పరిపాలింపబడునో, యః=ఎవడు, అస్మాత్=కార్యరూపమైన జగము కంటెను, పరస్మాత్=కారణరూపమైన ప్రకృతికంటెను, పరః=వేఱైయున్నాడో, తమ్=ఆ, స్వయంభువః=స్వతస్సిద్ధుడై యున్నవానిని విష్ణువును, ప్రపద్యే=శరణుపొందెదను.

**తాత్పర్యము :** అధిష్ఠానమై సర్వమునకు రజ్జువువలె యుండగా ఈ విశ్వము భాసించుచున్నదో, ఎవని యుపాదానమున (కుండకు మట్టి ఆకారము) ఈ జగము ఏర్పడుచున్నదో, ఎవడు కర్తయై ఈ జగమును బ్రోచుచున్నాడో ఎవఁడీ జగమంతయు తానేయై యున్నాడో, ఎవడీ కార్యరూపమగు జగత్తుకంటెను కారణరూపమగు ప్రకృతికంటెను పరుడో, ఆ స్వయంభువుని విష్ణువును శరణుపొందుచున్నాను.

**శ్లో॥ యః స్వాత్మనీదం నిజమాయయార్పితం క్వచిత్ విభాతం క్వ చ తత్ తిరోహితమ్।**
**అవిద్ధదృక్ సాక్ష్యుభయం తదీక్షతే స ఆత్మమూలోఽవతు మాం పరాత్పరః॥** 4

విశ్వహేతువగుటను స్వతస్సిద్ధుడై యుండుటను చెప్పబడినది. ఇప్పుడు విశ్వ ప్రకాశకత్వమును స్వప్రకాశకత్వమును వర్ణించుచు బ్రార్థించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, నిజమాయయా=తన వైష్ణవమాయచే, స్వాత్మని=తనయందు, అర్పితమ్=సమర్పించబడిన (లీనము గావింపబడిన), ఇదమ్=ఈ జగమును, అవిద్ధదృక్= లుప్తముగాని దృష్టిగలవాడై, సాక్షీ=సాక్షియై, క్వచిత్=ఒకప్పుడు, సృష్టికాలమునందు, విభాతమ్= అభివ్యక్తమైనదియు, క్వచిత్=ఒకప్పుడు ప్రళయకాలమందు, తిరోహితమ్=లీనమైపోవుదానిని, ఉభయమ్=కార్యమును, జగమును, కారణమును, ప్రకృతిని, ఈక్షతే=చూచుచున్నాడో, ఆత్మమూలః=ఎల్ల జీవులకు మూలమై స్వప్రకాశుడైన, పరాత్పరః=ప్రకృతికిఁబరుడు లేక ప్రకాశములైన చక్షురాదులకునుఁ బరుడో వానిని సైతము ప్రకాశింపజేయువాడును, మామ్= నన్ను, అవతు=రక్షించుగాక !

**తాత్పర్యము :** ఎవడు తన వైష్ణవమాయ తనయందు సమర్పించిన ఈ జగమును సృష్టి కాలమును బ్రకాశించునదిగనుఁబ్రళయకాలమందు లీనమైనదిగను, అప్రతిహతమైన జ్ఞాన దృష్టిగలవాడై సాక్షియై చూచుచున్నాడో ఆయాత్మ మూలజీవులకెల్ల మూలమైన స్వప్రకాశుడు ఆ పరాత్పరుడు ప్రకృతి పురుషులకు పరుడై లేక పరమైన చక్షురాదీంద్రియ సముదాయమునుఁ బ్రకాశింపజేయుచున్నాడో వాడు నన్ను రక్షించువాడు.

**శ్లో॥ కాలేన పఞ్చత్వమితేషు కృత్స్నశో లోకేషు పాలేషు చ సర్వహేతుషు।**
**తమస్తదాసీద్ గహనం గభీరం యస్తస్య పారేఽభివిరాజతే విభుః॥** 5

తిరోహితమైన దానిని జూచుచున్నాడను దానిని విస్తరించి చెప్పుట ద్వారా దుర్జ్ఞేయత్వమును తెలిసికొనలేకపోవుటను తలంచుచు ప్రార్థించుచున్నాడు. రెండవ శ్లోకం చేత – కాలేన.

**ప్రతిపదార్థము :** లోకేషు=భువాది చతుర్దశ భువనములను, పాలేషు=ఇంద్రాది దిక్పాలకులకు

లోపల గల అత్తిలోనగు పుల్లలచే) కప్పబడి, చిదూష్మపాయ=జ్ఞానమను నగ్నికలవాడు, తత్+క్షోభ=ఆ గుణముల కార్యమగు జగత్సృష్టిచేత, విస్ఫూర్జిత=బహిర్వృత్తికల (వెలుపల నుంచినదై) మానసాయ=మానసము (సంకల్పముగలవాడు)గల, నైష్కర్మ్యభావేన=ఆత్మతత్త్వము యొక్క అభావము చేత, నివర్తిత+ఆగమస్వయం ప్రకాశాయ=నివర్తింపబడిన, విధినిషేధలక్షణ రూపములై వేదములు గలవారి యందు స్వయముగానే ప్రకాశించువాడు అగు దేవుని కొరకు, నమస్కరోమి=నమస్కరించెదను.

**తాత్పర్యము :** గుణముల ఆరణిచే ప్రకృతిచే గప్పబడిన జ్ఞానాగ్ని కలవాడును, గుణముల కార్యమగు సృష్టియందు బ్రకటితమైన మనస్సంకల్పముగలవాడు ఆత్మతత్త్వభావనచే విధి నిషేధరూపములైన వేదములను వర్జించినవానియందు స్వయముగాఁబ్రకాశించువాడగు దేవునికి నమస్కరించెదను.

**శ్లో॥ మాదృక్ ప్రపన్నపశుపాశవిమోక్షణాయ**
**ముక్తాయ భూరి కరుణాయ నమోऽలయాయ।**
**స్వాంశేన సర్వతనుభృన్మనసి ప్రతీత-**
**ప్రత్యగ్ దృశే భగవతే బృహతే నమస్తే॥ 17**

**ప్రతిపదార్థము :** మాదృక్.....ణాయ-మాదృక్=నా వంటి దిక్కులేని, ప్రపన్న=శరణుపొందిన, పశుపాశ=పశువుయొక్క అవిద్యయను పాశమును విముక్తిగావించువాడు, యోగ్యతను చెప్పు చున్నాడు, ముక్తాయ=అవిద్యాది సంబంధము లేనివాడు, విమోచనమున హేతువు, భూరి కరుణాయ=అధికకరుణగలవాడు, అందువలన ఆవిభుడు, అలయాయ=అలయుడు అగుచు, స్వాంశేన=అంతర్యామి రూపమున, సర్వతనుభృత్మనసి=ఎల్ల దేహధారుల మనస్సు లందు, ప్రతీత ప్రత్యగ్దృశే=ప్రఖ్యాతమైన అంతర్దృష్టి కలవాడును,

య ఆత్మనితిష్ఠన్నాత్మా.... అంతరోయం, భగవతే=ఎల్ల శరీరధారుల నియమనము నందు సమర్థుడు, బృహతే=వారి మనస్సునందున్నాను అపరిచ్ఛిన్నుడైన, తే=నీకు, నమః =నమస్కారము.

**తాత్పర్యము :** దిక్కులేని తన్ను శరణుపొందిన నావంటి పశువుల అజ్ఞానపాశమునుండి విడిపించువాడును, అవిద్యాసంబంధము లేనివాడు, దయాసముద్రుడు, అలయుడు లేక సర్వమును జాగ్రత్తగ నిర్వహించువాడు, అంతర్యామిరూపమున ఎల్ల దేహధారుల హృదయములందుండువాడు పరిచ్ఛిన్నుడు కానివాడును సర్వజీవుల నియమించు భగవంతునికి నమస్కారము.

**శ్లో॥ ఆత్మాత్మజాప్తగృహవిత్తజనేషు సక్తైర్దుష్ప్రాపణాయ గుణసఙ్గవివర్జితాయ।**
**ముక్తాత్మభిః స్వహృదయే పరిభావితాయ జ్ఞానాత్మనే భగవతే నమ ఈశ్వరాయ॥ 18**

**ప్రతిపదార్థము :** ఆత్మాత్మ... జనేషు=వారందరి లోపలనున్నవాడై, ఆత్మ=దేహమున, ఆత్మజ=పుత్రులు, ఆప్త=మిత్రులు, గృహ=ఇళ్ళు, విత్త=సొమ్ము, జనేషు=పరివారములోనగు వానియందు, సక్తైః=ఆశక్తులైన వారిచే దుష్ప్రాపణాయ=పొందశక్యముగాని వాడును, గుణసంగవివర్జితాయ=సత్వాది గుణముల సంపర్కము లేనివాడును, ముక్త+ఆత్మభిః



**తాత్పర్యము :** ఏ పరమేశ్వరుని నిత్య కళ్యాణాస్పదమైనధామమును బొందగోరి ఎల్ల విషయము లందు సంగము వీడిన మునులు, చక్కని సాధువర్తనము గలవారు, సర్వభూతములందు ఆత్మదృష్టిగలవారు, సర్వభూతములందు స్నేహబుద్ధి గలవారునై అడవిలో లోక సామాన్యము గాని బ్రహ్మచర్యాదివ్రతము, జపములలో, అవ్రణమ్=నడువ భంగము పొందనిదైనది అనుష్ఠించుచున్నారో ఆ పరమేశ్వరుడు నాకు శరణు అగుగాక !

**శ్లో॥ న విద్యతే యస్య చ జన్మ కర్మ వా న నామరూపే గుణదోష ఏవ వా।**
**తథాపి లోకాప్యయసమ్భవాయ యః స్వమాయయా తాన్యనుకాలమృచ్ఛతి॥ 8**

దుర్గమమైన చరిత్ర గలవాడని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య=ఎవనికి, జన్మకర్మ చ=పుట్టుక, కర్తవ్యమగు క్రియలు, న విద్యతే= లేవో, నామరూపే=నామ రూపములు, న=లేవో, గుణదోషః+ఏవ వా=గుణదోషములును న=లేవో, తథాపి=అట్టివాడైనను, లోక+అప్యయసంభవాయ=జగము యొక్క ప్రళయమునకు సృష్టికొరకు, స్వమాయయా=తన మాయతో గూడి, అనుకాలమ్=ప్రతికాలమునందు, ప్రతి కల్పమునందు, తాన్=ఆ జన్మ కర్మలను, ఋచ్ఛతి=పొందుచున్నాడో ఆ దేవునకు నమ (స్కరించుచున్నాను)స్కారము.

**తాత్పర్యము :** ఎవనికి జన్మకర్మములు లేవో, నామరూపములు లేవో, గుణదోషములు లేవో తానట్టివాడై లోకముల సృష్టి ప్రళయముల కొరకు ఆయా కాలమునందు తాను తన మాయతో గూడి ఆ జన్మ కర్మాదులను బొందుచున్నాడో ఆ దేవునికి నమ(స్కరించు చున్నాను)స్కారము.

**శ్లో॥ తస్మై నమః పరేశాయ బ్రహ్మణేऽనన్తశక్తయే।**
**అరూపాయోరురూపాయ నమ ఆశ్చర్యకర్మణే॥ 9**

**ప్రతిపదార్థము :** బ్రహ్మణే=బ్రహ్మమును, అనంత శక్తయే=నాశము లేని శక్తులు గలవాడు, అరూపాయ=రూపము లేనివాడు, ఉరురూపాయ=పెక్కు దొడ్డ రూపములు గలవాడు, ఆశ్చర్యకర్మణే=అద్భుతములు గల క్రియలు గలవాడునగు, తస్మై=ఆ, పరేశాయ= పరమేశ్వరునకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** బ్రహ్మము, అనంతశక్తి, అరూపుడు, మహారూపుడు, అద్భుతక్రియుడైన ఆ పరమేశ్వరునకు నమస్కారము.

**శ్లో॥ నమః ఆత్మప్రదీపాయ సాక్షిణే పరమాత్మనే।**
**నమో గిరాం విదూరాయ మనసశ్చేతసామపి॥ 10**

**ప్రతిపదార్థము :** ఆత్మప్రదీపాయ=ప్రకాశాంతరమునకు అవిషయుడై, స్వయంప్రకాశుడు, సాక్షిణే=సాక్షియై యుండి సర్వమును ప్రకాశింపజేయువాడు, పరమాత్మనే=జీవులను నియమించువాడు అగువానికి, నమః=నమస్కారము. గిరాం=వాక్కులకు, మనస=మనస్సునకు, చేతసామ్=చిత్తవృత్తులకు, విదూరాయ=అందనివానికి, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** మనోబుద్ధులతో సూర్యచంద్రాది ప్రకాశముల వలె ప్రకాశింపనివాడు, స్వయం ప్రకాశుడు, సర్వమును ప్రకాశింపజేయువాడును, సర్వలోక సాక్షియు, వాక్కునకు, మనస్సునకు, చిత్తవృత్తులకు దూరుడైన పరమేశ్వరునకు నమస్కారము.

**శ్లో॥ సత్త్వేన ప్రతిలభ్యాయ నైష్కర్మ్యేణ విపశ్చితా।**
**నమః కైవల్యనాథాయ నిర్వాణసుఖసంవిదే॥ 11**

**ప్రతిపదార్థము :** విపశ్చితా=బుద్ధిమంతుడై నిపుణుడైన పండితునిచే, సత్త్వేన=సత్యమైన, శుద్ధమైన మార్గము చేత, నైష్కర్మ్యేణ=సన్న్యాసము చేత, ప్రతిలభ్యాయ=ప్రత్యగాత్మగా పొందదగినవాడు, కైవల్యనాథాయ=మోక్షమునిచ్చు ప్రభువు, నిర్వాణసుఖసంవిదే= మోక్షానందానుభవస్వరూపుడైనవానికి, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** సన్న్యాసయోగాత్మక శుద్ధసత్త్వగుణముచే పరిశుద్ధాంతకరణుడై సన్న్యాస యోగమున పరమేశ్వరుని పొందును. ఈ బుద్ధిమంతుడైన, నిపుణుడైన, పండితుడైన, సత్త్వ గుణమున పరిశుద్ధాంతఃకరణుడై సన్న్యాసముచే మాత్రము పొందఁదగినవాఁడు కైవల్యమిచ్చు ప్రభువు మోక్షానందాద్యనుభవరూపుడునగువానికి నమస్కారము.

**శ్లో॥ నమః శాన్తాయ ఘోరాయ మూఢాయ గుణధర్మిణే।**
**నిర్విశేషాయ సామ్యాయ నమో జ్ఞానఘనాయ చ॥ 12**

**ప్రతిపదార్థము :** శాంతాయ=సత్త్వగుణవృత్తియగు శాంతమును పొందువాడు, ఘోరాయ= రజోవృత్తియగు సృష్ట్యాదులను విషాది ఘోరప్రవృత్తులను, మూఢాయ=(మూఢము) తమో గుణవృత్తి మూఢవృత్తిగొన్నవాడు, గుణధర్మిణే=సత్త్వాది గుణముల ధర్మముననుసరించు వాడును, నిర్విశేషాయ=సజాతీయ విజాతీయ స్వగత భేదములేనివాడు, ప్రకృతికంటె పరుడును, సామ్యాయ=సర్వసముడు, జ్ఞానఘనాయ=జ్ఞానవంతుడై ఇతరము అజ్ఞానాదులు చొచ్చుటకు వీలులేనివాడయిన వానికి, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** సత్త్వ క్షుత్పిపాసలు శోకమోహము, జర మొదలైనవి, ధర్మము, శాంతము, రజో ధర్మము, ఘోరము, తమోధర్మము అగు మూఢములను త్రిగుణముల ధర్మముల ననుసరించువాడు, ప్రకృతికంటే భిన్నుడు సర్వసముడు కేవల జ్ఞానస్వరూపుడునగువానికి నమస్కారము.

**శ్లో॥ క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే।**
**పురుషాయాత్మమూలాయ మూలప్రకృతయే నమః॥ 13**

**ప్రతిపదార్థము :** క్షేత్రజ్ఞాయ=సర్వభూతములయందు క్షేత్రజ్ఞుడై (జీవుడై) యుండును, సర్వాధ్యక్షాయ=చేతనాచేతన ప్రాణులకెల్ల ప్రభువును, సాక్షిణే=అట్లైన సాక్షిమాత్రముగ నుండువాడు, పురుషాయ=పూర్ణుడు, పూర్వము నుండి యుండినవాడు, ఆత్మమూలాయ= క్షేత్రజ్ఞులకు మూలమైనవాడు, మూలప్రకృతియే=ప్రకృతికి సైతము జన్మ కారణమైనవాడునగు, తుభ్యమ్=భగవన్తునికి, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** సర్వక్షేత్రములందు క్షేత్రజ్ఞుడైయుండువాడు, ఎల్లప్రాణులకు ప్రభువయి సాక్షిమాత్రుడై నిర్వికారుడై యుండువాడు, క్షేత్రజ్ఞులగు జీవులకెల్ల మూలమైనవాడు, పూర్వము



నుండి యుండినవాడు పూర్ణుడైనవాడు, పురుషుడైనవాడు మూలప్రకృతికి సైతము జన్మ కారణమైనవాడునగు దేవునికి నమస్కారము.

**శ్లో॥ సర్వేన్ద్రియగుణద్రష్ట్రే సర్వప్రత్యయహేతవే।**
**అసతాచ్ఛాయయోక్తాయ సదాభాసాయ తే నమః॥ 14**

**ప్రతిపదార్థము :** సర్వ+ఇంద్రియగుణద్రష్ట్రే=ఎల్ల ఇంద్రియముల గుణములైన శబ్దాదులకు ద్రష్టయైనవాడు, సర్వప్రత్యయహేతవే=సమస్తమైన ఇంద్రియవృత్తులకు, శబ్దాదులకు కారణమైనవాడు, అసతా=అహంకారాది ప్రపంచమున, ఛాయయా=నడచే అసద్రూపమగు మాయచే, ఉక్తాయ=బింబమువలె సూచింపబడు, సత్+ఆభాసాయ=సద్రూపుడై విషయము లందు ఆభాసగలవాడునగు, తే=నీకు, నమః=నమస్కారము.

ఇట్లే తృతీయస్కంధమున "యథాజలస్థ ఆభాసః" జలమునందు ప్రతిబింబించిన సూర్యచంద్రాదులవలె ఆభాసుడైనవాడు, అసతాచ్ఛాయయా ఉక్తాయ=అసత్యమైన మాయ యను ఛాయచేత, అధ్యాస చేత, ఉక్తాయ=కూడినవాడు, మాయనధిష్ఠించినవాడు అగు, తే=నీకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** సమస్తఇంద్రియగుణములగు శబ్దాదులకు ద్రష్టయు (చూచువాడు) సర్వేంద్రియ వృత్తులకు శబ్దాదులకు హేతువు, అహంకారాదులకు మూలమై అసత్యమగు మాయయందు ప్రతిబింబించి చూపట్టువాడు, సద్రూపుడై శబ్దాది విషయములందు జలములందు చంద్రుడు వలె అంతఃకరణములందు ఆభాసించువాడవగు నీకు నమస్కారము.

**శ్లో॥ నమో నమస్తేఽఖిలకారణాయ నిష్కారణాయాద్భుతకారణాయ।**
**సర్వాగమామ్నాయమహార్ణవాయ నమోఽపవర్గాయ పరాయణాయ॥ 15**

**ప్రతిపదార్థము :** అఖిలకారణాయ = సమస్తమునకు గారణమైన సర్వమును కలిగించు రూపము గలవాడు, సర్వకారకరూపుడు, నిష్కారణాయ=తానున్నందుకు తనకొక కారణము లేనివాడు, అద్భుతకారణాయ=తానన్నింటికి కారణమైనను కుందాదులవలె వికారమును పొందనివాడు, అద్భుతకారణుడు ఇట్లుండునను ప్రమాణములు లేనివాడు, సర్వ+ఆగమ +ఆమ్నాయ=మహదహంకారాది సమస్తములై పంచతన్మాత్రాది ఆగమములు వేదములు అనువానికి, మహార్ణవాయ=దొడ్డ సముద్రుడైనవాడు అగు, తే=నీకు, నమోనమ= నమస్కారము, నమస్కారము. అపవర్గాయ=మోక్షాదులకు, పరాయణాయ=పరములకు ఆశ్రయుడునగు, తే నమః=నీకు నమస్కారము.

**తాత్పర్యము :** సర్వవిశ్వమునకు గారణమై సృజించు కారకస్వరూపుడును తనకొక కారణము లేనివాడు, పంచతన్మాత్రలకు, వేదములులోనగువాటికి దొడ్డ సముద్రుడైనవాడు, మోక్ష స్వరూపుడును పరమునకు ఆశ్రయుడైన నీకు నమస్కారము.

**శ్లో॥ గుణారణిచ్ఛన్నచిదూష్మపాయ తత్క్షోభవిస్ఫూర్జితమానసాయ।**
**నైష్కర్మ్యభావేన వివర్జితాగమస్వయంప్రకాశాయ నమస్కరోమి॥ 16**

**ప్రతిపదార్థము :** గుణ+అరణి=గుణములను గుణత్రయమను (ప్రకృతి) అరణిచే (అరణి

**తాత్పర్యము :** విశ్వమును సృజించువాడు, విశ్వస్వరూపుడు, విశ్వమునకు వ్యతిరిక్తుడు, విశ్వమను నుపకరణముగలవాడు (విశ్వమునెఱింగినవాడు) విశ్వమునకు ఆత్మయైనవాడు, పుట్టుకలేనివాడు, పరమపదమైనవాడును అగు బ్రహ్మమును గురించి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ యోగరన్ధితకర్మాణో హృది యోగవిభావితే।**
**యోగినో యం ప్రపశ్యన్తి యోగేశం తం నతోఽస్మ్యహమ్॥** 27

యోగము లేక ఆ యీశు నెఱుంగలేరని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యోగరంధితకర్మాణః=భగవంతుని కర్మముచే ధ్యానమున, దగ్ధము చేయబడిన కర్మలు గల, యోగినః=యోగులు, యోగవిభావతే=ధ్యానము యోగభావనను పొందిన, హృది=హృదయమందు, యమ్=ఎవనిని, ప్రపశ్యంతి=చూచెదరో, తమ్=ఆ, యోగేశమ్=యోగగమ్యుని, అహమ్=నేను, నతఃఅస్మి=నమస్కరించిన వాడనగుచున్నాను.

**తాత్పర్యము :** భగవద్ధ్యానమను యోగముచే కర్మలదహించిన యోగులు ధ్యానమును బొందిన హృదయమందే ఎవనిని దర్శింతురో ఆ యోగగమ్యునికి నమస్కరించెదను.

**శ్లో॥ నమో నమస్తుభ్యమసహ్యవేగశక్తిత్రయాయాఖిలధీగుణాయ।**
**ప్రపన్నపాలాయ దురన్తశక్తయే కదిన్ద్రియాణామనవాప్యవర్త్మనే॥** 28

అట్లయిన నెల్లరును యోగమునే ఏల యవలంబింపరు అనగా ఆ విషయము రెండు శ్లోకములచే జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అసహ్యవేగ=సహింపదగని రాగాది లక్షణములు గల సంకలము గల, శక్తిత్రయాయ=ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తులు గలవాడును, అఖిలధీగుణాయ=సమస్తమైన ఇంద్రియముల గుణమైన, శబ్దాది రూపమున తోచువాడును, కదింద్రియాణామ్=కుత్సితమైన యింద్రియములు గలవారలకు, అనవాప్యవర్త్మనే=పొందరాని మార్గముగలవాడును, ప్రపన్నపాలాయ=శరణుపొందినవారిని రక్షించువాడును అయిన, దురంతశక్తయే=అపారమైన శక్తిగలవాడును, తుభ్యమ్=నీ కొఱకు, నమో నమః=నమస్కారము, నమస్కారము.

**తాత్పర్యము :** సహింపగూడని రాగాదులు గల ఇచ్ఛాది క్రియాజ్ఞానశక్తులుగలవాడు, సర్వేంద్రియమత్తులై ప్రకాశించువాడు, కామాదిదోషములకు గుఱియైన ఇంద్రియములు గలవారలకు గానరాని మార్గముగలవాడు శరణాగతులను కావించువాడు, అపరిమిత శక్తి సంపన్నుడునగు నీకు నమస్కారము.

**శ్లో॥ నాయం వేద స్వమాత్మనం యచ్ఛక్త్యాఽహంధియా హతః।**
**తం దురత్యయమాహాత్మ్యం భగవన్తమితోఽస్మ్యహమ్॥** 29

**ప్రతిపదార్థము :** యత్+శక్త్యా=ఎవని మాయాశక్తిచే, అహంధియా=అహం బుద్ధిచే, హతః =కొట్టబడిన, అయమ్=ఈ జనుడు, స్వం ఆత్మనమ్=స్వస్వరూపఆత్మను, న వేద=ఎఱుగడో, తం దురత్యయమాహాత్మ్యమ్=దాటశక్యముగాని మహిమగలవాడు, తమ్ భగవంతమ్= ఆ భగవంతుని గూర్చి, అహమ్=నేను, నతః అస్మి=నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఎవని మాయచే, అహంకార బుద్ధిచే గొట్టబడిన ఈ ప్రాణి తన ఆత్మ స్వరూపము



=దేహాదులయందు ఆసక్తులు గానివారిచే, స్వహృదయే=వారి హృదయమునందు, పరిభావితాయ=చక్కగా భావింపబడువాడు, జ్ఞానాత్మనే=జ్ఞానరూపుడగు, భగవతే=భగవంతుడు అగు, ఈశ్వరాయ=జగదీశ్వరుడు సర్వమును పరికించువాడు అగు దేవునకు, నమః =నమస్కారము.

**తాత్పర్యము :** దేహాభిమానులై పుత్రమిత్రగృహధనపరిజనులందు ఆసక్తులైన వారికి ప్రాప్తింపశక్యముగానివాడు గుణత్రయసంపర్కము లేనివాడు దేహాదికమునందనాసక్తులైన వారిచే హృదయమునందుఁజరించువాడు జ్ఞానశూరుడు, పరమేశ్వరుడు అగు ఆ భగవంతునికి నమస్కారము.

**శ్లో॥ యం ధర్మకామార్థవిముక్తికామా భజన్త ఇష్టాం గతిమాప్నువన్తి।**
**కిం త్వాశిషో రాత్యపి దేహమవ్యయం కరోతు మేఽదభ్రదయో విమోక్షణమ్॥** 19

**ప్రతిపదార్థము :** యమ్=ఎవనిని, ధర్మ+అర్థకామ విముక్తికామాః=ధర్మార్థ కామములందు మోక్షమున వాంఛగలవారు, భజంతః=సేవించుచున్నవారై, ఇష్టాం గతిమ్=కామితమైన ఫలమును ధర్మాదిఫలమును, ఆప్నువంతి=పొందుచున్నారు, కిఞ్చ=అంతమాత్రమే కాక మఱియు ఎవడు, ఆశిషః=ఇతరములైన కోరికల సైతము, రాతి=ఇచ్చుచున్నాడు, అవ్యయమ్= జరామరణరహితమైన, దేహమ్=దేహమును సైతము, రాతి=మోక్షమును ఇచ్చుచున్నాడు. అదభ్రదయః=అధికమైన దయగలవాడు, మే=నాకు, విమోక్షణమ్=బంధ విమోచనమును, కరోతు=చేయుగాక.

**తాత్పర్యము :** ధర్మార్థకామమోక్షములందు ఆసక్తిగలవారు ఎవని భజించి ధర్మాది ఫలములను పొందుచున్నారో ఎవడు భక్తులు వాంఛించు కోర్కెలు కంటే హెచ్చుగా నిచ్చుచున్నాడో ఎవ్వడు జరామరణ రహితమైన దేహమును మోక్షమును సైతము ఇచ్చుచున్నాడో ఆ దేవుడు నాకు బంధవిమోచనము చేయుగాక !

**శ్లో॥ ఏకాన్తినో యస్య న కఞ్చనార్థం వాఞ్ఛన్తి యే వై భగవత్ప్రపన్నాః।**
**అత్యద్భుతం తచ్చరితం సుమఙ్గళం గాయన్త ఆనన్దసముద్రమగ్నాః॥** 20

**ప్రతిపదార్థము :** ఇంతమాత్రమైన నేను భక్తి సుఖము నెఱుంగని వాడనగుట చేత వాంఛించు చున్నాను. యస్య=ఎవని యొక్క, ఏకాంతినః=అనన్య భక్తులు, కంచన+అర్థమ్=ఏకించిత్తు ప్రయోజనమును, న వాంఛంతి=కోరరరో, యే వై=నిష్కామమునకు కారణము అని చెప్పుదురో ఎవరు, భగవత్ ప్రపన్నాః=భగవంతుని శరణుపొందినవారై, భగవత్ భక్తులై, సర్వజ్ఞులై, ముక్తులైనవారిని సేవించుచున్నవారై, అత్యద్భుతమ్=ఆశ్చర్యకరమైన, సుమంగళమ్= శోభనకరమైన, తత్ చరితమ్=ఆ విష్ణుకథను, గాయంతః=గానము చేయుచు, ఆనందసముద్ర మగ్నాః=ఆనంద సముద్రమునందు మునుంగుచుండుదురో.

**తాత్పర్యము :** ఏ విష్ణువు యొక్క ఏకాంత భక్తితో కించిత్ప్రయోజనము, ముక్తిని వాంఛింపరో భగవంతుని శరణుపొందినవారై, సర్వజ్ఞులై ముక్తులైన భగవద్భక్తులతోడ గూడి ఆనంద సముద్రమునందు మునుంగుచుందురో ఆ విష్ణుదేవుని స్తుతించెదను.

**శ్లో॥ తమక్షరం బ్రహ్మ పరమ్పరేశమవ్యక్తమాధ్యాత్మికయోగగమ్యమ్।**
**అతీన్ద్రియం సూక్ష్మమివాతిదూరమనన్తమాద్యం పరిపూర్ణమీడే॥** 21

**ప్రతిపదార్థము :** అత్యద్భుతము సుమంగళము అని నిరూపించుటకై అక్షరాదివిశేషమును చెప్పుచున్నాడు, అక్షరమ్=నాశరహితుడు, బ్రహ్మ=మిగుల దొడ్డవాడు, పరమ్=అధికమైన, పరేశమ్= పరమేశ్వరుడు, అవ్యక్తమ్=ఇంద్రియ లభ్యుడుగానివాడు, ఆధ్యాత్మికయోగగమ్యమ్ =జ్ఞానయోగముచే పొందదగినవాడు, అతీంద్రియమ్=ఇంద్రియములకు గోచరింపనివాడు, సూక్ష్మమ్=సూక్ష్మ స్వరూపుడు, అతిదూరమ్=అజ్ఞానులకు అతిదూరుడు, అనంతమ్=అంతము లేనివాడు, పరిపూర్ణమ్=పరిపూర్ణుడు అగు, తమ్=ఆ విష్ణువును, ఈడే=స్తుతించెదను.

**తాత్పర్యము :** అక్షరుడు, బ్రహ్మము, పరుడు, పరమేశ్వరుడు, అవ్యక్తుడు, జ్ఞానయోగగమ్యుడు, ఇంద్రియాతీతుడు, సూక్ష్మస్వరూపుడు, అజ్ఞానమునకతిదూరుడు, అనంతుడు పరిపూర్ణుడునైన ఆ మహావిష్ణువును స్తుతించెదను.

**శ్లో॥ యస్య బ్రహ్మాదయో దేవా వేదా లోకాశ్చరాచరాః।**
**నామరూపవిభేదేన ఫల్గ్వ్యా చ కలయా కృతాః॥ 22**

పరిపూర్ణత్వమును ప్రదర్శించుచుఁజెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య=ఏ విష్ణువు యొక్క, ఫల్గ్వ్యా చ=చాల స్వల్పమైన, కలయా చ= అంశములచే, బ్రహ్మ+ఆదయః=బ్రహ్మలోనగు, దేవాః=దేవతలు, వేదాః=వేదములు, చర+ అచరాః=స్థావర జంగమ ప్రాణులు, నామరూపవిభేదేన=నామభేదం రూపభేదముచే, కృతాః =సృజింపబడిరో.

**తాత్పర్యము :** ఎవని స్వల్పమగు నంశమున బ్రహ్మాది దేవతలు, వేదములు స్థావర జంగమములైన ప్రాణులు, నామరూపభేదమున సృజించబడిరో అతనిని స్తుతించెదను అని

**శ్లో॥ యథార్చిషోఽగ్నేః సవితుర్గభస్తయో నిర్యాన్తి సంయాన్త్యసకృత్ స్వరోచిషః।**
**తథా యతోఽయం గుణసమ్ప్రవాహో బుద్ధిర్మనః ఖాని శరీరసర్గాః॥ 23**

**ప్రతిపదార్థము :** యథా=ఏ విధము, అగ్నేః=అగ్ని వలన, అర్చిషః=జ్వాలలు, ప్రవాహమునకు దృష్టాంతమో, సవితుః=సూర్యుని యొక్క, గభస్తయః=కిరణములు అనంతమున, స్వరోచిషః =స్వకీయములైన కాంతిచే, అసకృత్=పలుమారు, నిర్యాంతి=బయలువెడలుచున్నవో, సంయాంతి=లీనమగుచున్నవో, తథా=ఆ ప్రకారము, స్వరోచిషః=స్వయంప్రకాశుడైన, యతః =ఎవని వలన, అయం గుణసంప్రవాహః=త్రిగుణములను కారణములచేనగు కార్యములైన, బుద్ధిః=బుద్ధి, మనః=మనస్సు, ఖాని=ఇంద్రియాలు, శరీరసర్గాః=శరీరము, జన్మములు పొడముచున్నవగుచున్నవో, ఆ విష్ణువును స్తుతించెదను.

**తాత్పర్యము :** అగ్నినుండి జ్వాలలు, సూర్యుని నుండి కిరణములెట్లు స్వయముగా బయలు వెడలుచు లీనమగుచున్నవో అట్లే స్వయంప్రకాశుడైన ఎవని వలన త్రిగుణములను కారణము చేనగు కార్యములైన బుద్ధి, మనస్సు, ఇంద్రియము, శరీరములు జన్మములు నిరంతరము పొడముచున్నదగుచుండునో ఆతని శరణువేడెదను.

**శ్లో॥ స వై న దేవాసురమర్త్యతిర్యఙ్ న స్త్రీ న షణ్ఢో న పుమాన్ న జన్తుః।**
**నాయఙ్గుణః కర్మ న సన్న చాసన్నిషేధశేషో జయతాదశేషః॥ 24**



అందువలన దేవతలలోనగు వారిలోనే యొకడుఁదాను గాదనుచున్నాడు.

**ప్రతిపదార్థము :** సవై=ఆ పరమేశ్వరుడు, దేవ+అసుర+మర్త్యతిర్యక్=దేవత అసుర, మనుష్యుడు, మృగములు, న=కాదు, ఇది జాతి నిషేధము, నస్త్రీ=స్త్రీ కాదు, నషండ= నపుంసకుడు గాదు, నపుమాన్=పురుషుడు గాదు, నజంతుః=స్త్రీ పుంనపుంసక వ్యక్తులు గాని, కేవల ప్రాణి మాత్రము గాదు, న అయంగుణః=ఈ త్రిగుణములును గావు, నకర్మ= కర్మగాదు, న సత్=సత్తుగాదు, న అసత్=అసత్తు గాదు, నిషేధశేషః=సర్వమును నిషేధించుట ద్వారా శేషించినవాడై, అశేషః=సర్వాత్ముడు ఐన విష్ణువు, జయతాత్=నా బంధమోక్షణమునకు ఆవిర్భవించుగాక.

**తాత్పర్యము :** ఆ పరమేశ్వరుడు దేవాసురమనుష్యులు తిర్యగ్జంతువులను వానిలో ఏ జాతి గలవాడు గాదు, స్త్రీ కాదు, పురుషుడు గాదు, నపుంసకుడు కాదు, ఈ లింగత్రయ విశిష్టము గాని ఏ ప్రాణి మాత్రము గాదు, స్వరూప నిషేధ త్రిగుణ స్వరూపుడు గాదు, కర్మ స్వరూపుడు గాదు, సత్తుగాదు, ఇంద్రియగోచరుడు గాదు, అసత్తు, సర్వశూన్యుడు గాడు సర్వనిషేధమున శేషించిన అశేషాత్మకుడైన దేవుడు నా బంధవిమోచనమునకావిర్భవించు గాక.

**శ్లో॥ జిజీవిషే నాహమిహాముయా కిమన్తర్బహిశ్చావృతయేభయోన్యా।**
**ఇచ్ఛామి కాలేన న యస్య విప్లవస్తస్యాత్మలోకావరణస్య మోక్షమ్॥ 25**

**ప్రతిపదార్థము :** ఇహ=ఇచ్చట, అహమ్=నేను, న జిజీవిషే=గ్రాహము వలన శరీర మోక్షణను పొందుట, నేను జీవింపగోరుట లేదు, అంతఃబహిశ్చ=లోపల వెలుపల, ఆవృతయా= అవివేకముచేత వ్యాప్తమైన, అముయా=ఈ, ఇభయోన్యా=గజజన్మముచే, కిమ్=ఏమి ప్రయోజనము, ఆత్మ+ఆలోక+ఆవరణస్య=ఆత్మ ప్రకాశమునకు ఏది ఆవరణమైన అజ్ఞానము గలదో దాని యొక్క, మోక్షణమ్=విముక్తిని, ఇచ్ఛామి=కోరుచున్నాను, యస్య=ఏ మోక్షమునకు, కాలేన=కాలము చేత, న విప్లవః=నాశము లేదు.

**తాత్పర్యము :** దేహబంధము, దేహనాశము నందు ఎట్లు నశించునది దానిని ప్రార్థించుట లేదు. ఆత్మ ప్రకాశము నావరించిన అజ్ఞానమునకు కాలముచే నాశము లేదు. అది జ్ఞానము చేతనే నివర్తింపదగినది. కావున దాని మోక్షణమే కోరుచున్నాను. నేను గ్రాహము వలన శరీరబంధవిముక్తిని పొంది జీవింపగోరుట లేదు. ఆత్మావలోకనమునకు అడ్డమైన అజ్ఞానావరణము యొక్క మోక్షమును గోరుచున్నాను. దానికి కాలముచే నాశము లేదు.

**శ్లో॥ సోఽహం విశ్వసృజం విశ్వమవిశ్వం విశ్వవేదసమ్।**
**విశ్వాత్మానమజం బ్రహ్మ ప్రణతోఽస్మి పరమ్పదమ్॥ 26**

**ప్రతిపదార్థము :** సః అహమ్=అట్టి నేను, విశ్వసృజమ్=విశ్వకర్తను, విశ్వమ్=విశ్వమయుని, అవిశ్వమ్=విశ్వమునకు వ్యతిరిక్తుని, విశ్వవేదసమ్=విశ్వమను నుపకరణము గలవాడు, విశ్వాత్మానమ్=విశ్వమునకు ఆత్మయైనవాడు, అజమ్=పుట్టుకలేనివాడు, పరం పదమ్= ఉత్కృష్టమైన స్థానమైన, బ్రహ్మ=బ్రహ్మమును, ప్రణతోస్మి=ఆయన గురించి నమస్కరించు చున్నాను.

అవ్యయమ్=నాశరహితుని గురించి, శిరసా=తలతో, ప్రణమ్య=మ్రొక్కి, యశోధామ=యశస్సునకు స్థానమును, కీర్తన్యగుణసత్కథమ్=కీర్తింపదగినవయిన గుణములు గల శ్రేష్ఠమైన కథయు గలవానిని, అగాయత=గానము చేసెను.

**తాత్పర్యము :** అంత నాగంధర్వుడు జగదీశుడు పుణ్యరూపుడైన అవ్యయుని హరిని గూర్చి శిరస్సు వంచి నమస్కరించి యశోనిలయుడును కొనియాడదగిన గుణములు గలవానిని ఉత్తమ చరిత్రము గలవానిని స్తుతించెను.

**శ్లో॥ సోఽనుకమ్పిత ఈశేన పరిక్రమ్య ప్రణమ్య తమ్।**
**లోకస్య పశ్యతో లోకం స్వమగాన్ముక్తకిల్బిషః॥** 5

**ప్రతిపదార్థము :** సః=ఆ గంధర్వుడు, ఈశేన=పరమేశ్వరునిచే, అనుకంపితః=కనికరింపడిన వాడై, తమ్=ఆ దేవుని, పరిక్రమ్య=ప్రదక్షిణము చేసి, ప్రణమ్య=నమస్కరించి, లోకస్య పశ్యతః=లోకము చూచుచుండ, ముక్త కిల్బిషః=శాపవిముక్తుడై, స్వం లోకమ్=తన గంధర్వ లోకమును గూర్చి, అగాత్=పోయెను.

**తాత్పర్యము :** ఆ గంధర్వుడు హరిచే ననుగ్రహింపబడినవాడై హరికి ప్రదక్షిణము చేసి నమస్కరించి శాపము దీరి యథారూపమొంది తన గంధర్వలోకమునకుఁబోయెను.

**శ్లో॥ గజేన్ద్రో భగవత్స్పర్శాద్ విముక్తోఽజ్ఞానబన్ధనాత్।**
**ప్రాప్తో భగవతో రూపం పీతవాసాశ్చతుర్భుజః॥** 6

**ప్రతిపదార్థము :** గజేంద్రః=ఆ గజేంద్రుడు, భగవత్+స్పర్శాత్=భగవంతుని హస్త స్పర్శ వలన, అజ్ఞానబంధనాత్=అవిద్యయను బంధము వలన, విముక్తః=విడుదల పొందినవాడై, భగవతః=భగవంతుని యొక్క, రూపమ్=స్వరూపమును, ప్రాప్తః=పొందినవాడు, పీతవాసాః=పసుపు వన్నె వస్త్రములు గలవాడును, చతుర్భుజః=నాలుగు భుజములు కలవాడయ్యెను.

**తాత్పర్యము :** ఆ గజేంద్రుడు శ్రీహరి కరస్పర్శ వలన తన అజ్ఞాన బంధములు వైదొలగిపోగా పవిత్ర భగవత్‌సారూప్యమును పొంది పీతాంబరుడై చతుర్భుజుడయ్యెను.

**శ్లో॥ స వై పూర్వమభూద్ రాజా పాణ్డ్యో ద్రవిడసత్తమః।**
**ఇన్ద్రద్యుమ్న ఇతి ఖ్యాతో విష్ణువ్రతపరాయణః॥** 7

**ప్రతిపదార్థము :** సవై=ఆ గజేంద్రుడు, పూర్వమ్=పూర్వము, పాండ్యః=పాండ్యదేశీయుడు, ద్రవిడసత్తమః=ద్రవిడులలో శ్రేష్ఠుడు, ఇంద్రద్యుమ్నః ఇతి=ఇంద్రద్యుమ్నుడు అని, ఖ్యాతః=ప్రసిద్ధికెక్కినవాడు, విష్ణువ్రతపరాయణః=విష్ణు భజనమునందాసక్తుడై, రాజా=రాజై, అభూత్=ఉండెను.

**తాత్పర్యము :** పూర్వము ఆ గజేంద్రుడు పాండ్య దేశపు రాజు, ద్రవిడ శ్రేష్ఠుడు, ఇంద్రద్యుమ్నుడను పేరు గలవాడు, విష్ణుభక్తితత్పరుడై యుండెను.

**శ్లో॥ స ఏకదారాధనకాల ఆత్మవాన్ గృహీతమౌనవ్రత ఈశ్వరం హరిమ్।**
**జటాధరస్తాపస ఆప్లుతోఽచ్యుతం సమర్చయామాస కులాచలాశ్రమః॥** 8

**ప్రతిపదార్థము :** సః=ఆ రాజు, జటాధరః=జడధారి, తాపసః=తాపసుడు, ఆప్లుతః=తీర్థస్నాన



నెఱుంగలేదో అట్టి జనుడు దాటశక్యము గాని మహిమగలవాడయిన భగవంతుని గూర్చి నమస్కరించుచున్నాడు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీశుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం గజేన్ద్రముపవర్ణితనిర్విశేషం బ్రహ్మాదయో వివిధలిఙ్గభిదాభిమానాః।**
**నైతే యదోపససృపుర్నిఖిలాత్మకత్వాత్ తత్రాఖిలామరమయో హరిరావిరాసీత్॥** 30

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, ఉపవర్ణిత నిర్విశేషమ్=వర్ణింపబడి మూర్తి భేదము లేని పరతత్త్వము గల, గజేంద్రమ్=గజరాజును, వివిధ లింగభిదాభిమానాః=వివిధములైన మూర్తి భేదమునందభిమానము గల అతనిని (గజరాజును), బ్రహ్మాదయః=బ్రహ్మాదిదేవతలు, యదా=ఎప్పుడు, న+ఉపసస్పృపుః=సమీపించనివారైరి, తత్ర=అప్పుడు, అఖిల+అమరమయః=సర్వ దేవతాస్వరూపుడు అయిన, హరిః=విష్ణువు, ఆవిరాసీత్=ఆవిర్భవించెను.

**తాత్పర్యము :** ఇట్లు నామరూపక్రియారహితమైన (మూర్తి భేదము లేని) పరతత్త్వమును స్తుతించిన గజేంద్రుని నామరూపాది భేదములు గల బ్రహ్మాది దేవతలు సమీపించలేకపోయిరి. అప్పుడు సర్వదేవతామయుడు హరి ప్రత్యక్షమయ్యెను.

**శ్లో॥ తం తద్వదార్తముపలభ్య జగన్నివాసః స్తోత్రంనిశమ్య దివిజైః సహ సంస్తువద్భిః।**
**ఛన్దోమయేన గరుడేన సముహ్యమాన శ్చక్రాయుధోఽభ్యగమదాశు యతో గజేన్ద్రః॥** 31

**ప్రతిపదార్థము :** తద్వత్=ఆ విధమున, ఆర్తః=ఆపద నొందిన, తమ్=ఆ గజేంద్రుని, ఉపలభ్య=ఎఱింగి, స్తోత్రమ్=ఆతని స్తోత్రమును, నిశమ్య=విని, జగత్+నివాసః=జగమునకు నివాసస్థానమైన హరి, సంస్తువద్భిః=స్తుతించుచున్నట్టివారు, దివిజైఃసహ=దేవతలను గూడి, ఛందోమయేన=వేద స్వరూపుడైన, గరుడేన=గరుత్మంతునిచే, సముహ్యమానః=కొనిరాబడిన వాడు, చక్రాయుధః=సుదర్శన చక్రమును ఆయుధముగా గలవాడై, గజేంద్రః=గజేంద్రుడు, యతః=ఎక్కడనుండెనో అక్కడకు, ఆశు=వెంటనే/శీఘ్రముగా, అభ్యగమత్=చనుదెంచెను.

**తాత్పర్యము :** అట్లు ఆర్తుడైన గజేంద్రునెఱింగి అతడు చేసిన స్తోత్రమును విని జగములకు నివాసస్థానమైన హరి తన్ను వేల్పులు చక్కగా స్తుతించుచు వెంబడిరాగా చక్రము చేతఁబట్టి వేదస్వరూపుడై గరుత్మంతుడు తన్ను సేవింప(మోయుచుండగా) నతి శీఘ్రముగా గజేంద్రుడున్న చోటికి వచ్చెను.

**శ్లో॥ సోఽన్తస్సరస్యురుబలేన గృహీత ఆర్తో దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్తచక్రమ్।**
**ఉత్క్షిప్య సామ్బుజకరం గిరమాహ కృచ్ఛ్రాన్నారాయణాఖిలగురో భగవన్ నమస్తే॥** 32

**ప్రతిపదార్థము :** అంతఃసరసి=కొలనునడుమ, ఉరుబలేన=కడు బల్లిదమైన మొసలిచే, గృహీతః=పట్టుబడిన, ఆర్తః=ఆపన్నుడైన ఆ గజేంద్రుడు, ఖే=ఆకాశమునందు, గరుత్మతి= గరుత్మంతుని పైనుండి, ఉపాత్తచక్రమ్=కైకొన్న చక్రముగల, హరిమ్=విష్ణువును, దృష్ట్వా= చూచి, సాంబుజకరమ్=కమలములతో కూడిన తొండమును, ఉత్క్షిప్య=పైకెత్తి, నారాయణ=నారాయణా, అఖిలగురో=జగమంతటికి తండ్రీ, భగవన్!=భగవంతుడా!, తే=నీకు, నమః=నమస్కారము అని, కృచ్ఛ్రాత్=అతికష్టముగా, గిరమ్= మాటను, ఆహ=వచించెను.

**తాత్పర్యము :** కొలని నడుమ మొసలిచేఁబట్టువడి కుందుచున్న ఆ గజేంద్రుడు ఆకసము నందు గరుత్మంతునిపైఁజక్రాయుధమును బూని చనుదెంచిన విష్ణువును జూచి తామర పూలతో తొండమును పైకెత్తి సర్వలోకగురూ నీకు నమస్కారము అని అతికష్టముతో అనెను.

**శ్లో॥ తం వీక్ష్య పీడితమజః సహసావతీర్య సగ్రాహమాశు సరసః కృపయోజ్జహార।**
**గ్రాహాద్ విపాటితముఖాదరిణా గజేన్ద్రం సమ్పశ్యతాం హరిరమూముచదుచ్ఛ్రియాణామ్॥ 33**

**ప్రతిపదార్థము :** పీడితమ్=మొసలిచే వ్యథపడిన, సగ్రాహమ్=మొసలితో గూడిన, తమ్=ఆ గజేంద్రుని, వీక్ష్య=చూచి, అజః=అజుడైన, హరిః=విష్ణువు, కృపయా=దయతో, సహసా=శీఘ్రముగా, అవతీర్య=గరుత్మంతుని నుండి దిగి, సరసః=సరస్సు నుండి, ఆశు=శీఘ్రముగా, ఉజ్జహార=లేవనెత్తి గట్టునకుఁజేర్చెను. అరిణా=చక్రముచే, విపాటితముఖాత్=చీల్చబడిన నోరుగల, గ్రాహాత్=మొసలి నుండి, గజేంద్రమ్=గజేంద్రుని, ఉచ్ఛ్రియాణామ్=దేవతలు, సంపశ్యతామ్=చూచుచుండగా, కృపయా=దయతో, హరిః=శ్రీహరి, అమూముచత్=విడిపించెను.

**తాత్పర్యము :** అట్లు మొసలి బాధింప, మొసలితో గూడిన ఆ గజేంద్రుని చూచి అజుడు హరి వెంటనే గరుడు నుండి దిగి చక్రాయుధమున ఆ మకరము శిరము ఖండించి కృపతో ఆ గజేంద్రుని దేవతలెల్లరు చూచుచుండగా సరస్సునుండి లేవనెత్తి గట్టునకుఁజేర్చి రక్షించెను.

*ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కన్ధే గజేంద్రమోక్షణం నామ తృతీయో - ధ్యాయః*

*ఇది శ్రీమద్భాగవతమహాపురాణమునందు అష్టమస్కంధమున*
*గజేంద్రమోక్షము అనునది తృతీయాధ్యాయము.*

## చతుర్థోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

ఆ రెండింటియందు గ్రాహమునకు గంధర్వత్వము, గజమును తన పార్శ్వమున తన సభాసభ్యునిగ చేసుకొని హరి తన వైకుంఠమునకు తీసుకొనిపోవుట వర్ణింపబడును.

**శ్లో॥ తదా దేవర్షిగన్ధర్వా బ్రహ్మేశానపురోగమాః।**
**ముముచుః కుసుమాసారం శంసన్తః కర్మ తద్ధరేః॥ 1**

**ప్రతిపదార్థము :** తదా=అప్పుడు, దేవర్షి గంధర్వాః=దేవతలు, ఋషులు, గంధర్వులు, బ్రహ్మేశానపురోగమాః=బ్రహ్మదేవుడు ముందుఁగలవార్రై, హరేః=విష్ణువు యొక్క, తత్+కర్మ =ఆ గజేంద్ర రక్షణ రూపమైన పనిని, శంసంతః=స్తుతించుచు, కుసుమాసారమ్= పూవుల జడిని, ముముచుః=వర్షించిరి.

**తాత్పర్యము :** అప్పుడు దేవర్షి గంధర్వులు బ్రహ్మదేవుడు ముందుండగ హరి యొక్క గజేంద్ర రక్షణము గ్రాహ శిక్షణమును స్తుతించుచు పూలవర్షమునుఁగురిపించిరి.

**శ్లో॥ నేదుర్దున్దుభయో దివ్యా గన్ధర్వా ననృతుర్జగుః।**
**ఋషయశ్చారణాస్సిద్ధాస్తుష్టువుః పురుషోత్తమమ్॥ 2**

**ప్రతిపదార్థము :** దివ్యాః=దేవతల సంబంధమైన, దుందుభయః=భేరులు, నేదుః=మ్రోగినవి, గంధర్వాః=గంధర్వులు, ననృతుః=నాట్యము సల్పిరి, జగుః=గానము చేసిరి, ఋషయః =ఋషులు, చారణాః=చారణులు, సిద్ధాః=సిద్ధులు, పురుషోత్తమమ్=పురుషోత్తముని, తుష్టువుః =స్తుతించిరి.

**తాత్పర్యము :** అప్పుడు దేవదుందుభులు మ్రోగెను. గంధర్వులు నాట్యము చేసిరి. గానము చేసిరి. ఋషులు, చారణులు, సిద్ధులు పురుషోత్తముని స్తుతించిరి.

**శ్లో॥ యోఽసౌ గ్రాహః స వై సద్యః పరమాశ్చర్యరూపధృక్।**
**ముక్తో దేవలశాపేన హూహూగన్ధర్వసత్తమః॥ 3**

**ప్రతిపదార్థము :** హూహూగంధర్వసత్తమః=హూహూ అను గంధర్వశ్రేష్ఠుడు, అసౌ=ఇతడు, దేవలశాపేన=దేవలుడను ముని శాపముచే, గ్రాహః=మొసలియై, సః=అతడు, సద్యః ముక్తః =వెంటనే శాపవిముక్తుడై, పరమాశ్చర్యరూపధృక్=అతి విచిత్రమైనరూపమును ధరించిన వాడయ్యెను.

**తాత్పర్యము :** పూర్వము హూహూ అను గంధర్వశ్రేష్ఠుడు దేవలశాపముచే గ్రాహమై యుండి ఇప్పుడు శాపవిముక్తుడై అచ్చెరువొందు రూపమును పొందెను.

**శ్లో॥ ప్రణమ్య శిరసాధీశముత్తమశ్లోకమవ్యయమ్।**
**అగాయత యశోధామ కీర్తన్యగుణసత్కథమ్॥ 4**

**ప్రతిపదార్థము :** అధీశమ్=లోకేశుడు, ఉత్తమశ్లోకమ్=పవిత్రరూపము గలవాడు అగు,

**ప్రతిపదార్థము :** బ్రహ్మణః=బ్రహ్మకు, మే=నాకు, శివస్య=శివునికిని, ధిష్ణ్యాని=నివాసములైన, ఇమాని=ఈ, శృంగాణి=ఈ త్రికూటగిరి శిఖరములను, మే=నాకు, ప్రియంధామ=ఇష్టమైన నివాసమగు, క్షీరోదమ్=పాలకడలిని, భాస్వరమ్=ప్రకాశించు, శ్వేతద్వీపమ్=తెల్ల దీవిని కీర్తించునో –

**తాత్పర్యము :** బ్రహ్మకు, నాకు, శివునికి వాసస్థానములైన ఈ పర్వతము యొక్క మూడు శృంగములును, నా ప్రియనివాసమైన క్షీరసముద్రమును, ప్రకాశించు ఈ శ్వేతద్వీపమును కీర్తించుచున్నదో–

**శ్లో॥ శ్రీవత్సం కౌస్తుభం మాలాం గదాం కౌమోదకీం మమ।**
**సుదర్శనం పాఞ్చజన్యం సుపర్ణం పతగేశ్వరమ్॥** 19

**ప్రతిపదార్థము :** మమ=నా యొక్క, నా హృదయమున నుండు పుట్టుమచ్చయగు శ్రీవత్సమును, కౌస్తుభమణిని, వైజయంతియనుమాలను కౌమోదకియను గదను, సుదర్శనమను చక్రమును, పాంచజన్యమను శంఖమును, నా వాహనమైన పక్షిరాజగు గరుత్మంతుని కీర్తించునో –

**శ్లో॥ శేషం చ మత్కలాం సూక్ష్మాం శ్రియం దేవీం మదాశ్రయామ్।**
**బ్రహ్మాణం నారదమృషిమ్భవం ప్రహ్లాదమేవ చ ॥** 20

**ప్రతిపదార్థము :** శేషం చ=ఆదిశేషుని, మత్కలామ్=నాయంశమై, సూక్ష్మామ్=సూక్ష్మరూపమై, మత్+ఆశ్రయామ్=నన్నే ఆశ్రయము గలవై, శ్రియం దేవీమ్=శ్రీదేవిని, బ్రహ్మాణమ్=బ్రహ్మను, నారదం ఋషిమ్=నారద మహర్షిని, భవమ్=శివుని, ప్రహ్లాదం ఏవ=ప్రహ్లాదుని గూడ కీర్తించునో.

**తాత్పర్యము :** ఆదిశేషుని, నాయంశమున జనించినదై సులభముగాఁదెలియ రాగలంత సూక్ష్మరూపిణియై నా హృదయమునాశ్రయించిన శ్రీదేవిని, బ్రహ్మను, నారద ఋషిని, శివుని, ప్రహ్లాదుని కీర్తించునో –

**శ్లో॥ మత్స్యకూర్మవరాహాద్యైరవతారైః కృతాని మే।**
**కర్మాణ్యనన్తపుణ్యాని సూర్యం సోమం హుతాశనమ్॥** 21

**ప్రతిపదార్థము :** మత్స్యకూర్మవరాహ+ఆద్యైః=మత్స్యకూర్మవరాహములులోనగు, అవతారైః =అవతారములచే, కృతాని=చేయబడిన, అనంతపుణ్యాని=అధికపుణ్యములగు, కర్మాణి= పనులను, సూర్యమ్=సూర్యుని, సోమమ్=చంద్రుని, హుతాశనమ్=అగ్నిని కీర్తించునో.

**తాత్పర్యము :** నేను మత్స్యకూర్మవరాహాదులగునవతారములెత్తి కావించిన మిగుల పవిత్రములగు నా కృత్యములును సూర్యుని, చంద్రుని, అగ్నిని ఎవరు కీర్తించుచున్నారో–

**శ్లో॥ ప్రణవం సత్యమవ్యక్తం గోవిప్రాన్ ధర్మమవ్యయమ్।**
**దాక్షాయణీర్ధర్మపత్నీః సోమకశ్యపయోరపి॥** 22

**ప్రతిపదార్థము :** ప్రణవమ్=ఓంకారము, సత్యమ్=సత్యమగు బ్రహ్మము, అవ్యయమ్= మాయను, గోవిప్రాన్=గోవులను, విప్రులను, అవ్యయమ్=నాశరహితమును, ధర్మమ్= భక్తిరూపమైన ధర్మమును, ధర్మపత్నీః=ధర్మదేవత భార్యయై, సోమకశ్యపయోఃఅపి=చంద్రునికి, కశ్యపమహర్షికి భార్యలైన, దాక్షాయణీ=దాక్షాయణి, దక్షప్రజాపతి కూతులను కీర్తించునో,



శీలుడై, వ్రతనిష్ఠుడై, కుల+అచల+ఆశ్రమః=సప్తకుల పర్వతములలో దొడ్డదైన మలయ పర్వతమునందు గల ఆశ్రమముగలవాడై, ఏకదా=ఒకనాడు, ఆరాధనకాలే=విష్ణువును ధ్యానించు సమయమున, ఆత్మవాన్=మనోనిగ్రహముగలవాడు, గృహీతమౌనవ్రతః=మౌన నియమము గలవాడయి, ఈశ్వరమ్=పరమేశ్వరుడగు, హరిమ్=విష్ణువుని, అచ్యుతమ్= అచ్యుతుని, అర్చయామాస=పూజించెను.

**తాత్పర్యము :** ఆ రాజు ఒకప్పుడు మలయపర్వతమునందు ఆశ్రమమేర్పరచుకొని జటాధారియు, తాపసుఁడై, తీర్థస్నానశీలుడై మనోనిగ్రహముతో మౌనవ్రతము బూని పరమేశ్వరుని, హరిని, అచ్యుతుని పూజించెను.

**శ్లో॥ యదృచ్ఛయా తత్ర మహాయశా మునిః సమాగమచ్ఛిష్యగణైః పరిశ్రితః।**
**తం వీక్ష్య తూష్ణీమకృతార్హణాదికం రహస్యుపాసీనమృషిశ్చుకోపహ॥** 9

**ప్రతిపదార్థము :** మహాయశాః=లోకప్రసిద్ధి చెందిన, మునిః=అగస్త్యముని, శిష్యగణైః=శిష్య సమూహముతో, పరిశ్రితః=కూడుకొన్నవాడు, యదృచ్ఛయా=స్వేచ్ఛమెయి, తమ్=ఆ ఇంద్రద్యుమ్ను నాశ్రమమునకు, సమాగమత్=వచ్చెను. ఋషిః=ఆయగస్త్య ఋషి, అకృతార్హణమ్=చేయబడని పూజకలవాడు, రహసి=ఏకాంతమున, ఉపాసీనమ్=ఉపాసించు చున్నవాడు, తూష్ణీమ్=మిన్నకున్నవాడు అగు, తమ్=ఆ ఇంద్రద్యుమ్నుని, వీక్ష్య=చూచి, చుకోపహ=కోపమొందెను.

**తాత్పర్యము :** లోకప్రసిద్ధిఁజెందిన అగస్త్యముని పెక్కుమంది శిష్యులతో గూడి ఇచ్ఛమెయి బోవుచు నా ఇంద్రద్యుమ్నుని ఆశ్రమమునకు వచ్చెను. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు ఋషిని పలుకరించి పూజింపక ఏకాంతమునందు ఉపాసించుచుండెను. ఆ రాజును చూచిన మునికి కోపము వచ్చెను.

**శ్లో॥ తస్మా ఇమం శాపమదాదసాధురయం దురాత్మాకృతబుద్ధిరద్య।**
**విప్రావమన్తా విశతాం తమిస్రం యథా గజః స్తబ్ధమతిః స ఏవ॥** 10

**ప్రతిపదార్థము :** అయమ్=ఈ రాజు, దురాత్మా=దుష్టాత్ముడు, అకృతబుద్ధిః=గురుశిక్ష పొందని బుద్ధిహీనుడు, అసాధుః=సాధువు కానివాడు, అత్ర=ఇక్కడ, విప్ర+అవమంతా=విప్రుని అవమానించినవాడు, యథాగజః=గజము వలె, స్తబ్ధమతిః=మందమతిగలవాడైనవాడు, సః ఏవ=ఆ గజమువలె, తమిస్రమ్=అజ్ఞానమును, విశతామ్=పొందుగాక అని, తస్మై=ఆ ఇంద్రద్యుమ్నుని కొఱకు, ఇమం శాపమ్=ఈ శాపమును, అదాత్=ఇచ్చెను.

**తాత్పర్యము :** ఈ రాజు దురాత్ముడు, వీడు గురుశిక్ష పొందిన బుద్ధిగలవాడు కాదు. ఇపుడు విప్రుడనగు నన్ను నవమానించాడు. గజమువలె మత్తుగొన్న బుద్ధిగలవాడై యున్నాడు. వీడు అట్టి గజమై అజ్ఞానమునొంది కష్టమును బొందుగాక అని శాపమొసగెను.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం శప్త్వా గతోఽగస్త్యో భగవాన్ నృప సానుగః।**
**ఇంద్రద్యుమ్నోఽపి రాజర్షిర్దిష్టన్తదుపధారయన్॥** 11

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా, భగవాన్ అగస్త్యః=భగవంతుడైన అగస్త్యుడు, ఏవమ్=ఇట్లు,

శప్త్వా=ఆ ఇంద్రద్యుమ్నుని శపించి, సానుగః=శిష్యులఁగూడి, గతః=పోయెను. ఇంద్రద్యుమ్నః అపి=ఇంద్రద్యుమ్నుడు కూడా, రాజర్షిః=రాజర్షి, దిష్టమ్=విధి వశమున ప్రాప్తించిన, తత్+ ఉపధారయన్=ఆ శాపమును తెలిసికొనెను.

**తాత్పర్యము :** అగస్త్య భగవానుడిట్టులా రాజును శపించి శిష్యులతో మరలిపోయెను. రాజర్షి ఇంద్రద్యుమ్నుడు తనకు ఆ శాపము విధివశమున వచ్చినదని తెలుసుకొనెను.

**శ్లో॥ ఆపన్నః కౌఞ్జరీం యోనిమాత్మస్మృతివినాశినీమ్।**
**హర్యర్చనానుభావేన యద్గజత్వేఽప్యనుస్మృతిః॥** 12

**ప్రతిపదార్థము :** ఆత్మస్తుతివినాశినీమ్=ఆత్మజ్ఞానమును తోనడంచునదైన, కౌంజరీమ్= కుంజరమునకు సంబంధించిన, యోనిమ్=జన్మమును, ఆపన్నః=పొందెను. యత్+గజత్వే - పి =ఏ గజభావమున వీడు, హరి+అర్చన+అనుభావేన=మహావిష్ణువునర్చించిన ప్రభావముచే, అనుస్మృతిః=పూర్వజన్మ జ్ఞానము గలవాడయ్యెను.

**తాత్పర్యము :** ఆత్మజ్ఞానమును నాశనము చేయునదైన కుంజరజన్మమును బొందెను. విష్ణు నారాధించిన మహిమవలన గజజన్మమునందు ఆ రాజుకు పూర్వజన్మ జ్ఞానము గలిగెను.

**శ్లో॥ ఏవం విమోక్ష్య గజయూథపమబ్జనా**
**భస్తేనాపి పార్షదగతిం గమితేన యుక్తః।**
**గంధర్వసిద్ధవిబుధైరుపగీయమాన**
**కర్మాద్భుతం స్వభవనం గరుడాసనోఽగాత్॥** 13

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, గజయూథపమ్=గజేంద్రుని, విమోక్ష్య=బంధ విముక్తుని గావించి, అబ్జనాభః=పద్మము నాభియందు గలవాడు, పార్షదగతిమ్=తన పరిషత్తునందలి సభ్యత్వమును, గమితేన=పొందింపబడిన ఆ ఇంద్రద్యుమ్నునితో, యుక్తః =కూడినవాడై, విబుధైః=దేవతలచేత, ఉపగీయమానకర్మా=గానము చేయబడుచున్న, తన చేయిదముగలవాడై, గరుడ+ఆసనః=గరుడవాహనారూఢుడై, అద్భుతమ్= ఆశ్చర్యకరమైన, స్వభువనమ్=తన వైకుంఠలోకమునుగూర్చి, అగాత్=పోయెను/పొందెను.

**తాత్పర్యము :** పద్మనాభుడాహరి ఇట్లు గజేంద్రుని బంధవిముక్తుని చేసి అతనిని తన పారిషదునిగా చేసుకొని ఇంద్రద్యుమ్నునితో కూడా సురలు తన గజేంద్రమోక్షణ కథను కొనియాడుచుండగా అద్భుతము అయిన తన వైకుంఠ లోకమునకు పోయెను.

**శ్లో॥ ఏతన్మహారాజ తవేరితో మయా కృష్ణానుభావో గజరాజమోక్షణమ్।**
**స్వర్గ్యం యశస్యం కలికల్మషాపహం దుస్స్వప్ననాశం కురువర్య శృణ్వతామ్॥** 14

**ప్రతిపదార్థము :** మహారాజ=ఓ మహారాజా!, ఏవమ్=ఈ ప్రకారము, తవ=నీకు, మయా= నాచేత, కృష్ణ+అనుభావః=మహావిష్ణు ప్రభావమైన, గజరాజమోక్షణమ్=గజరాజు మోక్షణము, ఈరితః=చెప్పబడెను. కురువర్య=కురువర్యా!, శృణ్వతామ్=దానిని వినువారలకు, స్వర్గ్యమ్= స్వర్గమును కలిగించును, యశస్యమ్=కీర్తి కలుగును, కలికల్మషాపహమ్=కలి దోషమును పోగొట్టును, దుస్స్వప్ననాశమ్=చెడ్డ కల దోషములను బోగొట్టునదై యున్నది.

**తాత్పర్యము :** ఓ రాజా! ఇట్టి విష్ణుప్రభావమును దెల్పునదైన గజేంద్రమోక్షము కథను నీకు



చెప్పినాడను. దానిని వినువారు స్వర్గమును, యశస్సునుఁబొందగలరు. ఇది దుస్స్వప్న దోషములను నాశనమొనరించునదై యున్నది.

**శ్లో॥ యథానుకీర్తయన్త్యేతచ్ఛ్రేయస్కామా ద్విజాతయః।**
**శుచయః ప్రాతరుత్థాయ దుఃస్వప్నాద్యుపశాన్తయే॥** 15

**ప్రతిపదార్థము :** శ్రేయస్కామాః=శ్రేయస్సును వాంఛించు, ద్విజాతయః=త్రైవర్ణీయులు, ప్రాతః ఉత్థాయ=ఉదయమున నిద్ర మేల్కొంచి, శుచయః=పరిశుద్ధులై, దుస్స్వప్నాది+ఉపశాంతయే= చెడ్డ కలల దోషమును నివర్తించుటకై, ఏతత్=ఈ గజేంద్రమోక్షణమును, యథా+ అనుకీర్తయంతి=ఈ చెప్పిన విధముగా సంకీర్తనము చేయుచున్నారు.

**తాత్పర్యము :** శ్రేయస్కాములగు క్షత్రియ వైశ్యులు ఉదయమున మేల్కొంచి కాలుసేతులు కడుగికొని యాచమించి శుచులై, చెడు స్వప్నములు, దోషములు శమించుటకై ఈ గజేంద్ర మోక్షణ కథను ఈ చెప్పిన ప్రకారము సంకీర్తనము చేయుచుందురు.

**శ్లో॥ ఇదమాహ హరిః ప్రీతో గజేన్ద్రం కురుసత్తమ!।**
**శృణ్వతాం సర్వభూతానాం సర్వభూతమయో విభుః॥** 16

ఈ కథను కీర్తించుటచే శ్రేయస్సు కలుగునని ఎట్లు తెలియవచ్చును. సాక్షాత్తుగా భగవంతుడు వచించినందున దెలియుచున్నదనుచున్నాడు.

**ప్రతిపదార్థము :** కురుసత్తమ=ఓ కురుశ్రేష్ఠా!, సర్వభూతమయః=సర్వప్రాణుల స్వరూపమున కాశ్రయమైనవాడు, విభుః=ప్రభువు, హరిః=విష్ణువు, ప్రీతః=సంతోషించినవాడు, సర్వభూతానామ్=ఎల్ల భూతములు, వేల్పులులోనగువారు, శృణ్వతామ్=వినుచుండ, వారి మ్రోల, గజేంద్రమ్=గజేంద్రుని గూర్చి, ఇదం ఆహ=ఈ మాట చెప్పెను.

**తాత్పర్యము :** సర్వ భూతములందంతర్యామియై ప్రభువైన హరి సంతసించినవాడై ఎల్ల ఋషులు, దేవతలు వినుచుండ గజేంద్రునితో నీమాట చెప్పెను.

**శ్రీ భగవానువాచ :** శ్రీ భగవంతుడు వచించెను.

**శ్లో॥ యే మాం త్వాం చ సరశ్చేదం గిరికన్దరకాననమ్।**
**వేత్రకీచకవేణూనాం గుల్మాని సురపాదపాన్॥** 17

**ప్రతిపదార్థము :** యే=ఏ సుజనులు, మామ్=నన్ను, త్వాంచ=నిన్ను, ఇదం సరశ్చ=ఈ సరస్సును, గిరికందరకాననమ్=ఈ త్రికూటగిరిని, గుహలను, కాననమును, వేత్రకీచక వేణూనామ్=బెత్తపు చెట్లను, ధ్వనించు వెదురు చెట్లను, గుల్మాని=చిన్న పొదలను, సురపాదపాన్=కల్పవృక్షములను, కీర్తయేయుః=కీర్తించునో.

**తాత్పర్యము :** ఈ కీర్తన సందర్భమున ఇతరమైనవాని కీర్తించ ఫలము చెప్పబడుచున్నది.

ఓ గజేంద్రా ! ఏ జనులు నిన్ను, నన్ను, ఈ సరస్సును, ఈ త్రికూట పర్వతమును, ఈ గుహలను, కాననమును, బెత్తపు చెట్లు మొదలగు వానిని, పొదలను, కల్ప వృక్షములను కీర్తించునో.

**శ్లో॥ శృఙ్గాణీమానిధిష్ణ్యాని బ్రహ్మణో మే శివస్య చ।**
**క్షీరోదం మే ప్రియన్ధామ శ్వేతద్వీపం చ భాస్వరమ్॥** 18

**తాత్పర్యము :** ఆఅవ మనువు చక్షుషుని పుత్రుడు చాక్షుషుడయ్యెను. పురుస్సు, పురుషుడు, సుద్యుమ్నుడులోనగువారు ఆ మనుపుత్రులు.

**శ్లో॥ ఇంద్రో మన్త్రద్రుమస్తత్ర దేవా ఆప్యాదయో గణాః।**
**మునయస్తత్ర వై రాజన్ హవిష్మద్వీరకాదయః॥ 8**

**ప్రతిపదార్థము :** మంత్రద్రుమః=మంత్రద్రుముడు అనువాడు, ఇంద్రః=ఇంద్రుడయ్యెను, తస్య=ఆ ఇంద్రునికి, ఆప్యాదయః=ఆప్యుడు లోనగు, దేవాః గణాః=సురగణములైరి, రాజన్!=ఓ రాజా!, తత్ర=ఆ మన్వంతరమున, హవిష్మ ద్వీరక+ఆదయః=హవిష్మతుడు, వీరకుడు లోనగువారు, మునయః=సప్తర్షులైరి.

**తాత్పర్యము :** ఆ చాక్షుషుని మన్వంతరమున మంత్రద్రుముడను వాడింద్రుడు, ఆప్యుడు లోనగువారు దేవగణములు, హవిష్మతుడు, వీరకుడులోనగువారు సప్తర్షులైరి.

**శ్లో॥ తత్రాపి దేవసమ్భూత్యాం వైరాజస్యాభవత్సుతః।**
**అజితో నామ భగవానంశేన జగతః పతిః॥ 9**

**ప్రతిపదార్థము :** తత్ర+అపి=ఆ మన్వంతరమునందు, జగతః పతిః=లోక ప్రభువు, భగవాన్=విష్ణు భగవానుడు, వైరాజస్య=వైరాజునువానికి, దేవసంభూత్యామ్=దేవ సంభూతియను భార్యయందు, అంశేన=తనయంశముతో, అజితః నామ=అజితుడను పేరున, సుతః=కుమారుడు, అభవత్=ఆయెను.

**తాత్పర్యము :** ఆ మన్వంతరమునందును వైరాజనుడు అనువానికి దేవసంభూతయను భార్యయందు, విష్ణువు తనయంశచే అజితుడను కుమారుడై జన్మించెను.

**శ్లో॥ పయోధిం యేన నిర్మథ్య సురాణాం సాధితా సుధా।**
**భ్రమమాణోఽమ్భసి ధృతః కూర్మరూపేణ మన్దరః॥ 10**

**ప్రతిపదార్థము :** యేన=ఏ విష్ణువుచే, పయోధిమ్=పాలసముద్రమును, నిర్మథ్య=మథించి, సురాణామ్=దేవతలకు, సుధా=అమృతము, సాధితా=సాధించబడెనో, అంభసి=నీటియందు, భ్రమమాణః=తిరుగుచున్న, మంథరః=మందరపర్వతము, కూర్మరూపేణ=కూర్మరూపియైన, ఏ విష్ణువు చేత, ధృతః=ధరింపబడెనో.

**తాత్పర్యము :** ఆ మహావిష్ణువు సురలకై పాలసముద్రమును మథించి, అమృతము నొసంగెనో మథన సమయమున నీటియందు తిరుగుచున్న మందర పర్వతము కూర్మావతారమెత్తి ఆ మహావిష్ణువుచే ధరించబడెనో.

**రాజోవాచ :** పరీక్షిన్మహారాజు వచించెను.

**శ్లో॥ యథా భగవతా బ్రహ్మన్ మథితః క్షీరసాగరః।**
**యదర్థం వా యతశ్చాద్రిం దధారామ్బుచరాత్మనా॥ 11**

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ విప్రోత్తమా!, భగవతా=విష్ణుభగవానుచేత,యథా=ఏ ప్రకారము, క్షీరసాగరః=పాలకడలి, మథితః=చిలుకబడెనో, యదర్థం వా=ఎందుకొఱకు, యతశ్చ=ఎందువలన, అంబుచరాత్మనా=నీట సంచరించు తాబేలు రూపమున, అద్రిమ్=మందర గిరిని, దధార=ధరించెను.



**తాత్పర్యము :** ఓంకారమును, సత్యమును (బ్రహ్మమును) మాయను, అవ్యయరూపమగు భక్తిధర్మము, గోవులను, విప్రులను, ధర్మదేవతను, చంద్రునికి, కశ్యపునకు భార్యలైన దక్షుని కూతులను కీర్తించునో –

**శ్లో॥ గఙ్గాం సరస్వతీం నన్దాం కాళిన్దీం సితవారణమ్।**
**ధ్రువం బ్రహ్మఋషీన్ సప్త పుణ్యశ్లోకాంశ్చ మానవాన్॥ 23**

**ప్రతిపదార్థము :** పుణ్యశ్లోకాన్=పవిత్ర యశస్సుగల, సితవారణమ్=తెల్ల యేనుగును గంగా, సరస్వతీ, అలకనంద, యమునలోనగు నదులను, ఐరావత గజమును, ధ్రువుని, సప్తర్షులను, పవిత్రయశస్సుగల మానవులను కీర్తించునో –

**శ్లో॥ ఉత్థాయాపరరాత్రాన్తే ప్రయతాః సుసమాహితాః।**
**స్మరన్తి మమ రూపాణి ముచ్యన్తే తేఽంహసోఽఖిలాత్॥ 24**

**ప్రతిపదార్థము :** అపరరాత్రాంతే=రాత్రి యొక్క రెండవ భాగము చివర వేకువను, ఉత్థాయ=నిద్ర మేల్కాంచి, ప్రయతాః=నియమము గలిగి, సుసమాహితాః=ఏకాగ్రచిత్తులై, మమ రూపాణి =నాయొక్క రూపములను, నా విభూతులను, స్మరంతి=స్మరించుచున్నారో, తే=వారు, అఖిలాన్ =సమస్తమైన, అంహసః=పాపములనుండి, ముచ్యంతే=విముక్తి చెందుదురు.

**తాత్పర్యము :** వేకువను మేల్కాంచి, నియములై ఏకాగ్రచిత్తులై నా రూపములను, నా యైశ్వర్యమును స్మరించువారు సమస్త పాపములనుండి విముక్తి చెందును.

**శ్లో॥ యే మాం స్తువన్త్యనేనాఙ్గ! ప్రతిబుధ్య నిశాత్యయే।**
**తేషాం ప్రాణాత్యయే చాహం దదామి విమలాం మతిమ్॥ 25**

**ప్రతిపదార్థము :** అంగ=ఓ గజేంద్ర !, యే=ఎవరు, నిశాత్యయే=వేకువను, ప్రతిబుధ్య=నిద్ర మేల్కొని, అనేన=ఈ నేను చెప్పిన క్రమమున, మామ్=నన్ను, స్తువంతి=స్తోత్రము చేయుచున్నారో, తేషామ్=వారికి, ప్రాణాత్యయే=ప్రాణము పోవునప్పుడు, విమలాం మతిమ్=విస్తారమైన బుద్ధిని జ్ఞానమును, దదామి=ఇచ్చుచున్నాను.

**తాత్పర్యము :** ఎవరు వేకువను మేల్కొంచి ఈ నేను జెప్పిన క్రమమున నన్ను స్తుతించుచున్నారో వారికి ప్రాణము పోవుకాలమున నా సంబంధి చక్కని జ్ఞానమును ప్రసాదించుచున్నాను.

**శ్రీ శుక ఉవాచ –** శ్రీశుకుడు వచించెను.

**శ్లో॥ ఇత్యాదిశ్య హృషీకేశః ప్రాధ్మాయ జలజోత్తమమ్।**
**హర్షయన్ విబుధానీకమారురోహ ఖగాధిపమ్॥ 26**

**ప్రతిపదార్థము :** ఇతి ఆదిశ్య=అని యిట్లాజ్ఞాపించి, హృషీకేశః=విష్ణువు, జలజ+ఉత్తమమ్ =ఉత్తమమైన తన శంఖమును, ప్రాధ్మాయ=పూరించి ఊది, విబుధ+అనీకమ్=వేల్పుల మొత్తమును, హర్షయన్=సంతోషపెట్టుచు, ఖగాధిపమ్=పక్షిరాజును, ఆరురోహ=ఎక్కెను.

**తాత్పర్యము :** ఇట్లు నానతిచ్చి శ్రీహరి పాంచజన్యమను తన యుత్తమ శంఖమును పూరించి వేల్పులకు సంతసము గలిగించి పక్షిరాజుపైనెక్కెను.

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమందు అష్టమస్కంధమున నాల్గవ అధ్యాయము.

## పంచమోఽధ్యాయః

ఈ అధ్యాయము మొదలు ఎనిమిది అధ్యాయములు క్షీరసాగరమును అమృతమునకై మథించు ఉపాఖ్యానము వర్ణింపబడును. మరి తన భక్తులందు పక్షపాతముచే హరి స్త్రీరూపమును (మోహినీ) గైకొనుట, విప్రశాపమున రాచసిరిని గోల్పోయిన దేవతలు మరల యథాప్రకారము శ్రీమంతులై శ్రీహరిని స్తుతించుట వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ రాజన్నుదితమేతత్తే హరేః కర్మాఘనాశనమ్।**
**గజేన్ద్రమోక్షణం పుణ్యం రైవతం త్వన్తరం శృణు॥ 1**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, హరేః=హరి యొక్క, అఘనాశనమ్=పాప సంహరణమైన, ఏతత్ గజేంద్రమోక్షణమ్=ఈ గజేంద్ర మోక్షణము, పుణ్యమ్=పవిత్రము, తే=నీకు, ఉదితమ్ =చెప్పబడినది, రైవతం తు అంతరమ్=రైవతుడను మన్వంతరమును, శృణు=వినుము

**తాత్పర్యము :** ఓ రాజా ! పవిత్రమైన పాపనాశకమైన ఈ గజేంద్ర మోక్షకథను నీకు చెప్పితిని. ఇక రైవత మన్వంతరమును చెప్పెదను వినుము.

**శ్లో॥ పఞ్చమో రైవతో నామ మనుస్తామససోదరః।**
**బలివిన్ధ్యాదయస్తస్య సుతా హార్జునపూర్వకాః॥ 2**

**ప్రతిపదార్థము :** పంచమః=ఐదవవాడు, రైవతః నామ=రైవతుడని ప్రసిద్ధికెక్కినవాడు, తామస సోదరః=నాలుగవ మనువైన తామసుడను మనువుకు సోదరుడు, మనుః=మనువయ్యెను, తస్య సుతాః=అతని పుత్రులు, అర్జునపూర్వకాః=అర్జునుడు మొదటివాడుగా గల, బలి వింధ్యాదయః=బలివింధుడు మొదలగువారు.

**తాత్పర్యము :** నాలుగవ మనువు తామసుడు అతని సోదరుడు రైవతుడు అయిదవ మనువయ్యెను. అర్జునుడు జ్యేష్ఠుడుగా గల బలివింధ్యుడులోనగువారు పుత్రులుగలిగిరి.

**శ్లో॥ విభురిన్ద్రః సురగణా రాజన్ భూతరయాదయః।**
**హిరణ్యరోమా వేదశిరా ఊర్ధ్వబాహ్వాదయో ద్విజాః॥ 3**

**ప్రతిపదార్థము :** రాజన్!=ఓ రాజా !, విభుః=విభుడనువాడు, ఇంద్రః=ఇంద్రుడయ్యెను, భూతరయాదయః=భూతరయుడు లోనగువారు, సురగణాః=దేవతలైరి, హిరణ్యరోమాః =హిరణ్యరోముడు మొదలైనవారు, వేదశిరాః=వేదశిరుడు, ఊర్ధ్వబాహ్వాదయః=ఊర్ధ్వబాహుడు లోనగువారు, ద్విజాః=విప్రులు సప్తర్షులైరి.

**తాత్పర్యము :** ఆ మన్వంతరమున విభుడింద్రుడు, భూతరయుడు లోనగువారు సురలు, హిరణ్యరోముడు వేదశిరుడు, ఊర్ధ్వబాహుడు లోనగువారు సప్తర్షులైరి.

**శ్లో॥ పత్నీ వికుంఠా శుభ్రస్య వైకుంఠైః సురసత్తమైః।**
**తయోః స్వకలయా జజ్ఞే వైకుణ్ఠో భగవాన్ స్వయమ్॥ 4**



**ప్రతిపదార్థము :** శుభ్రస్య=శుభ్రుడనువానియొక్క, పత్నీ=భార్య, వికుంఠా=వికుంఠయను నామెయయ్యె, తయోః=ఆ దంపతులకు, భగవాన్=భగవంతుడు, వైకుంఠః=విష్ణువు, స్వయమ్=తాను, స్వకలయా=తనయంశమున, వైకుంఠైః=వైకుంఠవాసులగు, సురసత్తమైః =సురశ్రేష్ఠులతో, జజ్ఞే=పుత్రుడుగా జన్మించెను.

**తాత్పర్యము :** శుభ్రుడు, వికుంఠ అను దంపతులకు విష్ణువు, వైకుంఠవాసులగు సురశ్రేష్ఠులు సోదరులుకాగా భగవానుడు తాను తనయంశములో పుత్రుడై జన్మించెను.

**శ్లో॥ వైకుణ్ఠః కల్పితో యేన లోకో లోకనమస్కృతః।**
**రమయా ప్రార్థ్యమానేన దేవ్యా తత్ప్రియకామ్యయా॥ 5**

**ప్రతిపదార్థము :** తత్+ప్రియకామ్యయా=ఆతని ఇష్టమును కోరు, రమయాదేవ్యా=లక్ష్మీదేవి చేత, ప్రార్థ్యమానేన=ప్రార్థింపబడుచున్న, యేన=ఏ విష్ణువుచేత, లోకనమస్కృతః=లోకముచే నమస్కరింపబడిన, వైకుంఠఃలోకః=వైకుంఠమను లోకము, కల్పితః=నిర్మింపబడెనో, (లోకో+లోక+ఉపరి=మర్త్యలోక పర్వతము, చక్రవాళ పర్వతమునకు పైభాగమున అని పాఠాంతరము.)

**తాత్పర్యము :** లక్ష్మి ఆ హరి ప్రియముగోరునది తన్ను మిక్కిలి ప్రార్థింపగా విష్ణువు ఎల్లలోకములను నమస్కరింపదగిన వైకుంఠమను లోకమును నిర్మించెను.

**శ్లో॥ తస్యానుభావః కథితో గుణాశ్చ పరమోదయాః।**
**భౌమాన్ రేణూన్సవిమమే యో విష్ణోర్వర్ణయేద్ గుణాన్॥ 6**

**ప్రతిపదార్థము :** తస్య=వైకుంఠ సంజ్ఞను పొందిన హరియొక్క, అనుభావః=ప్రభావము, (సనకాదులశాపముచే దైత్యులై జన్మించిన తన పార్షదులను వరాహాదిరూపమున యుద్ధము చేసిన కథ) కథితః=చెప్పబడినది, పరమ+ఉదయాః=గొప్ప శుభకరములైన, గుణాశ్చ= గుణములున్ను చెప్పబడినవి, యః=ఎవడు, విష్ణోః=విష్ణువు యొక్క, గుణాన్=గుణములను, వర్ణయేత్=వర్ణించునో, సః=అతడు, భౌమాన్ రేణూన్=భూరేణువులను, విమమే=లెక్కించును. ఇది యెట్లు అసాధ్యమో ఆ గుణవర్ణనము నట్లెంచుగాక.

**తాత్పర్యము :** ఆ వైకుంఠుడు సనకాదుల శాపమును పొందిన తన పార్షదులు హిరణ్యాక్షాది దైత్యులై భూమిమీద నవతరించగా ఆ హరి వరాహాద్యవతారములనెత్తి వారిని వధించిన కథారూపమైన ప్రభావము (తృతీయ స్కంధమున చెప్పబడినది.) ఆయన ఉత్తమగుణములున్ను చెప్పబడినవి. విష్ణువు గుణములను వర్ణింపదొరకొన్నవాడు భూమి రేణువులను లెక్కపెట్టఁ బూను కొనుట అగును. ఎట్లు భూమి రేణువులను లెక్కపెట్టుట అసాధ్యమో అట్లే విష్ణు గుణవర్ణనము అసాధ్యమగును.

**శ్లో॥ షష్ఠశ్చ చక్షుషః పుత్రశ్చాక్షుషో నామ వై మనుః।**
**పూరుపూరుషసుద్యుమ్నప్రముఖాశ్చాక్షుషాత్మజాః॥ 7**

**ప్రతిపదార్థము :** చక్షుషఃపుత్రః=చక్షుషుని పుత్రుడు, చాక్షుషః=చాక్షుషుడను, నామ=ప్రసిద్ధి చెందిన, మనుః=మనువు, పూరుపురుషసుద్యుమ్నప్రముఖాః=పూరువు, పూరుషుడు, సుద్యుమ్నుడులోనగువారు, చాక్షుష+ఆత్మజాః=చాక్షుషుని కుమారులు.

**తాత్పర్యము :** నేను శివుడు మీరు మఱియు అసురులులోనగువారు జరాయుజాండజ స్వేదజోద్భిజ్జములు అగు మానవులు, జంతువులు, పక్షులు, వృక్షములు, నల్లులు, పేలు లోనగునవి ఈ మనమందఱము, ఆ విష్ణువునవతారాంశమునంబొడమిన బ్రహ్మయు, ఆయన కళలైన మరీచ్యాదులును వారి పుత్రపౌత్రాదులును వారి వలన జనించినవారును ఆ హరి వలన జనించినవారము కావున ఆ విష్ణునే అవ్యయుని శరణుపొందెదము.

**శ్లో॥ న యస్య వధ్యో న చ రక్షణీయో నోపేక్షణీయాదరణీయపక్షః।**
**తథాపి సర్గస్థితిసంయమార్థం ధత్తే రజస్సత్త్వతమాంసి కాలే॥ 22**

ఓయీ ! అట్లయిన ఇతడు విష్ణువు అందఱి యందును సముడగుచున్నాడు, మరి ఆయన చరణమునాశ్రయించుట వలన నేమి ప్రయోజనము అన్నచో సత్యము, ఇట్టివాడైనను మనయందు పక్షపాతము గలవాడగును అనుచున్నారు.

**ప్రతిపదార్థము :** యస్య=ఏ విష్ణువునకు, న వధ్యః=వధింపదగినవాడు లేఁడు, న రక్షణీయః =రక్షింపదగినవాడును లేడు, న ఉపేక్షణీయ+ఆదరణీయపక్షః=ఉదాసీనమునుండదగినదియు, ఆదరింపదగిన పక్షమును లేదు.. తథాపి=అట్లున్నను, కాలే=తగు సమయమందు, సర్గస్థితి సంయమార్థం=సృష్టిస్థితిలయములుగావించుట కొఱకు, రజస్సత్త్వతమాంసి=రజస్సత్త్వ తమస్సులను గుణములను, తదనుగుణరూపములను, ధత్తే=ధరించును.

**తాత్పర్యము :** ఎవనికి వధింపదగినవాడు లేడో, రక్షింపదగినవాడు లేడో, ఎవనికి ఉపేక్షించదగిన పక్షము ఆదరింపదగిన పక్షమును లేదో అట్టివాడైనను జగము సృజింపను, పరిపాలింపను, లయముగావింపను రజస్సత్త్వతమస్సులను గుణములను తదనురూపమైన రూపములను ధరించుచున్నాడో.

**శ్లో॥ అయన్తు తస్య స్థితిపాలనక్షణః సత్త్వం జుషాణస్య భవాయ దేహినామ్।**
**తస్మాద్ వ్రజామః శరణం జగద్గురుం స్వానాం స నో ధాస్యతి శం సురప్రియః॥ 23**

**ప్రతిపదార్థము :** అయంతు=ఇదియైనచో్, దేహినామ్=దేహధారులగు జీవుల యొక్క, భవాయ=సంసారము కొఱకు, సత్త్వమ్=సత్త్వగుణమును, జుషాణస్య=పొందిన, తస్య=ఆ విష్ణునకు, స్థితిపాలనక్షణః=జగము యొక్క ఉనికిని పాలించుకాలమై యున్నది. సురప్రియః =సాత్త్వికులగు దేవతలకు ఇష్టుడగు, సః=ఆ విష్ణువు, స్వానామ్=సత్త్వగుణ విశిష్టులైన, నః =మనకు, శమ్=సుఖమును, దాస్యతి=కలిగింపగలడు. తస్మాత్=అందువలన, జగద్గురుమ్=ఆ జగద్గురుని, శరణమ్=రక్షకునిగా, వ్రజామః=పొందెదము.

**తాత్పర్యము :** జీవుల సంసారముకొఱకు సత్త్వగుణమును బొందిన ఆ విష్ణువునకు జగము యొక్క స్థితిని పాలించు కాలమైయున్నది. సురలకు ప్రియుడైన ఆ విష్ణువు సత్త్వగుణ విశిష్టులమగు మనకు సుఖమును కలిగింపగలడు. కావున ఆ జగద్గురుని శరణుపొందెదము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇత్యాభాష్య సురాన్ వేధాః సహ దేవైరరిన్దమ।**
**అజితస్య పదం సాక్షాజ్జగామ తమసః పరమ్॥ 24**



**తాత్పర్యము :** ఓ విప్రోత్తమా ! భగవంతుడు ఏ ప్రకారము క్షీరసాగరమును మథించెను. ఎందుకొఱకు ఏ కారణమున తాను నీట సంచరించు తాబేలు రూపును స్వీకరించి ఆ మందరగిరిని మోసెను.

**శ్లో॥ యథామృతం సురైః ప్రాప్తం కిం చాన్యదభవత్తతః।**
**ఏతద్భగవతః కర్మ వదస్వ పరమాద్భుతమ్॥ 12**

ఏ హేతువున నీటసంచరించు తాబేలు రూపమున, సురలకు అమృతము సంపాదించెనో అని చెప్పుట యుద్ధముగూడ సూచింపబడె - అందువలన ప్రశ్నించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యథా=ఏ ప్రకారము, సురైః=వేల్పులచే, అమృతమ్=అమృతము, ప్రాప్తమ్= పొందబడినది, తతః=ఆవల, అన్యత్=ఇతరమైన, కించ=మరి, ఏతత్=ఈ, భగవతః= భగవంతుని, కర్మ=పనిని, పరమాద్భుతమ్=మిక్కిలి అద్భుతమైనదానిని, వదస్వ=మాకు చెప్పుము.

**తాత్పర్యము :** దేవతలెట్లు అమృతమును బడసిరి. అప్పుడెట్టి విశేషములు కలిగెను. భగవంతుడు చేసిన, చేయు పనినచ్చెరువు కొల్పుదానిని వచింపుము.

**శ్లో॥ త్వయా సఙ్కథ్యమానేన మహిమ్నా సాత్వతామ్పతేః।**
**నాతితృప్యతి మే చిత్తం సుచిరం తాపతాపితమ్॥ 13**

**ప్రతిపదార్థము :** త్వయా=నీ చేత, సంకథ్యమానేన=చెప్పబడుచు/సంకీర్త్యమానేన=కీర్తనము చేయబడుచున్న, సాత్వతాంపతేః=విష్ణు భక్తులకు ప్రభువైన హరియొక్క, మహిమ్నా=ప్రభావము చేత, సుచిరమ్=తడవు కాలము, తాపతాపితమ్=శాపవ్యథచే సంతాపమును పొందుచున్న, మే చిత్తమ్=నా మనస్సు, న+అతితృప్యతి=మిక్కిలి తనివి పొందలేదు.

**తాత్పర్యము :** సాత్వతులకుఁబ్రభువైన విష్ణువు యొక్క మహిమలను నీవు సంకీర్తనము చేయుచుండగా వినుచు నా మనము చిరకాలము శాపతాపమున వేగుచుండునది. తనివొందలేదు.

**సూత ఉవాచ :** సూతుడు వచించెను.

**శ్లో॥ విష్ణురాతేన సంపృష్టో భగవాన్ బాదరాయణః।**
**అభినన్ద్య హరేర్వీర్యమాఖ్యాతుముపచక్రమే॥ 14**

**ప్రతిపదార్థము :** విష్ణురాతేన=విష్ణువుచే నీయబడిన పరీక్షిత్తుచే (విష్ణువు రక్షించిన), సంపృష్టః =చక్కగా ప్రశ్నింపబడినవాడై, బాదరాయణః=బాదరాయణుడగు వ్యాసుని కుమారుడు, శుకుడు, హరేః=విష్ణువు యొక్క, వీర్యమ్=ప్రభావము, సామర్థ్యము, అభినంద్య=అభినందించి, ఆఖ్యాతుమ్=క్షీరసాగర మథన వృత్తాంతమును చెప్పుటకు, ఉపచక్రమే=ప్రారంభించెను.

**తాత్పర్యము :** తల్లి గర్భమున నుండగ అశ్వత్థామ బ్రహ్మాస్త్రమునుంచి శ్రీకృష్ణునిచే రక్షింపబడిన పరీక్షిత్తు ఈ ప్రకారము చక్కగ ప్రశ్నింప శుకుడు హరి ప్రభావమునభినందించి పాల సముద్రమును మథించిన కథను చెప్పుటకు ప్రారంభించెను.

శ్రీ శుక ఉవాచ : శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ యదా యుద్ధేఽసురైర్దేవా బధ్యమానాః శితాయుధైః।**
**గతాసవో నిపతితా నోత్తిష్ఠేరన్ పునశ్చతేస్మ భూరిశః॥ 15**

**ప్రతిపదార్థము :** యదా=ఎప్పుడు, యుద్ధే=యుద్ధమునందు, అసురైః=అసురుచే, దేవాః =దేవతలు, శితాయుధైః=పదునైన కైదువులచే, బధ్యమానాః=చంపబడుచున్నవారై, గత+ ఆసవః=ప్రాణములు గోలుపోయిన, నిపతితాః=పడిపోయినవారు, పునః=మరల, భూరిశః =వారిలో అధికశాతము, న+ ఉత్తిష్ఠేరన్=జీవించకపోవుచుండిరి, స్మ=అయ్యెను.

**తాత్పర్యము :** యుద్ధము సంభవించినప్పుడంతయు అసురులచే వాడియైన యాయుధములచే కొట్టబడి ప్రాణములు పోయి యుద్ధభూమిలో పడిపోయిన దేవతలు మరల జీవించనివారైరి.

**శ్లో॥ యదా దుర్వాససః శాపాత్ సేన్ద్రా లోకాస్త్రయో నృప।**
**నిశ్శ్రీకాశ్చాభవంస్తత్ర నేశురిజ్యాదయః క్రియాః॥ 16**

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా !, యదా=ఎప్పుడు, దుర్వాససః=దుర్వాసుని యొక్క శాపాత్=శాపము వలన, స+ఇంద్రాః=ఇంద్రునితో గూడిన, త్రయఃలోకాః=మూడు లోకములూ, నిశ్శ్రీకాః=రాచసిరిని గోలుపోయినవి, అభవన్=ఆయెనో, తత్ర=అప్పుడు, ఇజ్యా+ ఆదయః=యజ్ఞయాగాదులను, క్రియాః=కర్మలు, న+ఈశుః=చేయజాలరైరి.

**తాత్పర్యము :** ఒకప్పుడు దుర్వాసుడను మహర్షి మార్గమునందుఁబోవుచున్న ఇంద్రుని జూచి తన కంఠమునందున్న శివదళమయిన పుష్పమాలను నతనికిచ్చెను. ఆ ఇంద్రుడు రాజ్యలక్ష్మీ మదము వలన అనాదరము చేసి ఆ మాలను ఐరావతగజము యొక్క కుంభస్థలమున నుంచెను. ఆ యేనుగు మదించినది కావున ఆ మాలను తొండమునగొని పాదముల క్రింద బడవేసి నలుగఁద్రొక్కెను. దానిజూచి కుపితుడై దుర్వాసుడు ముల్లోకములతో గూడిన రాజ్యలక్ష్మిని కోల్పోదువుగాక అని ఇంద్రునికి శాపమిచ్చెను.

అందువలన ముల్లోకములతో గూడనింద్రుడు రాజ్యలక్ష్మిని గోలుపోగా ఎప్పుడును, ఎవ్వరును యజ్ఞయాగాదులు చేయుటకు సమర్థులు కాలేదు.

**శ్లో॥ నిశమ్యైతత్ సురగణా మహేన్ద్రవరుణాదయః।**
**నాధ్యగచ్ఛన్ స్వయం మన్త్రైర్మన్త్రయన్తో వినిశ్చయమ్॥ 17**

**ప్రతిపదార్థము :** మహేంద్రవరుణ+ఆదయః=దేవేంద్రుడు, వరుణుడు మొదలైన, సురగణాః =దేవగణము, ఏతత్=దుర్వాసుని శాపమును ముల్లోకముల సిరి దరిగిపోవుటను, కర్మలు బడయవేల్పులు చనిపోవుటయు, నిశమ్య=విని తెలిసి, స్వయమ్=స్వయముగ, మంత్రైః =ఆలోచనములచే, మంత్రయంతః=ఆలోచించువారైనను, వినిశ్చయమ్=ఒక నిర్ణయమును, న+అధ్యగచ్ఛన్=పొందలేకుండిరి.

**తాత్పర్యము :** కయ్యమున సురలు మృతులగుటయు, లోకముల సిరితఱుగుట కర్మకలాపములు జరుగకపోవుటయు తెలిసికొని, ఇంద్రవరుణాదులగు వేల్పులు అందుకు ప్రతీకారమెంత యాలోచించినను ఒక నిర్ణయమునకు రాఁజాలరైరి.



**శ్లో॥ తతో బ్రహ్మసభాం జగ్ముర్మేరోర్మూర్ధని సర్వశః।**
**సర్వం విజ్ఞాపయాఞ్చక్రుః ప్రణతాః పరమేష్ఠినే॥ 18**

**ప్రతిపదార్థము :** తతః=అంత, సర్వశః=అందఱును, మేరోః మూర్ధని=మేరు పర్వత శిఖరమందున్న, బ్రహ్మ సభామ్=బ్రహ్మదేవుని సభను గూర్చి, జగ్ముః=పోయిరి, పరమేష్ఠినే= బ్రహ్మకై, ప్రణతాః=నమస్కరించినవారై, సర్వమ్=జరిగినదంతయు, విజ్ఞాపయామ్ చక్రుః =విన్నవించిరి.

**తాత్పర్యము :** అంతనందరు బయలుదేరి మేరు శృంగముననున్న బ్రహ్మసభకుబోయి, బ్రహ్మకు బ్రణమిల్లి తమకు వచ్చిన యిక్కట్టులన్నియు విన్నపము చేసిరి.

**శ్లో॥ స విలోక్యేన్ద్రవాయ్వాదీన్ నిస్సత్త్వాన్ విగతప్రభాన్।**
**లోకానమఙ్గళప్రాయానసురానయథా విభుః॥ 19**

**ప్రతిపదార్థము :** విభుః=ప్రభువైన, సః=ఆబ్రహ్మ, నిస్సత్త్వాన్=బలహీనులను, విగతప్రభాన్= తేజమును గోలుపోయినవారైన, ఇంద్రవాయు+ఆదీన్=ఇంద్రుడు, వాయువులోనగు దేవతలు, అమంగళప్రాయాన్=సిరిసంపదలను శుభములను గోలుపోయిన, లోకాన్=లోకములను, అసురాన్=అసురులను, విలోక్య=చూచి,...... ఇట్లు తలంచెను.

**తాత్పర్యము :** జగత్ప్రభుడైన బ్రహ్మ బలహీనులై తేజము కోల్పోయిన ఇంద్రుడు వాయువు లోనగు వేల్పులను గాంచి, పాడువడిన జగములను గాంచి, అట్లు బలనైపుణ్యములఁజెలరేగు అసురులను విలోకించెను.

**శ్లో॥ సమాహితేన మనసా సంస్మరన్ పురుషం పరమ్।**
**ఉవాచోత్ఫుల్లవదనో దేవాన్స భగవాన్ పరః॥ 20**

**ప్రతిపదార్థము :** సమాహితేన=ఏకాగ్రమున నిల్పిన, మనసా=మనస్సుతో, పరంపురుషమ్= పరమ పురుషుని, సంస్మరన్=స్మరించుచున్నవాడై, పరః=అధికుడైన, సః భగవాన్=భగవానుడగు బ్రహ్మ, ఉత్ఫుల్లవదనః=హర్షమున వికసించిన ముఖముగలవాడై, ఉవాచ=ఇట్లు పచించెను.

**తాత్పర్యము :** కొంతవడి ఆ భగవానుడు బ్రహ్మ ఉత్తముడు చిత్తము సమాధానము గావించి పురుషోత్తముని ధ్యానించి, హరిని శరణుపొందినవాడై సర్వమును బొందగలమని హర్షమున వికసించిన ముఖముకలవాడై యిట్లు వచించెను.

**శ్లో॥ అహం భవో యూయమథోఽసురాదయో మనుష్యతిర్యగ్ద్రుమఘర్మజాతయః।**
**యస్యావతారాంశకలావిసర్జితా వ్రజామ సర్వే శరణం తమవ్యయమ్॥ 21**

**ప్రతిపదార్థము :** అహమ్=నేను, భవః=శివుడు, యూయమ్=మీరు, అథ=మరియు, అసురాః =అసురులు, మనుష్య=మనుష్యులు, తిర్యక్=జంతువులు, ద్రుమ=వృక్షములు, ఘర్మజ+ ఆదయః=చెమట వలన జనించు నల్లులు, పేలులోనగునవి, తస్య=ఆ విష్ణువు యొక్క, అవతారాంశకలావిసర్జితాః=అవతారమైన పురుషుని యొక్క అంశమైన బ్రహ్మయు, అతని కళలైన మరీచ్యాదులును, వారిచే సృజించబడిన పుత్రపౌత్రాదుల ద్వారా జనించినవారమై, సర్వే=మనమందఱము, తం అవ్యయమ్=ఆ నాశరహితుడైన హరిని, శరణం వ్రజామ=శరణు పొందెదము.

మాయకు నియంతయై యుండువాడు కనుక జీవసామ్యమును పరిహరించు పరమేశ్వరుడు వరిష్ఠుడని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య మాయామ్=ఎవని మాయను, కః చ=ఒకానొకడును, న+అతితితర్తి =అతిక్రమించడో, యయా=ఏ మాయచే, వేదన+అర్థమ్=ఎఱుంగదగిన ఆత్మ స్వరూపమును గూర్చి, ముహ్యతి=మోహమునుఁబొందుచున్నాడో, ఎఱుంగలేడో, తమ్=ఆ, నిర్జిత+ఆత్మ+ ఆత్మగుణమ్=జయింపబడిన మాయయు, ఆ మాయా గుణములు గలవాడును, భూతేషు= సర్వప్రాణులందు, సమమ్=సమానముగా, చరంతమ్=వర్తించు, తం పరేశమ్=ఆ పరమేశ్వరుని, నమామి=నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఎవని మాయనే యొక్కడు నతిక్రమించలేడో, ఏ మాయచే వేద్యమైన ఆత్మ స్వరూపము నెఱుంగలేడో ఎవడు మాయను మాయాగుణములను లోగొన్నవాడో సర్వభూతము లందు సమానముగా వర్తించువాడెవ్వడో ఆ పరమేశ్వరునికి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ ఇమే వయం యత్ప్రియయైవ తన్వాసత్త్వేన సృష్టా బహిరన్తరావిః।**
**గతిం న సూక్ష్మామృషయశ్చ విద్మహే కుతోఽసురాద్యా ఇతరప్రధానాః॥ 31**

అర్థమగు ఆత్మ స్వరూపమును నెఱుంగదని చెప్పినదానిని విస్తరించి చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఇమే=ఈ, వయమ్=దేవతలు, ఋషయశ్చ=ఋషులగు మేము, యత్+ ప్రియయా=ఎవని ప్రియమైన, తన్వా=శరీరముచే, సత్త్వేన+ఏవ=సత్త్వగుణముచే, సృష్టాః =సృజింపబడినవారమైనను, బహిః+అంతః=వెలుపలను లోపలను, సత్త్వప్రకాశములచే, ఆవిః=ప్రకటమైన, సూక్ష్మామ్‌గతిమ్=నిరుపాధికమైన స్వరూపమును, న విద్మహే=ఎఱుంగ లేము, ఇతర ప్రధానాః=ఇతరములైన రజస్తమస్సులను గుణములు ప్రధానముగా సృజింప బడిన, అసురాద్యాః=అసురులు లోనగువారు, కుతః=ఎట్లు ఎఱుంగుదురు?

**తాత్పర్యము :** దేవతలు, ఋషులు అను మేము పరమేశ్వరుని ప్రియతనువు ద్వారా సత్త్వగుణమున సృజింపబడిన వారమయ్యు లోపలను వెలుపలను సత్త్వప్రకాశములతో స్ఫురించు నిరుపాధికమైన ఆత్మ స్వరూపమును గుర్తెఱుంగలేకున్నాము. ఇక రజస్తమోగుణ ప్రధానులై జనించిన అసురాదులెట్లు గుర్తెఱుంగుదురు.

**శ్లో॥ పాదౌ మహీయం స్వకృతైవ యస్య చతుర్విధో యత్ర హి భూతసర్గః।**
**స వై మహాపూరుష ఆత్మతన్త్రః ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః॥ 32**

ఇప్పుడిక పండ్రెండు శ్లోకములచే వైరాజరూపమును (విరాట్టును) స్తుతించుచు ప్రార్థించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యత్ర హి=ఏ మహిమయందు, భూతసర్గః=జరాయుజాది చతుర్విధములగు భూతసృష్టి గలుగుచున్నదో, ఇయం మహీ=ఈ భూమి, స్వకృతైవ=పరమేశ్వరునిచే స్వయముగా చేయబడినది, యస్య=ఎవనికి, పాదౌ=పాదములుగా యున్నదో, ఆత్మతంత్రః=ఎవడు పాపులగు జీవులతో గూడిన వాడయ్యు, వారికి లొంగియుండడో ఏలయన, బ్రహ్మ=ఎవడు బ్రహ్మమై యున్నాడో, అప్రచ్యుత రూపుడై యున్నాడో, అది ఏలయన, మహా విభూతిః



**ప్రతిపదార్థము :** అరిందమ=ఓ శత్రువులను హరించువాడా, సురాన్=వేల్పులను గూర్చి, వేధాః=బ్రహ్మ, ఇతి+ఆభాష్య=ఇట్లు సంభాషించి, అజితస్య=ఎవరి చేతను జయింపబడనివాడైన విష్ణువు యొక్క, తమసః పరమ్=ఏది క్షీరాబ్ధియందు శ్రీహరి వాసస్థానముగలదో అదియే తమసః పరము, అనగా అజ్ఞానాంధకారమునకు ఆవలిదై యున్నది, సాక్షాత్=నేరుగా, దేవైస్సహ=దేవతలతోగలసి, జగామ=వెళ్ళెను.

**తాత్పర్యము :** ఓ శత్రువులను హరించువాడా ! ఈ విధముగా బ్రహ్మ దేవతలను గురించి సంభాషించి అజితుడైన విష్ణువు యొక్క నివాసస్థానమైన క్షీరాబ్ధి; అజ్ఞానాంధకారమునకు ఆవలిదై యున్నది. దానికి దేవతలతో కలసి వెళ్ళెను.

**శ్లో॥ తత్రాదృష్టస్వరూపాయ శ్రుతపూర్వాయ వై విభో।**
**స్తుతిమబ్రూత దైవీభిర్గీర్భిస్త్వవహితేన్ద్రియః॥ 25**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ క్షీరాబ్ధియందు, బ్రహ్మ అదృష్టస్వరూపాయ=ఇంద్రియములచే చూడబడని రూపముగల, శ్రుతపూర్వాయ=మున్ను వినబడినవాని కొఱకు, విభో!=ఓ రాజా!, అవహిత+ఇంద్రియః=జాగరూకత గల ఇంద్రియములు, మనస్సుగలవాడై, దైవీభిః =వైదికములగు, గీర్భిః=వాక్కులచేత, స్తుతిమ్=స్తోత్రమును, అబ్రూత=వచించెను.

**తాత్పర్యము :** ఓ రాజా! ఆ క్షీరాబ్ధియందు దేవతలతో గూడి బ్రహ్మ నియమితచిత్తుడై ఇంద్రియ గోచరుడుగానివాడు మున్ను విన్న రూపుగలవాడును అగు భగవంతుని కొఱకు అని వేదోక్తములచే స్తోత్రము చేసెను.

**బ్రహ్మోవాచ :** బ్రహ్మ వచించెను.

**శ్లో॥ అవిక్రియం సత్యమనన్తమాద్యం గుహాశయం నిష్కళమప్రతర్క్యమ్।**
**మనోఽగ్రయానం వచసానిరుక్తం నమామహే దేవవరం వరేణ్యమ్॥ 26**

**ప్రతిపదార్థము :** దేవ=ఓ దేవా !, వరమ్=శ్రేష్ఠుడైన నిన్ను గూర్చి, నమామహే=నమస్కరించు చున్నాను లేక దేవవరం=దేవతాశ్రేష్ఠుడైన నిన్ను గురించి నమస్కరించెదము, వరత్వమునకు హేతువు, సత్యమ్=సత్యస్వరూపుడు ఏలయన, అవిక్రియమ్=వికారములు (మార్పులు) లేనివాడు, అదియు ఏల, అనంతమ్=అంతము లేనివాడు, ఆద్యమ్=ప్రథముడు, అద్యంతము గలవి మాత్రము వృద్ధిక్షయాది వికారయుక్తములగుచున్నవి మరియు గుహాశయమ్= సర్వంహరుడు హృదయగుహయందున్నవాడు, అది ఎందువలన నిష్కళమ్=నిరూపాధికుడు, అది ఎందువలన, అప్రతర్క్యమ్=ఊహింపనలవికానివాడు, అది ఎందువలన, మనస్+ అగ్రయానమ్=మనస్సుకంటె వడిగలవాడు, మనస్సు పొందదగిన స్థానమునందు మనస్సునకు బూర్వమే అచ్చట నుండువాడుగను అట్లే శ్రుతి : "అనేకజదేకం మనసో జవీయోనైన ద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్, తద్ధావతోన్యాన్" ఆ పరమాత్మ చలించనివాడు. ఒకడు మనస్సుకంటే మిక్కిలి వడిగల ఈ ఆత్మను ఇంద్రియాధిదేవతలెవ్వరు ముందు మించి పోజాలడు. వారు పరుగెత్తిపోయిన దానికంటే ముందే అక్కడ నుండుచున్నాడు. వచసా=వాక్కు చేత, అనిరుక్తమ్=విషయుడు కానందున వచింపగానివాడు. శ్రుతి : యద్వాచా - నభ్యుదితమ్ ఏది వాక్కుచేఁదెలుపుటకు గాదో ఏ ఆతనిచే వాక్కు జనించుచున్నదో ఇట్టి శ్రుతులను బట్టి మనోవాక్కులకు గోచరుడు కానందువలన అప్రతర్క్యుడు, యథేష్టముగానైనను ఎల్లవానికి హేతుహేతుమద్భావము.

**తాత్పర్యము :** ఓ దేవా! శ్రేష్ఠుడవును, సత్య స్వరూపుడవును, వికారరహితుడవును, అనంతుడవాద్యుడవు, సర్వాంతరుడవు, నిరుపాధికుడవు, ఊహింపనలవికాని వాడవు, మనస్సు కంటె వడిగలవాడవు, వాక్కుచే నిరూపింపగానివాడవగు నిన్ను గూర్చి నమస్కరించుచున్నాను.

**శ్లో॥ విపశ్చితం ప్రాణమనోధియాత్మనామర్థేన్ద్రియాభాసమనిద్రమవ్రణమ్।**
**ఛాయాతపౌ యత్ర న గృధ్రపక్షౌ తమక్షరం ఖం త్రియుగం వ్రజామహే॥ 27**

**ప్రతిపదార్థము :** ఆత్మనామ్=జీవుల యొక్క, ప్రాణమనోధియః=ప్రాణమును దేహము, అహంకారము, మనస్సు, బుద్ధిని, విపశ్చితమ్=ఎఱుంగువాడును, వీనికి వ్యతిరిక్తముగా జ్ఞేయము లేదనుచున్నాడు. అర్థ+ఇంద్రియ+ఆభాసమ్=శబ్దాది విషయములను వాని ఇంద్రియములను రెండు రూపములను భావించుచున్నవాడు, అట్లున్ననో, అనిద్రమ్=స్వప్న ద్రష్టవలె, అజ్ఞానరహితుడును, ఏలయన, అవ్రణమ్=దేహములేనివాడును కావున, అక్షరమ్= నాశరహితుడు, ఖమ్=ఆకాశము వలె వ్యాపించినవాడు, అన్నింటికీ హేతువు, యత్ర=ఎవని యందు, గృధ్రపక్షౌ=జీవపక్షపాతులైన, ఛాయా+ఆతపౌ=అవిద్య, తన్నివర్తిక విద్యయు వలె, న=లేవు, త్రియుగమ్=మూడు యుగములందు ఆవిర్భవించువాడునగు, తమ్=ఆ పరమేశ్వరుని, వ్రజామహే=శరణుపొందెదము.

**తాత్పర్యము :** జీవుల ప్రాణమనోబుద్ధులనెఱింగినవాడును, శబ్దాదులను వాని గ్రహించు నింద్రియములను, ఉభయరూపమున భాసించువాడు, స్వప్నద్రష్టవలె అజ్ఞానరహితుడును, దేహము లేనివాడును, నాశరహితుడును, ఆకాశము వలె వ్యాపించినవాడును, జీవపక్షపాతులైన అవిద్య దాని నివర్తించు విద్యయు లేనివాడును, మూడు యుగములందు ఆవిర్భవించువాడునైన ఆ విష్ణువును శరణుపొందుచున్నాము.

**శ్లో॥ అజస్య చక్రం త్వజయేర్యమాణం మనోమయం పఞ్చదశారమాశు।**
**త్రిణాభి విద్యుచ్చలమష్టనేమియదక్షమాహుస్తమృతం ప్రపద్యే॥ 28**

ఈ ప్రకారము అవిక్రియుడులోనగు విశేషణముల చేతను, సర్వజ్ఞుడులోనగువాని చేతను సత్యస్వరూపుడు వరేణ్యుడు అనియు చెప్పబడినది. సంసార చక్రమునకు ఆధారుడనియు, నా విషయమునే తెలుపుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అజస్య=జీవుని యొక్క, మనోమయమ్=మనస్సు ప్రధానముగాగలదియు, పంచదశ+అరమ్=అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు కార్యేంద్రియములు, పంచ ప్రాణములు చేరి పదునైదు ఆకులుగలదియు, ఆశు=వడిగ ఎఱుగునది, త్రిణాభిః=మూడు కుండలు గలదియు, విద్యుచ్చలమ్=మెఱుపువలె చలించునదియు, అష్టనేమి= ఎనిమిది ప్రకృతులు అంచులు (పై పట్టీలు) గలదియు, అజయా=మాయచే, ఈర్యమాణః=ప్రేరేపించ బడుచున్నది, త్రిప్పcబడుచున్నదియునగు, జీవస్య=జీవుని యొక్క, చక్రమ్=చక్రము వలె మరల మరల మఱి దిరుగుచున్న దేహాదికము, యత్+అక్షమ్=ఎవడు ఇరుసుగ గలదిగc జెప్పుదురో, తమ్=ఆ, ఋతమ్=సత్యస్వరూపుడవగు నిన్ను, ప్రపద్యే=శరణు పొందెదను.

**తాత్పర్యము :** మనస్సు ప్రధానముగ గలదై (మనోమయమై) జ్ఞానేంద్రియాదులైదు, కర్మేంద్రియములైదు, పంచప్రాణములు చేరి పదునైదు ఆకులు గలదియు (బండి చక్రమునకు



చుట్టు ఉన్న కఱ్ఱలు) మూడు నాభులుకలదియు (నాభియనగా కర్రలు చొచ్చుకొను బండికొండ) వడివడి తిరుగుచున్నదియు, మెఱుపువలె చలించునదియు భూమి, అప్పులు, అగ్ని, వాయువు, ఆకాశము, బుద్ధి, అహంకారము, మూలప్రకృతియను నెనిమిది నేములు గలదియు, (నేమియనగా అంచు. చక్రమునకు చుట్టు పైభాగమున నుండు ఇనుపపట్టా బిగించి భూమిపై నాని తిరుగు పైయంచు) మాయచే ప్రేరేపించబడుచున్నదియు త్రిప్పబడుచున్నదియునగు జీవుని యొక్క చక్రమువలె తిరుగుచున్నదై దేహాదికమను చక్రమునకు ఎవడు అక్షమై యున్నాడో ఇరుసై చక్రము తిరుగుటకు ఆధారమైన మధ్యస్థానమునcజక్రమును జొచ్చియుండునది ఆ సత్యస్వరూపుని శరణుపొందుచున్నాను.

**శ్లో॥ య ఏకవర్ణం తమసః పరం తదలోకమవ్యక్తమనన్తపారమ్।**
**ఆసాఞ్చకారోపసుపర్ణమేనముపాసతే యోగరథేన ధీరాః॥ 29**

సర్వజీవులకు నియంత అని లోనగు విశేషణములచే వరిష్ఠునిగc జెప్పుచున్నారు. యద్/త్ ఎవడు. ఉపసుపర్ణమ్=జీవుని సమీపమున నుండి ప్రేరేపించు (పక్షియై) నియంతయై యున్నాడో ద్వాసుపర్ణా స యుజౌ స ఖాయౌ సమానం వృక్షం పరిషస్వజాతే। రెండు పక్షులు మిత్రులై కూడుకొని సమానమైన వృక్షమును ఆలింగనము చేసుకొనియున్నవి (ఆశ్రయించి యున్నవి) అను శ్రుతి వలన లేక భక్తరక్షణము కొఱకు గరుడుని మీద కూర్చున్నవాడని యర్థము. దేహస్థుడైనందునను భక్తులను రక్షించు కార్యమునుపదేశించుట వలనను జీవునితో సామ్యము గలుగుచున్నదో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఏకవర్ణమ్=జ్ఞానైక స్వరూపుడు, తమసః పరమ్=ప్రకృతికి పరుడును, అలోకమ్=అదృశ్యుడు, అవ్యక్తమ్=నిర్వికల్పుడు, అనంతపారమ్=కాలము వలనను, దేశము వలనను, పరిచ్ఛిన్నుడునయినది గదా ! ఆ బ్రహ్మమిట్లు అప్రచ్యుత స్వరూపము గలదగుట వలన జీవసామ్యమును బొందదు. శ్రుతి : తయోరన్యః పిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి.

ఆ రెండు పక్షులలో ఒకటి ఆ వృక్షము యొక్క మధుర ఫలములను భుజించుచున్నది. రెండవదేఫలమును భుజించక మిన్నక చూచుచున్నది అని విశేషము విననగుచున్నది. కాబట్టి ఏనమ్=ఇట్టి యే పరమేశ్వరుని, ధీరాః=పండితులు, యత్=ఎవనిని, యోగరథేన=ప్రాప్తి సాధనమైన యోగమను రథముచే, ఉపాసతే=భజించుచున్నారో, ఆ దేవునికి నమస్కరింతునని పైకి అన్వయము.

**తాత్పర్యము :** ఎవడు పక్షిరూపముననున్న జీవుని చెంత రెండవ పక్షిరూపమున భాసించుచున్నాడో లేక గరుత్మంతునిపై గూర్చుండి భక్తుల రక్షింప సిద్ధుడైయున్నాడో ఎవడు ప్రకృతిపరుడో అదృశ్యుడు, నిర్వికల్పుడు, దేశకాలాపరిచ్ఛిన్నుడై యున్నాడో, ఎవడు బ్రహ్మమై ప్రచ్యుతి గాంచని స్వరూపమునున్నాడో, ఎవని యోగులు యోగమను మనోరథము ద్వారా భజించు చున్నారో ఆ పరమేశ్వరునికి నమస్కరించెదను.

**శ్లో॥ న యస్య కశ్చాతితితర్తి మాయాం యయా జనో ముహ్యతి వేదనార్థమ్।**
**తం నిర్జితాత్మాత్మగుణం పరేశం నమామి భూతేషు సమం చరన్తమ్॥ 30**

**ప్రతిపదార్థము :** వక్షసః=ఎవని యొక్క వక్షము నుండి, శ్రీః=లక్ష్మియు, ఛాయయా=నీడచే, పితరశ్చ=పితృదేవతలును, ఆసన్=అయిరో (అయ్యారో), స్తనాత్=స్తనము వలన, ధర్మః =ధర్ముడు, పృష్ఠతః=వీపునుండి, ఇతరః=ఇతరుడైన అధర్ముడును, అభూత్=కలిగెనో, శీర్ష్ణః =శిరస్సు నుండి, ద్యౌః=స్వర్గము, విహారాత్/హాసాత్=నవ్వు నుండి, అప్సరసః అపి= అప్సరసలును అయిరో, సః మహావిభూతిః=ఆ దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు, నః ప్రసీదతామ్=మాకు ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** ఎవని వక్షము నుండి లక్ష్మి, నీడనుండి పితృదేవతలుద్భవించిరో, ఎవని స్తనము నుండి ధర్ముడు, వీపునుండి అధర్ముడును, శిరస్సు నుండి స్వర్గమును, హాసము నుండి అప్సరసలును గలిగిరో, ఆ దొడ్డ యైశ్వర్యము గల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ విప్రో ముఖం బ్రహ్మ చ యస్య గుహ్యం రాజన్య ఆసీద్ భుజయోర్బలఞ్చ।**
**ఊర్వోర్విడోజోఽఙ్ఘ్రిరవేదశూద్రౌ ప్రసీదతాం నః స మహావిభూతిః॥** 41

విడం ఘ్రోరభవంశ్చ శూద్రాః అని పాఠాంతరము.

**ప్రతిపదార్థము :** యస్య=ఎవని యొక్క, ముఖాత్=ముఖము నుండి, విప్రః=బ్రాహ్మణుడు, గుహ్యమ్=రహస్యమైన, బ్రహ్మ చ=వేదమును, భుజయోః=భుజములందు, రాజన్యః=రాజు, బలం చ=అతని ముఖ్యమైన బలమును, ఊర్వోః=తొడలనుండి, విట్=వైశ్యుడును, ఓజః =అతని వృత్తియైన నైపుణ్యమును, అంఘ్రిః=పాదము వలన, అవేదశూద్రౌ=వేదవ్యతిరిక్తమైన శుశ్రూష యను వృత్తియు, శూద్రుడును జనించిరో, సః=ఆ, మహావిభూతిః=దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్=ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** ఎవని ముఖము నుండి విప్రుడును, అతనికి ముఖ్యమగు రహస్యమైన వేదమును, భుజములనుండి క్షత్రియుడు, అతనికి ముఖ్యమగు బలమును, ఊరువుల నుండి వైశ్యుడును వానికి ముఖ్యమగు నైపుణ్యమును, పాదముల నుండి శూద్రుడు వేదవ్యతిరిక్తమైన వాని వృత్తియు జనించెనో ఆ దొడ్డయైశ్వర్యము గల పురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ లోభోఽధరాత్ ప్రీతిరుపర్యభూద్ ద్యుతిర్నస్తః పశవ్యః స్పర్శేన కామః।**
**భ్రువోర్యమః పక్ష్మభవస్తు కాలః ప్రసీదతాం నః స మహావిభూతిః॥** 42

**ప్రతిపదార్థము :** అధరాత్=ఎవని క్రింద పెదవి నుండి, లోభః=లోభమును, ఉపరి=పై పెదవి నుండి, ప్రీతిః=సంతోషమును, అభూత్=కలిగెనో, నస్తః=నాసిక నుండి, ద్యుతిః =కాంతియు, స్పర్శేన=స్పర్శముచే, పశవ్యః=పశువులకు హితమైన, కామః=కామమును, భ్రువోః=కనుబొమలయందు, యమః=యముడును, పక్ష్మభవః తు=పార్శ్వముల నుండి పుట్టినది, కాలః=కాలమో, సః=ఆ, మహా విభూతిః=దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్=ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** ఎవని క్రింది పెదవి నుండి లోభమును, పై పెదవి నుండి సంతోషమును, నాసిక నుండి కాంతియు, స్పర్శము నుండి పశువులకు హితమైన కామమును జనించెనో ఆ దొడ్డ యైశ్వర్యము గల మహా పురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!



=ఎవడు దొడ్డ ఐశ్వర్యముగలవాడో, సః=అతడు, వై=నిజముగా, మహాపూరుషః=మహా పురుషుడు, విరాట్స్వరూపుడు, మే=నాకు, ప్రసీదతామ్=అనుగ్రహించువాడగు గాక!

**తాత్పర్యము :** ఏ భూమియందు జరాయుజము లోనగు చతుర్విధములగు భూతజాలము పుట్టువుగాంచుచున్నదో అట్టి ఈ భూమి యెవనికి పాదములుగా నేర్పడియున్నదో, ఎవడు జీవులతో గూడినను వారి పాపపుణ్యములంటవో స్వతంత్రుడై యున్నాడో, ఎవడు బ్రహ్మమై అప్రచ్యుత స్వరూపుడైయున్నాడో ఎవని యైశ్వర్యము మిక్కిలి గొప్పదో ఆ మహాపురుషుడు విరాట్స్వరూపుడు నన్ను అనుగ్రహించు గాక!

**శ్లో॥ అమ్భస్తు యద్రేత ఉదారవీర్యం సిధ్యన్తి జీవన్త్యుత వర్ధమానాః।**
**లోకాస్త్రయోఽథాఖిలలోకపాలాః ప్రసీదతాం బ్రహ్మ మహావిభూతిః॥** 33

**ప్రతిపదార్థము :** ఉదారవీర్యమ్=అత్యధిక శక్తిగలదైన, అంభఃతు=జలములు సైతము, యత్+రేతః=ఎవని వీర్యమై యున్నదో, ఉత=మఱియు ఏ జలము వలన, త్రయఃలోకాః =స్వర్గమర్త్య పాతాళములను ముల్లోకములు, అథ=ఇంకను, అఖిలలోకపాలాః=సర్వలోక పాలురు, దిక్పాలురు, సిధ్యంతి=జన్మించుచున్నారో, వర్ధమానాః=వృద్ధిగాంచుచున్నవారై, జీవంతి=జీవించుచున్నారో, సః=ఆ, బ్రహ్మ=బ్రహ్మస్వరూపుడు, మహావిభూతిః=గొప్ప ఐశ్వర్యముగల విరాట్స్వరూపుడు, నః ప్రసీదతామ్=మాకనుగ్రాహకుడగు గాక!

**తాత్పర్యము :** అత్యధిక శక్తిగల జలములు సైతము ఎవని వీర్యమయి యున్నవో, ఏ వీర్యమగు జలముల వలన ముల్లోకములు ఎల్లలోకపాలురు జన్మించుచున్నారో పెరుగుచు జీవించుచున్నారో ఆ గొప్ప యైశ్వర్యము గల మహాపురుషుడు విరాట్పురుషుడు మమ్మనుగ్రహించువాడగు గాక!

**శ్లో॥ సోమం మనో యస్య సమామనన్తి దివౌకసాం వై బలమన్ధ ఆయుః।**
**ఈశో నగానాం ప్రజనః ప్రజానాం ప్రసీదతాం నః స మహావిభూతిః॥** 34

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, సోమః=సోముడు, దివౌకసామ్=దేవతలకు, అంధః=అన్నము గనుక, బలం ఆయుః=బలము ఆయువునై యున్నాడో, ఈశః=ఎవడోషధీశ్వరుడై, నగానామ్= వృక్షములకును, ప్రజానామ్=ప్రజలకును, ప్రజనః=వృద్ధిని కలిగించువాడు, అట్టి సోముడు, యస్య=ఎవనికి, మనః=మనస్సై యున్నాడో, సః (బ్రహ్మ)=ఆ బ్రహ్మపై యున్న, మహా విభూతిః=దొడ్డ ఐశ్వర్యము గల విరాడ్రూపుడైన పురుషుడు, నః ప్రసీదతామ్=మమ్ము అనుగ్రహించు గాక.

**తాత్పర్యము :** దేవతలకు అన్నము అయి బలమును, ఆయువును గలిగించువాడును, ఓషధీశుడై వృక్షములను ప్రజలనుఁబెంచువాడునైన చంద్రుడెవ్వనికి మనస్సైయున్నాడో బ్రహ్మమైన దొడ్డయైశ్వర్యముగల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ అగ్నిర్ముఖం యస్య తు జాతవేదా జాతః క్రియాకాణ్డనిమిత్తజన్మా।**
**అన్తః సముద్రేఽనుపచన్ స్వధాతూన్ ప్రసీదతాం నః స మహావిభూతిః॥** 35

**ప్రతిపదార్థము :** యస్య=ఏ పరమేశ్వరునికి, అగ్నిః=అగ్ని, ముఖమ్=ముఖమై పుట్టినాడో,

జాతవేదాః=ఎవడు వేదములనెఱింగినవాడైన లేక ధనాదిసంపదను గలిగించువాడో, క్రియాకాండ నిమిత్తజన్మా=వేదపూర్వభాగము కర్మకాండను, నిర్వర్తించుట కారణమై సాధనమైన జన్మము గలవాడు ఎవడో, అంతః సముద్రే చ=ఉదర మధ్యమునందు (గర్భము లోపల సముద్రము గలవాడో), స్వధాతూన్= పాకార్హములైన అన్నాదులను, పచన్=జీర్ణింపజేయు చున్నాడో, మఱి ప్రసిద్ధమగు సముద్ర మధ్యమునందు బడబానల రూపమున ఉదకములను పచనము చేయుచున్నాడో, సః=ఆ యగ్నిముఖుడై, మహావిభూతిః=దొడ్డ యైశ్వర్యము గల విరాట్పురుషుడు, ప్రసీదతామ్=మాకు ప్రసన్నుడగుగాక!

వేదములన్నింటినెఱింగినవాడును, ధనసంపదను గలిగించువాడు, వేదోక్తమైన కర్మకాండ నిమిత్తము జనించినవాడును, ప్రాణులు భుజించినవై పాకార్హములైన అన్నాదులను ఉదరమధ్యమున నుండి జీర్ణింపజేయువాడు ప్రసిద్ధమైన సముద్ర మధ్యమున బడబాగ్ని రూపమున నుండి ఉదకములను బచనము చేయువాడునగు అగ్నియెవనికి ముఖమై యున్నాడో ఆ దొడ్డయైశ్వర్యము గల విరాట్పురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ యచ్చక్షురాసీత్ తరణిర్దేవయానం త్రయీమయో బ్రహ్మణ ఏష ధిష్ణ్యమ్।**
**ద్వారం చ ముక్తేరమృతం చ మృత్యుః ప్రసీదతాం నః స మహావిభూతిః॥ 36**

**ప్రతిపదార్థము :** దేవయానమ్=ఎవడు అర్చిరాది మార్గదేవతయో, త్రయీమయః=వేద స్వరూపుడో, శ్రుతి : సైషాత్రయ్యేవ విద్యాతప... ఈ వేదము నుండి విద్యాస్వరూపి లోకమును ధరింపజేయుము. బ్రహ్మణః=బ్రహ్మమునకు, ధిష్ణ్యమ్=ఉపాసనాస్థానమో, "యఏషో - న్తరాదిత్యే హిరణ్మయః పురుషః" అని శ్రుతి. ఎవడు ఆదిత్యునందు హిరణ్మయపురుషుడై యున్నాడో, ముక్తేః ద్వారమ్=దేవయానమైనందున ముక్తికి ద్వారమైయున్నవాడో, అమృతమ్= పుణ్యలోకమైనందున అమృతమును స్వర్గమునకు, మృత్యోః=కాల స్వరూపుడగుట వలన మృత్యువునకు, ద్వారమ్=ద్వారమై యున్నాడో, ఏషః తరణిః=అట్టి యీ సూర్యుడు, యత్+చక్షుః=ఎవనికి చక్షువై యున్నాడో, మహా విభూతిః=దొడ్డ ఐశ్వర్యముగల, సః=ఆ విరాట్పురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్=ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** ఎవడు సగుణ బ్రహ్మోపాసనములు సత్యలోకమునకు బోవునదైన అర్చిరాది మార్గమునకు దేవతయై యున్నాడో, వేదస్వరూపుడో, బ్రహ్మమునకు ఉపాసనాస్థానమో, దేవయానమగుట వలన ముక్తికిని, పుణ్యలోకుడగుట వలన అమృతమును స్వర్గమునకును, కాలస్వరూపుడగుట వలన మృత్యువునకును ద్వారమైయున్నాడో అట్టి యీ రవి యెవనికి చక్షువైయున్నాడో, దొడ్డ యైశ్వర్యము గల ఆ మహాపురుషుడు మాకు బ్రసన్నుడగుగాక !

**శ్లో॥ ప్రాణాదభూద్యస్య చరాచరాణామ్ప్రాణః సహో బల మోజశ్చ వాయుః।**
**అన్వాస్మ సమ్రాజమివానుగా వయమ్ప్రసీదతాం నః స మహావిభూతిః॥ 37**

**ప్రతిపదార్థము :** ఎవడు చర+అచరాణామ్=జంగమ స్థావర ప్రాణులకెల్ల, ప్రాణః=ఎవడు ఆది ధర్మము గలిగి పంచవృత్త్యాత్మమగు ప్రాణమో, సహః=మనోబలము, బలమ్=దేహ బలము, ఓజశ్చ=ఇంద్రియబలమో, యమ్=ఎవని, వయమ్=బుద్ధి నింద్రియములను అధిష్ఠించిన వారమైన మేము, సమ్రాజమ్=చక్రవర్తిని, అనుగాః+ఇవ=భృత్యుల వలె, అన్వాస్మ= అనుసరించి నిల్చి యుందుమో, వాయుః=ఆ వాయువు, యస్య=ఎవని యొక్క, ప్రాణాత్= ప్రాణము వలన, అభూత్=కలుగుచున్నదో, సః మహావిభూతిః=ఆ దొడ్డ ఐశ్వర్యము గల మహా పురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్=ప్రసన్నుడగుగాక!



**తాత్పర్యము :** ఎవడు స్థావర జంగములగు సర్వప్రాణులకు ఆదిధర్మమును, జీవనమును ప్రాణాపానాది వ్యవహారమును గలిగించు పంచప్రాణ స్వరూపుడై యున్నాడో, ఎవడు ప్రాణులకు మనోదేహేంద్రియముల బలమొసగువాడో, ఎవనిని ఇంద్రియాధిదేవతలమైన మేము చక్రవర్తిని భృత్యులవలె అనుసరించి నిల్చియుందుమో అట్టివాయువెవని ప్రాణము వలన కలిగెనో ఆ దొడ్డయైశ్వర్యముగల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగుగాక!

**శ్లో॥ శ్రోత్రాద్ దిశో యస్య హృదశ్చ ఖాని ప్రజజ్ఞిరే ఖం పురుషస్య నాభ్యాః।**
**ప్రాణేన్ద్రియాత్మాసుశరీరకేతః ప్రసీదతాం నః స మహావిభూతిః॥ 38**

**ప్రతిపదార్థము :** యస్య=ఏ, పురుషస్య=పురుషుని యొక్క, శ్రోత్రాత్=శ్రోత్రము నుండి, దిశః=దిక్కులు, హృదః=హృదయము నుండి, ఖాని=దేహగత ఛిద్రములైన ఇంద్రియములు, నాభ్యాః=బొడ్డు నుండి, ఖమ్=ఆకాశము, ప్రజజ్ఞిరే=జనించినవో, ఎవడు, ప్రాణ+ఇంద్రియ+ ఆత్మ+అసు శరీరకేతః=పంచ ప్రాణములకు, ఇంద్రియములకు, మనస్సునకు, నాగ కూర్మాదులకు, ఉపవాయువులకు, శరీరమునకు ఆశ్రయమై యున్నాడో, సః=ఆ, మహావిభూతిః =దొడ్డ ఐశ్వర్యము గల మహాపురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్=ప్రసన్నుడు అగుగాక!

**తాత్పర్యము :** ఏ పురుషుని యొక్క వీనుల వలన దిక్కులు, హృదయము వలన ఇంద్రియములు, నాభి వలన ఆకాశము జనించినవో, ఎవడు పంచప్రాణములకు ఇంద్రియము లకు మనస్సునకు నాగకూర్మాదులగు ఉపవాయువులకు దేహమునకు ఆశ్రయమై యున్నాడో ఆ దొడ్డ ఐశ్వర్యము గల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగుగాక!

**శ్లో॥ బలాన్మహేన్ద్రస్త్రిదశాః ప్రసాదాన్మన్యోర్గిరీశో ధిషణాద్ విరిఞ్చః।**
**ఖేభ్యశ్చ ఛన్దాంస్యృషయో మేఢ్రతః కః ప్రసీదతాం నః స మహావిభూతిః॥ 39**

**ప్రతిపదార్థము :** బలాత్=ఎవని బలము వలన, మహేంద్రః=దేవేంద్రుడు, జజ్ఞే=జనించెనో, ప్రసాదాత్=అనుగ్రహము వలన, త్రిదశాః=దేవతలు, మన్యోః=కోపము వలన, గిరీశః=శివుడు, ధిషణా=బుద్ధి వలన, విరించః=బ్రహ్మయు, ఖేభ్యఃతు=ఇంద్రియముల వలన, ఛందాంసి ఋషయః=శ్రుతులు, ఋషులు, మేఢ్రతః=శిశ్నము నుండి, కః=ప్రజాపతియు జనించిరో, సః=ఆ, మహావిభూతిః=దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు, నః ప్రసీదతామ్=మాకు ప్రసన్నుడగుగాక!

**తాత్పర్యము :** ఎవని బలము వలన దేవేంద్రుడు, అనుగ్రహము వలన దేవతలు, కోపమున శివుడు, బుద్ధి బ్రహ్మ, ఇంద్రియముల వలన శ్రుతులు, ఋషులు, శిశ్నము వలన ప్రజాపతి జనించిరో ఆ దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ శ్రీర్వక్షసః పితరశ్ఛాయయాసన్ ధర్మః స్తనాదితరః పృష్ఠతోఽభూత్।**
**ద్యౌర్యస్య శీర్ష్ణోఽప్సరసో విహారాత్/హాసాత్ ప్రసీదతాం నః స మహావిభూతిః॥40**

## షష్ఠోஉ ధ్యాయః

ఈ అధ్యాయమందు విష్ణువు సాక్షాత్కరింప సురలు స్తుతించుట, వారి మంత్రాలోచనము, అసురులతో గూడి అమృతము కొఱకు గొప్ప ప్రయత్నము వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం స్తుతః సురగణైర్భగవాన్ హరిరీశ్వరః।**
**తేషామావిరభూద్ రాజన్ సహస్రార్కోదయద్యుతిః॥ 1**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, ఏవమ్=ఈ ప్రకారము, సురగణైః=వేల్పుల మూకలచేత, స్తుతః=స్తుతింపబడిన, భగవాన్ హరిః ఈశ్వరః=భగవంతుడు, హరి, ఈశ్వరుడు, తేషామ్=ఆ దేవతలకు (ముందు), సహస్ర+అర్క+ఉదయద్యుతిః=వేయి సూర్యుల యుదయమునందలి కాంతివంటి కాంతిగలవాడై, ఆవిరభూత్=ప్రత్యక్షమయ్యెను.

**తాత్పర్యము :** ఇట్లు సురగణములు తన్నుఁబ్రార్థింపగా భగవానుడు హరి ఈశ్వరుడు వేయి సూర్యులయుదయకాంతివంటి కాంతిగలవాడై ఆ వేల్పులముందు ప్రత్యక్షమయ్యెను.

**శ్లో॥ తేనైవ మహసా సర్వే దేవాః ప్రతిహతేక్షణాః।**
**నాపశ్యన్ ఖం దిశః క్షోణిమాత్మానఞ్చ కుతో విభుమ్॥ 2**

**ప్రతిపదార్థము :** తేన=ఆ విష్ణువు యొక్క, మహసా ఏవ=తేజము చేతనే, సర్వే దేవాః=ఎల్ల దేవతలు, ప్రతిహత+ఈక్షణాః=కొట్టబడిన కన్నులుగలవారై, ఖమ్=ఆకాశమును, దిశః =దిక్కులను, క్షోణిమ్=భూమిని, ఆత్మానమ్=తమ్మును, న+అపశ్యన్=చూడలేకపోయిరి, కుతః విభుమ్=ఇఁకను ఆ ప్రభువును చూచుట ఎక్కడ ?

**తాత్పర్యము :** ఆ విష్ణుమూర్తి తేజమున దేవతల కన్నులు చూపులు వృథాకాగా వారు ఆకాశమును, దిక్కులను, భూమిని, తమ్మును జూడలేకుండిరి. ఇంకను ఆ పరమేశ్వరుని జూడకపోవుటలో వింత ఏమి ?

**శ్లో॥ విరిఞ్చో భగవాన్ దృష్ట్వా సహ శర్వేణ తాం తనుమ్।**
**స్వచ్ఛాం మరకతశ్యామాం కఞ్జగర్భారుణేక్షణామ్॥ 3**

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవానుడైన, విరించః=బ్రహ్మ, శర్వేణ సహ=శివునితో గూడి, స్వచ్ఛామ్=నిర్మలమై, మరకతశ్యామామ్=గరుడ పచ్చల పసరు ఛాయగలదై, కంజగర్భ+ అరుణ+ఈక్షణామ్=కమలము లోపలి భాగములోని యెఱ్ఱదనముగల కన్నులు గల, తామ్=ఆ పరమేశ్వరుని, తనుమ్=శరీరమును, దృష్ట్వా=చూచి, స్తుతించెను అని పైకి అన్వయము.

**తాత్పర్యము :** భగవానుడు బ్రహ్మ, శివునితో గూడి స్వచ్ఛమైన మరకతమణులవలె పచ్చనిదై తామరల లోపలి యెఱ్ఱదనము గల గన్నులుగలదైన ఆ విష్ణుదేహమును గాంచెను.

**శ్లో॥ తప్తహేమావదాతేన లసత్కౌశేయవాససా।**
**ప్రసన్నచారుసర్వాఙ్గీం సుముఖీం సున్దరభ్రువమ్॥ 4**

**ప్రతిపదార్థము :** తప్తహేమ+అవదాతేన=పుటము వేయబడి బంగారువలె పసుపువన్నె గలదై,



**శ్లో॥ ద్రవ్యం వయః కర్మగుణాన్విశేషం యద్యోగమాయావిహితాన్ వదన్తి।**
**యద్దుర్విభావ్యం ప్రబుధావబోధం ప్రసీదతాం నః స మహావిభూతిః॥ 43**

**ప్రతిపదార్థము :** ద్రవ్యమ్=పంచమహాభూతములు, వయః=కాలము, కర్మ=పుణ్య పాపకర్మలు, గుణాన్ విశేషమ్=గుణములు, భౌతిక ప్రపంచమును, యత్+యోగమాయా విహితాన్=ఎవని యోగమాయచే సృజించబడినవని, వదంతి=వచింతురో, యత్=ఏది, దుర్విభావ్యమ్=ఇట్టిదని భావింప శక్యముగాదో ఏలయన ప్రబుధ+అవబోధమ్=విద్వాంసులకు, అపోహ్యమానమో, ప్రబుధావబోధమ్=(పాఠాంతరము) విద్వాంసులకు మాయయను జ్ఞానము కలదగునో, సః =ఆ, మహావిభూతిః=దొడ్డ యైశ్వర్యము గల మహా పురుషుడు, నః=మాకు, ప్రసీదతామ్= ప్రసన్నుడగు గాక!

**తాత్పర్యము :** పంచ మహాభూతములు, కాలము, కర్మలు, సత్త్వాది గుణములు భౌతిక ప్రపంచము ఎవని మాయవలన సంభవించుచున్నవని పెద్దలు చెప్పుచున్నారో, ఏ యోగమాయ బ్రహ్మము భావింపశక్యముగాదో, ఏది పండితులకు మాయయని తెలియనగునో ఆ దొడ్డయైశ్వర్యము గల మహాపురుషుడు మాకు ప్రసన్నుడగు గాక!

**శ్లో॥ నమోஉస్తు తస్మై ఉపశాన్తశక్తయే స్వారాజ్యలాభప్రతిపూరితాత్మనే।**
**గుణేషు మాయారచితేషు వృత్తిభిర్న సజ్జమానాయ నభస్వదూతయే॥ 44**

ఈ ప్రకారము ప్రపంచమును స్థూలమగు విరాట్స్వరూపమును వర్ణించి నిష్ప్రపంచము సూక్ష్మస్వరూపమును వర్ణించుచు ప్రణమిల్లుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఉపశాంతశక్తయే=ఉపశమిల్లిన/మించిన మాయాశక్తిగలవాడు, స్వారాజ్య లాభప్రతిపూరితాత్మనే=స్వయంప్రకాశమైన ఆనందముతో నిండుకొన్న స్వరూపము గలవాడును, మాయారచితేషు=మాయచే నిర్మితములైన, గుణేషు=శీలాది గుణములందు, వృత్తిభిః= దర్శనాది వృత్తులచేత,న సజ్జమానాయ=ఆసక్తుడు కానివాడును,నభస్వత్+ఊతయే=వాయువు లీలవలె లీలగలవాడును అగు,తస్మై=ఆ పరమేశ్వరునికి,నమః అస్తు=నమస్కారము అగుగాక!

**తాత్పర్యము :** ఎవడు మాయావిద్యల కార్యములగు ఆవరణ విక్షేప శక్తులనంటనివాడో, ఎవడు స్వయంప్రకాశుడై, ఆనందపూర్ణుడై, ఆత్మస్వరూపుడై వెలుగొందువాడో, ఎవడు మాయచే సృజించిన శబ్దాదిగుణములందు చూచుట, వినుటలోనగు ఇంద్రియ వృత్తులందు ఆసక్తుడు గానివాడో, ఎవడు వాయువువలె లీలగాఁబ్రవర్తించువాడో ఆ పరమేశ్వరునికి నమస్కారము చేయుచున్నాను.

**శ్లో॥ స త్వం నో దర్శయాత్మానమస్మత్కరణగోచరమ్।**
**ప్రపన్నానాం దిదృక్షూణాం సస్మితం తే ముఖామ్బుజమ్॥ 45**

**ప్రతిపదార్థము :** సః త్వమ్=ఆ నీవు, ప్రపన్నానామ్=శరణుపొందినట్టి, దిదృక్షూణామ్= చూడగోరిన, నః=మాకు, సస్మితమ్=చిరునగవుతో గూడిన, తే=నీయొక్క, ముఖ+అంబుజమ్= ముఖ కమలము, అస్మత్+కరణగోచరమ్=మా చక్షురింద్రియమునకు గన్పట్టునట్లు, ఆత్మానమ్ =నీ స్వరూపమును, దర్శయ=చూపుము.

**తాత్పర్యము :** అట్టి నీవు ప్రపన్నులమై చూడగోరిన మాకు చిరునగవుతో గూడిన నీ ముఖము మా చక్షురింద్రియమునకు గోచరించునట్లు నీ స్వరూపమును గన్పఱుపుము.

**శ్లో॥ తైస్తైః స్వేచ్ఛాధృతై రూపైః కాలే కాలే స్వయం విభో।**
**కర్మ దుర్విషహం యన్నో భగవాంస్తత్ కరోతి హి॥ 46**

భక్తుల ఇచ్ఛానువర్తివై యుందువు నీవు అనుట పెక్కుమారులు తెలుసుకొని యున్నాము.

**ప్రతిపదార్థము :** విభో!=ఓ జగత్ప్రభూ!, కాలే కాలే=ప్రతియుగము నందును, స్వయమ్=స్వయముగా, తైఃతైః=ఆయా కాలానుగుణ్యములైన, స్వేచ్ఛాధృతైః=స్వయమగునిచ్ఛచే ధరించిన, రూపైః=రూపముల చేత, యత్=ఏది, నః=మా యొక్క, దుర్విషహమ్=అశక్యమైన, కర్మ=కర్మ గలదో, తత్=దానిని, భవాన్ వై=నీవే, కరోతి హి=చేయుచుందువు గదా!

**తాత్పర్యము :** ఓ లోకేశ్వరా! ప్రతి యుగమునందు నీవే స్వయముగా ఆయా కాలానుగుణ్యములైన నీ ఇచ్ఛవచ్చిన రూపములనవతరించి అశక్యమైన మా కార్యమేది గలదో దానిని నీవే చేయుచుందువు గదా!

**శ్లో॥ క్లేశభూర్యల్పసారాణి కర్మాణి విఫలాని వా।**
**దేహినాం విషయార్తానాం న తథైవార్పితం త్వయి॥ 47**

అంతర్ముఖులుగాక కేవలం బహిర్ముఖులవలె నీ భక్తులైన మాకు నీయందు సమర్పింపబడిన పూర్వపుణ్యములు విపరీతఫలములిచ్చునవనుచున్నాడు.

**ప్రతిపదార్థము :** విషయార్తానామ్=సకాములైన, దేహినామ్=జీవుల యొక్క, క్లేశభూరి+అల్పసారాణి=క్లేశమధికము ఫలము స్వల్పము గల, కర్మాణి=కర్మలు, విఫలాని హి=ప్రయోజనమంతములుగావు. త్వయి=నీయందు, అర్పితమ్=సమర్పితమై చేయబడిన కర్మ, న తథా ఏవ=ఆ ప్రకారము విఫలము గాదు.

**తాత్పర్యము :** ఫలమును గోరి గావించువారల కర్మలు క్లేశమధికమును ఫలము అల్పమును గలవై తుదకు నిష్ప్రయోజనములగుచున్నవి. అట్లుగాక నీయందు సమర్పితములైన కర్మలు అట్లు కావు. అనగా మహాఫలమిచ్చునవగునని భావము.

**శ్లో॥ నావమః కర్మకల్పోఽపి విఫలాయేశ్వరార్పితః।**
**కల్పతే పురుషస్యైష స హ్యాత్మా దయితో హితః॥ 48**

ఆ కర్మ వైఫల్యముగాదని ప్రతిపాదించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఆవమః అపి=స్వల్పమైనదైనను, కర్మకల్పః=కర్మాభాసము, కర్మవలె కన్పట్టునది కాని నిజమైన కర్మకానిది, ఈశ్వర+అర్పితః=పరమేశ్వరునకు అర్పితమైనది, విఫలాయ=విఫలము కొఱకు, న కల్పతే=సమర్థము గాదు, హి=ఏలయనగా, సః ఏషః=ఆ యీశ్వరుడు, పురుషస్య=పురుషునికి, ఆత్మా=ఆత్మయై యున్నాడు, అత ఏవ=అందువలననే, దయితః=ప్రియుడు, హితః=హితుడైయున్నాడు, దయితుడై హితుడైన ఆత్మయందు సమర్పితమైన నిష్ఫలము గాదు.



**తాత్పర్యము :** ఉబుసుపోకకు లేక పరిహాసమునకు (పిల్లలు బొమ్మరిల్లు కట్టుకొని యాడినట్లు) చేయబడిన స్వల్పమైన కర్మయైన ఈశ్వరునందు సమర్పితమగునేని యది విఫలముగాదు. ఏలయన ఆ యీశ్వరుడు పురుషునికి ఆత్మయై, ప్రియుడై, హితుడై యున్నాడు. ఇట్టివాని యందు సమర్పితమైన కర్మ యెన్నటికి నిష్ఫలము గాదు.

**శ్లో॥ యథా హి స్కంధశాఖానాం తరోర్మూలావసేచనమ్।**
**ఏవమారాధనం విష్ణోః సర్వేషామాత్మనశ్చ హి॥ 49**

అనంతఫలత్వమును చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యథా=ఏ ప్రకారము, తరోః=వృక్షము యొక్క, మూల+అవసేచనమ్=మొదలునందు జలమును పోయుట, స్కంధశాఖానామ్=మొదలు పెద్ద కొమ్మలకు చిన్న కొమ్మలకును ప్రయోజనమగునో, ఏవమ్=ఇట్లే, ఆత్మనః=పరమాత్మయగు, విష్ణోః=విష్ణువు యొక్క, ఆరాధనమ్=పూజాధికము, సర్వేషామ్=ఎల్ల దేవతలకు ప్రీతికరమగును.

**తాత్పర్యము :** తరువునకు మొదలునందు జలములు పోసినచో పెద్ద చిన్న కొమ్మలకు ఎట్లు దోహదమగునో అట్లే పరమాత్మయగు విష్ణువుయొక్క ఆరాధనము ఎల్ల దేవతలకు తృప్తికరమగుచున్నది.

**శ్లో॥ నమస్తుభ్యమనన్తాయ దుర్వితర్క్యాత్మకర్మణే।**
**నిర్గుణాయ గుణేశాయ సత్త్వస్థాయ చ సామ్ప్రతమ్॥ 50**

**ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కంధే పంచమోఽధ్యాయః**

ఇట్లున్నను నీయందు సమర్పించిన కర్మలుగలవారమై నీ భక్తులమైన మాకు ఈ దుఃఖము ఏ నిమిత్తము వచ్చినదో దానిని నీవు మాత్రమే ఎఱుంగుదువు అను ఆశయమునఁ జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అనంతాయ=నాశములేనివాడవును, దుర్వితర్క్య+ఆత్మకర్మణే=ఊహింప శక్యము గాని స్వభావ చేష్టలుగలవాడవును, నిర్గుణాయ=నిర్గుణుడు, గుణేశాయ=మాయాది గుణములకు ప్రభువు, సత్త్వస్థాయ=సత్త్వగుణమున నొప్పారువాడును అగు, తుభ్యమ్=నీ కొఱకు, సాంప్రతమ్=ఇప్పుడు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** అనంతుడు, దురూహ్యామైన స్వభావ చేష్టలుగలవాడు, నిర్గుణుడు, సత్త్వగుణమునఁప్రకాశించువాడు, మాయాది గుణములకు అధీనుడునగు నీకిప్పుడు నమస్కారము చేయుచున్నాను.

ఇది శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధమున పంచమాధ్యాయము.

**శ్లో॥ యథాగ్నిమేధస్యమృతం చ గోషు భువ్యన్నమమ్బూద్యమనే న వృత్తిమ్।**
**యోగైర్మనుష్యా అధియన్తి హి త్వాం గుణేషు బుద్ధ్యా కవయో వదన్తి॥ 12**

**ప్రతిపదార్థము :** యథా=ఏ ప్రకారము, ఏధసి=దారువునందు, అగ్నిమ్=మంథనము చేత అగ్నిని, గోషు=గోవులయందు దోహనాదులచే, అమృతమ్=ఆజ్యమును, భువి=భూమి యందు, అన్నమ్=దున్నుట చల్లుట వాని ద్వారా ఫలించిన ధాన్యము ద్వారా అన్నమును, అంబు=భూమిని త్రవ్వుట ద్వారా జలమును, ఉద్యమనేన=పురుషకారమగు వాణిజ్యాదికముచే, వృత్తిమ్=జీవికను లేక, ఉద్యమనేన=ఘట యంత్రాదులచే నుద్ధరించుట ద్వారా, అంబు= జలమును పొందుచున్నారు. అట్లే మనుష్యాః=మానవులు, యోగైః=చిత్తవృత్తినిరోధమగు యోగసాధనల చేతను, త్వామ్=నిన్ను, అధియంతి=పొందుచున్నారు. అట్లే, కవయః=జ్ఞానులు, త్వామ్=నిన్ను, గుణేషు=త్రిగుణములందు, వాని పరిణామముగా విశ్వమునందు, బుద్ధ్యా= జ్ఞానదృష్టిచేత, వదన్తి=వచించుచున్నారు.

**తాత్పర్యము :** దారువును మథించి యగ్నినెట్లు పడయుచున్నారో, గోవులందు క్షీరము పిదుకుకొని దాని ద్వారా నేయినెట్లు పడయుదురో, భూమిని వ్యవసాయము చేసి దున్ని చల్లి ధాన్యమునుబడసి తద్వారా అన్నమునెట్లు పొందుదురో భూమిని ద్రవ్వి జలమునెట్లు పడయుదురో పురుషప్రయత్నమును వాచ్యాది వృత్తులచే జీవనాధారమగు ధనమెట్లు పడయుదురో అట్లే సత్పురుషులగు మానవులు చిత్త నిరోధాదికము అగు యోగవిధానముచే నిన్నుఁబొందుచున్నారు. అట్లే జ్ఞానులు సత్త్వాదిగుణముల పరిణామమగు విశ్వమును పరిశీలించుట ద్వారానైన జ్ఞానబుద్ధితో జ్ఞానయోగమున నిన్ను వచించుచున్నారు.

**శ్లో॥ త్వం త్వాం వయం నాథ సముజ్జిహానం సరోజనాభాతిచిరేప్సితార్థమ్।**
**దృష్ట్వా గతా నిర్వృతిమద్య సర్వే గజా దవార్తా ఇవ గాఙ్గమమ్భః॥ 13**

**ప్రతిపదార్థము :** నాథ!=ఓ ప్రభూ!, సరోజనాభ!=ఓ పద్మనాభా!, అతిచిర+ఈప్సిత+అర్థమ్= చాలా తడవు కాలము నుండి కోరబడిన అర్థమై, మాయెట్టయెదుట ఆవిర్భవించుచున్న ప్రత్యక్షమైన, తమ్=ఆ, త్వామ్=నిన్ను, వయమ్=మేము, అద్య=ఇప్పుడు, దవ+ఆర్తా= దావాగ్నిచే సంతప్తములైన, గజాః=ఏనుగులు, గాంగం అంభః ఇవ=గంగాజలమును వలె, దృష్ట్వా=చూచి, నిర్వృతిమ్=సుఖమును, గతాః=పొందితిమి.

**తాత్పర్యము :** ఓ లోకప్రభూ! ఓ పద్మనాభా! మేము ఎంతకాలము నుండియో అపేక్షించు చుండిన పెన్నిధియై మాయెట్టయెదుట సాక్షాత్కరించిన నిన్ను చూచిన మేము ఇప్పుడు కాఱుచిచ్చు మంటలచేఁదాపమొందిన యేనుగులు గంగాజలములనుఁజూచినట్లు నిన్ను జూచి సుఖమును బడసిన వారమగుచున్నాము.

**శ్లో॥ స త్వం విధత్స్వాఖిలలోకపాలా వయం యదర్థాస్తవ పాదమూలమ్।**
**సమాగతాస్తే బహిరన్తరాత్మన్ కిం వాన్యవిజ్ఞాప్యమశేషసాక్షిణః॥ 14**

ఏది విధేయము (చేయదగినది) దానిని చెప్పుడు. అందువా అని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అఖిలలోకపాలాః=ఎల్లలోకపాలురును, వయమ్=మేమును, యత్+అర్థాః =ఏ ప్రయోజనమునపేక్షించినవారమై, తే=నీయొక్క, పాదమూలమ్=పాదముల సామీప్యము



లసత్+కౌశేయవాససా=ప్రకాశించు పట్టు పుట్టముతో గూడినదియు, ప్రసన్నచారు సర్వాంగీమ్= స్వచ్ఛములై సుందరములయిన ఎల్ల అవయవములు గలదియు, సుముఖీమ్= మంగళ ప్రదమైన ముఖముగలదై, సుందరభ్రువమ్=అందమైన కనుబొమలుగలదియు అయి యుండెను.

**తాత్పర్యము :** ఆ విష్ణుమూర్తి పుటమార్చిన పసిడిపసుపుఛాయ పట్టు దుకూలములతో గూడి నిర్మలమైన, మనోహరములైన అంగములు గలదై మంగళకరమై శోభిల్లు ముఖము గలదై సొగసైన కనుబొమలు కలిగియుండెను.

**శ్లో॥ మహామణికిరీటేన కేయూరాభ్యాం చ భూషితామ్।**
**కర్ణాభరణనిర్భాతకపోలశ్రీముఖామ్బుజామ్॥ 5**

**ప్రతిపదార్థము :** మహామణికిరీటేన=దొడ్డ మణులు గల బొమిడికముతోను (కిరీటముతోను), కేయూరాభ్యామ్=భుజకీర్తులతోను, భూషితామ్=అలంకరింపబడినదై, కర్ణాభరణనిర్భాత కపోలశ్రీముఖ+అంబుజామ్=కుండలములచే ప్రకాశించు చెక్కిళ్ళ కాంతులతో నొప్పు ముఖ కమలము గలదై యుండెను.

**తాత్పర్యము :** గొప్ప గొప్ప రతనాలు చెక్కిన కిరీటము చేతను, భుజకీర్తుల చేతనలంకరించ బడినదై రత్నకుండలములచే భాసిల్లు చెక్కిళుల కాంతుల నొప్పారు కమలము వంటి ముఖము గలదై యుండెను.

**శ్లో॥ కాఞ్చీకలాపవలయహారనూపురశోభితామ్।**
**కౌస్తుభాభరణాం లక్ష్మీం బిభ్రతీం వనమాలినీమ్॥ 6**

**ప్రతిపదార్థము :** కాంచీ.... శోభితామ్=కాంచీ=మొలనూలు, కలాప=ఆభరణములు, వలయ=చేతి కడియము, నూపుర=అందెలు అనువానిచే, శోభితామ్=శోభిల్లునదై, కౌస్తుభాభరణామ్=కౌస్తుభమణి ఆభరణముగా గలదైన, లక్ష్మీమ్=లక్ష్మిని, వనమాలినీమ్= వనమాలిని అను పేరుగల తోమాలను, బిభ్రతీమ్=ధరించియుండెను.

**తాత్పర్యము :** మఱియు మొలనూలును, ఆభరణములను, కడియములను, అందెలను ధరించి శోభిల్లుచు కౌస్తుభమణియను ఆభరణమును, లక్ష్మిని, వనమాలియను పెద్ద పూవుల దండను ధరించియుండెను.

**శ్లో॥ సుదర్శనాదిభిః స్వాస్త్రైర్మూర్తిమద్భిరుపాసితామ్।**
**తుష్టావ దేవప్రవరః సశర్వః పురుషం పరమ్।**
**సర్వామరగణైః సాకం సర్వాఙ్గైరవనిం గతైః॥ 7**

**ప్రతిపదార్థము :** మూర్తిమద్భిః=మూర్తిమంతములైన రూపములు దాల్చిన, స్వ+అస్త్రైః=తన అస్త్రములగు, సుదర్శన+ఆదిభిః=సుదర్శన చక్రములోనగువానిచే, ఉపాసితామ్=సేవింపబడు చున్నదైన, ఆ విష్ణుమూర్తిని గాంచి, దేవప్రవరః=దేవతలందు శ్రేష్ఠుడగు బ్రహ్మ, సశర్వః =శివునితో గూడినవాడై, సర్వాంగైః=సర్వావయవములచే, అవనిం గతైః=సాష్టాంగ ప్రణామ ములు చేయువాడై, సర్వ+అమరగణైః సాకమ్=ఎల్ల వేల్పుల గణములతో గూడి, పరం పురుషమ్=పరమపురుషుని, తుష్టావ=స్తుతించెను.

**తాత్పర్యము :** మూర్తిమంతములై సుదర్శన చక్రాద్యస్త్రములు తన్ను సేవించుచుండినదియునగు విష్ణుమూర్తిని గాంచి దేవతాశ్రేష్ఠుడు బ్రహ్మ శంకరునితోగూడి సాష్టాంగ ప్రణామములాచరించిన యమరగణములెల్ల తన్ను పరివేష్టింప నా పరమపురుషునిట్లు స్తుతించెను.

**బ్రహ్మోవాచ :** బ్రహ్మవచించెను.

**శ్లో॥ అజాతజన్మస్థితిసంయమాయాగుణాయ నిర్వాణసుఖార్ణవాయ।**
**అణోరణిమ్నేఽపరిగణ్యధామ్నే మహానుభావాయ నమో నమస్తే॥ 8**
**(అనావిరావిరాసేయం నాభూతాభూదితి బ్రువన్**
**బ్రహ్మాఽభిప్రైతి నిత్యత్వవిభుత్వే భగవత్తనోః॥)**

ప్రత్యక్షముగాని ఈ విష్ణుమూర్తి ప్రత్యక్షమాయెను. ఇంద్రియ గోచరముగానిది ఇంద్రియ గోచరమయ్యెనని స్తుతించుచు బ్రహ్మ భగవంతుని తనువునకు సత్యత్వము, విభుత్వమును అంగీకరించుచున్నాడు (శ్రీధరీయం). శ్రీమూర్తి యొక్క ఆవిర్భావమే ఇదియగును గాని మనబోంట్లకు వలె జన్మాదికము నీకు లేవనుచున్నారు.

**ప్రతిపదార్థము :** అజాతజన్మస్థితిసంయమాయ=కలుగని జన్మస్థితి లయముగలవాడు ఏలయన, అగుణాయ=గుణరహితుడు, అందువలన, నిర్వాణసుఖార్ణవాయ=అపారమైన మోక్షసుఖస్వరూపుడును, అట్లయ్యు, అణోః=అణువుకంటెను, అణిమ్నే=అణువైనవాడు, తెలియరానివాడగుట వలన అతిసూక్ష్ముడు, అపరిగణ్యధామ్నే=ఇంతమాత్రునివలె లెక్కింప శక్యముగాని మూర్తిగలవాడును, మహానుభావాయ=భావింపశక్యముగాని ప్రభావము గలవాడగు, తే=నీకు, నమః నమః=నమస్కారము, నమస్కారము.

**తాత్పర్యము :** జన్మస్థితిలయములు లేనివాడును, గుణరహితుడు, అపారమైన మోక్షసుఖ స్వరూపుడును, అణువుకంటెను అణువైనవాడును, అతిసూక్ష్ముండును, గణింపశక్యముగాని శరీరముగలవాడునగు భావింప శక్యముగాని ప్రభావముగలవాడవగు నీకు నమస్కారము.

**శ్లో॥ రూపం తవైతత్ పురుషర్షభేజ్యం శ్రేయోఽర్థిభిర్వైదికతాన్త్రికేణ।**
**యోగేన ధాతః సహ నస్త్రిలోకాన్ పశ్యామ్యముష్మిన్ ను హ విశ్వమూర్తౌ॥ 9**

ఆ మూర్తి సనాతనము అపరిమేయమని యుపపాదించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** పురుషర్షభ=ఓ పురుషోత్తమా!, ధాతః=ఓ విశ్వకర్త!, ఏతత్=ఈ, తవ రూపమ్=నీ యొక్క రూపము, వైదికతాంత్రికేణ=వేదోక్త విధిచేతను, పాంచరాత్రాద్యాగమము చేతను, యోగేన=యోగవిధానము చేతను, శ్రేయో - ర్థిభిః=శ్రేయస్సును గోరువారిచే, పూజ్యమ్=సదా పూజింపదగినది. అందువలన ఇది ఇప్పుడు అపూర్వమై జనించలేదని భావము. ఓయీ! మీరు దేవతలు సదా పూజ్యులని ప్రసిద్ధులై యున్నారు గదా! సత్యమే. వారెల్లరు నీ రూపమునందే అంతర్భావమును బొంది యున్నారనుచున్నాడు. నుహ=అహో! స్పష్టమైనది, విశ్వమూర్తౌ=విశ్వస్వరూపుడవైన, అముష్మిన్=ఈ నీయందు, నః=మమ్ములను త్రిలోకాన్ సహ=ముల్లోకములను గూడినవారిని, పశ్యామి=చూచుచున్నాను. అందువలన ఈ నీ రూపము పరిచ్ఛిన్నమైనది కాదని భావము.



**తాత్పర్యము :** ఓ పురుషోత్తమా! ఓ విశ్వకర్త! ఈ నీ రూపమును శ్రేయస్సు గోరువారు వేదమునందు చెప్పబడిన విధానమునను పాంచరాత్రాద్యాగమ మార్గమునను యోగపద్ధతిని సదా పూజింపదగినదై యున్నది. దేవతలమగు మేము లోకపూజ్యులమైనను మేమెల్ల నీయందు అంతర్భాగమును పొందుచున్నాము. విశ్వమూర్తియైన నీయందు నేను ఈ ముల్లోకములను చూచుచున్నాను. అందువలన నీ రూపము లోకము కంటె ప్రత్యేకించినది కాదు.

**శ్లో॥ త్వయ్యగ్ర ఆసీత్ త్వయి మధ్య ఆసీత్ త్వయ్యన్త ఆసీదిదమాత్మతన్త్రే।**
**త్వమాదిరన్తో జగతోఽస్య మధ్యం ఘటస్య మృత్స్నేవ పరః పరస్మాత్॥ 10**

ఆ విశ్వమూర్తిత్వమును జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఆత్మతంత్రే=స్వతంత్రుడైన, త్వయి=నీయందు, అగ్రే=సృష్టికి ముందు, ఆసీత్=సూక్ష్మ రూపమున నుండెను, త్వయి=నీయందు, ఇదమ్=ఈ విశ్వము, మధ్యే= సృజింపబడిన కాలమునందు, ఆసీత్=ఉండెను, త్వయి=నీయందు, అంతే=ప్రళయ కాలము నందును, ఆసీత్=ఉండెను, త్వయి=నీయందు, పరస్మాత్=ప్రధానము కంటెను, పర= అన్యుడవగు, త్వమ్=నీవు, అస్య=ఈ, జగతః=జగమునకు, ఆదిః=మొదలు, మధ్యమ్= మధ్యము, అంతః=అంతమునై, ఘటస్య=ఘటమునకు, మృత్స్నా ఇవ=మన్నువలె ఉన్నావు.

**తాత్పర్యము :** ఓ స్వతంత్ర స్వరూపా! సృష్టికి పూర్వమీ విశ్వము నీయందే సూక్ష్మరూపమున లీనమై యుండెను. సృష్టియైన తర్వాతను నీయందే మధ్య కాలమందు నిల్చి యున్నది. ప్రళయమందు నీయందే లయము పొందుచున్నది. ప్రధానము కంటెఁబరుడవైన ఆదిమధ్యాంతములై ఈ జగమునకు జన్మస్థితిలయకారుడవై ఘటమునకు మన్నువలె ఉన్నావు.

**శ్లో॥ త్వం మాయయాత్మాశ్రయయా స్వయేదం నిర్మాయ విశ్వం తదనుప్రవిష్టః।**
**పశ్యన్తి యుక్తా మనసా మనీషిణో గుణవ్యవాయేఽప్యగుణం విపశ్చితః॥ 11**

మృత్తికను దృష్టాంతమును చెప్పుటచేత పరిణామవాదము సంభవించుచున్నదను పూర్వపక్షముగా దానిని నివారించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఆత్మాశ్రయయా=పరమాత్మవగు నీవు ఆశ్రయముగలదై, స్వయా=నీ స్వాధీనమైన, త్వత్+మాయయా=నీ మాయచేత, ఇదమ్=ఈ, విశ్వమ్=విశ్వమును, నిర్మాయ= నిర్మించి, తత్+అనుప్రవిష్టః=ఈ విశ్వము లోపలననుసరించి ప్రవేశించిన వాడవై యున్నావు. మనీషిణః=వివేకవంతులు, విపశ్చితః=శాస్త్రజ్ఞులు, మనసా=సంస్కారమును బొందిన చిత్తముతో, యుక్తాః=కూడుకొన్నవారై, గుణవ్యవాయే అపి=సత్త్వాది గుణముల పరిణామ మందును, అగుణమ్=గుణముల సంబంధములేనివానినిగాను, పశ్యంతి=చూచుచున్నారు.

**తాత్పర్యము :** ఓ జగదీశా! నీవు నిన్నాశ్రయించినదై నీ స్వాధీనమైన నీ మాయ ద్వారా ఈ విశ్వమంతటిని సృజించి ఈ విశ్వములోపలననుసరించి ప్రవేశించి అంతర్యామి స్వరూపమున వెలుగొందుచున్నావు. వివేకవంతులు వేదాంతాది శాస్త్రములనెఱింగినవారు సంస్కృత బుద్ధితో సత్త్వాదిగుణముల పరిణామమున జనించిన విశ్వమందు నీవు ప్రవేశించియున్నను నీవు ఆ గుణసంబంధము లేక వాని వలె పరిణామము చెందక గుణరహితుడై యున్నవానినిగా నిన్ను కనుగొందురు.

**తాత్పర్యము :** దేవతలారా! మీరు సహాయుడగు నాతో మెలకువగలవారై పాలకడలిని చిలుకుడు. దైత్యులు కష్టమునకు పాత్రమగుదురు. మీరు ఫలమును గ్రహించువారగుదురు.

**శ్లో॥ యూయం తదనుమోదధ్వం యదిచ్ఛన్త్యసురాః సురాః।**
**న సంరమ్భేణ సిధ్యన్తి సర్వేఽర్థాః సాన్త్వయా యథా॥** 24

**ప్రతిపదార్థము :** సురాః=ఓ దేవతలారా!, అసురాః=అసురులు, యత్+ఇచ్ఛంతి=దేనిని గోరుదురో, తత్=దానిని, యూయమ్=మీరు, అనుమోదధ్వమ్=అనుమతింపుడు. సర్వే అర్థాః =బలవంతులు సహకారముచే సాధింపదగిన యెల్ల కార్యములు, సాంత్వయా యథా=సామ మార్గముచేతనువలె, సంరంభేణ=తొందరపడుటచే, న సిధ్యంతి=సిద్ధింపవు.

ఈ రెండు శ్లోకములచే సామమార్గములోనగు దానినుపదేశించుచున్నాడు.

**తాత్పర్యము :** ఓ దేవతలారా! మిమ్ములనసురులేయే వాంఛలను గోరుదురో, వానికన్నింటికి మీరు సమ్మతింపుడు. బలవంతుల సహకరించిన నెరవేరు కార్యములు సామమార్గమున నయినట్లు తొందరపడుట చేత, సిద్ధించవు.

**శ్లో॥ న భేతవ్యం కాలకూటాత్ విషాజ్జలధిసమ్భవాత్।**
**లోభః కార్యో న వో జాతు రోషః కామస్తు వస్తుషు॥** 25

**ప్రతిపదార్థము :** జలధిసంభవాత్=సముద్రమునఁబొడము/జనించు, కాలకూటాత్=కాలకూటమను, విషాత్=విషము వలన, న భేతవ్యమ్=భయపడదగదు. జాతు=ఎప్పుడును, వః=మీకు, వస్తుషు=జలధి మథనముననుత్పన్నములగు పదార్థములందు, లోభః=పేరాస, రోషః=కోపము, కామశ్చ=వాంఛయు, న కార్యః=చేయదగదు.

**తాత్పర్యము :** సముద్రమున జనించు కాలకూటము వలన మీరు భయపడకుడు. పాలకడలిని జిలుకుట వలనఁబొడము వస్తువులందు మీకు ఎప్పుడుగాని పేరాస పడగూడదు. మఱి కామక్రోధములను చేపట్టవలదు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇతి దేవాన్ సమాదిశ్య భగవాన్ పురుషోత్తమః।**
**తేషామన్తర్దధే రాజన్ స్వచ్ఛన్దగతిరీశ్వరః॥** 26

**ప్రతిపదార్థము :** రాజన్!=ఓ రాజా!, ఇతి=ఇట్లు, దేవాన్=సురలను గూర్చి, సమాదిశ్య=చక్కగా నానతిచ్చి, భగవాన్ పురుషోత్తమః=భగవంతుడు పురుషోత్తముడు, స్వచ్ఛందగతిః=స్వచ్ఛమై వర్తించువాడు, ఈశ్వరః=ఈశ్వరుడు, తేషామ్=వారియెదుటనే అంతర్దధే=అంతర్హితుడయ్యెను.

**తాత్పర్యము :** ఓ రాజా! ఆ భగవానుడు పురుషోత్తముడు స్వతంత్రుడు, పరమేశ్వరుడు ఇట్లు సురలనాదేశించి వారు చూచుచుండగనే అంతర్థానమొందెను.

**శ్లో॥ అథ తస్మై భగవతే నమస్కృత్య పితామహః।**
**భవశ్చ జగ్మతుః స్వం స్వం ధామోపేయుర్బలిం సురాః॥** 27

**ప్రతిపదార్థము :** అథ=అంత, పితామహః=బ్రహ్మ, భవశ్చ=శివుడును, భగవతేతస్మై=ఆ



నకు, సమాగతాః=చనుదెంచియున్నాము. సః త్వమ్=అట్టి నీవు, విధత్స్వ=ఆయా కార్యమును గావింపుము. అంతరాత్మన్=ప్రాణులకెల్లలోపలనుండు ఆత్మలైనవాడా!, అశేషసాక్షిణః=సమస్త జగమునకు సాక్షివై చూచుచుండు, తే=నీకు, అద్య=ఇప్పుడు, బహిః=వెలుపలిదైన, విజ్ఞాప్యమ్=విన్నవించదగినది, కించ=ఏమి గలదు, ఇతరులు విన్నవించునదేమి గలదో, సర్వము నీకు తెలిసినదనుట.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరుడా! ఈ యెల్లలోకపాలురును మేమును ఏ ప్రయోజనమర్థించి నీ పాదముల సామీప్యమునకు వచ్చియున్నామో ! అట్టి మహానుభావుడవగు నీవు మా ప్రయోజనమును నెరవేర్పుము. ఓ ప్రాణులకెల్ల అంతరాత్మవైనవాడా! సర్వజగములకు సాక్షివైన నీకు ఈ బాహ్య జగత్తు విషయములు అన్యులు నీకు విన్నవించదగినవి ఏమి గలవు. లోపల నున్న సంగతులే తెలుసుకొను నీకు వెలుపలి సంగతులు తెలియకున్నవా ? అనుట.

**శ్లో॥ అహం గిరిత్రశ్చ సురాదయో యే దక్షాదయోఽగ్నేరివ కేతవస్తే।**
**కిం వా విదామేశ పృథగ్విభావితా విధత్స్వ శం నో ద్విజదేవమన్త్రమ్॥** 15

**ప్రతిపదార్థము :** అహమ్=బ్రహ్మనైన నేను, గిరిత్రశ్చ=శివుడును, యే=ఏ, సుర+ఆదయః =దేవతలులోనగువారు, దక్ష+ఆదయః=దక్షుడు మొదలైన ప్రజాపతులు, అగ్నేః=అగ్ని వలన, కేతవ ఇవ=విస్ఫులింగములు వలె, తే=నీ వలనను, పృథక్+విభావితాః=మేము, వేఱుగా విభాగించబడియుండుచునో, ఈశ=ఓ పరమేశ్వర!, శమ్=ఆ మా ఆత్మాశ్రయము, కిం వా విదామ=ఎంతమాత్రమెఱుంగుదుము అందువలన నీవే, ద్విజదేవమంత్రమ్=ఋషులు, దేవతలు, మంత్రాలోచనమును, విధత్స్వ=చేయుము ఇది చేయుడని ఉపాయమునుఁజెప్పుమని అర్థము.

**తాత్పర్యము :** బ్రహ్మనైన నేను ఈ శివుడు ఈ దేవతలు ఈ దక్షాదిప్రజాపతులులోనగు మేమెల్లరము అగ్నినుండి నిప్పురవ్వలవలె నీ వలన వేఱయియున్నవారము. ఓ ఈశా! మా శ్రేయమిదేయని మాకేమి తెలియును ? కావున నీవే ఋషులు దేవతలు కలసి చేసిన మంత్రాలోచనమును విని ఇదియట్లు చేయుడని మాకుపదేశింపుము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం విరిఞ్చాదిభిరీడితస్తద్ విజ్ఞాయ తేషాం హృదయం యథైవ।**
**జగాద జీమూతగభీరయా గిరా బద్ధాఞ్జలీన్ సమ్భృతసర్వకారకాన్॥** 16

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, విరించ+ఆదిభిః=బ్రహ్మలోనగువారిచే, ఈడితః =స్తుతింపబడినవాడై, తేషామ్=వారియొక్క, హృదయమ్=హృదయములోని భావము, యథా ఏవ=ఏ ప్రకారమో, తత్=దానిని, విజ్ఞాయ=అట్లు తెలిసి, బద్ధ+అంజలీన్=చేర్చబడిన దోయిలి కలవారును, సంభృత సర్వకారకాన్=నియమింపబడిన సర్వేంద్రియములుగలవారు అగు వారిఁజూచి, జీమూత గభీరయా=మేఘ ధ్వనివలె గంభీరమైన, గిరా=వాక్కుచే, జగాద=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** ఇట్లు బ్రహ్మాది దేవతలు తన్ను స్తుతింపగా పరమేశ్వరుడు వారి హృదయములోని

భావమున్నదున్నట్లు గుర్తెతింగి తమ కర్తవ్యమునుపదేశింపుమన్న ప్రార్థనము మేరకు చేదోయి దోయిలించుకొని మొక్కుచు ఇంద్రియముల సంయమము గావించి ఏకాగ్రచిత్తులైన యా బ్రహ్మాదులకు విష్ణువు మేఘధ్వనివలె గంభీరమైన వాక్కుతో నిట్లు వచించెను.

**శ్లో॥ ఏక ఏవేశ్వరస్తస్మిన్ సురకార్యే సురేశ్వర।**
**విహర్తుకామస్తానాహ సముద్రోన్మథనాదిభిః॥ 17**

ఈశ్వరునికి సైతము వారి యిష్ట ప్రకారము నిర్వర్తించుటయే సమ్మతమనుచున్నారు.

**ప్రతిపదార్థము :** నరేశ్వర!=ఓ రాజా!, తస్మిన్=ఆ, సురకార్యే=దేవతల కార్యమునందు, ఏకఃఏవ=ఒక్కడే, ఈశ్వరః=సమర్థుడైనను, సముద్రోన్మథనాదిభిః=సముద్రమును మథించుట లోనగువానిచే, విహర్తుకామః=విహరింపనిచ్ఛగించినవాడై, తాన్=ఆ దేవతలను గురించి, ఆహ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** ఓ రాజా! దేవతల కార్యము నెరవేర్చుటకు పరమేశ్వరుడుఁదానొక్కడే సమర్థుడై యుండియు సముద్రమును మథించుటలోనగు కార్యములతో క్రీడింపనిచ్ఛగోరి ఆ జగదీశుడు ఆ దేవతలతో నిట్లు వచించెను.

**శ్రీ భగవానువాచ :** శ్రీ భగవంతుడు వచించెను.

**శ్లో॥ హన్త బ్రహ్మన్నహో శమ్భో హే దేవా మమ భాషితమ్।**
**శృణుతావహితాః సర్వే శ్రేయో వః స్యాద్ యథా సురాః॥ 18**

**ప్రతిపదార్థము :** హంత బ్రహ్మన్=ఔరా!, ఓ బ్రహ్మ!, అహో శంభో=ఔరా ఓ శంకరా!, హేదేవాః=ఓ దేవతలారా!, సురాః=ఇతర దేవతలగు గంధర్వాదులారా!, యథా=ఏ ప్రకారము, వః=మీకు, శ్రేయః=శ్రేయస్సు, స్యాత్=తప్పక కలుగునో, మమ భాషితమ్=నా మాటను, సర్వే=మీరెల్లరు, అవహితాః=సమాధాన చిత్తులై, శృణుత=వినుడు.

**తాత్పర్యము :** ఓహో! బ్రహ్మ! శివుడా! ఓ దేవతలారా! ఓ గంధర్వులారా! మీకు శ్రేయమెట్లు గలుగునో దానిని గూర్చి నేను జెప్పుమాటను మీరు జాగరూకులై వినుడు.

**శ్లో॥ యాత దానవ దైతేయైస్తావత్ సన్ధిర్విధీయతామ్।**
**కాలేనానుగృహీతైస్తైః యావద్వో భవ ఆత్మనః॥ 19**

**ప్రతిపదార్థము :** యాత=పొందు, తావత్=ఇప్పుడు, దానవదైతేయైః=దానవులతో దైతేయులతో, సంధిః=సంధి, విధీయతామ్=చేయబడుగాక!, కాలేన=కాలముచే, అనుగృహీతైః =అనుగ్రహింపబడిన, తైః=వారిచే, వః=మీకు, ఆత్మనః=స్వయముగా, యావత్=ఎప్పుడు, భవః=అభివృద్ధి కలుగును.

**తాత్పర్యము :** మీరు వెంటనే పోయి దానవులతోనూ, దైత్యులతోనూ సంధి చేసుకొనుడు. కాల బలమున వారు మీయందనుగ్రహము గలవారు కాగా మీకు దానంతట అభివృద్ధి కలుగగలదు.

**శ్లో॥ అరయోఽపి హి సన్ధేయాః సతి కార్యార్థగౌరవే।**
**అహిమూషకవద్దేవా హ్యర్థస్య పదవీం గతైః॥ 20**



**ప్రతిపదార్థము :** దేవాః=దేవతలారా!, అరయోః అపి=శత్రువులు సైతము, సంధేయాః=సంధి చేయదగిన వారు గదా!, కార్య+అర్థగౌరవే=సాధింపదగిన ప్రయోజన గౌరవము గలిగి నప్పుడు, అర్థస్య= ప్రయోజనము యొక్క, పదవీమ్=సిద్ధిని, గతైః=పొందినవారిచే, పశ్చాత్= తరువాత, అహిమూషికవత్=సర్పము మూషికముల వలె మఱల వైరమును పొందవచ్చును.

**తాత్పర్యము :** కార్య ప్రయోజన గౌరవమును బట్టి శత్రువులతోనైనను దప్పక సంధి చేసుకొన వలయును. ప్రయోజనము సిద్ధించినంతన సర్పము మూషికమును వలె శత్రువులను వధింప వలయును. ఒక పెనుబాము పాములవాని పెట్టె నుండి బయలువెడలి వెలుపలకి రాలేక యున్నదై తాత్కాలికముగ తటస్థించిన మూషికముతో నెయ్యము గఱపి అదియాపాముల పెట్టెకు రంధ్రము గావింపగా దాని ద్వారా బయలువెడలి వచ్చి ఆ మూషికమును జంపివేయు చున్నది. ఇది అహి మూషికన్యాయము.

**శ్లో॥ అమృతోత్పాదనే యత్నః క్రియతామవిలమ్బితమ్।**
**యస్య పీతస్య వై జన్తుర్మృత్యుగ్రస్తోఽమరో భవేత్॥ 21**

**ప్రతిపదార్థము :** యస్య=ఏది, పీతస్య=పానము చేయబడినచో, మృత్యుగ్రస్తః=మృత్యువుచేబట్టు వడినయిన మరణింపనున్న, జంతుః=ప్రాణి, అమృతః=చావనిది, భవేత్=అగునో ఆ, అమృత+ఉత్పాదనే=అమృతమునుత్పాదించుటయందు, యత్నః=ప్రయత్నము, అవలంబితమ్ =ఆలస్యము లేక, వెంటనే, క్రియతామ్=చేయబడుగాక!

**తాత్పర్యము :** దేని పానమున చనిపోవువాడు సైతము జీవించునో అట్టి అమృతమును బడయుటకై తక్షణమే ప్రయత్నము చేయుడు.

**శ్లో॥ క్షిప్త్వా క్షీరోదధౌ సర్వా వీరుత్తృణలతౌషధీః।**
**మన్థానం మన్దరం కృత్వా నేత్రం కృత్వా తు వాసుకిమ్॥ 22**

**ప్రతిపదార్థము :** క్షీరోదధౌ=పాల కడలియందు, సర్వాః=సమస్తమైన, వీరుత్తృణలతౌషధీః =చిన్న పొదలను, గడ్డిని, తీగలను, ఓషధులను, క్షిప్త్వా=పడవైచి, మందరమ్=మందర గిరిని, మంథానమ్=కవ్వముగా, కృత్వా=చేసి, వాసుకిమ్=వాసుకిని, సర్పరాజును, నేత్రమ్=కవ్వపుఁదాడుగాను, కృత్వా చ=చేసియు.

**తాత్పర్యము :** ఎల్ల చిన్న పొదలు, గడ్డి, తీగలు, ఓషధులు లోనగువానిని పాలకడలియందు వైచి మందరగిరిని కవ్వముగా చేసి సర్పరాజగు వాసుకిని గవ్వపుత్రాడుగా చేయుడు.

**శ్లో॥ సహాయేన మయా దేవా నిర్మన్థధ్వమతన్ద్రితాః।**
**క్లేశభాజో భవిష్యన్తి దైత్యా యూయమ్ఫలగ్రహాః॥ 23**

**ప్రతిపదార్థము :** దేవాః=దేవతలగు మీరు, సహాయేన మయా=సహాయుడగు నాతోడ, అతంద్రితాః=హెచ్చరికగలవారై, నిర్మంథధ్వమ్=చిలుకుడు అట్లయిన అసురులు సయితము అమృతపానమున నమరులు కాగలరన్నచో, దైత్యాః=దైత్యులు, క్లేశభాజః=కేవలము శ్రమకు మాత్రము పాత్రము, భవిష్యతి=కాగలరు, యూయమ్=మీరు మాత్రమే, ఫలగ్రహాః=ఫలమును గ్రహించువారగుదురు.

**శ్లో॥ అవరోప్య గిరిం స్కన్ధాత్ సుపర్ణః పతతాం వరః।**
**యయౌ జలాన్త ఉత్సృజ్య హరిణా సవిసర్జితః॥ 39**

**ప్రతిపదార్థము :** పతతాంవరః=పక్షిశ్రేష్ఠుడు, సుపర్ణః=గరుత్మంతుడు, గిరిమ్=ఆ మందర గిరిని, స్కంధాత్=భుజము నుండి, అవరోప్య=క్రిందికి దించి, జలాంతే=నీటి చివర సముద్రము గట్టున, ఉత్సృజ్య=విడిచి, సః=ఆ గరుడుడు, హరిణా=విష్ణువుచే, విసర్జితః=విసర్జింపబడినవాడై, యయౌ=వెళ్ళెను. సుపర్ణుడచ్చటనున్నచో వాసుకి రాదు. ఆగమనము సంభవించదు కాబట్టి వెళ్ళెను.

**తాత్పర్యము :** పక్షిశ్రేష్ఠుడాగరుత్మంతుడు భుజము నుండి ఆ మందరగిరిని క్రిందకి దింపి సముద్రము దరిని విడిచి హరి సెలవీయగ బయలుదేరిపోయెను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే షష్ఠో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున షష్ఠాధ్యాయము.



విష్ణు భగవానునకు, నమస్కృత్య=నమస్కరించి, స్వం స్వమ్=తమతమ, ధామ=స్థానమును గూర్చి, జగ్మతుః=పోయిరి/వెళ్ళిపోయిరి, సురాః=వేల్పులు, బలిమ్=బలిచక్రవర్తిని, ఉపేయుః =సమీపించిరి.

**తాత్పర్యము :** అంత బ్రహ్మయు, శివుడును ఆ భగవంతుడైన యా విష్ణువునకు నమస్కరించి వారి వారి స్థానములకు బోయిరి. సురలు బలికడకు బోయిరి.

**శ్లో॥ దృష్ట్వారీనప్యసంయత్తాఞ్జాతక్షోభాన్ స్వనాయకాన్।**
**న్యషేధత్ దైత్యరాట్ శ్లోక్యః సన్ధివిగ్రహకాలవిత్॥ 28**

**ప్రతిపదార్థము :** దైత్యరాట్=దైత్యుల రాజు, శ్లోక్యః=కీర్తికర్యుడు, సంధి విగ్రహకాలవిత్= శత్రువులతో సంధిచేయుటకు కయ్యమొనర్చుటకు తగిన కాలమెఱింగినవాడు, అసంయత్తాన్= యుద్ధమునకు సిద్ధపడినవారుగాని, అరీన్=శత్రువులగు సురలను, దృష్ట్వా=చూచి, జాతక్షోభాన్= చిత్తక్షోభగలిగి యుద్ధసన్నద్ధులైన, స్వనాయకాన్=తన సేనానాయకులను, న్యషేధత్=యుద్ధము వలదని నిషేధించెను.

**తాత్పర్యము :** శత్రువులతో సంధి చేయుట యుద్ధము చేయుటలోనగు రాజధర్మము యెఱింగినవాడు, మంచిపేరు పొందినవాడును, దైత్యరాజునగు బలి యుద్ధమునకుగాక శాంతులై వచ్చిన శత్రువులగు సురలను చూచి కోపమున రేగి యుద్ధమునకు సంసిద్ధులగు తమ సేనానాయకులనట్లు వర్తింపకుడని నిషేధించెను.

**శ్లో॥ తే వైరోచనిమాసీనం గుప్తంచాసురయూథపైః।**
**శ్రియా పరమయా జుష్టం జితాశేషముపాగమన్॥ 29**

**ప్రతిపదార్థము :** తే వై=ఆ సురలన్ననో, ఆసీనమ్=సింహాసనాసీనుడును, అసురయూథపైః= అసురసేనా నాయకులచే, గుప్తంచ=రక్షింపబడువాడును, పరమయా=శ్రేష్ఠమైన, శ్రియా= రాజ్యలక్ష్మిచే, జుష్టమ్=పొందబడినవాడు, జిత+అశేషమ్=సమస్త జగములను జయించిన వాడునగు, వైరోచనిమ్=విరోచనుని కుమారుడగు బలిని, ఉపామగన్=సన్నిధిని చేరిరి.

**తాత్పర్యము :** ఆ సురలు మాత్రము సింహాసనమధిష్ఠించి అసురసేనాపతులు తన్ను పరివేష్టించ రక్షించు త్రిలోక రాజ్యలక్ష్మిని కైవసము గావించుకుని సర్వజగములను జయించి వెలుగు ఆ బలిచక్రవర్తి సన్నిధిని చేరిరి.

**శ్లో॥ మహేన్ద్రః శ్లక్ష్ణయా వాచా సాన్త్వయిత్వా మహామతిః।**
**అభ్యభాషత తత్ సర్వం శిక్షితం పురుషోత్తమాత్॥ 30**

**ప్రతిపదార్థము :** మహామతిః=దొడ్డబుద్ధిగలవాడును, మహేంద్రః=దేవేంద్రుడు, శ్లక్ష్ణయా= మృదువైన, వాచా=వాక్కుచే, సాంత్వయిత్వా=బలిని అనునయించి ఊరడించి, పురుషోత్త మాత్=విష్ణువు వలన, శిక్షితమ్=కఱుపబడిన, తత్ సర్వమ్=అమృతమునకై పాలకడలిని ద్రచ్చుటలోనగు విషయమంతయు, అభ్యభాషత=చక్కగా వివరించి చెప్పెను.

**తాత్పర్యము :** అప్పుడు చాలా తెలివిగలవాడగు దేవేంద్రుడు మృదువైన మంచి మాటలతో బలినూరడించి విష్ణువు తమకుగఱపిన దానిని అమృతమునకై పాలకడలిని ద్రచ్చుటలోనగు సంగతినంతయు వివరించి చక్కగా చెప్పెను.

శ్లో॥ తదరోచత దైత్యస్య తత్రాన్యే యేఽసురాధిపాః।
శమ్బరోఽరిష్టనేమిశ్చ యే చ త్రిపురవాసినః॥ 31

**ప్రతిపదార్థము :** తత్=ఇంద్రుడు వచించిన ఆ విషయము (పాలకడలి మధనము), దైత్యస్య=దైత్యుల రాజగు బలికి, తత్ర=ఆ సభయందున్న, యే=ఎవ్వరూ, అన్యే=ఇతరములైన, అసురాధిపాః=అసురేశ్వరులును, యే=ఎవ్వరూ, త్రిపురవాసినః=త్రిపురవాసులును, శంబరః=శంబరుడును, అరిష్టనేమిశ్చ=అరిష్టనేమియు, అరోచత=ఇష్టపడిరి.

**తాత్పర్యము :** ఇంద్రుడు వచించిన క్షీరసాగరమథనమును, దైత్యరాజగు బలియు సభయందున్న ఇతరులగు నసురేశ్వరులు త్రిపురవాసులగు శంబరుడు అరిష్టనేమిలోనగువారును ఇష్టపడిరి.

శ్లో॥ తతో దేవాసురాః కృత్వా సంవిదం కృతసౌహృదాః।
ఉద్యమం పరమం చక్రురమృతార్థే పరన్తప॥ 32

**ప్రతిపదార్థము :** తతః=అంత, దేవాసురాః=దేవాసురులు, సంవిదమ్=సమయమును, ప్రవర్తించిన నియమపద్ధతిని, కృత్వా=చేసి, కృతసౌహృదాః=పరస్పరము నెయ్యము గలవారై, అమృతార్థే=అమృతము బడయు ప్రయోజనమునందు, పరమమ్= దొడ్డదైన ప్రయత్నమును, చక్రుః=చేసిరి.

**తాత్పర్యము :** అంత దేవాసురులు తమలో తాము ఒక నియమమేర్పఱచుకొని ఒండొరుల యెడ స్నేహబుద్ధిగలవారై అమృతముఁబడయుటకై పెద్ద ప్రయత్నము గావించిరి.

శ్లో॥ తతస్తే మన్దరగిరిమోజసోత్పాట్య దుర్మదాః।
నదన్త ఉదధిం నిన్యుః శక్తాః పరిఘబాహవః॥ 33

**ప్రతిపదార్థము :** తతః=అంత, తే=ఆ సురాసురులు, పరిఘబాహవః=ఇనుప గుదియల వంటి బాహువులు గలిగి, దుర్మదాః=మదము పొంగినవారై, పొగరు బోయలై, శక్తాః=సమర్థులు, ఓజసా=బలముతో, మందరగిరిమ్=మందరనగమును, ఉత్పాట్య=పెళ్ళగించి, నదంతః=కిలకిలారావము చేయుచు, ఉదధిమ్=పాలసముద్రమును దరికి, నిన్యుః=తీసుకొని వచ్చుచుండిరి.

**తాత్పర్యము :** అంత నాసురాసురులు ఇనుప గుదియల వంటి బాహువులు గలవారు, మదముప్పొంగగా బలిమియై మందరనగమును పాయనుండి పెళ్ళగించి యెత్తుకొని కిలకిలారావము చేయుచు పాలసముద్రము దరికి తీసుకొని రాసాగిరి.

శ్లో॥ దూరభారోద్వహశ్రాన్తాః శక్రవైరోచనాదయః।
అపారయన్తస్తం వోఢుం వివశా విజహుః పథి॥ 34

**ప్రతిపదార్థము :** దూరభార+ఉద్వహశ్రాంతాః=దూరము బరువును వహించుటచే అలసిపోయినవారై, శక్రవైరోచన+ఆదయః=ఇంద్రుడు బలిలోనగువారు, తమ్=ఆ మందరగిరిని, అపారయంతః=సముద్రము దరికి చేర్చలేనివారై, వోఢుమ్=దానిని మోయుటకు, వివశాః=వశముగానివారై, పథి=మార్గమునందు, విజహుః=దానిని వదిలివేసిరి.

**తాత్పర్యము :** ఇంద్రుడు, బలిలోనగువారలు చాలదూరము భారమైనా మందర నగమును



మోయుటచే మిక్కిలి అలసిపోయి, దానిని సముద్రము దరికి చేర్చలేక, దారియందే దానిని వదలివేసిరి.

శ్లో॥ నిపతన్ స గిరిస్తత్ర బహూనమరదానవాన్।
చూర్ణయామాస మహతా భారేణ కనకాచలః॥ 35

**ప్రతిపదార్థము :** మహతాభారేణ=గొప్ప భారముచే, కనకాచలః=హేమాద్రియగు మేరు పర్వతమునకు సరివచ్చు, సఃగిరిః=ఆ మందరగిరి, తత్ర=ఆచోట, బహూన్=పెక్కులు, అమరదానవాన్=దేవదానవులను, చూర్ణయామాస=ఆ గిరి క్రింద పడుట వల్ల, చూర్ణయామాస=పిండిచేసెను.

**తాత్పర్యము :** భారమునందు మేరుపర్వతమును సరిపోలు ఆ మందరగిరి అప్పుడు దాని క్రిందపడిపోయిన పెక్కుమంది వేల్పులను, రాక్షసులను పిండిచేసెను.

శ్లో॥ తాంస్తథా భగ్నమనసో భగ్నబాహూరుకన్ధరాన్।
విజ్ఞాయ భగవాంస్తత్ర బభూవ గరుడధ్వజః॥ 36

**ప్రతిపదార్థము :** తథా=ఆ ప్రకారము, భగ్నబాహూః ఊరు కంధరాన్=విఱిగిపోయిన బాహువులు, తొడలు, కంఠములుగలవారును, భగ్నమనసః=సంతాపము, దుఃఖము పొందిన మనసుగలవారైన, తాన్=ఆ దేవదానవులను, విజ్ఞాయ=తెలుసుకొని, తత్ర=అక్కడ, భగవాన్=భగవంతుడు, గరుడధ్వజః=గరుడుడు టెక్కెముగాగల విష్ణువు, బభూవ=కన్పట్టెను.

**తాత్పర్యము :** అట్లు దేవదానవులు చేతులు కాళ్ళు మెడలు విఱిగి వ్యథపడుచుండ వారలను జూచి భగవంతుడు గరుడధ్వజుడు విష్ణువు వారలకు గనుపించెను.

శ్లో॥ గిరిపాతవినిష్పిష్టాన్ విలోక్యామరదానవాన్।
ఈక్షయా జీవయామాస నిర్జరాన్ నిర్వ్రణాన్ యథా॥ 37

**ప్రతిపదార్థము :** గిరిపాతవినిష్పిష్టాన్=పర్వతము పైన పడుటచేత పిండిపిండియైన, అమరదానవాన్=దేవదానవులను, విలోక్య=చూచి, కటాక్షైః=కడకంటి చూపులచే, నిర్జరాన్=దేవతలను, అసురాంతు=రాక్షసులను, నిర్వ్రణాన్=మేని గాయములు లేనివారలుగా, జీవయామాస=చేసి బ్రతికించెను.

**తాత్పర్యము :** కొండ పైన పడి నలిగిపోయిన సురాసురులను తన కడగంటి చూపులచే మేని గాయములు మానినవారలుగాను మేని సడలికపోవు వారినిగాను చేసి బ్రతికించెను.

శ్లో॥ గిరిఞ్చారోప్య గరుడే హస్తేనైకేన లీలయా।
ఆరుహ్య ప్రయయావబ్ధిం సురాసురగణైర్వృతః॥ 38

**ప్రతిపదార్థము :** గిరిమ్=ఆ మందరనగమును, హస్తేన=తన ఒక్క హస్తముచే, లీలయా=సునాయాసముగా, గరుడే=గరుడుని మీద, ఆరోప్య=ఎత్తిపెట్టి, ఆరుహ్య=తాను ఎక్కి, సుర+అసుర గణైర్వృతః=దేవదానవులచే నమస్కరింపబడినవాడైన విష్ణువు, అబ్ధిమ్=సముద్రమునకు, ప్రయయౌ=పోయెను.

**తాత్పర్యము :** ఆ మహావిష్ణువు ఆ మందరపర్వతమును తన ఒక హస్తముచే సునాయాసముగా గరుడునిపై బెట్టి తానెక్కి వేల్పులు అసురులు మ్రొక్కుచుండ పాలసముద్రమునకేగెను.

త్రిప్పసాగిరి. ఆదికూర్మమై అప్రమేయ బలుడైన ఆ విష్ణువు ఆ గిరిని తన వీపుపై భరించుచున్న ఆ నగము మరల మరల తిరుగుటను తన మేని దురదపోవునట్లు చేయుదానినిగా తలచెను.

**శ్లో॥ తథాసురానావిశదాసురేణ రూపేణ తేషాం బలవీర్యమీరయన్।**
**ఉద్దీపయన్ దేవగణాంశ్చ విష్ణుర్దైవేన నాగేన్ద్రమబోధరూపః॥ 11**

**ప్రతిపదార్థము :** తథా=ఆ మథించునప్పుడు, ఆసురేణ రూపేణ=తెలియని రూపము గలవాడై, అసుర సంబంధమైన రూపముతో, అసురాన్=అసురులను, తేషామ్=వారలకు, బలవీర్యమ్ =శక్తి సామర్థ్యములను, ఈరయన్=ఎక్కువ చేయుచును, దైవేన=వేల్పుల రూపముతో, దేవగణాంశ్చ=సురగణములను, నాగేంద్రమ్=నాగరాజైన వాసుకిని, ఉద్దీపయన్=వెలిగింప జేయుచు, ఆవిశత్=వారిలో ప్రవేశించెను.

**తాత్పర్యము :** బోధకు గుఱిగాని రూపముగలవాడైన విష్ణువు అసురరూపమున అసురులతోను, వేల్పు రూపమున దేవతలతోనూ జేరి వారలకు బలమును, సామర్థ్యమును కలిగించుచు నాగరాజు వాసుకిని ధృతసత్త్వముల వెలిగింపజేయుచు వారియందు ప్రవేశించెను.

**శ్లో॥ ఉపర్యగేన్ద్రం గిరిరాడివాన్య ఆక్రమ్య హస్తేన సహస్రబాహుః।**
**తస్థౌ దివి బ్రహ్మభవేన్ద్రముఖ్యైరభిష్టువద్భిః సుమనోఽభివృష్టః॥ 12**

**ప్రతిపదార్థము :** సహస్రబాహుః=వేయి బాహువుల గల విష్ణువు, అగ+ఇంద్రమ్=పర్వత రాజమగు మందరమును, ఉపరి=పైభాగమునందు, అన్యః=ఇతరమైన, గిరిరాట్+ఇవ= పర్వతము వలె, హస్తేన=ఒక హస్తముచే, ఆక్రమ్య=పట్టుకొని, స్తువద్భిః=స్తుతించుచున్న, బ్రహ్మభవ+ఇంద్రముఖ్యైః=బ్రహ్మ, శివుడు, ఇంద్రుడులోనగు దేవతా ముఖ్యులచే, సుమనః +అభివృష్టః=పుష్పములు గురిపింపబడుచున్నవాడై, దివి=ఆకాశమునందు, తస్థౌ=నిల్చెను.

**తాత్పర్యము :** వేయి బాహువులు గలవాడైన మహావిష్ణువు పర్వతరాజైన మందరము పైభాగమునఁజేరి వానినొక హస్తముతోఁబట్టుకొని బ్రహ్మరుద్రేంద్రులు స్తుతించుచుఁదనపై పూవులనుఁగురిపించుచుండ ఆకాశమునందు నిల్చియుండెను.

**శ్లో॥ ఉపర్యధశ్చాత్మని గోత్రనేత్రయోః పరేణ తే ప్రావిశతా సమేధితాః।**
**మమన్థురబ్ధిం తరసా మదోత్కటా మహాద్రిణా క్షోభితనక్రచక్రమ్॥ 13**

**ప్రతిపదార్థము :** ఉపరి=గిరిపై భాగమునందు, అధః=క్రింది భాగమునందు మోయు, ఆత్మని= దేవదైత్యులందును, గోత్రనేత్రయోః=కవ్వమై పర్వతమునకు దార్ఢ్యరూపము కవ్వపుదైన అభేద్యరూపముననే, ప్రావిశతా=ప్రవేశించుచున్న, పరేణ=పరుడైన, హరిచేసే, సమేధితాః= బలవీర్యముల ప్రకాశించువారు, మద+ఉత్కటాః=మదముచే మత్తుగొన్నవారైన సురాసురులు, మహాద్రిణా=ఆ దొడ్డ పర్వతముచే, క్షోభితనక్రచక్రమ్=కలతచెంది మొసళ్ళ సమూహము గలదైన, అబ్ధిమ్=పాలవెల్లిని, తరసా=వడిగా, మమంథుః=మథించిరి.

**తాత్పర్యము :** కొండకు పైన సహస్రబాహువై క్రింద కమఠమై కొండకు పర్వతమునకు దృఢత్వమును కవ్వపుత్రాడైన వాసుకినికి అభేద్యత్వమును కలిగించుచు హరి ప్రవేశించి బలసామర్థ్యములు ప్రసాదించినంతనే చెలరేగి దేవాసురులు మత్తుగొని ఆ పెద్ద కొండచే

## సప్తమోఽధ్యాయః

ఈ సప్తమాధ్యాయమందు మథించుటచే జనించిన విషము వలన భీతినంది అఖిల జనులు స్తుతించినంత రుద్రుడా విషమును ద్రావెను అనుట వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ తే నాగరాజమామన్త్ర్య ఫలభాగేన వాసుకిమ్।**
**పరివీయ గిరౌ తస్మిన్ నేత్రమబ్ధిం ముదాన్వితాః॥ 1**

**ప్రతిపదార్థము :** తే=ఆ దేవదానవులు, ఫలభాగేన=నీకు సైతము అమృతమున భాగము కలుగునని, నాగరాజమ్=సర్పరాజగు, వాసుకిమ్=వాసుకిని, ఆమంత్ర్య=ఆహ్వానించి, ముదా+అన్వితాః=సంతోషముతోఁగూడుకొన్నవారై, తస్మిన్‌గిరౌ=ఆ మందరగిరియందు, నేత్రమ్=కవ్వపుద్రాడుగా, పరివీయ=చుట్టి, అబ్ధిమ్=సముద్రమును –

**తాత్పర్యము :** అ సురాసురులు నాగరాజును వాసుకిని అమృతమునందు భాగమును ఇచ్చెదమని పిలిచి ముదముతో కూడుగొని అతనిని ఆ గిరికి కవ్వపుద్రాడుగా నొనర్చి సముద్రమునందు నిల్పిరి.

**శ్లో॥ ఆరేభిరే సురా యత్తా అమృతార్థే కురూద్వహ।**
**హరిః పురస్తాజ్జగృహే పూర్వం దేవాస్తతోఽభవన్॥ 2**

**ప్రతిపదార్థము :** (తే సురాః=ఆ దేవతలు దానవులు) అమృతార్థే=అమృతమును పొందుటకు, యత్తాః=గొప్ప యత్నముతో, మథితుమ్=సముద్రమును మథించుటకు, ఆరేభిరే= ఆరంభించిరి. వాసుకి యొక్క ముఖము దైత్యులు పట్టుకొనునట్లు చేయుటకు, పూర్వమ్= ముందు, హరిః=విష్ణువు, ముఖమ్=వాసుకి ముఖము లేక శిరమును, జగృహే=గ్రహించెను. తతః=అంతట, దేవాః=దేవతలు, అభవన్=అట్లే శిరమును పట్టుకొనిరి.

**తాత్పర్యము :** అంత దేవతలు అసురులు అమృతమును పొందుటకు సిద్ధపడి సముద్రమును మథింపనారంభించిరి. అసురులచే వాసుకి శిరమును పట్టుకొనజేయుటకై హరి తాను ముందుగా వాసుకి శిరమును పట్టుకొనెను. దేవతలును అట్లే హరివలె వాసుకి శిరమును పట్టుకొనిరి.

**శ్లో॥ తన్నైచ్ఛన్ దైత్యపతయో మహాపురుషచేష్టితమ్।**
**న గృహ్ణీమో వయం పుచ్ఛమహేరఙ్గమమఙ్గళమ్॥ 3**

**ప్రతిపదార్థము :** దైత్యపతయః=దైత్య ప్రభువులు, మహాపురుషచేష్టితమ్=పురుషోత్తముడైన విష్ణుమూర్తి యొక్క చేతయైన, తత్=ఆ వాసుకి శిరమును పట్టుకొనెను. న+ఐచ్ఛన్= ఇచ్ఛగింపరైరి, తెలియనివారై, వయమ్=మేము, అహేః=సర్పము యొక్క, అమంగళమ్= అశుభమైన, అంగమ్=అవయవమైన, పుచ్ఛమ్=తోకను, న గృహ్ణీమః=గ్రహింపము.

**తాత్పర్యము :** ఆ దైత్యులు పురుషోత్తముడు చేసెదు పని యెఱుంగలేక మేము అమంగళమైన ఈ వాసుకి యవయవమైన పుచ్ఛమును పట్టుకొనమనిరి.

**శ్లో॥ స్వాధ్యాయశ్రుతసమ్పన్నాః ప్రఖ్యాతా జన్మకర్మభిః।**
**ఇతి తూష్ణీం స్థితాన్ దైత్యాన్ విలోక్య పురుషోత్తమః॥ 4**

**ప్రతిపదార్థము :** స్వాధ్యాయశ్రుతసంపన్నాః=వేదాధ్యయనముతో గూడినవారము, జన్మకర్మభిః =పుట్టుక చేతను కర్మల అనుష్ఠానము చేతను, ప్రఖ్యాతాః=ప్రసిద్ధులము, ఇతి=అని, తూష్ణీంస్థితాన్=మిన్నకున్న, దైత్యాన్=దైత్యులను, విలోక్య=చూచి, పురుషోత్తమః= పురుషోత్తముడు విష్ణువు ఇట్లనెను.

**తాత్పర్యము :** మేము వేదాధ్యయనము చేసినవారము, జన్మము చేతను యాగాది కర్మలు చేయుట చేతను మేము ప్రసిద్ధికెక్కినవారము. కావున వాసుకి పుచ్ఛమును పట్టుకోము అని మిన్నకున్న దైత్యులను పురుషోత్తముడు విష్ణువు చూచెను.

**శ్లో॥ స్మయమానో విసృజ్యాగ్రం పుచ్ఛం జగ్రాహ సామరః।**
**కృతస్థానవిభాగాస్త ఏవం కశ్యపనన్దనాః॥ 5**

**ప్రతిపదార్థము :** స్మయమానః=చిరునవ్వు నవ్వుకొనుచు, సామరః=అమరులతో గూడిన విష్ణువు, అగ్రమ్=వాసుకి అగ్రభాగమైన శిరమును, విసృజ్య=వీడి, పుచ్ఛమ్=తోకను, జగ్రాహ= పట్టుకొనెను, ఏవమ్=ఈ ప్రకారము, తే=ఆ, కశ్యపనందనాః=కశ్యప ప్రజాపతి కుమారులైన దేవదానవులు, కృతస్థానవిభాగాః=చేయబడిన స్థానము యొక్క పంపకముగలవారై పైకి అన్వయము.

**తాత్పర్యము :** చిరునవ్వు నవ్వుచు వేల్పులతో గూడా వెన్నుడావాసుకి శిరమును విడిచి, పుచ్ఛమును గ్రహించెను. ఇట్లు స్థానములు పంచుకొన్న కశ్యప ప్రజాపతి కుమారులు దానవులు వాసుకి శిరమును, సురలు పుచ్ఛమును పట్టుకొన్నవారైరి.

**శ్లో॥ మమన్థుః పరమం యత్తా అమృతార్థం పయోనిధిమ్।**
**మథ్యమానేఽర్ణవే సోఽద్రిరనాధారో హ్యపోఽవిశత్।**
**ధ్రియమాణోఽపి బలిభిర్గౌరవాత్పాణ్డునందన॥ 6**

**ప్రతిపదార్థము :** పాండునందన=పాండుకుమారా!, దేవదానవులు, పరమం యత్తాః=గొప్ప యత్నముతో సిద్ధపడినవారై, అమృతార్థమ్=అమృతము కొరకు, పయోనిధిమ్=పాల సముద్రమును, మమంథుః=మథించిరి, మథ్యమానే+అర్ణవే=మథింపబడుచున్న ఆ సముద్రము నందు, సః అద్రిః=ఆ మందరగిరి, అనాధారః=క్రింద ఆధారము లేనిదై, బలిభిః =బలాఢ్యులచే, ధ్రియమాణః అపి=ధరింపబడుచున్నదైనను, గౌరవాత్=బరువు వలన, అపః =ఉదకములను, అవిశత్=ప్రవేశించెను.

**తాత్పర్యము :** దేవదానవులు గొప్ప యత్నముతో అమృతార్థము ఆ పాలసముద్రమును జిలికిరి. ఇట్లు మథింపబడు నాక్షీరోధియందు ఆ మందర పర్వతము క్రిందనేమియు ఆధారము లేనిదై బలవంతులు పట్టుకొనియున్నను బరువైనదగుట వలన సముద్ర జలమున మునిగెను.

**శ్లో॥ తే సునిర్విణ్ణమనసః పరిమ్లానముఖశ్రియః।**
**ఆసన్ స్వపౌరుషే నష్టే దైవేనాతిబలీయసా॥ 7**



**ప్రతిపదార్థము :** అతిబలీయసా=మిక్కిలి బలీయమైన, దైవేన=దైవముచే, స్వపౌరుషే=తమ పురుషకారము, నష్టే=విఫలముకాగా, తే=ఆ సురాసురులు, సునిర్విణ్ణమనసః=నిర్వీర్యమైన మనస్సుగలవారు, పరిమ్లానముఖశ్రియః=వాడిన ముఖకాంతి గలవారును, ఆసన్=అయిరి.

**తాత్పర్యము :** అంతనావేల్పులు అసురులు బలిష్ఠము అయిన విధి చేష్టవలన తమ పురుష ప్రయత్నము అంతయు వమ్ముకాగా మనసు నివ్వెరపోయి ముఖశోభవాడినవారైరి.

**శ్లో॥ విలోక్య విఘ్నేశవిధిం తదేశ్వరో దురన్తవీర్యోఽవితథాభిసన్ధిః।**
**కృత్వా వపుః కాచ్ఛపమద్భుతం మహత్ ప్రవిశ్య తోయం గిరిముజ్జహార॥ 8**

**ప్రతిపదార్థము :** విఘ్నేశవిధిమ్=విఘ్నేశ్వరుడు గావించిన పనిని, విలోక్య=చూచి, దురంతవీర్యః=వృథవోని అధికబలముగలవారు, అవితథ+అభిసంధిః=విఫలముగాని సంకల్పము గల, తత్ ఈశ్వరః=ఆ ప్రభువు విష్ణువు, అద్భుతమ్=ఆశ్చర్యకరమైన, మహత్= దొడ్డదైన,కాచ్ఛపమ్=తాబేలు సంబంధమైన, వపుః=శరీరమును, కృత్వా=కావించి పొంది, తోయమ్=నీటిని, ప్రవిశ్య=ప్రవేశించి, గిరిమ్=ఆ మందరగిరిని, నీట మునిగినదాని, ఉజ్జహార=పైకిలేవనెత్తెను.

**తాత్పర్యము :** విఘ్నపతి కార్యమును గాంచి అత్యధికబలుడు, సత్యసంకల్పుడునగు జగత్ప్రభుండునగు విష్ణువు ఆశ్చర్యకరమై దొడ్డదైన తాబేలు రూపమునొంది నీళులంజొచ్చి ఆ మందరగిరిని పైకి లేవనెత్తెను.

**శ్లో॥ తముత్థితం వీక్ష్య కులాచలం పునః సముత్థితా నిర్మథితుం సురాసురాః।**
**దధార పృష్ఠేన స లక్షయోజనప్రస్తారిణా ద్వీప ఇవాపరో మహాన్॥ 9**

**ప్రతిపదార్థము :** కుల+అచలమ్=కులపర్వతమైన, ఉత్థితమ్=పైకిలేచిన, తమ్=ఆ కొండను, వీక్ష్య=చూచి, సురాసురాః=దేవదానవులు, పునః=మరల, మథితుమ్=మథించుటకు, సముత్థితాః=సంసిద్ధులైరి. సః=కర్మరూపియైన ఆ విష్ణువు, లక్షయోజనప్రస్తారిణా=ఒక లక్ష యోజనములు వైశాల్యము గల, పృష్ఠేన=వీపు చేత, దధార=ధరించెను.

**తాత్పర్యము :** కులపర్వతమైన ఆ మందగిరిపైకి లేచినంతనే సురాసురులు మరల మథింప నుద్యుక్తులైరి. కూర్మరూపియైన ఆ మహావిష్ణువు రెండవ జంబూద్వీపమువలె నంత దొడ్డవాడై లక్షయోజనముల విస్తారము గల తన వీపుపై ఆ కొండను ధరించెను.

**శ్లో॥ సురాసురేన్ద్రైర్భుజవీర్యవేపితం పరిభ్రమన్తం గిరిమఙ్గ పృష్ఠతః।**
**బిభ్రత్ తదావర్తనమాదికచ్ఛపో మేనేఽఙ్గకణ్డూయనమప్రమేయః॥ 10**

**ప్రతిపదార్థము :** సుర+అసుర+ఇంద్రైః=దేవదానవపతులచే, భుజవీర్యవేపితమ్=భుజ బలముచే కదల్చబడినదై, అంగపృష్ఠతః=తన మేనివీపుపైన, పరిభ్రమంతమ్=అటు ఇటు తిరుగుచు, గిరిమ్=ఆ కొండను, బిభ్రత్=భరించుచున్న, ఆదికచ్ఛపః=ఆదికూర్మమైన, అప్రమేయః=కొలది మించిన బలముగల ఆ విష్ణువు, తత్+ఆవర్తనమ్=ఆ మందరము యొక్క అటునిటు జరుగుట, అంగకండూయనమ్=శరీరము దురదను పోగొట్టుదానినిగా, మేనే=తలంచెను.

**తాత్పర్యము :** సురాసురులు తమ భుజబలమునంగదలించి ఈశుని వీపుపైనున్న మందరగిరిని

నః=మమ్ములను, త్రైలోక్యదహనాత్=మూడు లోకములను దహించుచున్న, విషాత్=ఈ హాలాహలము నుండి, త్రాహి=రక్షింపుము.

**తాత్పర్యము :** ఓ దేవతలకు దేవుడైనవాడా! ఓ గొప్ప దేవుడా! ప్రాణులకాత్మయైనవాడా! ప్రాణులను సృజించువాడా! నిన్ను శరణుపొందిన ఆపన్నులను (ఆపదనొందినవారిని) ముల్లోకములను దహించు నీ హాలాహల విషమునుండి రక్షించుము.

**శ్లో॥ త్వమేకః సర్వజగత ఈశ్వరో బన్ధమోక్షయోః।**
**త్వాం త్వమర్చన్తి కుశలాః ప్రపన్నార్తిహరం గురుమ్॥ 22**

**ప్రతిపదార్థము :** సర్వజగతః=ఎల్ల జగములకు, బంధమోక్షయోః=సంసారము నుండి బంధ మోక్షమును, త్వమ్=నీవు, ఏకమ్=ఒక్కడవే, ఈశ్వరః=ప్రభుడవు, ప్రపన్న+ఆర్తిహరమ్=శరణు పొందిన వారి దుఃఖమును హరించువాడును, గురుమ్=జగద్గురుడును అగు, తమ్=ఆ, త్వామ్=నిన్ను, కుశలాః=బుద్ధికుశలురు, అర్చంతి=పూజించుచుందురు.

**తాత్పర్యము :** ఎల్ల జగములకు నీవొక్కడవే ప్రభుడవు. సంసారబంధమోక్షమును కలిగించు వాడవు నీవే. శరణుపొందినవారి దుఃఖమును హరించు జగద్గురుడవైన నిన్ను బుద్ధిమంతులు పూజించుచుందురు.

**శ్లో॥ గుణమయ్యా స్వశక్త్యాస్య సర్గస్థిత్యప్యయాన్ విభో।**
**ధత్సే యయా స్వదృగ్ భూమన్ బ్రహ్మవిష్ణుశివాభిధామ్॥ 23**

ఓయీ! ఇట్టివాడు విష్ణువు గదా! ప్రసిద్ధుడన్నచో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** విభో!=ఓ ప్రభూ!, గుణమయ్యా=త్రిగుణాత్మకమైన, స్వశక్త్యా=నీ మాయా శక్తిచే, అస్య=ఈ జగము యొక్క, సర్గస్థితి+అప్యయాన్=సృష్టి స్థితి లయములను, ధత్సే=భరించి చేయుదువు, భూమన్=ఓ నిత్య సుఖస్వరూపా!, సదృక్=ఓ స్వతస్సిద్ధ జ్ఞానము గలవాడా!, యయా=ఏ మాయచేతను, బ్రహ్మ విష్ణు శివాభిధామ్=బ్రహ్మ, విష్ణువు, శివుడు అను పేరులు, ధత్సే=ధరింతువు.

**తాత్పర్యము :** ఓ జగత్ప్రభూ! నీవు త్రిగుణాత్మకమగు నీ మాయాశక్తితో ఈ జగము యొక్క సృష్టి, స్థితి లయములు గావించుచుందువు. ఓ నిత్యసుఖస్వరూపా! ఓ స్వతస్సిద్ధజ్ఞానీ ఆ నీ శక్తి చేతనే బ్రహ్మవిష్ణుశివులను పేరులను పొందుచున్నావు.

**శ్లో॥ త్వం బ్రహ్మ పరమం గుహ్యం సదసద్భావభావనమ్।**
**నానాశక్తిభిరాభాతస్త్వమాత్మా జగదీశ్వరః॥ 24**

అందుకు హేతువును జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** సత్+అసత్+భావభావనమ్=కారణమైన మాయను కార్యములైన దేవమనుష్య తిర్యగాది రూపములను భావించువాడవు, సృజించువాడవు, పరమమ్=ఆద్యంతమైన, గుహ్యమ్=రహస్యమై తెలియని, బ్రహ్మ=బ్రహ్మము, త్వమ్=నీవు, బ్రహ్మవ్యతిరిక్తమైన సృజింపబడిన పదార్థము నీవు అనుచున్నారు. త్వమ్=నీవు, ఆత్మా=ఆత్మవై యున్నావు. నానాశక్తిభిః=జ్ఞానైశ్వర్య బలవీర తేజములులోనగు వివిధ శక్తులచే, ఆభాతః=జగద్రూపమున భాసించు, జగత్+ఈశ్వరః=జగత్ప్రభుడవు నీవే!



మొసళ్ళులోనుగాగల జలజంతువులు కలిగియుండుట వలన పాలవెల్లిని వడివడిగా మథింపసాగిరి.

**శ్లో॥ అహీన్ద్రసాహస్రకఠోరదృఙ్ముఖశ్వాసాగ్నిధూమాహతవర్చసోऽసురాః।**
**పౌలోమకాలేయబలీల్వలాదయో దవాగ్నిదగ్ధాః సరలా ఇవాభవన్॥ 14**

**ప్రతిపదార్థము :** అహీంద్ర=నాగరాజైన వాసుకి యొక్క, సాహస్ర=వేలకొలదిగ సంఖ్యగలవై, కఠోర=తీక్ష్ణములైన, దృక్=నేత్రములవలనను, ముఖ=ముఖము వలనను, శ్వాస=నిట్టూర్పుల వలనను పుట్టిన, అగ్ని=అగ్ని చేతను, ధూమ=పొగచేతను, ఆహత=కొట్టువడి, వర్చసః=తేజము గలవారై, పౌలోమ..లాదయః=పౌలోముడు, కాలేయుడు, బలి, ఇల్వలుడులోనగు, అసురాః =వాసుకి శిరము వంక పట్టుకొన్న అసురులు, దవాగ్ని దగ్ధాః=కాఱుచిచ్చుచే కాలబడిన, సరళాః ఇవ=సరళ వృక్షముల వలె, అభవన్=అయిరి.

**తాత్పర్యము :** నాగరాజయిన వాసుకి యొక్క అసంఖ్యాకములై తీక్ష్ణ ములైన నేత్రములు, ముఖములు, నిట్టూర్పులు లోనగువానినుండి వెలువడిన అగ్నిచేతను, ధూమము చేతను తమ తేజస్సు అంతయు గోల్పోబడి పౌలోముడు, కాలేయుడు, బలి, ఇల్వలుడు లోనగు అసురులు కారుచిచ్చుచే కాల్చబడిన సరళవృక్షములవలెనైరి.

**శ్లో॥ దేవాంశ్చ తచ్ఛ్వాసశిఖాహతప్రభాన్ ధూమ్రామ్బరస్రగ్వర కఞ్చుకాననాన్।**
**సమభ్యవర్షన్ భగవద్వశా ఘనా వవుః సముద్రోర్మ్యుపగూఢవాయవః॥ 15**

**ప్రతిపదార్థము :** తత్+శ్వాసశిఖా+హతప్రభాన్=ఆ వాసుకి నిట్టూర్పులచేనైన అగ్నిజ్వాలలచే కొట్టువడిన తేజముగలవారై, ధూమ్రాంబరస్రక్ వరకంచుకాననాన్=బూడిద వన్నె పొందిన వస్త్రములు, పూమాలలు, మేలైన కవచములు, ముఖములు గలవారైన, దేవాంశ్చ=దేవతలను గురించి, భగవత్+వశాః=భగవంతుని కధీనములైయున్న, ఘనాః=మేఘములు, సమభ్యవర్షన్ =చక్కగా వర్షించినవి, సముద్ర+ఊర్మి+ఉపగూఢవాయవః=మున్నీటి తరగల కౌగిలిచే గొన్ని వాయువులు చల్లగా, వవుః=వీచినవి.

**తాత్పర్యము :** ఆ వాసుకి నిట్టూర్పుల వలన జనించిన అగ్ని జ్వాలలచే తేజములు గోలుపోయి, వలువలు, పూలమాలలు, మిన్నైన కవచములు, మొగములుగల దేవతలపైన భగవదధీనము లైన మేఘములు వర్షించినవి. సముద్ర తరంగముల ఆలింగనమున కొన్ని వాయువులు శీతలముగా వీచెను.

**శ్లో॥ మథ్యమానాత్తథా సిన్ధోర్దేవాసురవరూథపైః।**
**యదా సుధా న జాయేత నిర్మమన్థాజితః స్వయమ్॥ 16**

**ప్రతిపదార్థము :** దేవ+అసుర వరూథపైః=దేవతలయు అసురులయు సేనలకు అధిపులైన వారిచే, తథా=ఆ ప్రకారము, సింధోః=పయోధి నుండి, మథ్యమానాత్=మథించబడినను, యదా=ఏ ప్రకారము, సుధా=అమృతము, న జాయేత=పొడమలేదో, పుట్టలేదో/అగపడలేదో, అజితః=జయింపబడని విష్ణువు, స్వయమ్=తాను స్వయముగా, నిర్మమంథ=మథించెను.

**తాత్పర్యము :** దేవాసురులు సేనాపతులట్లు మథించినను సముద్రమునందెంతకును సుధ ఉద్భవించకపోగా అజితుడగు వెన్నుడు తాను స్వయముగా మథించెను.

శ్లో॥ మేఘశ్యామః కనకపరిధిః కర్ణవిద్యోతవిద్యు
న్మూర్ధ్ని భ్రాజద్విలులితకచః స్రగ్ధరో రక్తకంఠః।
జైత్రైర్దోర్భిర్జగదభయదైర్దన్దశూకం గృహీత్వా
మథ్నన్ మథ్నా ప్రతిగిరిరివాశోభతాథోద్ధృతాద్రిః॥ 17

**ప్రతిపదార్థము :** మేఘశ్యామః=మబ్బువలె నీలిచాయగలవాడును, కనకపరిధిః=పసిడి వంటి పసుపు వలువలు కలవాడును, కర్ణవిద్యోత విద్యుత్=వీనులయందు ప్రకాశించుచున్న మెఱుపువంటి కుండలములు గలవాడును, మూర్ధ్ని=శిరస్సునందు, భ్రాజత్+విలులితకచః =మెఱయుచు చలించుచున్న కురులుగలవాడును, స్రక్+ధరః=పూమాలను ధరించినవాడును, రక్తకంఠః=సొంపైన స్వరముగల కంఠముగలవాడు, జైత్రైః=జయశీలములై, జగత్+అభయదైః =లోకములకభయమిచ్చునది, దోర్భిః=తన నాలుగు బాహువులచే, దందశూకమ్=వాసుకి సర్పమును, గృహీత్వా=పట్టుకొని, అథో=అపుడు, ఉద్ధృతాద్రిః=పైకెత్తి పట్టుకొన్న పర్వతము గలవాడు విష్ణువు, మథ్నా=కవ్వమైన మందరగిరితో, మథ్నన్=మథించుచు, ప్రతిగిరిః ఇవ=ఎదుర్కొన్న పర్వతమువలె, అశోభత=ప్రకాశించెను.

**తాత్పర్యము :** అట్లు విష్ణువు మేఘశ్యాముడును, హేమాంబరుడు, కర్ణములందు ప్రకాశించు మెఱుపు వంటి కుండలములు గలవాడును, శిరమునందు వెలుగొందుచు చలించు శిరోజములు గలవాడును, పుష్పమాలను ధరించినవాడు, మనోహరమైన కంఠస్వరము గలవాడునై జయశీలములై జగములకభయమిచ్చు తన చతుర్బాహువులతో కవ్వమైన ఆ మందరగిరితో మథించుచు అథోభాగమున ఆ మందరాద్రి పైకెత్తి నిల్పుచున్నవాడై ఎదుర్కొన్న రెండవ పర్వతము వలె బ్రకాశించెను.

శ్లో॥ నిర్మథ్యమానాదుదధేరభూద్విషం మహోల్బణం హాలహలాహ్వమగ్రతః।
సమ్భ్రాన్తమీనోన్మకరాహికచ్ఛపాత్ తిమిద్విపగ్రాహతిమిఙ్గిలాకులాత్॥ 18

**ప్రతిపదార్థము :** నిర్మథ్యమానాత్=అట్లు మథించబడుచున్నదియు, సంభ్రాంతమీన= తొట్రుపాటొంది తిరుగుడుపడు చేపలు, ఉత్+మకర+అహి+కచ్ఛపాత్=పైకి తేలివచ్చిన మొసళ్ళు, సర్పములు, తాబేళ్ళు గలదియు, తిమిద్విపగ్రాహ+తిమింగిల+ఆకులాత్= తిమి=తిములను దొడ్డ మత్స్యములు, ద్విప=నీటి యేనుంగులు, గ్రాహ=చొరచేపలు, తిమింగిల=తిమింగిలములను మిక్కిలి దొడ్డ చేపలులోనగువానిచే, ఆకులాత్=తొట్రుపాటు గలదైన, ఉదధేః=సముద్రము నుండి, మహా+ఉల్బణమ్=పైకి ఎక్కువగా ఉబికి వచ్చుచున్నదై, హాలహల+ఆహ్వమ్=హాలాహలమను పేరుగలదైన, విషమ్=విషము, అగ్రతః=ముందుగా, అభూత్=వెలువడినదయ్యెను.

**తాత్పర్యము :** క్రిందికి బైకి తలక్రిందులుగా తిరుగుడుపడు చేపలను, పైకి తేలిన మొసళ్ళు, పాములు, తాబేళ్ళుగలదై తిములను దొడ్డ చేపలు, నీటియేనుంగులు, చొరచేపలు, తిమింగలములను చాలా పెద్ద చేపలు లోనగు వానిచే కలగుండు పడినదై మథింపబడుచున్న ఆ పాలసముద్రము నుండి తీవ్రముగాఁబైకి పొంగివచ్చుచున్నదైన హాలాహలము అను విషము ముందుగా జనించెను.



శ్లో॥ తదుగ్రవేగం దిశి దిశ్యుపర్యథో విసర్పదుత్సర్పదసహ్యమప్రతి।
భీతాః ప్రజా దుద్రువురఙ్గ సేశ్వరా అరక్ష్యమాణాః శరణం సదాశివమ్॥ 19

**ప్రతిపదార్థము :** అంగ=ఓ రాజా!, ఉగ్రవేగమ్=తీవ్రమైన వేగముగలదై, దిశిదిశి=ప్రతి దిక్కునందు, అథ=తర్వాత, ఉపరి=పైభాగమునందు, విసర్పత్=విశేషముగా వ్యాపించుచున్నదియు, ఉత్సర్పత్=పైకి వ్యాపించుచున్నదియు, అసహ్యమ్=సహింపరానిదియు, అప్రతి= ప్రతిక్రియచేయగానిదియునగు, తత్=ఆ హాలాహల విషమును చూచి, ప్రజాః=ప్రజలైన దేవాసురులు, భీతాః=భయపడినవారై, స+ఈశ్వరాః=తమతమ ప్రభువుల తోఁగూడుకొన్న వారై, అరక్ష్యమాణాః=ఎవ్వరి చేతను రక్షింపబడనివారై, సదా=ఎల్లప్పుడు, శివమ్=మేలు కలిగించు వాడైన శివుని, శరణమ్=రక్షకునిగా, దుద్రువుః=పర్వెత్తిరి.

**తాత్పర్యము :** తీవ్రవేగము గలదై అన్ని దిక్కులకును పైకి, గ్రిందికిని వ్యాపించుచు, సహింపరానిదై శాంతిపఁజేయుటకు వలనుగానిదైన ఆ హాలహలమును గాంచి భయపడి దేవాసురులు తమతమ ప్రభువులతో గూడినవారై రక్షణములేనివారై నిరంతరము క్షేమంకరుడగు శంకరుని రక్షకునిగా శరణుపొంద పరుగెత్తిపోయిరి.

శ్లో॥ విలోక్య తం దేవవరం త్రిలోక్యా భవాయ దేవ్యాభిమతం మునీనామ్।
ఆసీనమద్రావపవర్గహేతోస్తపోజుషాణం స్తుతిభిః ప్రణేముః॥ 20

**ప్రతిపదార్థము :** దేవవరమ్=దేవతా శ్రేష్ఠుడును, త్రిలోక్యాః=ముల్లోకముల యొక్క, భవాయ= ఉద్భవమునకై, దేవ్యా=గౌరీదేవితో, అద్రౌ=కైలాసగిరియందు, ఆసీనమ్=కూర్చున్నవాడును, మునీనామ్=మునులకు, అభిమతమ్=ఇష్టుడును, అపవర్గహేతోః=వారి మోక్షము కొఱకు, తపోజుషాణమ్=తపము చేయుచున్నవాడునగు, తమ్=ఆ శివుని, విలోక్య=చూచి, స్తుతిభిః =స్తుతులతో, ప్రణేముః=నమస్కరించిరి.

**తాత్పర్యము :** వేల్పులందు మిన్నయై ముజ్జగములు పుట్టువునకై గౌరితోఁగూడి వెండి కొండపై కూర్చుండియున్న వాడును, మునుల కత్యంత ప్రియుడు, వారికి మోక్షముగలుగుటకై తాను తపము చేయుచున్నవాడునగు ఆ శివుని సందర్శించి సురాసురులు స్తుతులతో మ్రొక్కిరి.

(నిర్గుణం సగుణం చైవ శివం హరిపరాక్రమైః
స్తువన్తస్తు ప్రజేశానా నామన్యన్తాంతరం తయోః॥
ప్రజాపతులు విష్ణువు యొక్క పరాక్రమములచే నిర్గుణుడై సగుణుడైన శివుని స్తుతించు హరిహరులకు భేదమునుదలంచరైరి. ఇది శ్రీధరాచార్యుల శ్లోకము.)

**ప్రజాపతయ ఊచుః :** ప్రజాపతులు వచించిరి.

శ్లో॥ దేవదేవ మహాదేవ భూతాత్మన్ భూతభావన।
త్రాహి నః శరణాపన్నాంస్త్రైలోక్యదహనాద్ విషాత్॥ 21

**ప్రతిపదార్థము :** దేవదేవ=ఓ దేవతలకు దేవుడా!, మహాదేవ!=ఓ దొడ్డ వేల్పా, భూతాత్మన్= ఓ భూతములకు ఆత్మయైనవాడా!, భూతభావన=ప్రాణులచే భావింపబడువాడా!, లేక భూతములను సృజించువాడా !, శరణ+ఆపన్నామ్=నిన్ను శరణుపొందిన, ఆపద పొందిన,

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా! మన్మథుని త్రిపురాసురులను, యముని ఈ విషభక్షణములోనగు ప్రాణిహింసకుల సంహారము చేయు నీకు నిదియంతయు, స్తుతితో లెక్కకు రావు మఱి నీవు ప్రళయ కాలమునందు నీవు ఈ జగమును నీ మూడవ కంట పుట్టిన అగ్నిజ్వాలచే భస్మమైనదానిని గూడ లెక్కకు బాసిపోవు, ఎఱుంగవు.

**శ్లో॥ యే త్వాత్మరామగురుభిర్హృది చిన్తితాఙ్ఘ్రిద్వన్ద్వం చరన్తముమయా తపసాభితప్తమ్।**
**కత్థన్త ఉగ్ర(పు)పరుషం నిరతం శ్మశానే తే నూనమూతిమవిదంస్తవ హాతలజ్జాః॥**

ఇట్లు నిత్యుడవైన నిన్ను పరులననుగ్రహించుట యందు అలసుడని నిందించువారు మూర్ఖులు అని వచించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యే తు=ఎవరైన నిన్ను, ఉమయా=పార్వతితో, చరంతమ్=సంచరించు వానిగ, ఆమెయందు మిక్కిలి ఆసక్తిగల కాముకునిగను, కత్థంతే=వదరుచున్నారో, తపసా=ఫలమును గోరి తపస్సుచే, అభితప్తమ్=కఠోర తపస్సుచే సంతాపమొందువానినిగా, శ్మశానే=శ్మశానము నందు, చరంతమ్=సంచరించు నీకు, నితరామ్=మిక్కిలి, ఉగ్రపురుషమ్=క్రూరుడైన పురుషునిగను, హింస చేయుచు, వదరుదురో, ఆత్మరామగురుభిః=ఆత్మారాములైన గురువులచే విశ్వహితమునుపదేశించువారు, అట్టివారి, హృది=హృదయములందు, చింతితాంఘ్రి ద్వంద్వమ్=ధ్యానించబడిన పాదయుగళము గలవానిని, తపసా అభితప్తమ్=ఏ కాంక్ష చేతను, కఠోర తపస్సు చేయువానినిగ, కత్థంతే=వదరుచున్నారో, తే=వారు, తవ=నీ యొక్క ఊతిమ్=చేష్టను, అవిదన్=ఎఱింగినవారా? కారు. హాతలజ్జాః=విడువబడినసిగ్గుగలవారు, ఆత్మారాముల సేవించు చరణయుగళము గలవాడు కాముడెట్లగునని భావము. మఱి తపస్సు చేయుచు శాంతుడైనవానికా ఉగ్రత్వము పురుషత్వము సంభవించును అని విచారింపకయే ప్రలాపించు చుందురని భావము.

**తాత్పర్యము :** ఎవ్వరు నిన్ను ఉమాదేవితో గూడి ఆమెయందు అత్యంత ఆసక్తితో సంచరించు కాముకునిగాను, ఫలమును కాంక్షించి తపము చేయువానిగను, శ్మశానమునందు ఎప్పుడు నివశించుచున్న క్రూరుడైన పురుషుడిగను ప్రేలుచున్నారో – ఆత్మారాములై పరమాత్మయందే రమించువారై లోకహితమునుపదేశించు గురువులైన హృదయమందునెవ్వని పాద యుగళమును ధ్యానించుచున్నారో అట్టి నీ లీలను ఈ ప్రేలువాఱెంగుదురా? ఎఱుంగనే యెఱుంగరు. ఇట్లు నిన్ను గూర్చి ప్రేలువారెల్లరును సిగ్గులేని వారగుచు ఆత్మారాములగు గురువులు సేవించు పాదయుగళముగల దేవుడెట్లు కాముడగును. తపస్సు చేయుచు కాముడైన వాడు క్రూరుడై హింసకుడగును అని విచారము చేయకయే అట్టివారు ప్రేలుచుందురు.

**శ్లో॥ తత్ తస్య తే సదసతోః పరతః పరస్య నాఞ్జః స్వరూపగమనే ప్రభవన్తి భూమ్నః।**
**బ్రహ్మాదయః కిముత సంస్తవనే వయన్తు తత్సర్గసర్గవిషయా అపి శక్తిమాత్రమ్॥34**

అట్టి నిందకుల వార్త ఇప్పుడట్లుండుగాక! మహాత్ములు సైతము నీతత్త్వమును ఎఱుంగలేరని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** తత్=అందువలన, అంజః=నిజముగా ఓ దేవా! సత్+అసతోః=కారణమైన మాయ కంటెను, కార్యమైన జగత్తుకంటెను, పరతః=పరుడై, పరస్య=పరమాత్ముడు, భూమ్నః



**తాత్పర్యము :** కారణమైన మాయను కార్యమైన దేవమనుష్యతిర్యగాది వ్యక్తులను సృజించు వాడవును, అత్యంత నిగూఢమైన పరబ్రహ్మము నీవు, ఎల్లప్రాణులకు ఆత్మవు నీవు, జ్ఞాన తేజోబలైశ్వర్యాదులు వివిధశక్తులతో జగద్రూపమున భాసించు జగత్ప్రభుడవు నీవు.

**శ్లో॥ త్వం శబ్దయోనిర్జగదాదిరాత్మా ప్రాణేన్ద్రియద్రవ్యగుణస్వభావః।**
**కాలః క్రతుః సత్యమృతం చ ధర్మస్త్వయ్యక్షరం యత్ త్రివృదామనన్తి॥ 25**

స్వతసిద్ధమైన జ్ఞానమునుపపాదించుచు జగత్స్వరూపమును ఆభాసించు ప్రకారమును జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, శబ్దయోనిః=వేదమునకు ఉత్పత్తి స్థానము, ఇందువలన స్వతస్సిద్ధ జ్ఞానివి., త్వమ్=నీవు, జగత్+ఆది=జగత్తునకు మొదలైన మహత్తత్వము, ఆత్మా=అహంకార స్వరూపుడవు, ప్రాణ... స్వభావః=ప్రాణ+ఇంద్రియ ద్రవ్య=పంచప్రాణములు చక్షురాదీంద్రియములను ద్రవ్యములకు కారణములై, గుణస్వభావః=సత్త్వరజస్తమస్సులను ప్రసిద్ధములగు గుణములు, వాని స్వభావములు గలవాడవు నీవే, కాలః=కాలము, క్రతుః=సంకల్ప రూపుడవు నీవే!, సత్యమ్=సత్యము, ఋతమ్=కర్మఫలప్రదాత, ధర్మః=ధర్మము, త్వయి=నీయందు, యత్=ఏది, త్రివృత్=త్రిగుణాత్మకమగు, అక్షరమ్=ప్రధానము గలదో, త్వయి=నీయందు, నీవు ఆశ్రయముగా గలదైయున్నది అని చెప్పుచున్నాడు. త్వయి=నీయందు, త్రివృత్=అకార ఉకార మకారాత్మకములు, తత్ అక్షరమ్=ఆ ప్రకారము, ఆమనంతి=నిన్ను ప్రకాశింప జేయునదని చెప్పుదురు.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా! నీవు వేదమునకు మూలము. స్వతసిద్ధమైన జ్ఞానము గలవాడవు. జగత్తునకు మొదట మహత్తత్త్వము నీవు. అహంకారతత్వము నీవు ప్రాణము, ఇంద్రియములను ద్రవ్యములకు గారణమైన సత్త్వాది త్రిగుణముల స్వభావముగలవాడవు. కాలము, సంకల్పము, సత్యము, ఋతము యేధర్మము గలదో అది నీవు. మహదాదులకు హేతువై త్రిగుణాత్మకమైన ప్రధానమునకు ఆశ్రయుడవు నీవు. అకారోకారమకారాత్మకమగు ప్రణవము నిన్ను ప్రకాశింప జేయునదని చెప్పుదురు.

**శ్లో॥ అగ్నిర్ముఖం తేఽఖిలదేవతాత్మా క్షితిం విదుర్లోకభవాఙ్ఘ్రిపఙ్కజమ్।**
**కాలం గతిం తేఽఖిలదేవతాత్మనో దిశశ్చ కర్ణౌ రసనం జలేశమ్॥ 26**

**ప్రతిపదార్థము :** అఖిలదేవతాత్మన్=సమస్త దేవతల స్వరూపమైనవాడు, అఖిలదేవతాత్మా సర్వదేవతా స్వరూపుడైన, శ్రుతి : "అగ్నిః సర్వదేవతాః" అగ్నిః=అగ్ని, తే=నీకు, ముఖమ్=ముఖముగాను, భవ=లోకమును సృజించువాడా!, క్షితిమ్=భూమిని, అంఘ్రి పంకజమ్=నీ పాదకమలముగా, కాలమ్=కాలము, గతిమ్=నీ నడకనుగాను, దిశశ్చ=దిక్కులను, కర్ణౌ=చెవులుగాను, జలేశమ్=వరుణుడు, రసనమ్=నాలుకగాను, విదుః=పెద్దలు ఎఱుంగుదురు.

**తాత్పర్యము :** ఓ సర్వదేవతాత్ముడా! సర్వదేవతారూపుడగు అగ్ని నీ ముఖము, ఓ లోకమును సృజించువాడా భూమి నీ పాదకమలము, కాలము నీ గమనము, దిక్కులు నీ కర్ణము, జలాధిపతి వరుణుడు నీ జిహ్వ అని పెద్దలు ఎఱుంగుదురు.

**శ్లో॥ నాభిర్నభస్తే శ్వసనం నభస్వాన్ సూర్యశ్చ చక్షూంషి జలం స్మ రేతః।**
**పరావరాత్మాశ్రయణం తవాత్మా సోమో మనో ద్యౌర్భగవచ్ఛిరస్తే॥ 27**

**ప్రతిపదార్థము :** భగవన్=ఓ భగవంతుడా!, నభః=ఆకాశము, తే=నీకు, నాభిః=పొక్కిలి (నాభి), నభస్వాన్=వాయువు, శ్వసనమ్=ఉచ్ఛ్వాసనిశ్వాసములు, సూర్యశ్చ=సూర్యుడు, చక్షూంషి=నేత్రములు, జలం చ=జలము, రేతః=వీర్యము, పర+అవర+ఆత్మ+ ఆశ్రయణమ్=పరులు, అపరులునగు జీవులకు ఆశ్రయమైనది మాయ, తవ=నీకు, ఆత్మా=అహంకారము, సోమః=చంద్రుడు, మనః=మనస్సు, ద్యౌః=స్వర్గము, తే=నీకు, శిరః=శిరస్సు అని చెప్పుదురు.

**తాత్పర్యము :** ఓ భగవానుడా! ఆకాశము నీకు బొడ్డు, వాయువు నీకు శ్వాసము, సూర్యుడు నేత్రములు, జలము వీర్యము, స్థావర జంగమ శరీరము పొందిన జీవులకు ఆశ్రయమైన మాయ నీకు అహంకారము. చంద్రుడు నీకు మనస్సు, స్వర్గము నీకు శిరస్సు అని చెప్పుదురు.

**శ్లో॥ కుక్షిః సముద్రా గిరయోఽస్థిసఙ్ఘా రోమాణి సర్వౌషధివీరుధస్తే।**
**ఛన్దాంసి సాక్షాత్ తవ సప్త ధాతవస్త్రయీమయాత్మన్ హృదయం స ధర్మః॥ 28**

**ప్రతిపదార్థము :** త్రయీమయాత్మన్=ఓ వేదస్వరూపుడా!, సముద్రాః=సముద్రములు, కుక్షిః=నీకు జఠరము, గిరయః=పర్వతములు, అస్థిసంఘాః=ఎముకలు, సర్వౌషధి వీరుధః=ఎల్ల ఓషధులు, పొదలు, తే=నీకు, రోమాణి=రోమములు, ఛందాంసి=గాయత్ర్యాది సప్త ఛందస్సులు, సాక్షాత్=ప్రత్యక్షముగా, తవ=నీకు, సప్తధాతవః=సప్తధాతువులు, సః=ఆ, ధర్మః=ధర్మదేవత, హృదయమ్=నీకు హృదయము.

**తాత్పర్యము :** ఓ వేదస్వరూపుడా! సముద్రములు నీకు ఉదరము. పర్వతములు నీకు అస్థులు, వృక్షలతాదులు నీకు రోమములు, గాయత్రీలోనగు ఛందస్సులు నీకు సప్తధాతువులు. ఆ ధర్మదేవత నీకు హృదయమని చెప్పుదురు.

**శ్లో॥ ముఖాని పఞ్చోపనిషదస్తవేశ యైస్త్రింశదష్టోత్తరమన్త్రవర్గః।**
**యత్తచ్ఛివాఖ్యం పరమార్థతత్త్వం దేవః స్వయంజ్యోతిరవస్థితిస్తే॥ 29**

**ప్రతిపదార్థము :** ఈశ=ఓ పరమేశ్వరా!, పంచ+ఉపనిషదః=తత్పురుషము, అఘోరము, సద్యోజాతము, వామదేవము, ఈశానము అను ఐదు మంత్రములు, తవ=నీ యొక్క, ముఖాని=ముఖములు, యైః=ఏ అయిదు ముఖముల చేత, త్రింశత్+అష్టోత్తర మంత్రవర్గః=ముప్పది ఎనిమిది కళాత్మకములగు మంత్రములగుచున్నవో, దేవ!=ఓ దేవుడా!, యత్=ఏది, శివాఖ్యమ్=శివ అను పేరుగలదై, పరమార్థతత్త్వమ్=పరమాత్మ తత్త్వమై, స్వయంజ్యోతిః=స్వయం ప్రకాశకమైన తత్త్వముగలదో, తత్=అది, తే=నీకు, అవస్థితిః=విశ్రాంతి స్థితియై యున్నది.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా! తత్పురుషము, అఘోరము, సద్యోజాతము, వామదేవము, ఈశానము అను మంత్రములైదును నీ ముఖములు. నీ ముఖములవలననే ముప్పది యెనిమిది కళాస్వరూపములగు మంత్రములు జనించుచున్నవి. చిత్తమను/శివమను పేరుగలదై స్వయం జ్యోతియైన పరమాత్మతత్త్వము నీ విశ్రాంతి స్థితియై యున్నది.



**శ్లో॥ ఛాయా త్వధర్మోర్మిషుయైర్విసర్గో నేత్రత్రయం సత్త్వరజస్తమాంసి।**
**సాంఖ్యాత్మనః శాస్త్రకృతస్తవేక్షా ఛన్దోమయో దేవ ఋషిః పురాణః॥ 30**

**ప్రతిపదార్థము :** అధర్మ+ఊర్మిషు=అధర్మము యొక్క అలలైన, దంభము, లోభములోనగు గుణములందు, ఛాయాః తు=నీ ఛాయలు, యై=ఏ గుణములచే, విసర్గః=పై సర్గము సంహారము చేయబడునో లేక, యైః=వేనిచేత, విసర్గః=వివిధమగు సృష్టిచేయబడునో ఆ, సత్త్వరజస్తమాంసి=ఆ సత్త్వరజస్తమస్సులను మూడు గుణములు, నేత్రత్రయమ్=నీకు మూడు కన్నులు, హే దేవ!=ఓ దేవా, ఛందోమయః=ఛందస్వరూపమై, పురాణః=ప్రాచీనమైన, ఋషిః=సర్వజ్ఞమైన, మనుః=వేదము, శాస్త్రకృతః=వేదకారణుడవైన, తవ=నీకు, సాక్షాత్=ప్రత్యక్షమైన, ఈక్షా=చక్షురింద్రియము.

**తాత్పర్యము :** అధర్మము యొక్క తరంగములైన దంభలోభాది గుణములు నీ తనుఛాయలు, వివిధమైన సృష్టిని చేయునట్టి సత్త్వరజస్తమస్సులను మూడు గుణములు నీకు మూడు నేత్రములు. ఓ దేవా! గాయత్రిలోనగు ఛందస్సులచే ప్రకాశితమై ప్రాచీనమై సర్వజ్ఞమైన వేదము నీకు ప్రత్యక్షమగు చక్షురింద్రియము అగును.

**శ్లో॥ న తే గిరిత్రాఖిలలోకపాలవిరిఞ్చవైకుంఠసురేన్ద్రగమ్యమ్।**
**జ్యోతిః పరం యత్ర రజస్తమశ్చ సత్త్వం న యద్ బ్రహ్మనిరస్తభేదమ్॥ 31**

**ప్రతిపదార్థము :** గిరిత్ర=ఓ గిరీశా!, తే=నీ యొక్క, పరంజ్యోతిః=స్వయం ప్రకాశమైన ఆత్మజ్యోతి, అఖిల... గమ్యమ్, అఖిలలోకపాల=ఎల్ల జగములను పాలించువారగు, విరించ వైకుంఠ సురేంద్ర గమ్యమ్=బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడులోనగువారికి ప్రాప్తించదగినది, న=కాదు, యత్ర=ఏ పరంజ్యోతి స్వరూపమునందు, రజః=రజస్సు, తమశ్చ=తమస్సు, సత్త్వమ్=సత్త్వము అను గుణములు, న=లేవో, యత్=ఏది, నిరస్తభేదమ్=సజాతీయ విజాతీయ స్వగత భేదరహితమైన, బ్రహ్మ=బ్రహ్మమైయున్నదో-

**తాత్పర్యము :** ఓ గిరీశా! స్వయంప్రకాశమైన నీ స్వరూపము ఎల్లలోకములనేలు బ్రహ్మ విష్ణు దేవేంద్రాదులకు పొందరాదు. ఏ పరంజ్యోతి స్వభావమునందు సత్త్వరజస్తమస్సులను త్రిగుణములు లేవో దేవా! ఏది సజాతీయ విజాతీయ స్వగత భేదరహితము బ్రహ్మమై యున్నదో-

**శ్లో॥ కామాధ్వరత్రిపురకాలగరాద్యనేకభూతద్రుహః క్షపయతః స్తుతయే న తత్తే।**
**యస్త్వన్తకాల ఇదమాత్మకృతం స్వనేత్రవహ్నిస్ఫులిఙ్గశిఖయా భసితం న వేద॥ 32**

**ప్రతిపదార్థము :** కామ... ద్రుహః - కామ=మన్మథుడు, అధ్వర=దక్షయజ్ఞము, త్రిపుర=త్రిపురాసురులు, కాలగర+ఆది=కాలుడు విష భక్షణములులోనగు, అనేక=అనేకములైన, భూతద్రుహః=ప్రాణుల హింసించువారి, క్షపయతః=హతమార్చు, తే=నీకు, తత్=ఆ కార్యము, స్తుతయే=స్తుతి కొరకు, న=అర్హములు కావు, యః తు=ఏ నీవు, అంతకాలే=ప్రళయకాలము, ఆత్మకృతమ్=తనచే సృజింపబడిన (విషభక్షణము సైతము అవశ్యము కాదగినది గనుక సిద్ధించిన దానివలె నిర్దేశించు) ఇదమ్=ఈ జగమును, స్వనేత్రవహ్ని స్ఫులింగశిఖయా=నీ నేత్రమునందు పొడమిన అగ్ని యొక్క రవ్వల జ్వాలచే, భసితమ్=భస్మమై పోయినదానిని, న వేద=లెక్కకు బాసికొనవు.

**తాత్పర్యము :** అట్లు ఆ శివుడు భక్షించిన జలదోషమై జనించిన ఆ హాలాహలమును శివునికి సైతము కంఠమున కందునట్లు నీలివన్నె కలిగించెను. ఆ నీలవర్ణము దయాళువైన శివునికి కంఠభూషణమై వెలిగెను.

**శ్లో॥ తప్యన్తే లోకతాపేన సాధవః ప్రాయశో జనాః।**
**పరమారాధనం తద్ధి పురుషస్యాఖిలాత్మనః॥ 44**

**ప్రతిపదార్థము :** ప్రాయశః=తఱచుగ, సాధవః=దయాళువులైన, జనాః=జనులు, లోకతాపేన=ప్రజల యొక్క వ్యథచే, తప్యంతే=వారికి సాయము చేయుటచే సంతాపము పొందుదురు గాక!, తత్+హి=అట్లు పరోపకారమున సంతాపము పొందుట, అఖిల+ఆత్మనః=సర్వమునకు ఆత్మయైన, పురుషస్య=శ్రీ విష్ణువునకు, పరమ+ఆరాధనమ్=దొడ్డ పూజయగును లేక సంతోష కారణమగును.

**తాత్పర్యము :** దయావంతులైన సాధుజనులు లోకుల కష్టములను మాన్ప తామును కష్టముల పాలగుదురు. అట్లు కష్టమును పొంది సాయపడుట సర్వాత్ముడగు హరికి ఉత్తమ పూజయగును.

**శ్లో॥ నిశమ్య కర్మ తచ్ఛంభోర్దేవదేవస్య మీఢుషః।**
**ప్రజా దాక్షాయణీ బ్రహ్మా వైకుణ్ఠశ్చ శశంసిరే॥ 45**

**ప్రతిపదార్థము :** మీఢుషః=ఆశ్రితులకు అభీష్టముల గురియువాడును, దేవదేవస్య=దేవతలకు దేవుడైన, శంభోః=ఈశ్వరుని యొక్క, తత్+కర్మ=ఆ విషభక్షణమను పనిని, నిశమ్య=విని చూచి, ప్రజాః=ప్రజలు దేవాసురులు, దాక్షాయణీ=పార్వతి, బ్రహ్మా=బ్రహ్మ, వైకుంఠః=విష్ణువు, శశంసిరే=స్తుతించిరి.

**తాత్పర్యము :** ఆశ్రితులకు అభీష్టములు వర్షించు దేవదేవుడాశంభుడు గావించిన విషభక్షణ మను ఆయాశ్చర్యకర్మను గాంచి సురాసురులను ప్రజలు, గౌరీదేవి, బ్రహ్మ, విష్ణువును, శంకరుని స్తుతించిరి.

**శ్లో॥ ప్రస్కన్నం పిబతః పాణేర్యత్కిఞ్చిజ్జగృహుః స్మ తత్।**
**వృశ్చికాహివిషౌషధ్యో దన్దశూకాశ్చ యేఽపరే॥ 46**

**ప్రతిపదార్థము :** పిబతః=విషపానముచేయుచున్న శివుని యొక్క, పాణేః=హస్తము నుండి, యత్+కించిత్=ఏ కొంచెము, ప్రస్కన్నమ్=విషము జారినదో, తత్=ఆ విషము, వృశ్చిక+అహి+విష+ఓషధ్యః=తేళ్ళు, పాములు, విషములైన ఓషధులు, సరే=ఇంకను ఇతరములైన, దందశూకాః=కరచునట్టి ఎలుకలులోనగు విష జంతువులు, జగృహుః స్మ=గ్రహించినవి.

**తాత్పర్యము :** శంకరుడు విషమును పానము చేయుచున్నప్పుడు ఆయన హస్తము నుండి యించుకంత జాఱిన యా విషమును తేళ్ళు, పాములు విషప్రదములగు ఓషధులు, ఇంకను విష జంతువులు గ్రహించినవి.

ఇతి శ్రీమద్భాగవతమహాపురాణే అష్టమస్కంధే సప్తమో - ధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమునందు మహాపురాణమున అష్టమస్కంధమున సప్తమాధ్యాయము.



=నిత్య సుఖస్వరూపుడైన, తస్య=అట్టి, తే=నీయొక్క, స్వరూపగమనే=రూపమును తెలిసికొనుట యందు, బ్రహ్మాదయః=ప్రజాపతులులోనగువారు, న ప్రభవంతి=సమర్థులుగారు. కిముత సంస్తవనే=నిన్ను స్తుతించుటయందు శక్తులెట్లగుదురో, వయంతు=మేమన్ననో, తత్ సర్గసర్గవిషయాః=వారి సృష్టి కంటె తర్వాత, సృష్టికి చెందినవారము నిన్ను స్తుతింపనెట్లు సమర్థులమగుదుము. అపి=అట్లయిన ఈ మేము చేయు నీస్తుతి, శక్తిమాత్రమ్=మా ఆత్మశక్తికి పరిమితమై మాత్రమే యున్నది ఓ దేవా!

**తాత్పర్యము :** కారణమైన మాయకంటెను కార్యమైన జగముకంటెను బరుడై పరమాత్మయై నిత్య సుఖస్వరూపుడైన నా స్వరూపజ్ఞానము నందు బ్రహ్మ దక్షప్రజాపతులులోనగువారు సైతము సమర్థులు గారు. మరి నిన్ను స్తుతింపనెట్లు సమర్థులగుదురు. వారి సృష్టికిఁ దర్వాత వారు సృజింపగా జనించినవారమైన మేమెంతమాత్రము నిన్ను స్తుతింపగలము. అట్లయిన మేము చేయు స్తుతి మా ఆత్మశక్తికి పరిమితమైయున్నది.

**శ్లో॥ ఏతత్పరం ప్రపశ్యామో న పరం తే మహేశ్వర।**
**మృడనాయ హి లోకస్య వ్యక్తిస్తేఽవ్యక్తకర్మణః॥ 32**

దానినే చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** మహేశ్వర!=ఓ పరమేశ్వరా!, ఏతత్=ఈ పరిమితమైన, తే=నీయొక్క పరమ్=రూపమును, ప్రపశ్యామః=చూచుచున్నాము, అపరమ్=ఇతరమైన నీ రూపము, న=చూడలేకున్నను నీ దర్శనము వలననే మేము కృతార్థులమైతిమి. అవ్యక్తకర్మణః=వ్యక్తము గాని కర్మగల మాయచే జగత్సృష్ట్యాది కర్మగావించు, తే=నీయొక్క, వ్యక్తిః=స్వరూపము, లోకస్య=జగము యొక్క, మృడనాయ హి=సుఖము కొఱకే యగును.

**తాత్పర్యము :** ఓ మహేశ్వరా! మా ఇంద్రియములకు గోచరమైన పరిమితమైన ఈ నీ రూపమును మాత్రము చూడగలిగితిమి. కాని ఇందుకు వేఱైన నీ రూపము మేము చూడలేకున్నాము. ఎవ్వరికి నూహింపరాని కర్మగలవారు మాయాదికము వలన జగత్సృష్టియను కర్మ గావించువాడవైన నీ యొక్క వ్యక్తమైన ఈ స్వరూపము లోకమునకు సుఖము గలిగించునదగుచున్నది.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ తద్వీక్ష్య వ్యసనం తాసాం కృపయా భృశపీడితః।**
**సర్వభూతసుహృద్ దేవ ఇదమాహ సతీం ప్రియామ్॥ 36**

**ప్రతిపదార్థము :** తాసామ్=ఆ దేవతల యొక్క, తత్=ఆ, వ్యసనమ్=హాలాహలమను విషము వలన కలిగిన దుఃఖమును, వీక్ష్య=చూచి, కృపయా=దయచే, భృశపీడితః=మిగుల పీడింపబడినవాడు, సర్వభూత సుహృద్=ఎల్ల ప్రాణులకు మేలుచేయువాడై, దేవః=శివుడు, ప్రియామ్=ప్రియురాలైన, సతీమ్=భార్యయైన పార్వతిని చూచి, ఇదం ఆహ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** ఆ దేవతలకు గలిగిన హాలాహలమను విషము వలన దుఃఖమును గాంచి శివుడు మిగుల కృపగలవాడై సర్వభూతములకు మేలు గోరువాడైన ఆ దేవుడు ప్రియ భార్యయగు పార్వతితో నిట్లనెను.

**శ్లో॥ అహో బత భవాన్యేతత్ ప్రజానాం పశ్య వైశసమ్।**
**క్షీరోదమథనోద్భూతాత్ కాలకూటాదుపస్థితమ్॥ 37**

నా ప్రభావమును విచారించక విషపానమునందు ప్రవృత్తుడనైన నన్ను ఎట్లయిన ఈ ప్రియురాలు వారించునను శంకచే ఆమెను అనుమతింపజేయుచు చెప్పుచున్నాడు నాలుగు శ్లోకములలో.

**ప్రతిపదార్థము :** భవాని=ఓ పార్వతీ!, అహో!=ఔరా!, బత=అయ్యో!, ప్రజానామ్=సురాసురులు లోనగు ప్రజలకు, క్షీరోదమథన+ఉద్భూతాత్=క్షీరసాగరము మథించుట వలన జనించిన, కాలకూటాత్=కాలకూట విషము వలన, ఏతత్=ఈ, వైశసమ్=దుఃఖము, ఉపస్థితమ్=సంభవించినది, పశ్య=చూడుము.

**తాత్పర్యము :** ఓ పార్వతీ! ఔరా! అక్కటా! పాలకడలిని ద్రచ్చుటవలన/మథించుట వలన బొడమిన కాలకూట విషము వలన దేవాసురులకు దుఃఖము సంభవించినది చూడుము.

**శ్లో॥ ఆసాం ప్రాణపరీప్సూనాం విధేయమభయం హి నః।**
**ఏతావాన్ హి ప్రభోరర్థో యద్దీనపరిపాలనమ్॥ 38**

**ప్రతిపదార్థము :** ప్రాణపరీప్సూనామ్=ప్రాణరక్షణము గోరుచున్న, ఆసామ్=ఈ ప్రజలకు (సురాసురులకు), నః=మనకు, అభయమ్=అభయదానము, విధేయమ్=చేయదగినది, యత్=ఏది, దీనపరిపాలనమ్=దీనులగు వారిని రక్షించగల, ఏతావాన్=ఇదియే ఇంతమాత్ర(మైన), ప్రభోః=సమర్థుడైనవాని యొక్క, అర్థమ్=కార్యమై యున్నది.

**తాత్పర్యము :** ప్రాణరక్షణము గోరు నీ ప్రజలకు (సురాసురులకు) మనము అభయదానము నీయవలెను సుమా! సమర్థుడైన వానికి దీనులను రక్షించుటయే కదా ఉత్తమమైన కార్యమై యున్నది.

**శ్లో॥ ప్రాణైః స్వైః ప్రాణినః పాన్తి సాధవః క్షణభఙ్గురైః।**
**బద్ధవైరేషు భూతేషు మోహితేష్వాత్మమాయయా॥ 39**

**ప్రతిపదార్థము :** ఆత్మమాయయా=పరమాత్మ మాయచే, భూతేషు=ప్రాణులు, మోహితేషు=మోహమును బొందినవై, బద్ధవైరేషు=ఏర్పడిన వైరముగలవై, ఒండొకటిని జంపు కొనుచున్న వగుచుండగా, సాధవః=సత్పురుషులు, క్షణభంగురైః=క్షణములో నశించునవైన, స్వైః ప్రాణైః =తమ ప్రాణములచే, ప్రాణినః=ప్రాణులను, పాంతి=రక్షింతురు.

**తాత్పర్యము :** భగవంతుని మాయచే మోహమును బొంది ఎల్లప్రాణులు పరస్పరము వైరము గలిగి ఒండొంటిని జంపుకొనగోరుచుండును. అట్టి తఱి సాధువులు క్షణభంగురములైన తమ ప్రాణములనొసగి ప్రాణులను రక్షించుదురు.

**శ్లో॥ పుంసః కృపయతో భద్రే సర్వాత్మా ప్రీయతే హరిః**
**ప్రీతే హరౌ భగవతి ప్రీయేఽహం సచరాచరః**
**తస్మాదిదం గరం భుఞ్జే ప్రజానాం స్వస్తిరస్తు మే॥ 40**

**ప్రతిపదార్థము :** భద్రే=ఓ మంగళశాసనీ!, కృపయతః=ఈ ప్రజలపై కృపచూపు, పుంసః =పురుషునికి, సర్వాత్మా=సర్వమునకు ఆత్మయైన, హరిః=హరి, ప్రీయతే=ప్రీతి చెందును. భగవతి=భగవంతుడు, హరౌ=విష్ణువు, ప్రీతే=సంతోషించెనేని, సచరాచరః=చరాచర ప్రపంచముతో కూడిన, ప్రీయే - హమ్=నేను ప్రీతిపొందెదను. తస్మాత్=అందువలన, ఇదం గరమ్=ఈ విషమును, భుంజే=భుజించెదను, మే=నా వలన, ప్రజానామ్=ప్రజలకు, స్వస్తి= మంగళము, అస్తు=అగుగాక.



**తాత్పర్యము :** ప్రాణులపైఁగనికరము చూపు పురుషుని విషయమై విష్ణువు సంతోషించును. భగవంతుడు హరి సంతోషించెనేని ఈ చరాచర ప్రపంచముతో కూడిన నేను సంతోషింతును. కావున ఈ విషమును నేను భుజించెదను. నా వలన ప్రజలకు శుభము కలుగును గాక!

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవమామన్త్ర్య భగవాన్ భవానీం విశ్వభావనః।**
**తద్ విషం జగ్ధుమారేభే ప్రభావజ్ఞాఽన్వమోదత॥ 41**

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడు శివుడు, విశ్వభావనః=విశ్వమును సృజించువాడు, ఏవమ్=ఈ ప్రకారము, భవానీమ్=పార్వతిని గూర్చి, ఆమంత్ర్య=అనుమతింపఁజేసి, తత్+ విషమ్=ఆ హాలాహల విషమును, జగ్ధుమ్=మ్రింగుటకు, ఆరేభే=ప్రారంభించెను, భవానీ= పార్వతి, అన్వమోదత=ఆయన ప్రభావము తెలిసినది కనుక అందుకు ఆమోదించెను.

**తాత్పర్యము :** విశ్వకర్తయు భగవంతుడునగు హరుడిట్లు పార్వతికి చెప్పి, ఆమె ననుమతింపఁజేసి ఆ హాలాహల విషమును భుజింప నారంభించెను. తత్ప్రభావమును దెలిసిన పార్వతియు నందుకామోదించెను.

**శ్లో॥ తతః కరతలీకృత్య వ్యాపి హాలాహలం విషమ్।**
**అభక్షయన్ మహాదేవః కృపయా భూతభావనః॥ 42**

**ప్రతిపదార్థము :** తతః=అంత, భూతభావనః=ప్రాణులను సృజించువాడగు, మహాదేవః =శివుడు, వ్యాపి=అంతట వ్యాపించుచున్న, హాలాహలం విషమ్=హాలాహలమను విషమును, కరతలీ కృత్య=అరచేతిలోనికి పరిమితమగునట్లుగా జేసి, కృపయా=ప్రాణులపై దయతో, అభక్షయత్= భక్షించెను.

**తాత్పర్యము :** అంత ప్రాణులను సృజించు మహాదేవుడు శివుడు ప్రాణులపై దయతో అంతట వ్యాపించు ఆ హాలాహల విషమును అరచేతిలోనికి పరిమితమగునట్లుగా జేసి భక్షించెను.

**శ్లో॥ తస్యాపి దర్శయామాస స్వవీర్యం జలకల్మషః।**
**యచ్చకార గళే నీలం తచ్చ సాధోర్విభూషణమ్॥ 43**

**ప్రతిపదార్థము :** జలకల్మషమ్=జలదోషమైన ఆ విషము, స్వవీర్యమ్=తన బలమును, తస్య+అపి=ఆ శివునికి సైతము, దర్శయామాస=చూపెను. యత్=ఏ విషము, గళే=శివుని కంఠము, నీలమ్=నలుపు వన్నెను, కందిపోవుటను, చకార=చేసెను, తత్ చ=ఆ కందిన నలుపు వన్నెయు, సాధోః=సాధువైన శివునికి, విభూషణమ్=కంఠ భూషణమైనది.

శ్లో॥ ఋషయః కల్పయాంచక్రురాభిషేకం యథావిధి।
జగుర్భద్రాణి గన్ధర్వా నట్యశ్చ ననృతుర్జగుః॥ 11

**ప్రతిపదార్థము :** ఋషయః=మహర్షులు శ్రీదేవికి, ఆభిషేకమ్=గంగాది జలాభిషేకమును, యథావిధి=శాస్త్ర విధానమున, కల్పయాం చక్రుః=కావించిరి, గంధర్వాః=గంధర్వులు, భద్రాణి=మంగళగీతములను, జగుః=గానము చేసిరి, నట్యశ్చ=నట్టువకత్తెలైన అచ్చరలు, ననృతుః=నాట్యమాడిరి, జగుః=పాటలు పాడిరి.

**తాత్పర్యము :** మహర్షులు శ్రీదేవికి శాస్త్రవిధానమున గంగాది జలములనభిషేకించిరి. గంధర్వులు మంగళగీతములు గానము చేసిరి. నట్టువకత్తెలైన అచ్చరలు నాట్యమాడిరి, పాటలు పాడిరి.

శ్లో॥ మేఘా మృదఙ్గపణవమురజానకగోముఖాన్।
వ్యనాదయన్ శఙ్ఖవేణువీణాస్తుములనిఃస్వనాన్॥ 12

**ప్రతిపదార్థము :** మేఘాః=మేఘములు, మృదంగ... ముఖాన్; మృదంగ=మద్దెలలను, పణవ=చిన్న మద్దెలలను, మురజ=పెద్ద మద్దెలలను, ఆనక=తప్పెటలను, గోముఖాన్=కొమ్ములను, శంఖవేణువీణాః=శంఖములను, పిల్లనగ్రోవులను, వీణలను, తుముల నిఃస్వనాన్=సంకులమైన ధ్వనిగలవానిని, వ్యనాదయన్=మ్రోగించినవి.

**తాత్పర్యము :** మేఘములు మూర్తిమంతములై మృదంగ, పణవ, మురజములను వివిధములైన మద్దెలలను, తప్పెటలను, కొమ్ము వాద్యములను, శంఖములను, పిల్లనగ్రోవులను, వీణలను సంకుల ధ్వనులు గలవానిని మ్రోయించినవి.

శ్లో॥ తతోఽభిషిషిచుర్దేవీం శ్రియం పద్మకరాం సతీమ్।
దిగ్గజాః/దిగిభాః పూర్ణకలశైః సూక్తవాక్యైర్ద్విజేరితైః॥ 13

**ప్రతిపదార్థము :** తతః=అంత, దిగ్గజాః/దిగిభాః=దిగ్గజములు, ద్విజ+ఈరితైః=ఋషులుచ్చరించు, సూక్తవాక్యైః=వేదమంత్ర వాక్యముల చేతను, పూర్ణకలశైః=జలపూర్ణములైన ఘటములతో, పద్మకరామ్=హస్తములందు కమలమును ధరించినట్టి, సతీమ్= ఉత్తమాంగనయైన, శ్రియందేవీమ్=వెలుగొందు శ్రీదేవిని, అభిషిషిచుః=అభిషేకించినవి.

**తాత్పర్యము :** అంత ఐరావతాది దిగ్గజములు, ద్విజులు వేదమంత్రములు పఠించుచుండ జలపూర్ణ కలశములతో కమల హస్తయై ఉత్తమాంగనయైన శ్రీదేవిని అభిషేకించెను.

శ్లో॥ సముద్రః పీతకౌశేయవాససీ సముపాహరత్।
వరుణః స్రజం వైజయన్తీం మధునా మత్తషట్పదామ్॥ 14

**ప్రతిపదార్థము :** సముద్రః=సముద్రుడు, పీతకౌశేయ వాససీ=పసుపు వన్నె పట్టు వలువలను, సముపాహరత్=కొనివచ్చి సమర్పించెను, వరుణః=వరుణుడు, మధునా=పూతేనియచే, మత్తషట్పదామ్=మదించిన తుమ్మెదలు గల, వైజయంతీం స్రజమ్=వైజయంతియను పుష్పమాలను సమర్పించెను.

**తాత్పర్యము :** సముద్రుడు శ్రీదేవికి పసుపువన్నె పట్టు వస్త్రము/పుట్టములను సమర్పించెను.

## అష్టమోఽధ్యాయః

ఈ అధ్యాయమునందు సురాసురులు సముద్రమును మథించగా దానినుండి జనించిన లక్ష్మిని విష్ణువు వరించెను. ధన్వంతరి అమృతముతో జనించెను. దానిని అసురులు హరించిరి. అప్పుడు విష్ణువు మోహినీ రూపమున అవతరించెను అను విషయము వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ పీతే గరే వృషాఙ్కేణ ప్రీతాస్తేఽమరదానవాః।
మమన్థుస్తరసా సిన్ధుం హవిర్ధానీ తతోఽభవత్॥ 1

**ప్రతిపదార్థము :** వృషాంకేణ=వృషభధ్వజుడైన శివునిచే, గరే=హాలాహల విషము, పీతే=గ్రోలబడినది కాగా, తే=ఆ, అమరదానవాః=సురలు అసురులు, ప్రీతాః=సంతోషించినవారై, తరసా=వడిగా, సింధుమ్=పాలకడలిని, మమంథుః=మథించిరి. తతః=ఆ సముద్రమునుండి, హవిర్ధానీ=కామధేనువు, అభవత్=జనించెను.

**తాత్పర్యము :** వృషధ్వజుడు శివుడు అట్లు హాలాహల విషమును పానము చేయగా దేవదానవులు మిగుల సంతోషించి పూనుకొని కడు శీఘ్రముగా పాలకడలిని మథించిరి. ఆ సాగరము నుండి కామధేనువు జనించెను.

శ్లో॥ తామగ్నిహోత్రీమృషయో జగృహుర్బ్రహ్మవాదినః।
యజ్ఞస్య దేవయానస్య మేధ్యాయ హవిషే నృప॥ 2

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, బ్రహ్మవాదినః=వేదాధ్యయన సంపన్నులైన, ఋషయః=ఋషులు, అగ్నిహోత్రీమ్=అగ్నిహోత్రమునకు పనికివచ్చు పాలు, పెరుగు, నేయి ఇచ్చునదైన, తామ్=ఆ కామధేనువును, దేవయానస్య=బ్రహ్మలోక ప్రాప్తి మార్గము గలిగించు, యజ్ఞస్య=యజ్ఞమునకు, మేధ్యాయ=పవిత్రమైన, హవిషే=హవిస్సు కొఱకు, జగృహుః=గ్రహించిరి.

**తాత్పర్యము :** వేదాధ్యయన సంపన్నులగు మహర్షులు అగ్నిహోత్రాది కర్మలకుపయుక్తమగు పాలు, పెరుగు, నేయి నొసగునట్టిదైన ఆ కామధేనువును బ్రహ్మలోక ప్రాప్తిమార్గమైన దేవయానమును గలిగించునట్టి యాగమునకు పవిత్రమగు హవిస్సు కొఱకు గైకొనిరి.

శ్లో॥ తత ఉచ్చైఃశ్రవా నామ హయోఽభూచ్చన్ద్రపాణ్డురః।
తస్మిన్ బలిః స్పృహాం చక్రే నేన్ద్ర ఈశ్వరశిక్షయా॥ 3

**ప్రతిపదార్థము :** తతః=పిమ్మట, ఉచ్చైఃశ్రవా నామ=ఉచ్చైశ్రవమను ప్రసిద్ధిగల, హయః=అశ్వము, చంద్రపాండురః=చంద్రునివలె తెల్లనైనది, అభూత్=జనించెను, తస్మిన్=ఆ యశ్వమునందు, బలిః=బలి, స్పృహామ్=కోరికను, చక్రే=చేసెను. ఇంద్రః=ఇంద్రుడు, ఈశ్వర శిక్షయా=ముందే తనకు విష్ణువుపదేశించిన బోధచే, న=కోరలేదు.

**తాత్పర్యము :** అంత ఉచ్చైశ్రవమను అశ్వము చంద్రుని వలె తెల్లనిది జనించెను. దానిని బలి చక్రవర్తి కోరెను. తనకు మున్నె విష్ణువు బోధించి యుండుట చేత ఇంద్రుడాయశ్వమునకు అసమ్మతి చెప్పలేదు.

శ్లో॥ తత ఐరావతో నామ వారణేన్ద్రో వినిర్గతః।
దన్తైశ్చతుర్భిః శ్వేతాద్రేర్హరన్ భగవతో మహిమ్॥ 4

**ప్రతిపదార్థము :** తతః=తర్వాత, ఐరావతఃనామ=ఐరావతమను, వారణ+ఇంద్రమ్=గజరాజము, చతుర్భిః=నాలుగైన, దంతైః=దంతములచే, భగవతః=శివునియ యొక్క, శ్వేతాద్రేః=తెల్లని వెండికొండ కైలాసము యొక్క, మహిమ్=మహిమను, హరన్=వారించుచు, వినిర్గతః=బయలువెడలెను.

**తాత్పర్యము :** అంతట ఐరావతమను గజరాజము నాలుగు దంతములచే కైలాసపర్వత శోభను వారించునదై చంద్రునివలె తెల్లనైనది యుద్భవించెను.

శ్లో॥ తతోఽభవత్పారిజాతస్సురలోకవిభూషణమ్।
పూరయత్యర్థినో యోఽర్థైః శశ్వద్ భువి యథా భవాన్॥ 5

**ప్రతిపదార్థము :** తతః=అటు పిమ్మట, సురలోక విభూషణమ్=దేవలోకమునకు అలంకారమైన, పారిజాతః=పారిజాత వృక్షము, అభవత్=జనించెను. యః=ఏ పారిజాత వృక్షము, భువి =భూలోకమునందు, యథా భవాన్=నీవలెనె (పరీక్షిత్తు వలెనె), అర్థినః=యాచకులకు, అర్థైః =వాంఛలను, శశ్వత్=ఎల్లప్పుడు, పూరయతి=నిండించుచున్నదో

**తాత్పర్యము :** ఓ పరీక్షిత్తు రాజా! భూమిలో నీవలెనెట్లు దాతవైతివో అట్లే యాచకుల అభీష్టములను పూరించునట్టిదైన పారిజాత వృక్షము దేవలోకమునకు అలంకారమైనట్టిది జనించెను.

శ్లో॥ తతశ్చాప్సరసో జాతా నిష్కకణ్ఠ్యః సువాససః।
రమణ్యః స్వర్గిణాం వల్గుగతిలీలావలోకనైః॥ 6

**ప్రతిపదార్థము :** తతః=అంతట, అప్సరసః=అప్సరసలు, నిష్కకంఠ్యః/నిష్కగ్రీవాః=కంఠ హారములు గలవారును, సువాససః=మేటి వలువలు గట్టినవారు, వల్గుగతిలీలావలోకనైః =సుందరమైన నడకచేతను, విలాసముతో కూడిన చూపుల చేతను, స్వర్గిణామ్=స్వర్గవాసులకు దేవతలకు, రమణ్యః=రతిని ఆసక్తిని కలిగించువారు, జాతాః=ఉద్భవించిరి.

**తాత్పర్యము :** అంత అప్సరసలు కంఠహారములు వెలయగా మేలి పట్టువలువలు గట్టి తమ చక్కని నడక చేతను, విలాసపు చూపుల చేతను స్వర్గవాసులగు వేల్పులకు రతిని ఆసక్తిని గలిగించువారై జనించిరి.

శ్లో॥ తతశ్చావిరభూత్ సాక్షాచ్ఛ్రీరమా భగవత్పరా।
రఞ్జయన్తీ దిశః కాన్త్యా విద్యుత్ సౌదామనీ యథా॥ 7

**ప్రతిపదార్థము :** తతః=ఆవల, శ్రీః=సంపద, సాక్షాత్=మూర్తిధారిణియై, భగవత్+పరా= భగవంతుడగు విష్ణునందు ఆసక్తిగలదై, రమా=లక్ష్మీదేవి, సౌదామనీ=సుదామమను పర్వతము నందు నొక్క దిక్కున జనించినది, సౌదామిని అను పేరు గలది, స్ఫటిక మణిమయమైన పర్వత శృంగములందు విశేషము ప్రకాశించు విద్యుత్, యథా=మెఱుపు తీగెవలె, కాంత్యా= దేహకాంతి చేత, దిశః=దిక్కులను, రంజయంతీ=వెలిగించుచు, ఆవిరభూత్=ఆవిర్భవించెను.



**తాత్పర్యము :** అంత సంపద మూర్తిధారిణియై సుదామ పర్వతమునందుబుట్టి సౌదామిని యను పేరుగలదై స్ఫటిక మణిమయములైన పర్వత శృంగములందు మెఱుపు తీగవలె తన దేహకాంతిచే దిక్కులు వెలిగించుచు లక్ష్మీదేవి ఆవిర్భవించెను.

శ్లో॥ తస్యాం చక్రుః స్పృహాం సర్వే ససురాసురమానవాః।
రూపౌదార్యవయోవర్ణమహిమాక్షిప్తచేతసః॥ 8

**ప్రతిపదార్థము :** సర్వే=ఎల్ల, ససుర+అసుర మానవాః=దేవతలు, అసురులు, మానవులు, రూపౌదార్య... చేతసః, రూప=లక్ష్మి యొక్క సౌందర్యము, ఔదార్య=ఘనత, వయః=వయస్సు, వర్ణ=దేహవర్ణము, మహిమ=వాని యొక్క గొప్పతనముచే, ఆక్షిప్తచేతసః=చలించిన చిత్తము గలవారై, తస్యామ్=ఆ లక్ష్మియందు, స్పృహాం చక్రుః=వాంఛచేసిరి.

**తాత్పర్యము :** ఎల్ల సురలు అసురులు మానవులు ఆ లక్ష్మియొక్క దేహకాంతి, ఔదార్యము, మేనివన్నెలోనగు గొప్పతనముచే చలించిన మనసుకలవారై ఆమెయందు కోరికగలవారైరి.

శ్లో॥ తస్యా ఆసనమానిన్యే మహేన్ద్రో మహదద్భుతమ్।
మూర్తిమత్యః సరిచ్ఛ్రేష్ఠా హేమకుమ్భైర్జలం శుచి॥ 9

శ్రీమహావిష్ణు వక్షమున నెలకొన్న శ్రీదేవిచే విలోకింపబడిన దేవతలకు ముందున్నట్టు సంపత్ప్రాప్తియు ఆమె విలోకమునకుఁబాత్రులను సంపదలేమియు కావించుటకై ఆమె అభిషేక కారకమగు మహోత్సవము మున్నుగ బ్రహ్మాదిదేవతలు పరిహరించుట ద్వారా విష్ణు భగవానుని బొందుట చెప్పుచున్నారు. తస్యా ఆసన... శ్లోకము మొదలు అదాసీత్... అను శ్లోకము వరకు పూర్వమున్న శ్లోకములచే వచించెను.

**ప్రతిపదార్థము :** తస్యాః=ఆ శ్రీదేవికి, మహేంద్రః=ఇంద్రుడు, మహత్+అద్భుతమ్=దొడ్డదై ఆశ్చర్యకరమైన, ఆసనమ్=పీఠమును, ఆనిన్యే=కొనివచ్చెను. సరిత్ శ్రేష్ఠా=శ్రేష్ఠములైన గంగాది నదులు, మూర్తిమత్యః=స్వరూపధారిణులై, హేమకుంభైః=పసిండి కడవలచే, శుచి=స్వచ్ఛమైన, జలమ్=ఉదకమును తెచ్చెను.

**తాత్పర్యము :** ఆ శ్రీదేవికి ఇంద్రుడు అద్భుతమైన దొడ్డ పీఠమును గొనివచ్చియుండెను. గంగానదీమతల్లులు రూపొందినవారలై పవిత్ర జలములందెచ్చిరి.

శ్లో॥ ఆభిషేచనికా భూమి రాహరత్ సకలౌషధీః।
గావః పఞ్చ పవిత్రాణి వసన్తో మధుమాధవౌ॥ 10

**ప్రతిపదార్థము :** భూమిః=భూదేవి, ఆభిషేచనికాః=అభిషేకమునకుచితములైన, సకలౌషధీః =సమస్తౌషధములను, ఆహరత్=కొనివచ్చెను. గావః=గోవులు, పంచ పవిత్రాణి=గో మూత్రము, గోమయము, క్షీర, దధి ఘృతములు అను పంచగవ్యములను తెచ్చెను, వసంతః =వసంత ఋతువు, మధుమాధవౌ=చైత్రవైశాఖమాసములందు జనించి ఫలపుష్పాదికము లేక, మాధవౌ=చైత్ర వైశాఖములందు జనించిన, మధు=తేనెను తెచ్చెను.

**తాత్పర్యము :** భూదేవి అభిషేకమునకుపయుక్తమగు ఓషధులను తెచ్చెను. అట్లే గోవులు గోక్షీరము, గోదధి, గోఘృతము, గోమూత్రము, గోమయము అను పంచగవ్యములను తెచ్చెను. వసంతుడు చైత్ర వైశాఖములందు జనించు ఫలపుష్పములు, మధువును తెచ్చెను.

నిజైః=స్వకీయమైన, సద్గుణైః=మారని, నియమితములైన, ఏకాంతికములై, జ్ఞానైశ్వర్యాది గుణముల చేత, వరమ్=శ్రేష్ఠుడు, నిజ+ఏక+ఆశ్రయతా=ఇతరులపై ఆధారపడక సద్గుణసంపన్నుడైన కారణమున, అగుణాశ్రయమ్=ప్రకృతి గుణములకు అతీతుడును, కావున ఈప్సితమ్= తనకిష్టుడును, సర్వగుణైః=సమస్తమైన అణిమాది గుణములచే, అపేక్షితమ్= కూడుకొన్నవాడు, నిరపేక్షమ్=అపేక్షలేనివాడు, తాను స్వయముగా ఆత్మారాముడై నిరపేక్షు డైనను ఆశ్రితములైన అణిమాది సిద్ధులు తానెట్లుపేక్షించక ఉన్నాడో అట్లే నన్ను సైతము ఉపేక్షించడు. అంతమాత్రము ఆయన సేవచే నేను కృతార్థురాలనగుదును. ప్రాకృతులగు నితరులతోనేమి ప్రయోజనము. ముకుందమ్=విష్ణువును, వరమ్=వరునిగా, వవ్రే=వరించెను.

**తాత్పర్యము :** లక్ష్మీదేవి ఇట్లు విమర్శించి స్వయముగా ఏకాంతికములై జ్ఞానైశ్వర్యాదులగు గుణములకు ఆశ్రయుడగుటచే సర్వోత్తమములైన ప్రకృతి గుణములకు అతీతుడును, సమస్తములైన అణిమాది గుణములతోఁగూడుకొన్నవాడును, తాను అపేక్షలేనివాడును అగు విష్ణువును తనకిష్టుడైన వరునిగా వరించెను.

తాను ఆత్మారాముడై నిరపేక్షుడైనను తన్నాశ్రయించిన అణిమాది గుణములనెట్లు ఉపేక్షింపక గ్రహించియున్నాడో అట్లే తన్నుకూడా నుపేక్షింపక గ్రహించును. అంతమాత్రమున తత్సేవచే కృతార్థురాలనగుదునని తలంచి వరించెను. ప్రాకృతులగు బ్రహ్మాదులతో ప్రయోజనమేమి – అని.

**శ్లో॥ తస్యాంసదేశ ఉశతీం నవకఞ్జమాలాం మాద్యన్మధువ్రతవరూథగిరోపఘుష్టామ్।**
**తస్థౌ నిధాయ నికటే తదురః స్వధామ సవ్రీడహాసవికసన్నయనేన యాతా॥ 23**

**ప్రతిపదార్థము :** మాద్యత్+మధువ్రతవరూథగిరా=మదించిన మధుకరముల సమూహముల ఝుంకారములచే, ఉపఘుష్టామ్=మ్రోగుచున్నదియు, ఉశతీమ్=కమనీయమైన, నవకంజమాలామ్=క్రొత్త కమలముల మాలను, తస్య=ఆ విష్ణువు యొక్క, అంసదేశే=భుజ ప్రదేశమునందు కంఠమున, నిధాయ=ఉంచి, నికటే=ఆ విష్ణునకు సమీపమునందు, తత్+ఉరః =ఆయన వక్షమున, సవ్రీడహాస వికసత్+నయనేన=సిగ్గుతోను, నవ్వుతోనూ గూడి వికసించుచున్న నయనములచే, యాతా=వక్షమును ప్రతీక్షించుచున్నదై, తస్థౌ=నిలిచెను.

**తాత్పర్యము :** శ్రీదేవి మదించిన తుమ్మెదల మొత్తముల ఝుంకారమున ఘోషించు మనోహరమైన క్రొత్త తామరల దండను వెన్ను కంఠమునలంకరింపజేసి సిగ్గుచేతను, నవ్వు చేతను వికాసమునుబొందిన కడకంటి చూపుచే ఆ వెన్ను నురమును తనకు స్థానముగా చేసుకొనగోరి ప్రతీక్షించుచు విష్ణు సమీపమున నిలువబడియుండెను.

**శ్లో॥ తస్యాః శ్రియస్త్రిజగతో జనకో జనన్యా వక్షోనివాసమకరోత్ పరమం విభూతేః।**
**శ్రీః స్వాః ప్రజాః సకరుణేన నిరీక్షణేన యత్ర స్థితైధయత సాధిపతీంస్త్రిలోకాన్॥ 24**

భగవంతుడు విష్ణువు సైతము ముజ్జగముల అభివృద్ధి కొఱకు ఆ శ్రీదేవికి తన వక్షస్థలమును నివాసస్థానమునుగా నిచ్చెనని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** త్రిజగతః=ముల్లోకములకు, జనకః=తండ్రియైన విష్ణువు, త్రిజగతః =ముజ్జగములకు, జనన్యాః=తల్లియైన, విభూతేః=విశేషములైన ఐశ్వర్యముగలదైన, తస్యాః



వరుణుడు మకరందమున మత్తుగొన్న తేంట్లుగల వైజయంతియను పుష్పమాలను సమర్పించెను.

**శ్లో॥ భూషణాని విచిత్రాణి విశ్వకర్మా ప్రజాపతిః।**
**హారం సరస్వతీ పద్మమజో నాగాశ్చ కుణ్డలే॥ 15**

**ప్రతిపదార్థము :** ప్రజాపతిః=సృష్టికర్త అయిన, విశ్వకర్మా=విశ్వకర్మ, విచిత్రాణి=వివిధములైన తొడవులను సమర్పించెను. సరస్వతీ=సరస్వతీదేవి, హారమ్=ముత్యాల హారమును, అజః =బ్రహ్మ, పద్మమ్=పద్మమును, నాగాఃచ=నాగులు, కుండలే చ=కుండలములను సమర్పించిరి.

**తాత్పర్యము :** సృష్టికర్తయైన విశ్వకర్మ శ్రీదేవికి వివిధములైన రత్నభూషణములను సమర్పించెను. సరస్వతి ముత్యాల హారమును, బ్రహ్మ కమలమును, నాగరాజులు రత్న కుండలములను సమర్పించిరి.

**శ్లో॥ తతః కృతస్వస్త్యయనోత్పలస్రజం నదద్ద్విరేఫాం పరిగృహ్య పాణినా।**
**చచాల వక్త్రం సుకపోలకుణ్డలం సవ్రీడహాసం దధతీ సుశోభనమ్॥ 16**

**ప్రతిపదార్థము :** తతః=అంత, కృతస్వస్త్యయనా=చేయబడిన మంగళవాచన పూర్వకమైన అలంకారములను బొందినదైన లక్ష్మి, నదత్ ద్విరేఫామ్=మెరయుచున్న భృంగములు గలదై, ఉత్పలస్రజమ్=నల్ల కలువల దండను, పాణినా=హస్తముచే, పరిగృహ్య=స్వీకరించి, సుకపోల కుండలమ్=శోభిల్లు చెక్కిళ్ళు, కుండలములు గలదయి, సవ్రీడహాసమ్=సిగ్గును నవ్వును గలదయి, సుశోభనమ్=సౌందర్యముచే నొప్పారు, వక్త్రమ్=మొగమును, దధతీ=ధరించు చున్నదై, చచాల=చలించెను.

**తాత్పర్యము :** అంత మంగళ వచన పూర్వకముగ అభిషిక్తయై అలంకృతయైన శ్రీదేవి తుమ్మెదలు మొరయుచున్న నల్లకలువల దండను హస్తమునగొని కుండలముల కాంతిచే మెఱయు చెక్కిళ్ళుగలదై సిగ్గు నవ్వును దొరలుచుండ సౌందర్యమున నొప్పు మొగముతో గూడి చలించెను.

**శ్లో॥ స్తనద్వయం చాతికృశోదరీ సమం నిరన్తరం చన్దనకుఙ్కుమోక్షితమ్।**
**తతస్తతో నూపురవల్గుశిఞ్జితైర్విసర్పతీ హేమలతేవ సా బభౌ॥ 17**

**ప్రతిపదార్థము :** అతికృశోదరీ=సన్నని నడుము గలదై, సా=ఆ శ్రీదేవి, సమమ్=సమమై, నిరంతరమ్=నడుమ యెడము లేనిదై, కుంకుమ+ఉక్షితమ్=కుంకుమపూవు గంధములచే దడుపబడినదై, చారు=సుందరమైన, స్తనద్వయమ్=చనుఁగవ ధరించినది. నూపుర వల్గు శింజితైః=అందెల యొక్క మనోహరమైన మ్రోతచే, తతః తతః=ఇటునటు, విసర్పతీ= సంచరించుచున్న, హేమలతేవ=బంగారులతవలె, బభౌ=ప్రకాశించెను.

**తాత్పర్యము :** లేనడుము గల ఆ సిరిదేవికి హెచ్చుతగ్గులు లేని సమానమైన నడుమ నెడము లేక యొండొంటిని కలిసినవై కుంకుమ గంధము పూత పూయబడినవై సొంపైన పాలిండ్ల జంటను ధరించి కాలియందెలు ఘల్లు ఘల్లుమని మ్రోయుచుండ నిటునటు తిరుగుచు సంచరించు బంగారు తీగెవలె ప్రకాశించెను.

**శ్లో॥ విలోకయన్తీ నిరవద్యమాత్మనః పదం ధ్రువం చావ్యభిచారిసద్గుణమ్।**
**గన్ధర్వయక్షామరసిద్ధచారణత్రైవిష్టపేయాదిషు నాన్వవిన్దత॥ 18**

**ప్రతిపదార్థము :** గంధర్వ... దిషు= గంధర్వ=గంధర్వులు, యక్ష=యక్షులు, అమర=దేవతలు, సిద్ధ=సిద్ధులు, చారణ=చారణులు, త్రైవిష్టపేయాదిషు=త్రివిష్టపము అనగా స్వర్గము అందులో నివశించువారు త్రైవిష్టపేయులు, దేవతలు లోనగువారియందు, ధ్రువమ్=నిత్యమై, అవ్యభిచారి=మారనిదై, సద్గుణమ్=మేలి గుణములు గలదై, నిరవద్యమ్=నిర్దోషమైన, ఆత్మనః పదమ్=ఆశ్రయమైన వ్యక్తిని, విలోకయంతీ=చూచుచున్నదై. న+అన్వవిన్దత=పొందలేక పోయినది.

**తాత్పర్యము :** ఆ శ్రీదేవి గంధర్వులు, యక్షులు, అమరులు, సిద్ధులు, చారణులు, త్రివిష్టపము అనగా స్వర్గమునందు వశించు దేవతలు లోనగువారియందు నిత్యమును, నిర్దోషము, నిత్యములైన సద్గుణములకు నెలవైన వ్యక్తిని సంపాదింపగోరి నలుగడల చూచెను గాని ఒక్కొక్కనియందును ఒక్కొక్క దోషముండుట వలన ఒక్కడు తనకు దగినవాడు లభింప డయ్యెను.

**శ్లో॥ నూనం తపో యస్య న మన్యునిర్జయో జ్ఞానం క్వచిత్తచ్చ న సఙ్గవర్జితమ్।**
**కశ్చిన్మహాంస్తస్య న కామనిర్జయః స ఈశ్వరః కిమ్పరతో వ్యపాశ్రయః॥ 19**

అట్టి ఉత్తముడు లభింపలేదని చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యస్య=ఏ దుర్వాసుడు మొదలగువానికి, తపః=తపము గలదో, మన్యు నిర్జయః=క్రోధము యొక్క జయము, న=లేదు, క్వచిత్=గురువగు శుక్రుడులోనగు వారియందు, జ్ఞానమ్=జ్ఞానము, తస్య=వానికి, సంగవర్జితమ్=ప్రాపంచిక సంబంధములందు ఆసక్తి వర్జించినది, న=కాదు, కశ్చిత్=ఒకానొకడు, మహాన్=బ్రహ్మ, సోముడు గలరు కానీ, తస్య=వానికి, కామనిర్జయః=కాముని నిర్జించుట, న=లేదు, పరతః=ఇతరుని వలన, వ్యపాశ్రయః=అపేక్ష గలవాడగు, ఇంద్రుడులోనగువారు, సః=అతడు, ఈశ్వరః కిమ్=ప్రభువు అగునా ఏమి?

**తాత్పర్యము :** దుర్వాసుడులోనగు తపోధనులు గలరు గాని వారు క్రోధమును జయించిన వారు కారు. జ్ఞానులైన గురు శుక్రులు గలరు కాని వారి జ్ఞానము దేహేంద్రియాది ప్రపంచము నందు ఆసక్తి లేనిది కాదు. దొడ్డవారైన బ్రహ్మ, చంద్రుడులోనగువారు గలరు కాని కాముని జయించినవారుగారు. ఇతరుని సహాయమునుపేక్షించు నింద్రాదులు ప్రభువులగుదురా ఏమి? తపము, జ్ఞానము, మహత్త్వము, నిర్దుష్టము గలవారెవ్వరు ఆమెకు కన్పడకపోయిరి.

**శ్లో॥ ధర్మః క్వచిత్ తత్ర న భూతసౌహృదం త్యాగః క్వచిత్ తత్ర న ముక్తికారణమ్।**
**వీర్యం న పుంసోఽస్త్యజవేగనిష్కృతం నహి ద్వితీయో గుణసఙ్గవర్జితః॥ 20**

**ప్రతిపదార్థము :** క్వచిత్=ఒకానొకనియందు, పరశురాముడులోనగు వారియందు, ధర్మః =ధర్మగుణము గలదు కాని, తస్య=వానికి, భూతసౌహృదః=ప్రాణులందు స్నేహము, భూతదయ, న=లేదు, క్వచిత్=ఒకనియందు, శిబి మొదలువారియందు, త్యాగః=దానగుణము గలదు కాని, తస్య=వానికి, ముక్తికారణమ్=మోక్షమునకు కారణమైనది కాదు, పుంసః=ఒకానొక



పురుషునికి కార్తవీర్యుడులోనగునొకానొక పురుషునందుగాని అజవేగ నిష్కృతమ్=ఆ బలాధికము కాలవేగమున అస్ఖలితము కాలేదా ఏమి, గుణసంగవర్జితః=సత్త్వాది గుణత్రయ సంబంధ వర్జితుడగు, సనకుడులోనగువారు, ద్వితీయః=నాకు పరుడైన సమాధి నిష్ఠుడై తామె బ్రహ్మమై అద్వితీయులైనందున నాకు పరుడు, న=కాదు.

**తాత్పర్యము :** పరశురాముడులోనగు నొకానొకడు ధర్మగుణము గలవాడు కలడు. కాని వానికి ప్రాణులయెడ స్నేహము, భూతదయ లేదు. శిబిలోనగు నొక్కనొకని యందు దానగుణము గలదు కాని అది ముక్తి కారణము కాలేదు. కార్తవీర్యుడులోనగు నొక పురుషునందు బలపరాక్రమాది గుణములు గలవు కాని అవి కాలవేగమున గొట్టువడినవి. సనకుడులోనగు నొకానొకడు త్రిగుణముల సంగము లేనివాడు గలడు కాని అట్టివాడు సమాధి నిష్ఠుడై తనకు రెండవ వానిదైన బ్రహ్మమును దెలిసికొన్నవాడైన నీకు ద్వితీయుడు, రెండవవాడు కానేరడు.

**శ్లో॥ క్వచిచ్చిరాయుర్న హి శీలమఙ్గళం క్వచిత్తదప్యస్తి న వేద్య మాయుషః।**
**యత్రోభయం కుత్ర చ సోఽప్యమఙ్గళః సుమఙ్గళః కశ్చ న కాంక్షతే హి మామ్॥ 21**

**ప్రతిపదార్థము :** క్వచిత్=మార్కండేయుడు లోనగు నొకానొకడు, చిరాయుః=దీర్ఘాయుష్మంతుడు గలడు కాని అట్టివాడు ఇంద్రియములు శమింపజేయువాడగుట వలన, నహి శీలమంగళమ్= శుభకరమైన స్వభావము లేదు, క్వచిత్=హిరణ్యకశిపుడు లోనగు నొకానొకనియందు, తత్ అపి అస్తి=మంగళకరమైన సత్త్వ స్వభావము గలదు కాని, ఆయుషః=ఆయుర్దాయము యొక్క స్థితి, న వేద్యమ్=తెలియరాదు. భగవంతుని ద్వేషించుటచే అకస్మాత్తుగా సంభవించుట వలన, యత్రకుత్ర చ=ఏ యొకానొకనియందు శివుడు లోనగువానియందు, ఉభయమ్= మంగళకరమైన శీలము, పూర్ణాయుర్దాయము గలదు. కాని సః అపి=ఆ శివుడు సైతము, అమంగళః=శ్మశానములోనగు అమంగళ వేషము గలవాడు, శ్రీముకుందుని లక్షించి చెప్పుచు, కశ్చన=ఒకానొకడు శ్రీ మహావిష్ణువు, సుమంగళః=నిర్దోషుడు, మంగళశీలుడు గలడు. అతడు మామ్=నన్ను, కాంక్షతే=ఆత్మారాముడైనందున నన్ను కోరును.

**తాత్పర్యము :** మార్కండేయుడులోనగువారు చిరాయుర్దాయులు గలరు కాని వారు ఇంద్రియ దమనశీలురు కాని మంగళ స్వభావము గలవారు కారు. హిరణ్యకశిపుడు లోనగువారు మంగళశీలురుగలరు కాని వారి ఆయువు నిర్ధారణ లేదు. ఏలయన వాని యాయువు భగవదన్వేషణము చేసి అకస్మాత్తుగా మృత్యువు పాలగుచున్నది. చిరాయుష్మంతుడు, మంగళశీలుడు శివుడు గలడు. కపాలధారియై శ్మశానవాసియైన అమంగళుడగుచున్నాడు. మంగళశీలుడు నిర్దోషుడగు శ్రీముకుందుడు విష్ణువు అన్ని విధముల సరియైనవాడు గలడు, అతడు ఆత్మారాముడగుట వలన నన్ను గాంక్షించువాడగును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవం విమృశ్యావ్యభిచారిసద్గుణైర్వరం నిజైకాశ్రయతాగుణాశ్రయమ్।**
**వవ్రే వరం సర్వగుణైరపేక్షితం రమా ముకున్దం నిరపేక్షమీప్సితమ్॥ 22**

**ప్రతిపదార్థము :** రమా=లక్ష్మి, ఏవమ్=ఈ విధముగా/ఈ ప్రకారము, విమృశ్య=విమర్శించి,

**ప్రతిపదార్థము :** అసురైః=అసురుల చేత, అమృతభాజనే=అమృతము ఉన్న పాత్రమును, తస్మిన్=ఆ, కలశే=కలశము, నీయమానే సతి=తీసుకొనిపోబడినది కాగా, దేవాః=దేవతలు, విషణ్ణమనసః=దిగులొంది నివ్వెరపోయిన చిత్తముగలవారై, హరిమ్=విష్ణువును, శరణమ్=రక్షకునిగా, ఆయయుః=పొందిరి.

**తాత్పర్యము :** అసురులమృతపూర్ణ కలశమును గ్రహించిన పిదప దేవతలందరు దిగులొంది యేమియు తోచని చిత్తములతో శ్రీహరిని శరణుచొచ్చిరి.

**శ్లో॥ ఇతి తద్దైన్యమాలోక్య భగవాన్ భృత్యకామకృత్।**
**మా ఖిద్యతామృతార్థం వః సాధయిష్యే స్వమాయయా।**
**ఇత్యుక్త్వా సాన్త్వయన్ దేవాంస్తత్రైవాన్తరధీయత॥ 36**

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, తత్+దైన్యమ్=ఆ దేవతల దీనభావమును, ఆలోక్య=చూచి, భగవాన్=విష్ణువు, భృత్యకామకృత్=భృత్యులైన దేవతల ఇష్టమును చేయగోరినవాడై, అమృతార్థమ్=అమృతము కొఱకు, మా ఖిద్యత=ఖేదమును పొందకుడు, దైత్యులకు పరస్పరము కలహమును పుట్టించుటచే, స్వమాయయా=యోగమాయ మోహినీ స్వరూపమున, వః=మీయొక్క ఇష్టమును, సాధయిష్యే=సాధింపగలను అని, ఉక్త్వా=చెప్పి, దేవాన్=దేవతలను, సాంత్వయన్=ఓదార్చుచు, తత్ర+ఏవ=అచ్చోటనే, అంతరధీయత=అంతర్థానము చెందెను.

**తాత్పర్యము :** అట్టి దేవతల దైన్యమునుగని భగవంతుడు విష్ణువు తన సేవకులైన దేవతల యిష్టమును చేయగోరినవాడై ఓ దేవతలారా! మీరు అమృతము లభింపలేదని చింత పడకుడు. నేను ఆ దైత్యులకు పరస్పరము కలహము పుట్టించి నా యోగమాయ చేసిన మోహినీ రూపముచేత మీ అభీష్టమును సాధింపగలనని చెప్పి వారిని ఓదార్చుచు ఆ చోటనే అంతర్హితుడయ్యెను.

**శ్లో॥ మిథః కలిరభూత్తేషాం తదర్థే తర్షచేతసామ్।**
**అహం పూర్వమహం పూర్వం న త్వం న త్వమితి ప్రభో!॥ 37**

**ప్రతిపదార్థము :** ప్రభో!=ఓ రాజా!, అహం పూర్వమ్=నేను ముందు, అహం పూర్వమ్=నేను ముందు, న త్వమ్=నీవు కాదు, న త్వమ్+ఇతి=నీవు కాదు అని, తత్+అర్థే=ఆయమృతము సంపాదించుటయందు, తర్షచేతసామ్=కామముతో కూడిన చిత్తముగల, తేషామ్=ఆ యసురులకు, మిథః=పరస్పరము, కలిః=కలహము, అభూత్=ఆయెను.

**తాత్పర్యము :** ఆయమృతమును గ్రహింప నాసక్తచిత్తులైన యాయసురులకు నేను ముందు నేను ముందు నీవు కాదు నీవు కాదని పరస్పరము కలహము సంభవించెను.

రెండు శ్లోకములచేత దుర్బలుల ఆక్రోశవిధమును జెప్పుచున్నాడు.

**శ్లో॥ దేవాః స్వం భాగమర్హన్తి యే తుల్యాయాసహేతవః।**
**సత్రయాగ ఇవైతస్మిన్నేష ధర్మః సనాతనః॥ 38**

**ప్రతిపదార్థము :** దేవాః=దేవతలు, స్వమ్‌భాగమ్=తమ భాగముల గూర్చి, అర్హంతి=అర్హులగుచున్నారు, యేతు=ఎవరు, తుల్య+ఆయాసహేతవః=సమానమైన శ్రమయందు సాధించు



శ్రియః‌శ్రీః=శ్రీదేవికి, వక్షః=తన వక్షము, పరమమ్=స్థిరమైన, నివాసమ్=నివాసస్థానముగా, అకరోత్=చేసెను. యత్ర=ఏ వక్షమునందు, స్థితా=ఉండినదైన, స్వాః=తనయొక్క, శ్రీః=శ్రీదేవి, సకరుణేన=కరుణతో కూడిన, నిరీక్షణేన=చూపుతో, ప్రజాః=ప్రజలను, స+అధిపతీన్=అధిపతులతో గూడిన, త్రిలోకాన్=మూడు లోకములను, ఐధయత=వర్ధిల్లజేసెను.

**తాత్పర్యము :** త్రిలోకములకు జనకుడగు విష్ణువు ముజ్జగములకు తల్లియై సమస్త ఐశ్వర్యములు గలదైన ఆ శ్రీదేవికి తన వక్షమును స్థిరమైన నివాసస్థానమును గావించెను. ఆ శ్రీదేవి విష్ణువు వక్షస్థలమును జేరినదై కృపాదృష్టితో అధిపతులతోఁగూడిన ముల్లోకములను ప్రజలను వర్ధిల్లజేసెను.

**శ్లో॥ శఙ్ఖతూర్యమృదఙ్గానాం వాదిత్రాణాం పృథుః స్వనః।**
**దేవానుగానాం సస్త్రీణాం నృత్యతాం గాయతామభూత్॥ 25**

**ప్రతిపదార్థము :** శంఖతూర్యమృదంగానామ్=శంఖవాద్యములు, మృదంగములు, వాదిత్రాణామ్=వాద్యముల యొక్క, స్వనః=శబ్దము, నృత్యతామ్=ఆడుచున్నవారై, గాయతామ్=పాడుచున్నవారును, సస్త్రీణామ్=స్త్రీలతో గూడినవారునూ, దేవానుగానామ్= దేవతానుచరులైన గంధర్వుల యొక్క, స్వనః=శబ్దము, పృథుః అభూత్=దొడ్డదయ్యెను.

**తాత్పర్యము :** అప్పుడు శంఖములు, మృదంగములోనగు వాద్యములు మ్రోగినవి. గంధర్వులు, అప్సరసలు గూడి నాట్యము చేయుచు గానము చేసిరి. ఆ సందడి గొప్పదయ్యెను.

**శ్లో॥ బ్రహ్మరుద్రాఙ్గిరోముఖ్యాః సర్వే విశ్వసృజో విభుమ్।**
**ఈడిరేఽవితథైర్మన్త్రైస్తల్లిఙ్గైః పుష్పవర్షిణః॥ 26**

**ప్రతిపదార్థము :** బ్రహ్మరుద్ర+అంగిరః ముఖ్యాః=బ్రహ్మ, శివుడు, బృహస్పతిలోనగు ప్రధానులు, సర్వే=ఎల్ల, విశ్వసృజః=విశ్వకర్తలగు ప్రజాపతులు, తత్+లింగైః=విష్ణువును ప్రతిపాదించునట్టి, అవితథైః=వేదమంత్రములచే, పుష్పవర్షిణః=పుష్పములు వర్షించుచున్నవారై, విభుమ్=లోక ప్రభువైన విష్ణువును, ఈడిరే=స్తుతించిరి.

**తాత్పర్యము :** బ్రహ్మ రుద్రుడు బృహస్పతిలోనగు ప్రధానులు, ఎల్ల విశ్వకర్తలు, ఆ విష్ణువు మహిమను ప్రతిపాదించు యదార్థములైన వేదమంత్రములు వచించుచు పుష్పములు వర్షించుచు లోకప్రభువు అయిన విష్ణువును స్తుతించిరి.

**శ్లో॥ శ్రియా విలోకితా దేవాః సప్రజాపతయః ప్రజాః।**
**శీలాదిగుణసమ్పన్నా లేభిరే నిర్వృతిమ్పరామ్॥ 27**

**ప్రతిపదార్థము :** శ్రియా=శ్రీదేవిచే, విలోకితాః=చూడబడిన, దేవాః=దేవతలు, సప్రజాపతయః=కశ్యప ప్రజాపతులతోఁగూడిన, ప్రజాః=ప్రజలు, శీలాదిగుణసంపన్నాః=శీలములోనగు మంచి గుణములతో గూడినవారై, పరామ్=అధికమైన, నిర్వృతిమ్=ఆనందమును, లేభిరే=పొందిరి.

**తాత్పర్యము :** లక్ష్మీదేవి చూసినంతనే దేవతలు కశ్యపాది ప్రజాపతులు ప్రజలు సురలు మంచిస్వభావమగు శీలములోనగు మంచిగుణములతోకూడినవారై అధికానందము పొందిరి.

**శ్లో॥ నిస్సత్త్వాలోలుపా రాజన్ నిరుద్యోగా గతత్రపాః।**
**యదా చోపేక్షితా లక్ష్మ్యా బభూవుర్దైత్యదానవాః॥ 28**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, యదా=ఎప్పుడు, లక్ష్మ్యా=లక్ష్మిచే, ఉపేక్షితాః=విలోకించక ఉపేక్షించబడెనో, దైత్యదానవాః=దైత్యదానవులు, నిస్సత్త్వాః=బలహీనులు, లోలుపాః =మోహశీలురు, నిరుద్యోగాః=ప్రయత్నములేని, గతత్రపాః=కొట్టువడిన కాంతిగలవారు, బభూవుః=అయిరి.

**తాత్పర్యము :** ఎప్పుడు లక్ష్మీదేవి తన కటాక్షమునకు గుఱిచేయకపోయెనో అప్పుడే దైత్యదానవులు బలహీనులు, మోహితులై నిరుద్యోగులై కాంతివిహీనులైరి.

**శ్లో॥ అథాసీత్ వారుణీ దేవీ కన్యా కమలలోచనా।**
**అసురా జగృహుస్తాం వై హరేరనుమతేన తే॥ 29**

**ప్రతిపదార్థము :** అథ=అంత, వారుణీ=వరుణుడు దేవతలుగాగల ఏ అన్నము గలదో ఆ స్వరూపము, సురాదేవీ=దేవియై, కన్యా=కన్యయు, కమలలోచనా=తామరలవంటి కన్నులు గలదై, ఆసీత్=కదలినుద్భవించెను. తామ్=ఆ సురాదేవిని, హరేః=విష్ణువు యొక్క అనుమతేన= అనుజ్ఞచేత, తే=ఆ, అసురాః=అసురులు, జగృహుః=పరిగ్రహించిరి.

**తాత్పర్యము :** అంత వరుణదైవత్యమై సురాదేవి కన్యయై కమలలోచనయై పాలకడలి నుద్భవించెను. హరి యనుమతితో నా సురాదేవిని అసురులు పరిగ్రహించిరి.

**శ్లో॥ అథోదధేర్మథ్యమానాత్ కాశ్యపైరమృతార్థిభిః।**
**ఉదతిష్ఠన్మహారాజ! పురుషః పరమాద్భుతః॥ 30**

**ప్రతిపదార్థము :** మహారాజ=ఓ పరీక్షిత్తు మహారాజా!, అథ=అంత, అమృతార్థిభిః=అమృతము నర్థించిన, కాశ్యపైః=కశ్యపుని సంతానమైన దేవాసురులచే, మథ్యమానాత్=మథించబడుతున్న, ఉదధేః=పాలసముద్రము నుంచి, పరమాద్భుతః=మిక్కిలి అచ్చెరువు గొలుపు, పురుషః=ఒక మహా పురుషుడు, ఉదతిష్ఠత్=ఉద్భవించెను.

**తాత్పర్యము :** ఓ మహారాజా! అంతనమృతమును గోరి కశ్యప ప్రజాపతి పుత్రులగు దేవాసురులు పాల సముద్రమును మథించుచుండ దానినుండి ఆశ్చర్యమునకు స్థానమైన యొక్క మహాపురుషుడుద్భవించెను.

**శ్లో॥ దీర్ఘపీవరదోర్దండః కమ్బుగ్రీవోఽరుణేక్షణః।**
**శ్యామలస్తరుణః స్రగ్వీ సర్వాభరణభూషితః॥ 31**

**ప్రతిపదార్థము :** దీర్ఘపీవరదోర్దండః=పొడవులై బలిసినవై దండముల వంటి బాహువులు గలవాడును, కంబుగ్రీవః=శంఖము వంటి కంఠము గలవాడును, అరుణ+ఈక్షణః=ఎఱ్ఱని కన్నులుగలవాడు, శ్యామలః=నీలవర్ణమువాడు, తరుణః=యువకుడు, స్రగ్వీ=పుష్పమాల గలవాడు, సర్వ+ఆభరణ భూషితః=అన్ని ఆభరణములచే నలంకరింపబడినవాడై యుండెను.

**తాత్పర్యము :** ఆ పురుషుడు పొడవులై బలసినవైన కఱ్ఱలవంటి బాహువులు గలవాడు, శంఖము వంటి మూడు లేఖలు గుండ్రని కంఠము గలిగి కెంపుఛాయ కనులు గలిగి నీల వర్ణదేహము గలవాడై యువకుడు పుష్పమాలను ధరించి సమస్తాభరణములు అలంకరించుకొని చెలువొందియుండెను.



**శ్లో॥ పీతవాసా మహోరస్కః సుమృష్టమణికుణ్డలః।**
**స్నిగ్ధకుఞ్చితకేశాన్తః సహాసః సింహవిక్రమః॥ 32**

**ప్రతిపదార్థము :** పీతవాసా=పసుపు వన్నె పుట్టము గలవాడు, మహా+ఉరస్కః=విశాలమైన రొమ్ముగలవాడు, సుమృష్టమణికుండలః=సానబెట్టిన ప్రకాశించు రత్నముల కుండలములు గలవాడు, స్నిగ్ధకుంచితకేశాంతః=నునుపైబేర్చబడినదై వెంద్రుకల చివర గలవాడు, వెంద్రుకలు ముడివేసికొన్నవాడు, సహాసః=నవ్వుతో కూడిన ముఖము గలవాడు, సింహవిక్రమః=సింహము వంటి పరాక్రమశీలి,

**తాత్పర్యము :** ఆ పురుషుడు పసుపు పచ్చని పుట్టముగలవాడు, విశాలమైన వక్షము గలవాడు, నిర్మలమునై ప్రకాశించు రత్నకుండలములు గలవాడు నిగనిగ మెఱయు శిరోజములు పేర్చి ముడివేసుకొని చిరునవ్వు మోమున దొలుకాడ సింహపరాక్రముడై కన్పట్టెను.

**శ్లో॥ అమృతాపూర్ణకలశం బిభ్రద్వలయభూషితః।**
**స వై భగవతః సాక్షాద్విష్ణోరంశాంశసమ్భవః।**
**ధన్వన్తరిరితి ఖ్యాత ఆయుర్వేదదృగిజ్యభాక్॥ 33**

**ప్రతిపదార్థము :** అమృత+అపూర్ణ కలశమ్=అమృతముతో నిండిన కలశమును, బిభ్రత్=భరించుచున్నవాడు, వలయభూషితః=హస్త కంకణములు అలంకరించుకొన్నవాడు, సః=అతడు, భగవతః=భగవంతుడైన, విష్ణోః=విష్ణువు యొక్క, సాక్షాత్=ప్రత్యక్షమై, అంశ+అంశ సంభవః=అంశము యొక్క అంశమై జనించినవాడు, ధన్వంతరిః ఇతి=ధన్వంతరి అను నామమున, ఖ్యాతిః=ప్రసిద్ధుడు, ఆయుర్వేదదృక్=ఆయుర్వేదమునకు ద్రష్టయై, ఇజ్యభాక్= యజ్ఞభాగ భోక్తయై ప్రకాశించెను.

**తాత్పర్యము :** ఆ పురుషుడు అమృతముతో నిండిన కలశమును చేత ధరించి హస్తములందు కడియములు చెలువారుచుండెను మఱియు నతడు భగవంతుడగు మహావిష్ణువు యొక్క అంశమై జనించినవాడును ధన్వంతరియను నామమున బ్రసిద్ధుడై ఆయుర్వేదమునకు ఆచార్యుడై యజ్ఞభాగభోక్తయై ప్రకాశించెను.

**శ్లో॥ తమాలోక్యాసురాః సర్వే కలశం చామృతాభృతమ్।**
**లిప్సన్తః సర్వవస్తూని కలశం తరసాహరన్॥ 34**

**ప్రతిపదార్థము :** సర్వే=ఎల్ల, అసురాః=అసురులు, తమ్=ఆ ధన్వంతరిని, అమృత+అభృతమ్= అమృతముతో పరిపూర్ణమైన, కలశమ్=కలశమును, ఆలోక్య=చూచి, సర్వవస్తూని= సముద్రమున ఁబొడమిన సమస్త వస్తువులను, లిప్సంతః=కోరుచున్నవారై, కలశమ్=ఆ అమృత కలశమును, తరసా=శీఘ్రముగా, హరన్=హరించిరి.

**తాత్పర్యము :** ఎల్ల అసురులు ఆ ధన్వంతరిని అమృతముతో నిండిన కలశమును చూచి కడలిని పుట్టిన ఐరావతములోనగు సర్వ వస్తువులను వాంఛించుచున్నవారై తక్షణమే వడివడిగా ఆయమృతకలశమును తీసుకొనిరి.

**శ్లో॥ నీయమానేఽసురైస్తస్మిన్ కలశేఽమృతభాజనే।**
**విషణ్ణమనసో దేవా హరిం శరణ మాయయుః॥ 35**

శ్లో॥ న వయం త్వామరై ర్దైత్యైః సిద్ధగన్ధర్వచారణైః।
అస్పృష్టపూర్వాం జానీమో లోకేశైశ్చ కుతో నృభిః॥ 4

నీవెవ్వని భార్యవని మేము ప్రశ్నించుట అయుక్తమగును. ఏలయన నిన్ను చూడ నీవెప్పుడు నే పురుషునిచే ననుభవింపబడిన దానవుగా కన్పడకున్నావనుచున్నాడు.

**ప్రతిపదార్థము:**వయం తు=మేము మాత్రము, అమరైః=దేవతల చేతను, సిద్ధగంధర్వ చారణైః =సిద్ధులు, గంధర్వులు చారణులు అనువారి చేత, లోకేశైః=లోకేశుల చేతను, అస్పృష్టపూర్వామ్ =తాకబడని శీలముగలదానినిగా, జానీమః=తెలిసికొనుచున్నాము, కుతఃనృభిః=నరులచే తాకబడుట యెక్కడిది!

**తాత్పర్యము :** నీవు దైత్యులచేతగాని, సిద్ధగంధర్వచారణుల చేతగాని యోగేశ్వరులు చేతగాని ఇంతకు మున్ను నీవు స్పృశింపబడలేదని తెలిసికొనుచున్నాము. ఇక నరులచేనేమాత్రము స్పృశింపబడుదువు. స్పృశింపబడలేదు.

శ్లో॥ నూనం త్వం విధినా సుభ్రూః ప్రేషితాసి శరీరిణామ్।
సర్వేంద్రియమనఃప్రీతిం విధాతుం సఘృణేన కిమ్॥ 5

మాకు ఈ నీ దర్శనము ఈశ్వరుని చేతనే సంపాదింపబడినదనుచున్నారు.

**ప్రతిపదార్థము :** సుభ్రూః=మంచి కనుబొమలు గలదానా!, త్వమ్=నీవు, శరీరిణామ్= దేహధారులకు, సర్వేంద్రియమనఃప్రీతిమ్=అన్ని యింద్రియములకును, మనస్సునకును, సంతోషమును, విధాతుమ్=కలిగించుటకు, సఘృణేన=కృపతో గూడిన, విధినా=బ్రహ్మచే, కిమ్ప్రేషితా అసి=పంపబడితివా ఏమి ? నూనమ్=ఇది నిశ్చయము.

**తాత్పర్యము :** ఓ మంచి కనుబొమలు గలదానా! నీవు ప్రాణులనెల్ల యింద్రియములు మనస్సును సంతోషమును కలిగించుటకై కృపావంతుడైన విధాతచేఁ బంపబడితివా ఏమి? ఇది నిక్కువము. నీవే స్వేచ్ఛమెయి వచ్చినదానవు కావు. దైవము చేత నిజముగా పంపబడితివి అని అర్థము.

శ్లో॥ సా త్వం నః స్పర్ధమానానామేకవస్తుని మానిని।
జ్ఞాతీనాం బద్ధవైరాణాం సంవిధత్స్వ సుమధ్యమే॥ 6

**ప్రతిపదార్థము :** సుమధ్యమే=సొగసైన నడుము గలదానా!, మానిని=మానవంతురాలా!, సా త్వమ్=అట్టి నీవు, ఏకవస్తుని=ఒక్క వస్తువైన అమృతమునందు, స్పర్ధమానానామ్= మత్సరము గలిగి, బద్ధవైరాణామ్=ఏర్పడిన విరోధముగల, జ్ఞాతీనామ్=దాయాదులైన, నః =మాకు, సంవిధత్స్వ=ఈ అమృతమును విభాగించుము.

**తాత్పర్యము :** ఓ మానినీ! సన్నని నడుము గలదానా! ఒక పదార్థమైన ఈ అమృతము విషయమై పగగొనిన దాయాదులమగు మాకు ఈ అమృతమును పంచిపెట్టుము.

శ్లో॥ వయం కశ్యపదాయాదా భ్రాతరః కృతపౌరుషాః।
విభజస్వ యథాన్యాయం నైవ భేదో యథా భవేత్॥ 7

**ప్రతిపదార్థము :** వయమ్=సురాసురులమగు మేము, కశ్యపదాయాదాః=కశ్యపుని



వారైన, సమానమైన శ్రమహేతువైన ధనాదికము గలవారో, సత్రయాగ ఇవ= సత్రయాగము నందువలె, అస్మిన్=ఈ మథనము, ఏష ధర్మః=ఈ ధర్మము, సనాతనః=సనాతనమైనది, శ్రుతి :- బుద్ధికామా సత్రమాసీదత్

ఎవరు యజమానులో వారే ఋత్విజులు.

**తాత్పర్యము :** అబ్ధి మథించుటయందు సమాన శ్రమగలవారైనందున దేవతలు సత్రయాగము నందు యజమానులట్లు వారి భాగము గైకొననర్హులగుదురు. ఇతి సనాతన ధర్మము.

శ్లో॥ ఇతి స్వాన్ ప్రత్యషేధన్ వై దైతేయా జాతమత్సరాః।
దుర్బలాః ప్రబలాన్ రాజన్ గృహీతకలశాన్ ముహుః॥ 39

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, దైతేయాః=దైత్యులు, జాతమత్సరాః=పుట్టిన మత్సరము గలవారై, దుర్బలాః=బలహీనులు, గృహీతకలశాన్=గైకొన్న కలశము గల, ప్రబలాన్= బలియులైన దైత్యులను, స్వాన్=తమవారిని, ముహుః=మాటిమాటికి, ప్రత్యషేధన్ వై= నిందించిరి.

**తాత్పర్యము :** అని దుర్బలులైన దైత్యులు మత్సరము గలవారై అమృత కలశమును గైకొని బలియులైన తమవారిని మాటిమాటికి నిందించిరి.

శ్లో॥ ఏతస్మిన్నన్తరే విష్ణుః సర్వోపాయవిదీశ్వరః।
యోషిద్రూపమనిర్దేశ్యందధార పరమాద్భుతమ్॥ 40

**ప్రతిపదార్థము :** ఏతస్మిన్=ఈ, అంతరే=మధ్యకాలమునందు, సర్వ+ఉపాయవిత్=అన్ని ఉపాయముల నెఱింగినవాడు, ఈశ్వరః=ప్రభువు, విష్ణుః=విష్ణువు, పరమ+అద్భుతమ్=మిక్కిలి, ఆశ్చర్యకరమైన, అనిర్దేశ్యమ్=ఇట్టిదని వర్ణింపగానిదైన, యోషిత్+రూపమ్=స్త్రీ రూపమును, దధార=ధరించెను.

**తాత్పర్యము :** ఇంతలోనన్నియుపాయముల నెఱింగిన జగత్ప్రభువు విష్ణువు మిగుల నచ్చెరువు గొల్పుచు వర్ణింపనలవిగాని స్త్రీ రూపమును దాల్చెను.

శ్లో॥ ప్రేక్షణీయోత్పలశ్యామం సర్వావయవసున్దరమ్।
సమానకర్ణాభరణం సుకపోలోన్నసాననమ్॥ 41

## మోహినీరూప వర్ణన

**ప్రతిపదార్థము :** ప్రేక్షణీయ+ఉత్పలశ్యామమ్=చూడదగిన నల్లకలువలవలె, నల్లనైనదియు, సర్వ+అవయవసుందరమ్=అన్ని అవయవములు సుందరములుగా గలదియు, సమాన కర్ణ+ఆభరణమ్=సరిగా మెఱయు చెవికమ్మలు గలదియు, సుకపోల+ఉన్నస+ఆననమ్=చక్కని చెక్కిళ్ళు ఉత్కృష్టమైన కొంచెమున్నతమైన ముక్కు మొగము గలదయ్యెను.

**తాత్పర్యము :** ఆమె మేను నల్లకలువల ఛాయగలదయ్యెను. అన్ని యవయవములు సుందరముగా నుండెను. చెవి కమ్మలు సమానములై యుండినవై చక్కని చెక్కిళ్ళు ఉన్నతమైన నాసిక ముఖము గలదయ్యెను.

శ్లో॥ నవయౌవననిర్వృత్తస్తనభారకృశోదరమ్।
ముఖామోదానురక్తాళిఝఙ్కారోద్విగ్నలోచనమ్॥ 42

**ప్రతిపదార్థము :** నవయౌవన... దరమ్=నవయౌవన=క్రొత్త జవ్వనముచే, నిర్వృత్త=పెరిగిన, స్తనభార=చనుగవల బరువు చేత, కృశ+ఉదరమ్=సన్నగిలిన కడుపు గలదై, ముఖ... లోచనమ్ =ముఖ+ఆమోద=ముఖపరిమళమునకు, అనురక్త+అళి=ఆసక్తములైన తుమ్మెదల యొక్క హుంకార=హుంకారములచే, ఉద్విగ్నలోచనమ్=చలించు నేత్రములు గలదయ్యెను.

**తాత్పర్యము :** క్రొత్త జవ్వనమున బలిసిన చనుగవ బరువున కృశించిన లేనడుము గలదై, ముఖ పరిమళమున కాసక్తములై చేరిన తేంట్ల ఝంకార ధ్వనులచే చలించు లోచనములు గలదయ్యెను.

**శ్లో॥ బిభ్రత్ స్వకేశభారేణ మాలాముత్ఫుల్లమల్లికామ్।**
**సుగ్రీవకణ్ఠాభరణం సుభుజాఙ్గదభూషితమ్॥ 43**

**ప్రతిపదార్థము :** కేశభారేణ=వెండ్రుకల జడచేత, ఉత్ఫుల్లమల్లికామ్=వికసించిన మల్లెలు గల, మాలామ్=సరమును/మాలను, బిభ్రత్=ధరించినదియు, సుగ్రీవకంఠాభరణమ్=చక్కని కంఠమునందు హారము గలదై, సుభుజ+అంగదభూషితమ్=సొగసైన భుజములందు భుజకీర్తులచే అలంకరింపబడినదయ్యెను.

**తాత్పర్యము :** తలయందు పూచిన మల్లెల విరులదండను దాల్చి చక్కని కంఠమునందు కంఠహారము మెఱయ అందమైన భుజములందు భుజకీర్తులను అలంకరించుకొని యుండెను.

**శ్లో॥ విరజామ్బరసంవీతనితమ్బద్వీపశోభయా।**
**కాఞ్చ్యా ప్రవిలసద్వల్గుచలచ్చరణ నూపురమ్॥ 44**

**ప్రతిపదార్థము :** విరజాంబర...శోభయా=విరజ+అంబర=నిర్మలమైన కట్టుచీరచే, సంవీత=ఆవృతమైన, నితంబద్వీపశోభయా=ద్వీపములవలె విశాలమైన పిఱుదుల కాంతిగల, కాంచ్యా=మొలనూలు చేతను, ప్రవిలసత్=మెఱయుచున్న, వల్గు=అందమైన హారములతో, చలత్= చలించుచున్న, చరణనూపురమ్=కాళ్ళయందు అందెలుగలదయ్యెను.

**తాత్పర్యము :** నిర్మలమైన చీర ధరించి గొప్ప పిఱుదుల శోభతో కూడిన మొలనూలు చేతను ఒండొకటి నొరయుచు మ్రోగుచున్న కాళ్ళయందు అందెలు గలదయ్యెను.

**శ్లో॥ సవ్రీడస్మితవిక్షిప్తభ్రూవిలాసావలోకనైః।**
**దైత్యయూథపచేతస్సు కామముద్దీపయన్ ముహుః॥ 45**

**ప్రతిపదార్థము :** సవ్రీడస్మిత=సిగ్గుతో కూడిన చిరునగవుచే, విక్షిప్త=చలించిన, భ్రూవిలాసావలోకనైః=కనుబొమల విలాసముతో కనుగవ చూపులచే, దైత్యయూథప చేతస్సు=దైత్యసేనాధిపతుల చిత్తములందు, కామమ్=కామమును, ముహుః=మఱిమఱి, ఉద్దీపయన్=ప్రజ్వలింపజేయుచుండెను.

**తాత్పర్యము :** ఆమె రూపమింకను సిగ్గుతోను, చిరునగవుతోను కూడిన కనుబొమల కదలికల విలాసముతోడి కనుగవ చూపులచే దైత్యశ్రేష్ఠుల చిత్తములందు కామమును జ్వలింప జేయుచుండెను.

ఇతి శ్రీమద్భాగవతమహాపురాణే అష్టమస్కంధే అష్టమో - ధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధమున అష్టమాధ్యాయము.

## నవమోఽధ్యాయః

ఈ అధ్యాయమునందు మోహినియందు మోహితులై దైత్యులర్పించే అమృత కలశమును గొని వారిని వంచించి సురలకమృతమును పంచుట వర్ణింపబడును.

మఱియు స్త్రీమూర్తిచే, దేవతలచే అమృతపానము గావించి రాహువు శిరస్సును ఖండించి దేవతలను రక్షించెను అని చెప్పబడును.

**శ్రీ శుక ఉవాచ :**

**శ్లో॥ తేఽన్యోన్యతోఽసురాః పాత్రం హరన్తస్త్యక్తసౌహృదాః।**
**క్షిపన్తో దస్యుధర్మాణః ఆయాన్తీం దదృశుః స్త్రియమ్॥ 1**

**ప్రతిపదార్థము :** అసురాః=దైత్యులు, అన్యోన్యతః=ఒండొరులనుంచి, పాత్రమ్=అమృత కలశమును, హరంతః=హరించుచున్నవారై, త్యక్త సౌహృదాః=విడిచిన స్నేహముగలవారై, దస్యుధర్మాణః=చోరధర్మమున, క్షిపంతః=అమృత కలశమును లాగుకొనిపోవుచు, ఆయాంతీమ్ =తమవంకకు వచ్చుచున్న, స్త్రియమ్=స్త్రీని, విష్ణువు మోహినీ రూపమును, దదృశుః=చూచిరి.

**తాత్పర్యము :** ఆ దైత్యులు ఒండొరుల చేత నుండి అమృత కలశమును దీసుకొనిపోవుచు ఒకరిపై నొకరికేమాత్రము అభిమానము లేనివారై దొంగలవలె ఆ కలశమును లాగుకొని పరుగెత్తి పోవుచుఁదమవంకకు వచ్చు విష్ణువు అవతారమైన మోహినియను స్త్రీని గాంచిరి.

**శ్లో॥ అహో రూపమహో ధామ అహో అస్యా నవం వయః।**
**ఇతి తే తామభిద్రుత్య పప్రచ్ఛుర్జాత సౌహృదాః॥ 2**

**ప్రతిపదార్థము :** అస్యాః=ఈ స్త్రీ యొక్క, రూపమ్=రూపము, అహో!=ఔరా! ఎంత బాగున్నది, ధామ=దేహకాంతి, అహో!=ఎంత చక్కన, నవమ్=కొత్తదైన, వయః=వయస్సు, అహో!=ఎంత లెస్స, ఇతి=ఇట్లని, జాతసౌహృదాః=ఆ మోహినియందు పుట్టిన నెయ్యము గలవారు, అభిద్రుత్య=ఆమె దగ్గరకు పరుగెత్తిపోయి, తామ్=ఆ మోహినిని, పప్రచ్ఛుః=ప్రశ్నించిరి.

**తాత్పర్యము :** ఔరా! ఈమె రూపమెంత బాగున్నది. ఆహా! ఎంత చక్కని మేను, ఓహో! ఎంత లేత వయస్సు అని ఆమె యందుఁప్రేమగలవారై ఆమె కడకుఁబరువెత్తిపోయి ఇట్లు ప్రశ్నించిరి.

**శ్లో॥ కా త్వం కఞ్జపలాశాక్షి కుతో వా కిఞ్చికీర్షసి।**
**కస్యాసి వద వామోరు మథ్నతీవ మనాంసి నః॥ 3**

**ప్రతిపదార్థము :** కంజపలాశాక్షి!=తామరరేకుల వంటి కన్నులు గలదానా!, కా త్వమ్= ఎవ్వతెవు నీవు, కుతో వా=ఎక్కడ నుండి రాక!, కిం చికీర్షసి=ఏమి చేయగోరుదువు, వామోరు= సుందరమైన తొడలు కలదానా!, కస్య+అసి=నీవెవ్వని భార్యవు, నః=మా యొక్క, మనాంసి= మనస్సులను, మథ్నతీవ=మథించుదానివలె నగుచున్నావు.

**తాత్పర్యము :** ఓ కమలదళాక్షి నీవెవ్వతెవు. ఎచ్చటనుండి వచ్చుచున్నావు. నీవేమి చేయ గోరిక కలదు. నీవెవ్వని భార్యవు. మా మనస్సులను క్షోభ పెట్టుచున్నావు.

**తాత్పర్యము :** ఆ సిరికి నెచ్చెలియై పసిండి కన్నులచే నందగించిన వీనులు, అందమైన చెక్కిళ్ళు, ముక్కు, మొగము గలదై పరదేవతయను పేరు గలదై చనుగవపైని పయ్యెట జార్చుచున్నదైన ఆ మోహినీ దేవతను భయమునఁగదలు కంటిచూపులఁ జూచుచు మిగుల మోహముఁబొందిరి.

**శ్లో॥ అసురాణాం సుధాదానం సర్వాణామివ దుర్నయమ్।**
**మత్వా జాతినృశంసానాం న తాం వ్యభజదచ్యుతః॥ 19**

ఇట్లు వారల మోహపెట్టి ఏమి చేసెనో దానిని మూడు శ్లోకములలో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అసురాణామ్=అసురులకు, సుధాదానమ్=అమృతమును పంచుట, సర్వాణామ్=సర్పములకు, సుధాదానమివ=పాలుపోయుట వలె, దుర్నయమ్=అన్యాయమును, మత్వా=తలంచి, అచ్యుతః=విష్ణువు, జాతినృశంసానామ్=జాతిచేతను క్రూరులైనవారికి, తామ్= ఆ సుధను, న వ్యభజత్=పంచిపెట్టలేదు.

**తాత్పర్యము :** అసురులకమృతము నొసగుట పాములకు పాలుపోయుట వంటిదని తలంచి మోహినియైన విష్ణువు జాతిచేతను క్రూరులైన ఆయసురులకు అమృతమును పంచిపెట్టలేదు. దాని భావమిది. దైత్యులు, నేను మంచి చేసినను చెడ్డ చేసినను అంతయునునుమతించి యున్నారు. అందువలన దేవతలకే ఈ యమృతము బంచియిచ్చి ద్రాగించెదను. ఈ దైత్యులే నా ఇష్టప్రకారము పంచి యిమ్మనిరి. జాతిచేతనే క్రూరులగువారికి అమృతము నొసగుట న్యాయము గాదు. అందువలన వారికి సుధను ఈయనని తలంచెను అని భావము.

**శ్లో॥ కల్పయిత్వా పృథక్ పఙ్క్తీరుభయేషాం జగత్పతిః।**
**తాంశ్చోపవేశయామాస స్వేషు స్వేషు చ పఙ్క్తిషు॥ 20**

**ప్రతిపదార్థము :** జగత్+పతిః=లోక ప్రభువు విష్ణువు, ఉభయేషామ్=ఇరు తెరగులగు ఆ సురాసురులకు, పృథక్=వేఱుగా, పంక్తీః=బంతులను, కల్పయిత్వా=కల్పించి, స్వేషు స్వేషు పంక్తిషు=వారివారి పంక్తులయందు, తాంశ్చ=వారిని, ఉపవేశయామాస=కూర్చుండ బెట్టెను.

**తాత్పర్యము :** సురాసురులనుభయులకును ఆజగత్పతి వేఱువేఱుగా తలచి బంక్తుల నేర్పాటు చేసి దేవతలను దేవతల పంక్తియందు దైత్యులను దైత్యుల పంక్తియందు కూర్చుండబెట్టెను.

**శ్లో॥ దైత్యాన్ గృహీతకలశో వఞ్చయన్నుపసఞ్చరైః।**
**దూరస్థాన్ పాయయామాస జరామృత్యుహరాం సుధామ్॥ 21**

**ప్రతిపదార్థము :** గృహీతకలశః=అమృతకలశము తీసుకొన్నవాడై విష్ణువు, ఉపసంచరైః =బహుమాన ప్రియవాక్యములచే, దైత్యాన్=దైత్యులను, వంచయన్=మోసగించుచు, దూరస్థాన్=దూరమందున్న దేవతలను, జరామృత్యుహరామ్=ముదిమిని, చావును హరించునదైన, సుధామ్=అమృతమును, పాయయామాస=త్రాగించెను.

**తాత్పర్యము :** విష్ణువు అమృతకలశమును గైకొని ప్రియవాక్యములచే దైత్యులను వంచించుచూ దూరస్థులైన సురలకు ముసలితనము రానీయనిదై, మృత్యువును పోగొట్టునదైన అమృతమునొసగి త్రాగించెను.



పుత్రపౌత్రులము. భ్రాతరః=సోదరులము, కృతపౌరుషాః=పౌరుషము గొనియున్నాము. యథా=ఏవిధముగా, భేదః=మాలో కలహము, న భవేత్ ఏవ=కలుగనే కలుగదో అట్లే యథా న్యాయమ్=న్యాయ ప్రకారము, విభజస్వ=ఈ అమృతమును పంచుము.

**తాత్పర్యము :** దేవతలము, అసురులమగు మేము కశ్యపుని పుత్రపౌత్రులము అయియున్నాము. మేము పరస్పరము సోదరులము. మాకు ఈ అమృతము విషయమై ఏ విధముగా కలహము సంభవింపదో ఆ విధముగా న్యాయము ప్రకారము ఈ అమృతమును పంచుము.

**శ్రీ భగవానువాచ :** భగవంతుడు వచించెను.

**శ్లో॥ కథం కశ్యపదాయాదాః పుంశ్చల్యాం మయి సఙ్గతాః।**
**విశ్వాసం పణ్డితో జాతు కామినీషు న యాతి హి॥ 8**

**ప్రతిపదార్థము :** కశ్యపదాయాదాః=కశ్యపుని పుత్రపౌత్ర సంతతివారైన మీకు, పుంశ్చల్యామ్= చెడ్డవనితయైన మయి=నాయందు, కథమ్=ఎట్లు, సంగతాః=కూడి వచ్చితిరి, పండితాః =పండితులు, జాతు=ఒకానొకప్పుడు, కామినీషు=స్త్రీలయందు, విశ్వాసమ్=నమ్మకమును, న యాతి హి=పొందరు కదా!

**తాత్పర్యము :** కశ్యపుని సంతతివారగు మీరు అసతినైన నన్నెట్లు అనుసరించి వచ్చితిరి. పండితులైనవారు కామినులందు విశ్వాసముంచరు కదా!

**శ్లో॥ సాలావృకాణాం స్త్రీణాం చ స్వైరిణీనాం సురద్విషః।**
**సఖ్యాన్యాహురనిత్యాని నూత్నం నూత్నం విచిన్వతామ్॥ 9**

**ప్రతిపదార్థము :** సురద్విషః=ఓ సురవైరులారా!, నూత్నం నూత్నమ్=క్రొత్త క్రొత్త వానిని గూర్చి, విచిన్వతామ్=వెదకుచున్న, సాలావృకాణామ్=తోడేళ్ళ యొక్కయు, స్వైరిణీనామ్= స్వేచ్ఛగా తిరుగు, స్త్రీణామ్=స్త్రీల యొక్క, సఖ్యాని=స్నేహములు, అనిత్యాని=అశాశ్వతములు అని, ఆహుః=పెద్దలు చెప్పుదురు.

**తాత్పర్యము :** ఓ సురద్విషులారా!, అప్పటికప్పుడు క్రొత్త క్రొత్త వస్తువులందు ఆసక్తములగు తోడేళ్ళ యొక్కయు స్వేచ్ఛతో వర్తించు స్త్రీల యొక్కయు స్నేహములు అశాశ్వతములు అని పెద్దలు చెప్పుదురు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇతి తే క్ష్వేళితైస్తస్యా ఆశ్వస్తమనసోఽసురాః।**
**జహసుర్భావగామ్భీర్యం దదుశ్చామృతభాజనమ్॥ 10**

**తాత్పర్యము :** ఇతి=ఈ విధముగా, అసురాః=అసురులు, తస్యాః=ఆ మోహిని యందు, క్ష్వేళితైః=పరిహాస వాక్యములచేత, ఆశ్వస్తమనసః=విశ్వసించిన మనస్సుగలవారై, భావగంభీరమ్=ఏదేనొక అభిప్రాయముచే తెలియరాని విధముగా గంభీరము, జహసుః =నవ్వి, అమృతభాజనం చ=అమృతకలశమును, దదుః=ఇచ్చిరి.

**తాత్పర్యము :** ఇట్లు ఆ మోహిని పరిహాసవాక్యములచే చలించిన మనస్సులు గలవారై ఆ యసురులు సాభిప్రాయ గంభీరముగ నవ్వి అమృతకలశమునిచ్చిరి.

శ్లో।। తతో గృహీత్వాఽమృతభాజనం హరిర్బభాష ఈషత్స్మితశోభయా గిరా।
యద్యభ్యుపేతం క్వ చ సాధ్వసాధు వా కృతం మయా వో విభజే సుధామిమామ్।। 11

**ప్రతిపదార్థము :** తతః=అంత, హరిః=మోహినియైన విష్ణువు, అమృతభాజనమ్=మధుపాత్రమును, గృహీత్వా=తన చేతికి తీసుకొని, ఈషత్+స్మితశోభయా=ఇంచుక నవ్వుచే శోభిల్లు, గిరా=వాక్కుతో, బభాషే=భాషించెను. క్వ చ=ఎచ్చటనేని, సాధు+అసాధువా=మంచిగాని, చెడ్డగాని, మయా=నాచే, కృతమ్=చేయబడినది, యది అభ్యుపేతమ్=మీకు సమ్మతమగునేని, ఇమాం సుధామ్=ఈ అమృతమును, విభజే=పంచెదను.

**తాత్పర్యము :** అంత మోహినీరూపుడగు హరి చిరునవ్వుతో గూడి శోభిల్లు మాటనొకటి యిట్లు చెప్పెను. నేనెక్కడనైన మంచిగాని, చెడ్డగాని చేసినను దానిని సమ్మతించువారగు నెడల మీకీ అమృతమును పంచిపెట్టెదను.

శ్లో।। ఇత్యభివ్యాహృతం తస్యా ఆకర్ణ్యాసురపుఙ్గవాః।
అప్రమాణవిదస్తస్యాస్తత్ తథేత్యన్వమంసత।। 12

**ప్రతిపదార్థము :** అసురపుంగవాః=దైత్యశ్రేష్ఠులు, ఇతి=ఈ విధముగ, తస్యాః=ఆ మోహిని యొక్క, అభివ్యాహృతమ్=వచించబడిన వాక్యమును, ఆకర్ణ్య=విని, అప్రమాణవిదః=ఈమె వాక్యమునకు ఇది అర్థము ఆ వాక్యమునకు నిశ్చయము దెలియనివారయి, తత్=అది, తథా+ఇతి=ఆ ప్రకారమే అని, అన్వమంసత=తలంచిరి, ఆమోదించిరి.

**తాత్పర్యము :** ఆ దైత్యశ్రేష్ఠులా మోహిని వచించిన వాక్యమును ఆ వాక్యములోని నిశ్చయమును తెలియనివారై అట్లే నీ యిష్టప్రకారమే కానిమ్ము అని సమ్మతం దెలిపిరి.

శ్లో।। అథోపోష్య కృతస్నానా హుత్వా చ హవిషానలమ్।
దత్త్వా గోవిప్రభూతేభ్యః కృతస్వస్త్యయనా ద్విజైః।। 13

**ప్రతిపదార్థము :** అథ=తర్వాత ఆ దైత్యులు, ఉపోష్య=ఉపవాసము చేసి, కృతస్నానాః=స్నానము చేసి, హవిషా=హవిస్సుచే, అనలమ్=అగ్నిని, గోవిప్రభూతేభ్యః=గోవిప్రులకును, భూతములకు, గాః=గోవులు అన్నమును, దత్త్వా=ఒసగి, ద్విజైః=బ్రాహ్మణులచే, కృతస్వస్త్యయనాః=చేయబడిన మంగళ వాచములు గలవారై –

**తాత్పర్యము :** అంత నాదైత్యులుపవసించి స్నానమొనర్చి హవిస్సును అగ్నియందు హోమము గావించి విప్రులకు గోవులను, ఇతర ప్రాణులకు అన్నాదికము నొసగి ద్విజులు మంగళ వచనములు పలుక నేతెంచిరి.

శ్లో।। యథోపజోషం వాసాంసి పరిధాయాహతాని తే।
కుశేషు ప్రావిశన్ సర్వే ప్రాగగ్రేష్వభిభూషితాః।। 15

**ప్రతిపదార్థము :** యథా+ఉపజోషమ్=వారివారి ప్రీతికిఁదగినట్లుగాను, తే=ఆ దైత్యులు సురులు, అహతాని=ఉదక నూతనమైన, వాసాంసి=వస్త్రములను, పరిధాయ=కట్టుకొని, సర్వే=ఎల్లరు దేవతలు గూడ, అభిభూషితాః=ఆభరణాదులలంకరించుకొని, ప్రాక్+కూలేషు/ప్రాక్+అగ్రేషు=తూర్పు కొనలు గల, కుశేషు=దర్భలయందు, ప్రావిశన్=ప్రవేశించి, కూర్చుండిరి.



శుభకార్యములందు నూతన వస్త్రధారణము శ్రేష్ఠము.

అహతం యన్త్రనిర్ముక్తం.... తావన్మాత్రేణ సర్వదా।।

మగ్గము నుండి తీసినదై ఉత్తరించని నూతన వస్త్రము అయినంతలో శుభ కార్యములందు మంచిదని బ్రహ్మదేవుడు ఏర్పరచెను.

**తాత్పర్యము :** అంతనాదైత్యులు వారివారికిచ్చవచ్చిన నూతన వస్త్రములను ధరించి ఆభరణములు ధరించి తూర్పు కొనలుగాఁబఱచిన దర్భలపై వచ్చి కూర్చుండిరి.

శ్లో।। ప్రాఙ్ముఖేషూపవిష్టేషు సురేషు దితిజేషు చ।
ధూపామోదితశాలాయాం జుష్టాయాం మాల్యదీపకైః।। 16

**ప్రతిపదార్థము :** సురేషు=దేవతలు, దితిజేషు=దైత్యులు, ప్రాఙ్ముఖేషు=తూర్పుముఖములు గలవారై, ధూపామోదితశాలాయామ్=అగరు ధూపము పరిమళించు శాలలందు, ఉపవిష్టేషు=కూర్చుండినవారు కాగా, మాల్య/ఆజ్య దీపకైః=నేతి దీపములచే, జుష్టాయామ్=వెలుగుచున్న–

**తాత్పర్యము :** దేవతలు దైత్యులు నేయి దీపములతో వెలుగొందుచు అగరు ధూపములచే పరిమళించు శాలయందు చేరి తూర్పు ముఖముగా కూర్చుండిరి.

శ్లో।। తస్యాం నరేన్ద్ర కరభోరురుశద్దుకూలశ్రోణీతటాలసగతిర్మదవిహ్వలాక్షీ।
సా కూజతీ కనకనూపురశిఞ్జితేన కుమ్భస్తనీ కలశపాణిరథావివేశ।। 17

**ప్రతిపదార్థము :** నరేంద్ర=ఓ రాజా!, సా=ఆ మోహిని, కరభ+ఊరు=ఏనుగు తొండముల వంటి తొడలు గల, ఉశత్+దుకూలశ్రోణీతటాలసగతిః=మనోహరమైన పట్టు చీరగలదైన నితంబ ప్రదేశముతో గూడిన మందగమనము గలదై, మదవిహ్వలాక్షీ=యౌవనమదమున చలించు కన్నులు గలది, కుంభస్తనీ=కనక ఘటముల వంటి స్తనములు గలదై, కలశపాణిః=అమృత కలశము హస్తమునందు గలదై, కనకనూపురశింజితేన=బంగారందియలు శబ్దించుటచే, కూజతీ=మ్రోగుచున్నదై, అథ=పిమ్మట, ఆవివేశ=ఆ శాలయందు ప్రవేశించెను.

**తాత్పర్యము :** అంత ఆ మోహిని ఏనుగు తొండముల వంటి తొడలు గలదియు మేలైన పట్టుపుట్టముగట్టి నితంబభారమైన మందమైన గమనము గలదై యౌవన మదమునఁదేలు కన్నులు గలదియు కనక కుంభముల వంటి స్తనములు గలదియు చేత నమృత కలశమును ధరించి బంగారందెలు ఘల్లు ఘల్లుమని మ్రోయుచుండగా ఆ శాలయందు ప్రవేశించెను.

శ్లో।। తాం శ్రీసఖీం కనకకుణ్డలచారుకర్ణనాసాకపోలవదనాం పరదేవతాఖ్యామ్।
సంవీక్ష్య సంముముహురుత్స్మితవీక్షణేన దేవాసురా విగలితస్తనపట్టికాయామ్।। 18

**ప్రతిపదార్థము :** తాం శ్రీ సఖీమ్=ఆ లక్ష్మిసఖురాలయిన, కనక కుండల... వదనామ్=కనక కుండల=పైడి కమ్మలచే, చారు=సుందరమైన, కర్ణ=చెవులు, నాసా కపోల వదనామ్=ముక్కు చెక్కిళ్ళు, మొగము గలదియు, పరదేవతా+ఆఖ్యామ్=పరదేవతయను పేరు కలదియు, విగళితస్తనపట్టికాయామ్=జాఱిన చనుఁగవపై పయటగలదైన, తామ్=ఆ మోహిని, దేవాసురాః=దేవాసురులు, ఉత్స్మిత వీక్షణేన=జనించిన భయముతో గూడినదై, సంవీక్ష్య=వీక్షించి, సంముముహుః=మిక్కిలి మోహమునొందిరి.

## దశమోఽధ్యాయః

ఈ అధ్యాయమునందు దైత్యులు మత్సరమున సురలతో యుద్ధము ప్రారంభించిరి. సురలు దైత్యుల మాయచే విషణ్ణులుకాగా హరియు ఓదార్చుట భక్తులుగానివారికి అమృతప్రాప్తి లేదని చెప్పబడినది. భక్తులపై మత్సరము పూనుట వలన ప్రాణహానియు కలుగుచున్నది.

### దేవాసురయుద్ధము

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇతి దానవదైతేయా నావిన్దన్నమృతం నృప।**
**యుక్తాః కర్మణి యత్తాశ్చ వాసుదేవపరాఙ్ముఖాః॥ 1**

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, ఇతి=ఇట్లు, దానవదైతేయాః=దానవులు, దైత్యులు, కర్మణి=క్షీరసాగర మథన క్రియయందు, యుక్తాః=కూడుకొన్న వారయ్యు, యత్తాః=గర్వించినవారై, వాసుదేవపరాఙ్ముఖాః=విష్ణువునకు పెడమొగము పెట్టినవారై, అమృతమ్=అమృతమును, న+అవిందన్=పొందలేదు.

**తాత్పర్యము :** ఇట్లు దైత్యులు, దానవులు సురలవలెనే పాలకడలిని ద్రచ్చుకార్యము నందు సమానులై శ్రమపడినవారయ్యు పొగరుబోతులై మహావిష్ణువునకు బెడమొగము గలవారైనందున అమృతమునుఁ బొందలేకపోయిరి.

**శ్లో॥ సాధయిత్వామృతం రాజన్ పాయయిత్వా స్వకాన్ సురాన్।**
**పశ్యతాం సర్వభూతానాం యయౌ గరుడవాహనః॥ 2**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, విష్ణువు, అమృతమ్=అమృతమును, సాధయిత్వా=సంపాదించి, స్వకాన్ సురాన్=స్వీయులైన సురలను, పాయయిత్వా=త్రాగింపజేసి, సర్వభూతానాం పశ్యతామ్=ఎల్ల ప్రాణులు చూచుచుండ, గరుడవాహనః=గరుడునిపై నెక్కి, యయౌ=వెళ్ళెను.

**తాత్పర్యము :** విష్ణువు ఇట్లు అమృతమును సాధించి సురలకుఁద్రాగనిచ్చి ఎల్లవారు చూచుచుండఁదాను గరుడునెక్కి వెళ్ళెను.

**శ్లో॥ సపత్నానాం పరాంసిద్ధిం దృష్ట్వా తే దితినన్దనాః।**
**అమృష్యమాణా ఉత్పేతుర్దేవాన్ ప్రత్యుద్యతాయుధాః॥ 3**

**ప్రతిపదార్థము :** సపత్నానామ్=శత్రువులైన సురలయొక్క, పరాంసిద్ధిమ్=ఉత్కృష్టమైన అమృత సిద్ధిని, దృష్ట్వా=చూచి, తే=ఆ, దితినందనాః=దైత్యులు, అమృష్యమాణాః=సహింపరానివారై, దేవాన్ ప్రతి=దేవతలను గూర్చి, ఉద్యత+ఆయుధాః=హస్తములందు ధరించిన ఆయుధములు గలవారై, ఉత్పేతుః=సురలపైఁగవిసిరి.

**తాత్పర్యము :** తమకుఁశత్రువులైన వేల్పులు అమృతమను ఫలసిద్ధిని పొందినవారగుటను చూచి యోర్వలేనివారై దేవతలను సంహరింప నాయుధములఁబూని సురలపైఁగవిసిరి.

**శ్లో॥ తతః సురగణాః సర్వే సుధయా పీతయైధితాః।**
**ప్రతి సంయుయుధుః శస్త్రైర్నారాయణపదాశ్రయాః॥ 4**



**శ్లో॥ తే పాలయన్తః సమయమసురాః స్వకృతం నృప।**
**తూష్ణీమాసన్ కృతస్నేహాః స్త్రీవివాదజుగుప్సయా॥ 22**

**ప్రతిపదార్థము :** తే=ఆ, అసురాః=అసురులు, తత్+కృతమ్=ఆ మోహిని ఏమిచేసిన, ఏమీ అనకూడదని, సమయమ్=ఒడంబడికను, పాలయంతః=పాలించుచు, కృతస్నేహాః=ఆమెతో గావించిన నెయ్యముగలవారై, స్త్రీ వివాద జుగుప్సయా=స్త్రీతో వాదమునకు పెట్టుకొనుట అసహ్యమగుటచే, తూష్ణీం ఆసన్=మిన్నకుండిరి.

**తాత్పర్యము :** ఆయసురులు మోహిని చెప్పిన ప్రకారము సమ్మతించినవారైనందున ఆ యేర్పాటునుఁబాలించువారై ఆమెయందు గల నెయ్యముతో స్త్రీతో వాదము పెట్టుకొనుట అసహ్యముగానుండునని తలంచి మిన్నకుండిరి.

**శ్లో॥ తస్యాం కృతాతిప్రణయాః ప్రణయాపాయకాతరాః।**
**బహుమానేన చాబద్ధా నోచుః కిఞ్చన విప్రియమ్॥ 23**

**ప్రతిపదార్థము :** తస్యామ్=ఆ మోహినియందు, కృత+అతిప్రణయాః=చేయబడిన మిక్కిలి ప్రేమగలవారును, ప్రణయ+అపాయకాతరాః=ప్రేమ వీడునను భయముగలవారై, బహుమానేన=గౌరవముచే, ఆబద్ధాః చ=కట్టుబడినవారై, కించన=ఇంచుక, విప్రియమ్=అనిష్టమును, న+ఊచుః=వంచించరైరి.

**తాత్పర్యము :** దైత్యులా మోహినీ దేవత యందత్యంతప్రేమగలవారై ఏమనిన ఆమె ప్రేమకు గురికాకపోవుదుమేమో అన్న భయముగలవారై ఈ దేవతలు కృపకాని వీరు మొదట సుధాపానము చేయుదురు గాక. మీరుదారులు. క్షణకాలము నిరీక్షించుచుండుడు అనునిట్లు బహుమానవాక్యముచే కట్టుబడినవారై సమయపాలనముచే ఇట్టి కారణములచే నేమియు ననిష్టకార్యమును వచింపరైరి.

**శ్లో॥ దేవలిఙ్గప్రతిచ్ఛన్నః స్వర్భానుర్దేవసంసది।**
**ప్రవిష్టః సోమమపిబచ్చన్ద్రార్కాభ్యాఞ్చ సూచితః॥ 24**

**ప్రతిపదార్థము :** దేవలింగ ప్రతిచ్ఛన్నః=దేవతల వేషముచే తెలియబడనివాడై, స్వర్భానుః=రాహువు, దేవసంసది=దేవతలపంక్తియందు సూర్యచంద్రుల మధ్య, ప్రవిష్టః=ప్రవేశించిన వాడై, సోమమ్=అమృతమును, అపిబత్=త్రాగెను, చంద్రార్కాభ్యామ్=చంద్రసూర్యులచే, సూచితః=సూచింపబడెను.

**తాత్పర్యము :** దేవతలవంటి వేషమును ధరించి తన రూపు తెలియనివాడై రాహువు దేవతల మధ్య ప్రవేశించి సూర్యచంద్రుల నడుమ గూర్చుండి అమృతమును ద్రావెను. ఆ సంగతి సూర్యచంద్రులు విష్ణువునకు సూచించిరి.

**శ్లో॥ చక్రేణ క్షురధారేణ జహార పిబతః శిరః।**
**హరిస్తస్య కబన్ధస్తు సుధయాప్లావితోఽపతత్॥ 25**

**ప్రతిపదార్థము :** హరిః=విష్ణువు, క్షుర ధారేణ=పదునైన వాడిదగు, చక్రేణ=తన చక్రముతో, పిబతః=అమృతమును గ్రోలు ఆ రాహువు యొక్క, శిరః=శిరస్సును, జహార=హరించెను,

ఛిద్రము చేసెను. తస్య=ఆ రాహువు యొక్క, కబంధస్తు=శరీరము మొండెము మాత్రము, సుధయా=అమృతముచే, ఆప్లావితః=స్పృశింపబడనిదై, అపతత్=క్రిందబడెను.

**తాత్పర్యము :** విష్ణువు తన చక్రమున నమృతమును గ్రోలు నారాహువు శిరసు నుండి ఖండించెను. వాని శరీరము మొండెము మాత్రము అమృత స్పర్శలేనిదై క్రిందబడిపోయెను.

**శ్లో॥ శిరస్త్వమరతాం నీతమజో గ్రహమచీక్లపత్।**
**యస్తు పర్వణి చన్ద్రార్కావభిధావతి వైరధీః॥ 26**

**ప్రతిపదార్థము :** శిరస్తు=శిరస్సు మాత్రము, అమరతామ్=అమరత్వమును (అమృత పానమును), నీతః=పొందెను, అజః=బ్రహ్మ, గ్రహమ్=ఆ రాహువును, గ్రహమునుగ, అచీక్లపత్=కావించెను. యస్తు=ఏ రాహువు, వైరధీః=వైర బుద్ధిగలవాడై, పర్వణి=పూర్ణిమ, అమావాస్య అను పర్వదినములందు, చంద్రార్కే=చంద్రుని సూర్యుని, అభిధావతి=పర్వెత్తి పట్టుచున్నాడు.

**తాత్పర్యము :** ఆ రాహువు శిరము అమృతపానమున అమరత్వమును బొందెను (మృతి లేమిని). బ్రహ్మ అజుడా శిరోమాత్ర రాహువును నవగ్రహములలో నొక్కనిగా నేర్పరిచెను. ఆ యీసునందున్న రాహువు పూర్ణిమయందు చంద్రుని అమావాస్యయందు సూర్యుని పట్టుచున్నాడు. అదియే గ్రహణమగును.

**శ్లో॥ పీతప్రాయేఽమృతే దేవైర్భగవా ంల్లోకభావనః।**
**పశ్యతామసురేన్ద్రాణాం స్వరూపజ్జగృహే హరిః॥ 27**

**ప్రతిపదార్థము :** దేవైః=దేవతలచే, అమృతే=అమృతము, పీతప్రాయే=సరాసరి త్రాగబడినది కాగా, లోకభావనః=లోకముల సృజించు కర్తయైన, భగవాన్=విష్ణు భగవంతుడు, అసురేంద్రాణామ్=అసుర శ్రేష్ఠులు, పశ్యతామ్=చూచుచుండగానే, విభుః/హరిః=లోక ప్రభువు, స్వరూపమ్=తన రూపమును, జగృహే=గ్రహించెను.

**తాత్పర్యము :** దేవతలందఱును సుధాపానము గావించినవారయినంతన లోకముల సృజించువాడయిన విష్ణువు లోకప్రభువు అసురేంద్రులు చూచుచుండగనే తన రూపమును గ్రహించెను.

**శ్లో॥ ఏవం సురాసురగణాః సమదేశకాలహేత్వర్థకర్మ మతయోఽపి ఫలే వికల్పాః।**
**తత్రామృతం సురగణాః ఫలమఞ్జసాపుర్యత్పాద పఙ్కజరజఃశ్రయణాన్న దైత్యాః॥ 28**

హరి భక్తులయుద్యమమే ఫలించును. ఇతరులకు ఫలించదని ఈ ఆఖ్యానము యొక్క తాత్పర్యము చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, సురాసురగణాః=సురాసురగణములు, సమ... తయః అపి, సమ=సమానములైన, దేశ=ప్రదేశమునందు చేరుట, కాల=కాలము, హేతుః =సాధన కారణమగు మందరాద్రిని తెచ్చారు, అర్థ=సముద్రమునందు ఓషధులను దెచ్చి యుంచుట, కర్మమతయః=లోనగు కర్మలందు నిమగ్నమైన మనసు కలిగినవారైనను, ఫలే= ఫలప్రాప్తిలో, వికల్పాః=భిన్నులైన, ఫలము కొందఱికి లభించుట, కొందఱికి లభింపకపోవుట



ఏర్పడినది, ఇది వైచిత్ర్యము గలవారైరి. ఫలమునందు వైషమ్యము గలవారైరి అని అర్థము. తత్ర=వారియందు, యత్+పాదపంకజ రజః శ్రయణాత్=ఏ విష్ణుని పాదపద్మముల పరాగము నాశ్రయించుట వలన, సురగణాః=దేవగణాలు, అమృతం ఫలమ్=అమృతఫలమును, అంజసా=శీఘ్రముగా, ఆపుః=పొందినారు, న దైత్యాః=దైత్యులు పొందలేదు.

**తాత్పర్యము :** ఇట్లు దేవాసురులు దేశకాలానుగుణముగాఁబ్రయత్నించి మందరాద్రి గొని తెచ్చి ఓషధులను సముద్రమునందు మధించుటలోనగు కార్యములందు శ్రమకుఁబాల్పడుట ఇరుతెగలవారికి సమానమైనను ఫలప్రాప్తియందు మాత్రము కొందఱికి ఫలము లభించి కొందరికి లభింపకపోవుట అను వైషమ్యము గలిగి దేవతలు హరిపాదపద్మపరాగము నాశ్రయించుట కారణముగా అమృతఫలమును పొందగలిగిరి. అట్లుగాని వారగుటచే దైత్యులమృతమును బొందలేకపోయిరి.

**శ్లో॥ యద్ యుజ్యతేఽసువసుకర్మమనోవచోభిర్దేహాత్మ జాదిషు నృభిస్తదసత్ పృథక్త్వాత్।**
**తైరేవ సద్ భవతి యత్క్రియతేఽపృథక్త్వాత్ సర్వస్య తద్భవతి మూలనిషేచనం యత్॥ 29**

**ప్రతిపదార్థము :** నృభిః=నరులచే, అసువ సుకర్మ మనోవచోభిః=ప్రాణము, ధనము, కార్యము, మనస్సు, వాక్కులోనగు వానిచే, దేహ+ఆత్మజాదిషు=దేహము పుత్రులులోనగు వారి విషయమై, యద్=ఏది, యుజ్యతే=చేయబడుచున్నదో దేహాదుల కొరకు ఏది చేయబడు చున్నదో, అది పృథక్త్వాత్=భేదాశ్రయమగుట వలన, శాఖలకు నీరు పోసినట్లు, అసత్= వ్యర్థమగుచున్న, తైః ఏవ=ఆ ప్రాణాదులచే తన, యత్క్రియతే=ఏది ఈశ్వరోద్దేశముచే చేయబడుచున్నదో, తత్=అది, అపృథక్త్వాత్=భేదాశ్రయములేనిదగుట వలన, ఈశ్వరుడు సర్వత్ర కూడియున్న వాడగుట వల్ల, మూల నిషేచనమ్=చెట్టు మొదలు నీరుపోయుట చేత, సర్వస్య=శాఖాదులకన్నిటికి వలె, సత్+భవతి=మహాఫలముగలదనుచున్నాడు.

**తాత్పర్యము :** పృథక్త్వమును పర్యాలోకించి భేదదృష్టితో దేహాద్యుద్దేశ్యమున ఏది జేయబడునో అది అసత్తు. అపృథక్త్వమును పర్యాలోకించి ఈశ్వర దృష్టిచే చేయునది యేదియో అది సత్తగును.

నరులు ప్రాణము, ధనము, కర్మము, మనస్సు, వాక్కులోనగువానిచే దేహము నందును పుత్రాదులందును భీతిగలవారై వాని సౌఖ్యమునకై యే క్రియ చేయబడుచున్నదో అది వ్యర్థమగుచున్నది. ఏలయన ఆ కార్యములో నేను నావారు ఇతరులు అను భేదదృష్టి గలిగి యున్నందువలన నట్లుగాక! ఆ ప్రాణాదుల చేత ఈశ్వరునుద్దేశించి చేయు క్రియ మహాఫలము గలదగుచున్నది. ఏలయన నేను నాది అను భేదదృష్టి లేకపోవుట వలన నట్లగుచున్నది. స్వార్థముననుసరించి చేయు క్రియయంతయు వ్యర్థము. ఈశ్వర ప్రీతిచేయు కర్మ యంతమున ఫలము - చెట్టు కొమ్మలపై నీరుపోసిన చెట్టు ఎంతమాత్రము పెరుగును. పైగా చెట్టు ఎండిపోవును. వ్యర్థమగును. అట్లుగాక చెట్టు మొదటియందు నీరు పోసిన చెట్టు కొమ్మలకు జీవనాధారమై చెట్టు ఎట్లు బ్రతికి పెరుగునో అట్లే ఈశ్వర ప్రీతి కర్మ సమస్తమునకు దోహదమగుచున్నది.

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కంధే నవమో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధమున నవమాధ్యాయము.

**శ్లో॥ వైరోచనో బలిః సంఖ్యే సోஉసురాణాం చమూపతిః।**
**యానం వైహాయసం నామ కామగం మయనిర్మితమ్॥ 16**

**ప్రతిపదార్థము :** వైరోచనః=విరోచను కుమారుడు, సః=అ, బలిః=బలి చక్రవర్తి, సంఖ్యే= యుద్ధమునందు, అసురాణామ్=అసురులకు, చమూపతిః=సేనాపతియాయెను. యానమ్= వాహనము, మయనిర్మితమ్=మయునిచే నిర్మింపబడిన, వైహాయసం నామ=ఆకాశమున సంచరించుటను బట్టి వైహాయసమను ప్రసిద్ధిగలదై, కామగమ్=ఇచ్ఛమెయి పోవునది యయ్యెను.

**తాత్పర్యము :** విరోచనుకుమారుడు బలిచక్రవర్తి అసురుల సేనాపతిగా నుండెను. అతనికి మయుడు నిర్మించినదై ఆకసమున నిచ్చవచ్చినట్లు పోగలదై వైహాయసమనునది విమానము వాహనమయ్యెను. ఆ యానమును బలి యధిష్ఠించెను.

**శ్లో॥ సర్వసాఙ్గ్రామికోపేతం సర్వాశ్చర్యమయం ప్రభో।**
**అప్రతర్క్యమనిర్దేశ్యం దృశ్యమానమదర్శనమ్॥ 17**

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ ప్రభూ!, సర్వసంగ్రామిక+ఉపేతమ్=సమస్తమైన యుద్ధ పరికరములతోఁ గూడినదై, సర్వ+ఆశ్చర్యమయమ్=అన్ని అచ్చెరువులకు స్థానమై, అప్రతర్క్యమ్=ఊహింపరానిదై, అనిర్దేశ్యమ్=ఇట్లు అని నిర్దేశింపగానిదై, దృశ్యమానమ్=కన్పట్టు చున్నదై, అదర్శనమ్=కన్పట్టనిదై యుండెను.

**తాత్పర్యము :** ఆ విమానము యుద్ధమునకు వలయు నాయుధములన్ని గలదై అన్ని వింతలకునికిపట్టై మనమున నూహింపను వాక్కుచేఁజెప్పనుగానిదై కన్పట్టుచు క్షణములో కన్పట్టనిదై వెలుగొందెను.

**శ్లో॥ ఆస్థితస్తద్ విమానాగ్ర్యం సర్వానీకాధిపైర్వృతః।**
**వాలవ్యజనఛత్రాగ్ర్యై రేజే చన్ద్ర ఇవోదయే॥ 18**

**ప్రతిపదార్థము :** తత్+విమానాగ్ర్యమ్=ఆ విమానశ్రేష్ఠమును, ఆస్థితః=ఎక్కి కూర్చున్నవాడై బలి, సర్వ+ఆనీక+అధిపైః=ఎల్ల సేనాపతులతో, వృతః=కూడుకొని, వాలవ్యజనఛత్రాగ్ర్యైః =చమరీ మృగముతోక వెంట్రుకల వింజామరల చేతను, గొడుగుల చేతను, ఉదయే= ఉదయాద్రి శిఖరమందున్న, చంద్ర ఇవ=చంద్రుడు వలె, రేజే=విరాజిల్లెను.

**తాత్పర్యము :** ఆ బలి చక్రవర్తి యుత్తమమైన ఆ విమానమునెక్కి ఎల్ల సేనాపతులను గూడి ఛత్రచామరములతో ఉదయగిరి శిఖరమందున్న చంద్రుడువలె విరాజిల్లెను.

**శ్లో॥ తస్యాసన్ సర్వతో యానైర్యూథానామ్పతయోஉసురాః।**
**నముచిః శమ్బరో బాణో విప్రచిత్తిరయోముఖః॥ 19**

**శ్లో॥ ద్విమూర్ధా కాలనాభోஉథ ప్రహేతిర్హేతిరిల్వలః।**
**శకునిర్భూతసన్తాపో వజ్రదంష్ట్రో విరోచనః॥ 20**

**శ్లో॥ హయగ్రీవః శఙ్కుశిరాః కపిలో మేఘదున్దుభిః।**
**తారకశ్చక్రదృక్ శుమ్భో నిశుమ్భో జమ్భ ఉత్కలః॥ 21**



**ప్రతిపదార్థము :** తతః=అంత, సురగణాః=దేవగణములు, పీతయా=త్రాగబడిన, సుధయా= అమృతముచే, ఏధితాః=పెంపొందినవారై, నారాయణ పదాశ్రయాః=నారాయణునందు ఆసక్తులైనవారై, శస్త్రైః=కైదువులతో, ప్రతిసంయుయుధుః=దైత్యుల నెదుర్కొని యుద్ధమొనర్చిరి.

**తాత్పర్యము :** అంత దేవగణములు అమృతమును ద్రావి దేహబలము ఉత్సాహము ఎక్కువ కాగా విష్ణువునందు పరమభక్తిగలవారు దైత్యుల నెదుర్కొని కయ్యమొనర్చిరి.

**శ్లో॥ తత్ర దేవాసురో నామ రణః పరమదారుణః।**
**రోధస్యుదన్వతో రాజంస్తుములో రోమహర్షణః॥ 5**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజ!, తత్ర=అచ్చట, దేవాసురః=దేవతలకు అసురులకు సంబంధించినదైన, రణః=సంగ్రామము, పరమదారుణః=మిగుల భయంకరమై, ఉదన్వతః =సముద్రము యొక్క రోధసి=తీరమునందు, తుములః=సంకులమై, రోమహర్షణః=గగుర్పాటు కలిగించునదై ఆయెను.

**తాత్పర్యము :** అప్పుడు దేవాసురులకు మిక్కిలి దారుణమైన రణము సముద్ర తీరమందు, సంకులమైన గగుర్పాటు కలిగించునదై ప్రారంభమయ్యెను.

**శ్లో॥ తత్రాన్యోన్యం సపత్నాస్తే సంరబ్ధమనసో రణే।**
**సమాసాద్యాసిభిర్బాణైర్నిజఘ్నుర్వివిధాయుధైః॥ 6**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ, రణే=యుద్ధమునందు, సంరబ్ధమనసః=చెలరేగిన కోపోద్రేకము గల, సపత్నాః=దాయాదులు, తే=ఆ సురాసురులు, వివిధాయుధైః=పెక్కులు ఆయుధములు గలవారై, సమాసాద్య=సమీపించి, అన్యోన్య=ఒకరినొకరు, అసిభిః=ఖడ్గముల చేత, బాణైః =బాణముల చేత, నిజఘ్నుః=కొట్టుకొనిరి.

**తాత్పర్యము :** ఆ రణమునందు దాయాదులైన ఆ దేవదానవులు పెక్కు కైదువులు పూని కోపోద్రేకమున వడివడిఁగలిసి యొండొరులు కటారుల చేతను అమ్ముల చేతను కొట్టుకొనిరి.

**శ్లో॥ శఙ్ఖతూర్యమృదఙ్గానాం భేరీడమరుణాం మహాన్।**
**హస్త్యశ్వరథపత్తీనాం నదతాం నిస్వనోஉభవత్॥ 7**

**ప్రతిపదార్థము :** శంఖతూర్యమృదంగానామ్=శంఖములు లోనగు వాద్యములు, మృదంగములను వానియొక్కయు, భేరీడమరుణామ్=నగారాలు, దమరుకములు వాద్యముల యొక్క, నదతామ్=అఱచుచున్న, హస్తి+అశ్వరథ పత్తీనామ్=ఏనుగులు గుఱ్ఱములు, రథముల కాల్బలము యొక్క, నిస్వనః=శబ్దము, మహాన్=దొడ్డది, అభవత్=ఆయెను.

**తాత్పర్యము :** ఆ సంగరమునందు శంఖములు, దుందుభులు, డమరుగములులోనగు వాద్యముల యొక్క, ఏనుగుల ఘీంకారములు, గుఱ్ఱముల సకిలింపులు, యుద్ధవీరుల సింహనాదములు, రథముల మ్రోతలు లోనగునవి చేరి దొడ్డ శబ్దము విననయ్యెను.

**శ్లో॥ రథినో రథిభిస్తత్ర పత్తిభిః సహ పత్తయః।**
**హయా హయైరిభాశ్చేభైః సమసజ్జన్త సంయుగే॥ 8**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ, సంయుగే=యుద్ధమునందు, రథినః=రథము నధిష్ఠించిన రథికులు, రథిభిః=రథికుల తోడను, పత్తయః=కాలుబంట్లు, పత్తిభిఃసహ=కాలుబంట్ల తోడను, హయాః

=అశ్వములు, హయైః=అశ్వములతోడ, ఇభాః=ఏనుగులు, ఇభైః=ఏనుగులతోడను, సమసజ్జంత=కలియబడి సంగరముకావించెను.

**తాత్పర్యము :** ఆ యుద్ధమునందు రథికులు రథికులతోడను, కాలుబంట్లు కాలుబంట్ల తోడను, అశ్వములశ్వములతోనూ, ఏనుగులు ఏనుగులతోడను కలియబడి పోట్లాడెను.

**శ్లో॥ ఉష్ట్రైః కేచిదిభైః కేచిదపరే యుయుధుః ఖరైః।**
**కేచిద్ గౌరమృగైర్ఋక్షైర్ద్వీపిభిర్హరిభిర్భటాః॥ 9**

**ప్రతిపదార్థము :** కేచిత్=సురాసురులలో కొందఱు, భటాః=బంట్లు, ఉష్ట్రైః=లొట్టిపిట్టలతోను, కేచిత్=కొందఱు, ద్విపైః=గజములతోను, అపరే=ఇతరులు, ఖరైః=గాడిదల మీద, కేచిత్= కొందరు, గౌరమృగైః=సివంగుల చేత, ఋక్షైః=ఎలుగుబంట్లచేత, ద్వీపిభిః=పెద్ద పులులచేత, హరిభిః=సింహములచేత, యుయుః=వచ్చిరి.

**తాత్పర్యము :** ఆ దేవాసురులందు వీరభటులు కొందఱు ఒంటెల మీదను, కొందఱు ఏనుగుల మీదను, మఱికొందరు గాడిదల మీదను, కొందఱు సివంగుల మీదను, గొందఱు ఎలుగుల మీదను, గొందరు బెబ్బులుల మీదను కొందరు సింహముల మీదను ఎక్కి వచ్చిరి.

**శ్లో॥ గృధ్రైః కఙ్కైర్బకైరన్యే శ్యేనభాసైస్తిమిఙ్గిలైః।**
**శరభైర్మహిషైః ఖడ్గైర్గోవృషైర్గవయారుణైః॥ 10**

**ప్రతిపదార్థము :** గృధ్రైఃకంకైః=గ్రద్దలతో రాబందులుగులతో (బోరువల మీద) వృకైః=తోడేళ్ళతో, శ్యేనభాసైః=డేగలతో, తిమింగిలైః=తిమింగిలములనే పెద్ద చేపలతోను, శరభైః=సింహమును జంపు ఎనిమిది కాళ్ళ మృగములతోను, మహిషైః=ఆబోతుల మీదను, గవయారుణైః= గురుపాయులతో, గోవృషైః=చమరీ మృగములతో ఎక్కి వచ్చిరి.

**తాత్పర్యము :** కొందఱు గ్రద్దలపైనను, బోరువల మీదను, డేగల మీదను, తిమింగలముల పైన, ఎనిమిది కాళ్ళు కలిగి సింహమును జంపు శరభములపైనను, అడవి దున్నపోతుల పైనను, ఖడ్గమృగముల మీదను, ఆబోతుల మీదను, గురుపాయల మీదను, చమరీ మృగముల మీదను ఎక్కివచ్చిరి.

**శ్లో॥ శివాభిరాఖుభిః కేచిత్ కృకలాసైః శశైర్నరైః।**
**బస్తైరేకే కృష్ణసారై ర్హంసైరన్యే చ సూకరైః॥ 11**

**ప్రతిపదార్థము :** కేచిత్=కొందఱు, శివాభిః=నక్కల తోడను, ఆఖుభిః=ఎలుకల తోడను, కృకలాసైః=తొండల తోడను, శశైః=కుందేళ్ళతోను, నరైః=నరులతోను, ఏకే=కొందఱు, బస్తైః =మేకపోతులతోను, కృష్ణసారైః=జింకలతోను, హంసైః=అంచలతోను, అన్యే=ఇతరులు, సూకరైః=అడవి పందులతోను గూడి వచ్చిరి.

**తాత్పర్యము :** కొందఱు నక్కలు, ఎలుకలు, తొండలు, కుందేళ్ళు, నరులు అనువాని మీదను కొందఱు మేకపోతులు, జింకలు, హంసలు అను వాహనముల మీదను, ఇతరులు అడవి పందులను ఎక్కి వచ్చిరి.



**శ్లో॥ అన్యే జలస్థలఖగైః సత్త్వైర్వికృతవిగ్రహైః।**
**సేనయోరుభయో రాజన్ వివిశుస్తేఽగ్రతోఽగ్రతః॥ 12**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓరాజా!, అన్యే=ఇతరులు, జలస్థలఖగైః=నీటియందును, నేలయందును సంచరించు పక్షుల చేతను, వికృతవిగ్రహైః=వికారమైన శరీరములుగల, సత్త్వైః=జంతువుల చేతను వహింపబడినవారై, ఉభయోఃసేనయోః=సురాసురుల రెండు సేనలయందు, అగ్రతః అగ్రతః=ముందుముందుగా వివిశుః=ప్రవేశించిరి.

**తాత్పర్యము :** ఓ రాజా! ఇతరులు కొందఱు నీటి పక్షులపైనను నేల మీదను సంచరించు పక్షుల మీదను వికారపు శరీరములు గల జంతువుల మీదనెక్కి ఉభయసేనలలోని భటులు యుద్ధరంగమున ప్రవేశించిరి.

**శ్లో॥ చిత్రధ్వజపటై రాజన్నాతపత్రైః సితామలైః।**
**మహాధనైర్వజ్రదణ్డైర్వ్యజనైర్బర్హచామరైః॥ 13**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓరాజా!, చిత్రధ్వజపటైః=వివిధములైన రంగులు గల టెక్కెముల వస్త్రముల చేతను, సిత+అమలైః=తెల్లని స్వచ్ఛములైన, ఆతపత్రైః=గొడుగుల చేత, మహాధనైః =గొప్ప విలువలగలవై, వజ్రదండైః=వజ్రముల కాడలు గల, వ్యజనైః=వీవనల చేత, బర్హచామరైః=నెమలి ఈకల వింజామరల చేతను ప్రకాశించువారు,

**తాత్పర్యము :** పలువన్నెల టెక్కెముల గుడ్డల చేతను, తెల్లని స్వచ్ఛములైన గొడుగుల చేత ఎక్కువ విలువ గలిగి వజ్రపు పిడులుగల వీవనల చేత నెమలి పురుల వింజామరల చేతను ప్రకాశించువారును.

**శ్లో॥ వాతోద్ధూతోత్తరోష్ణీషైరర్చిభిర్వర్మభూషణైః। (స్ఫుదృగ్భిర్వజ్ర)**
**స్ఫురద్భిర్విశదైః శస్త్రైః సుతరాం సూర్యరశ్మిభిః॥ 14**

**ప్రతిపదార్థము :** వాత+ఉద్ధూత+ఉత్తర+ఉష్ణీషైః=వాయువుచేనెగురగొట్టబడిన ఉత్తరీయము లచే తలగుడ్డల చేతను, ఉద్భగ్భిః స్వనద్భిః=మ్రోగుచున్న, వజ్రభూషణైః=వజ్ర నగల చేత, సూర్యరశ్మిభిః=సూర్య కిరణములతో, సుతరామ్=మిక్కిలి, స్ఫురద్భిః=ప్రకాశించు, వివిధైః =పలురకములైన, శస్త్రైః=కైదువుల చేతను మెఱయుచున్నారు.

**తాత్పర్యము :** గాలిచేనెగురు పై పంచెలు తలగుడ్డల చేతను, మ్రోగుచున్న వజ్రపు నగల చేతను సూర్యకిరణములట్లు మిక్కిలి మెఱయు పెక్కు రకముల కైదువులచే బ్రకాశించుచున్నారు.

**శ్లో॥ దేవదానవవీరాణాం ధ్వజిన్యౌ పాణ్డునన్దన।**
**రేజతుర్వీరమాలాభిర్యాదసామివ సాగరౌ॥ 15**

**ప్రతిపదార్థము :** పాండునందన=పాండుకుమారా!, దేవదానవవీరాణామ్=దేవతలయు దానవులయు వీరులయొక్క, ధ్వజిన్యౌ=రెండు సేనలు, వీరమాలాభిః=వీరుల పంక్తులచేతను, యాదసామ్ (మాలాభిః)=జలజంతువుల పంక్తులచే, సాగరౌ ఇవ=రెండు సముద్రములవలె, రేజతుః=ప్రకాశించెను.

**తాత్పర్యము :** ఆ దేవాసుర వీరుల సేనలు రెండును జలజంతువుల పంక్తులచే సాగరములవలె వీరుల పంక్తులచే మెఱసెను.

శ్లో॥ త ఏవమాజావసురాః సురేన్ద్రా ద్వన్ద్వేన సంహత్య నియుధ్యమానాః।
అన్యోన్యమాసాద్య నిజఘ్నురోజసా జిగీషవస్తీక్ష్ణశరాసితోమరైః॥ 35

**ప్రతిపదార్థము :** తే సురేంద్రాః=ఆ దేవతలు, ఇంద్రుడు, ఏవమ్=ఈ ప్రకారము, ఆజౌ=యుద్ధమునందు, అసురాః=అసురులు, ద్వంద్వేన=ద్వంద్వము, జతలుజతలుగా, సంహత్య=ఢీకొని, నియుధ్యమానాః=యుద్ధము చేయుచున్నవారై, అన్యోన్యమ్=ఒండొరులను, ఆసాద్య=సంహరించి, ఓజసా=బలముతో, జిగీషవః=జయింపబడినవారై, తీక్ష్ణశరాసితోమరైః=వాడియైన బాణముల చేతను, ఖడ్గముల చేతను, బల్లెకోలల చేతను, నిజఘ్నుః=పొడుచు కొనిరి, కొట్టుకొనిరి.

**తాత్పర్యము :** అట్లు ఆ దేవతలు ఇంద్రుడు యుద్ధమున అసురులు జతలుజతలుగా ఢీకొని యుద్ధము చేయుచు నొండొరులను సంహరించి జయింపగోరినవారై వాడియైన బాణముల చేతను ఖడ్గముల చేతను బల్లెకోలల చేతను పొడుచుకొని కొట్టుకొనిరి.

శ్లో॥ ముసుండిభిశ్చక్రగదేష్టిపట్టిశైః శక్త్యుల్ముకైః ప్రాసపరశ్వధైరపి।
నిస్త్రింశభల్లైః పరిఘైః సముద్గరైః సభిన్దిపాలైశ్చ శిరాంసి చిచ్ఛిదుః॥ 36

**ప్రతిపదార్థము :** ముసుండిభిః=కొయ్య గుదియల చేత, చక్రగదా+ఇష్టిపట్టిశైః=చక్రముల చేతను, గదల చేతను, కత్తుల చేతను, అడ్డకత్తుల చేతను, శక్తి+ఉల్ముకైః=చిల్లకోలల చేతను, కొఱవి కట్టెల చేతను, ప్రాసపరశ్వధైరపి=ఈటెల చేత, గండ్రగొడ్డళ్ళచేతను, నిస్త్రింశభల్లైః=పట్టాకత్తుల చేత, బల్లెముల చేత, సముద్గరైః=సమ్మెటలతో గూడను, సభిందిపాలైశ్చ=విడిలవాటు గుదియలతో గూడిన, పరిఘైః=ఇనుప గుదియల చేతను, శిరాంసి=శిరస్సులను, చిచ్ఛిదుః=ఖండించుకొనుచుండిరి.

**తాత్పర్యము :** కొయ్య గుదియలచేతను, చక్రములచేతను, గదలచేతను, కత్తులచేతను అడ్డ కత్తులచేతను, చిల్లకోలచేతను, కొఱవివంటి కైదువులచేతను, ఈటెలచేతను, గండ్ర గొడ్డళ్ళచేతను, పట్టా కత్తులచేతను, బల్లములచేతను ఒండొరుల శిరస్సులను ఖండించు కొనుచుండిరి.

శ్లో॥ గజాస్తురఙ్గాః సరథాః పదాతయః సారోహవాహా వివిధా విఖండితాః।
నికృత్తబాహూరుశిరోధరాఙ్ఘ్రయశ్ఛిన్నధ్వజజ్యాసి తనుత్రభూషణాః॥ 37

**ప్రతిపదార్థము :** గజాః=ఏనుగులు, సరథాః=రథములతో గూడ, తురంగాః=అశ్వములు, పదాతయః=కాలుబంట్లు, స+ఆరోహవాహాః=రౌతులతో గూడిన గుఱ్ఱములు, ఏనుగులు, వివిధాః=వివిధములైనవి, విఖండితాః=ఖండింపబడినవి, నికృత్తబాహూ+ఊరుశిరోధర+అంఘ్రయః=నఱుకబడిన బాహువులు, తొడలు, కంఠములు, పాదములు గలవో, ఛిన్న ధ్వజజ్య+అసి తనుత్ర భూషణాః=ఖండింపబడిన ధ్వజములు, అల్లె త్రాడులు, ఖడ్గములు, కవచములు ఆభరణములు గలవారైరి.

**తాత్పర్యము :** ఏనుగులు, గుఱ్ఱములు, రథాలు, కాల్బలము, గుఱ్ఱపు రౌతులు, మావటీండ్రును, బాహువులు తెగి, తొడలు విఱిగి కంఠములు ఖండితమయి పాదములు



శ్లో॥ అరిష్టోऽరిష్టనేమిశ్చ మయశ్చ త్రిపురాధిపః।
అన్యే పౌలోమకాలేయా నివాతకవచాదయః॥ 22

**ప్రతిపదార్థము :** అన్యే=ఇతరులు, తస్య=ఆ బలికి, సర్వతః=అన్ని విధములు అగు, యానైః=వాహనములతో, యూథానాంపతయః=సేనాపతులు, అసురాః=అసురులు, ఆసన్=ఆయిరి.
**తాత్పర్యము :** ఆ బలి చక్రవర్తికి నముచి, శంబరుడు, బాణుడు, విప్రచిత్తుడు, అయోముఖుడు, ద్విమూర్ధుడు, కాలనాభుడు, ప్రహేతి, హేతి, ఇల్వలుడు, శకుని, భూతసన్తాపుడు, వజ్రదంష్ట్రుడు, విరోచనుడు, హయగ్రీవుడు, శంకుశిరుడు, కపిలుడు, మేఘదుందుభి, తారకుడు, చక్రదృక్కు, శుంభుడు, నిశుంభుడు, జమ్భుడు, ఉత్కలుడు, అరిష్టుడు, అరిష్టనేమి, మయుడు, త్రిపురాధిపుడు ఇతరులు పౌలోమకాలేయులు, నివాత కవచులులోనగువారు సేనాపతులు వారివారికిఁదగిన వాహనములనధిష్ఠించి సహాయులై నిల్చిరి.

శ్లో॥ అలబ్ధభాగాః సోమస్య కేవలం క్లేశభాగినః।
సర్వ ఏతే రణముఖే బహుశో నిర్జితామరాః॥ 23

**ప్రతిపదార్థము :** ఏతే సర్వే=వీరందఱు, సోమస్య=అమృతము యొక్క, అలబ్ధ భాగాః=పొందఁ బడని భాగముగలవారును, కేవలమ్=ముఖ్యముగా, క్లేశభాగినః=శ్రమను మాత్రము పంచుకొనినవారును, బహుశః=పెక్కు విధములు, నిర్జిత+అమరాః=జయింపబడిన దేవతలు గలవారునై, రణముఖే=యుద్ధమునకు మొగసాల నిలువబడిరి.

**తాత్పర్యము :** ఈ సేనాపతులందరు అమృతభాగమును పొందనివారును, మథించిన శ్రమకు భాగస్వాములునై పెక్కు విధముల వేల్పులను జయించినవారునై యుద్ధమునకు మొగసాల నిలువబడిరి.

శ్లో॥ సింహనాదాన్ విముఞ్చన్తః, శఙ్ఖాన్ దధ్ముర్మహారవాన్।
దృష్ట్వా సపత్నానుత్సిక్తాన్ బలభిత్ కుపితో భృశమ్॥ 24

**ప్రతిపదార్థము :** సింహనాదాన్=సింహగర్జనను, విముంచంతః=విడుచుచు (చేయుచు), మహారవాన్=అధిక ధ్వనిగల, శంఖాన్=శంఖములను, దధ్ముః=పూరించిరి. బలభిత్=బలుడను దానవునిగొట్టిన ఇంద్రుడు, ఉత్సిక్తాన్=ఉద్ధతులైన, సపత్నాన్=శత్రువులను, అసురులను, దృష్ట్వా=కాంచి, భృశమ్=మిక్కిలి, కుపితః=కోపము పొందెను.

**తాత్పర్యము :** అసుర సేనాపతులు సింహనాదములు గావించు అధిక ధ్వనిగల శంఖములను పూరించిరి. ఇంద్రుడు ఉద్ధతులైన శత్రువులను గాంచి మిక్కిలి కోపము పొందెను.

శ్లో॥ ఐరావతం దిక్కరిణమారూఢః శుశుభే స్వరాట్।
యథా స్రవత్ ప్రస్రవణముదయాద్రిమహర్పతిః॥ 25

**ప్రతిపదార్థము :** స్వరాట్=స్వర్గమునకు రాజగు ఇంద్రుడు, దిక్+కరిణమ్=దిగ్గజమైన, ఐరావతమ్=ఐరావతమును, తెల్ల ఏనుగును, స్రవత్+ప్రస్రవణమ్=ప్రవహించు ప్రవాహములు గల, ఉదయాద్రిమ్=ఉదయపర్వతమును, అహర్పతిః యథా=సూర్యుడు వలె, ఆరూఢః=ఎక్కిన వాడయ్యెను.

**తాత్పర్యము :** స్వర్గాధిపతి ఇంద్రుడు ప్రవహించు సెలయేళ్ళు గల ఉదయ పర్వతమును సూర్యుడట్లు ఐరావతమను దిగ్గజమునెక్కి మెఱసెను.

**శ్లో॥ తస్యాసన్ సర్వతో దేవా నానావాహధ్వజాయుధాః।**
**లోకపాలాః సహ గణైర్వాయ్వగ్నివరుణాదయః॥ 26**

**ప్రతిపదార్థము :** తస్య=ఆ ఇంద్రునికి, సర్వతః=అన్ని విధములుగ సహాయులై, దేవాః =దేవతలు, నానావాహధ్వజ+ఆయుధాః=వివిధములైన వాహనములు, ధ్వజములు, ఆయుధములుగలవారు, లోకపాలాః=లోకపాలురు, వాయు+అగ్ని వరుణాదయః=వాయువు, అగ్ని, వరుణుడులోనగువారును, గణైః సహ=వారి వారి దేవతాగణములతో, ఆసన్= సహాయులైరి.

**తాత్పర్యము :** దేవతలు వివిధములైన వాహనములు, ధ్వజములు, ఆయుధములుగలవారై వాయువు, అగ్ని, వరుణుడులోనగు దిక్పాలురు వారివారి దేవగణములతో ఎల్ల విధములా ఆ ఇంద్రునికి సహాయులైరి.

**శ్లో॥ తేఽన్యోన్యమభిసంసృత్య క్షిపన్తో మర్మభిర్మిథః।**
**ఆహ్వాయన్తో విశన్తోఽగ్రే యుయుధుర్ద్వన్ద్వయోధినః॥ 27**

**ప్రతిపదార్థము :** తే=ఆ దేవాసురులు, అన్యోన్యమ్=పరస్పరము, అభిసంసృత్య=చుట్టుకొని, మర్మభిర్మిథ=హృదయములు తూట్లుపడునట్లు, క్షిపంతః=ఆక్షేపించుచు, అగ్రే=రణముఖమున, విశంతః=ప్రవేశించుచు, ఆహ్వాయన్తః=పరస్పరము పిలుచుకొనుచు, ద్వంద్వయోధినః=జతలు జతలుగా నేర్పడినవారై, యుయుధుః=యుద్ధము చేసిరి.

**తాత్పర్యము :** ఆ సురాసురులొకరినొకరు చుట్టుకొని ఆక్షేపించుచు నొండొరులను పేరులతో బిల్చుచు రణాగ్రమున నిల్చి జతలుజతలుగా నేర్పడి ద్వంద్వయుద్ధము గావించిరి.

**శ్లో॥ యుయోధ బలిరిన్ద్రేణ తారకేణ గుహోఽస్తథా।**
**వరుణో హేతినాఽయుధ్యన్మిత్రో రాజన్ ప్రహేతినా॥ 28**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓరాజా!, బలిః=బలి, ఇంద్రేణ=ఇంద్రునితో, యుయోధ=యుద్ధ మొనర్చెను. తథా=అట్లే, గుహః=కుమారస్వామి, తారకేణ=తారకునితో పోట్లాడెను. వరుణః =వరుణుడు, హేతినా=హేతితో, అయుధ్యత్=యుద్ధము చేసెను. మిత్రః=మిత్రుడు (సూర్యుడు) ప్రహేతినా=ప్రహేతితో యుద్ధము చేసెను.

**తాత్పర్యము :** బలి ఇంద్రునితోను, కుమారస్వామి తారకునితోను పోట్లాడెను. వరుణుడు హేతితోను, సూర్యుడు మిత్రుడు ప్రహేతితోనూ పవరమొనర్చిరి.

**శ్లో॥ యమస్తు కాలనాభేన విశ్వకర్మా మయేన వై।**
**శమ్బరో యుయుధే త్వష్ట్రా సవిత్రా తు విరోచనః। 29**

**ప్రతిపదార్థము :** యమస్తు=యముడైతే, కాలనాభేన=కాలనాభునితోనూ, విశ్వకర్మా=విశ్వకర్మ, మయేనవై=మయునితోను, శంబరః=శంబరుడు, త్వష్ట్రా=త్వష్టతోను, విరోచనః=విరోచనుడు, సవిత్రా=సూర్యునితోనూ, యుయుధే=యుద్ధము చేసెను.



**తాత్పర్యము :** యముడు కాలనాభునితోనూ, విశ్వకర్మ మయునితోనూ, శంబరుడు త్వష్టతోనూ, విరోచనుడు సూర్యునితోనూ యుద్ధమొనర్చిరి.

**శ్లో॥ రాహుణా చ తథా సోమః పులోమ్నా యుయుధేఽనిలః।**
**నిశుమ్భశుమ్భయోర్దేవీ భద్రకాలీ తరస్వినీ॥ 31**

**ప్రతిపదార్థము :** తథా=ఆ ప్రకారము, సోమః=చంద్రుడు, రాహుణా చ=రాహువుతోనూ, అనిలః=వాయువు, పులోమ్నా=పులోమునితోనూ, తరస్వినీ=మహాశక్తి స్వరూపిణి, దేవీ= దేవియైన, భద్రకాళీ=భద్రకాళి, నిశుంభ శుంభయోః=నిశుంభ శుంభులతోను, యుయుధే= యుద్ధ మొనర్చెను.

**తాత్పర్యము :** అట్లు చంద్రుడు రాహువుతోను, వాయువు పులోమునితో, భద్రకాళీదేవి నిశుంభశుంభులతోడి యుద్ధమొనర్చెను.

**శ్లో॥ వృషాకపిస్తు జమ్భేన మహిషేణ విభావసుః।**
**ఇల్వలః సహవాతాపిర్బ్రహ్మపుత్రైరరిన్దమ॥ 32**

**ప్రతిపదార్థము :** హే అరిందమ=ఓ రాజా!, వృషాకపిస్తు=వృషాకపి, జంభేన=జంభునితోనూ, విభావసుః=విభావసువు అగు సూర్యుడు, మహిషేణ=మహిషునితోను, సహవాతాపిః =వాతాపితో కూడిన, ఇల్వలః=ఇల్వలుడు, బ్రహ్మపుత్రైః=బ్రహ్మపుత్రులతోను, యుద్ధమొనర్చిరి.

**తాత్పర్యము :** వృషాకపి జంభునితో, విభావసువు మహిషునితో, వాతాపితో కూడిన ఇల్వలుడు బ్రహ్మపుత్రులతోను యుద్ధమొనర్చిరి.

**శ్లో॥ కామదేవేన దుర్మర్ష ఉత్కలో మాతృభిః సహ।**
**బృహస్పతిశ్చోశనసా నరకేణ శనైశ్చరః॥ 33**

**ప్రతిపదార్థము :** దుర్మర్షః=దుర్మర్షడను అసురుడు, కామదేవేన=మన్మథునితోను, ఉత్కలః =ఉత్కలుడు, మాతృభిః సహ=బ్రాహ్మీ మహేశ్వరిలోనగు సప్తమాతృకలతోను, బృహస్పతిస్తు= బృహస్పతి, ఉశనసా=శుక్రునితోను, శనైశ్చరః=శనైశ్చరుడు, నరకేణ=నరకునితోను, యుయుధే=యుద్ధము చేసిరి.

**తాత్పర్యము :** దుర్మర్షుడు మన్మథునితోను, ఉత్కలుడు బ్రాహ్మీలోనగు సప్తమాతృకలతోను, బృహస్పతి శుక్రునితోనూ, శనైశ్చరుడు నరకునితోను యుద్ధమొనర్చిరి.

**శ్లో॥ మరుతో నివాతకవచైః కాలేయైర్వసవోఽమరాః।**
**విశ్వేదేవాస్తు పౌలోమైః రుద్రాః క్రోధవశైః సహ॥ 34**

**ప్రతిపదార్థము :** మరుతః=మరుత్తులను దేవతలు, నివాతకవచైః=నివాత కవచులతోనూ, వసవః=అష్ట వసువులు అను, అమరాః=దేవతలు, కాలేయైః=కాలకేయులతోను, విశ్వేదేవాస్తు=విశ్వే దేవతలు, పౌలోమైః=పౌలోములతోను, రుద్రాః=ఏకాదశ రుద్రులు, క్రోధవశైః సహ=క్రోధవశులతోను యుద్ధమొనర్చిరి.

**తాత్పర్యము :** మరుద్దేవతలు నివాతకవచులతోను, అష్ట వసువులు కాలకేయులతోనూ విశ్వేదేవతలు పౌలోములతోను ఏకాదశరుద్రులు క్రోధవశులతోను యుద్ధమొనర్చిరి.

భింధి=నఱకుము, భింది=పగులగొట్టుము, ఇతి=అని, వాదిన్యః=వాదించువారైవచ్చిరి, తదా=అప్పుడు, రక్షోగణాః=రాక్షస మూకలు సంభవించిరి.

**తాత్పర్యము :** మఱియాయసురుల మాయవల్ల శూలములు గేలధరించి దిసమొలలతోడి రాక్షస స్త్రీలు వందల కొలది జనించి నఱుకుము పగులగొట్టుము అని అఱచుచుండిరి. అట్లే రాక్షసగణములు ప్రభవించినవి.

**శ్లో॥ తతో మహాఘనా వ్యోమ్ని గమ్భీరపరుషస్వనాః।**
**అఙ్గారాన్ ముముచుర్వాతైరాహతాః స్తనయిత్నవః॥ 49**

**ప్రతిపదార్థము :** తతః=ఆ మాయవలన, వ్యోమ్ని=ఆకాశమునందు, గంభీరపరుషస్వనాః=గొప్పవైన కఠినములైన ఉఱుములుగల, మహాఘనాః=దొడ్డ మబ్బులు, స్తనయిత్నవః=గర్జించుచు, వాతైః=గాలులచే, ఆహతాః=కొట్టబడినవై, అంగారాన్=నిప్పులను, ముముచుః=వర్షించెను.

**తాత్పర్యము :** అంతనామాయ వలన ఆకసము, కర్ణకఠోరముగానుఱుముచు గర్జనలు చేయుచున్న గొప్ప మబ్బులు పెనుగాలులచే గొట్టవడి నిప్పులవాన కురిపించెను.

**శ్లో॥ సృష్టో దైత్యేన సుమహాన్ వహ్నిః శ్వసనసారథిః।**
**సాంవర్తక ఇవాత్యుగ్రో విబుధధ్వజినీమధాక్॥ 50**

**ప్రతిపదార్థము :** దైత్యేన=ఆ బలి దైత్యునిచే, సృష్టిః=మాయచే సృజింపబడినదైన, మహాన్=మిగుల దొడ్డదైన, వహ్నిః=అగ్ని, పవన/శ్వసన సారథిః=గాలి సారథిగా గలది, సాంవర్తకః ఇవ=ప్రళయాగ్ని వలె, అతి+ఉగ్రః=మిగుల దారుణమైన, విబుధధ్వజినీమ్=దేవసేనను, అధాక్=దగ్ధము చేసెను.

**తాత్పర్యము :** దైత్యుడాబలి మాయచే సృజించిన అగ్ని మిక్కిలి దొడ్డదై గాలితోకూడిఁజెలరేగి ప్రళయాగ్నివలెనై దేవసేనలను దగ్ధము చేసెను.

**శ్లో॥ తతః సముద్ర ఉద్వేలః సర్వతః ప్రత్యదృశ్యత।**
**ప్రచణ్డవాతైరుద్ధూతతరఙ్గావర్తభీషణః॥ 51**

**ప్రతిపదార్థము :** తతః=అంతనా మాయవలన, సముద్రః=సముద్రము, ప్రచండవాతైః=పెను గాలుల చేత, ఉద్ధూత+తరంగ+ఆవర్త భీషణమ్=ఎగురగొట్టవడిన అలలు సుడులచే భయంకరమై, ఉద్వేలః=చెలియలికట్ట దాటినదై, ప్రత్యదృశ్యత=నలుగడల వ్యాపించి కన్పించెను.

**తాత్పర్యము :** అంత నా యసురుని వలన మాయచే జనించిన సముద్రము పెనుగాలులు వీచి లేచిన పెద్ద అలలు సుడులు గలిగి భయము గొల్పుచు చెలయలి కట్టను దాటి నలుగడల వ్యాపించి దేవసేనను ముంచుచు గన్పించెను.

**శ్లో॥ ఏవం దైత్యైర్మహామాయై(ఘోరై)రలక్ష్యగతిభీషణైః।**
**సృజ్యమానాసు మాయాసు విషేదుః సురసైనికాః॥ 52**

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, మహాఘోరైః=మిగుల భయంకరులైన, అలక్ష్యగతి భీషణైః=గుర్తింపరాని నడకచే దారుణులైన, దైత్యైః=దైత్యులచే, మాయాసు=మాయలు, పై



తెగిపడెను. టెక్కెములు విఱిగి అల్లెత్రాళ్ళు తెగి ఖడ్గములు విఱిగి కవచములు చినిగి ఆభరణములు పొడియైనవారైరి.

**శ్లో॥ తేషాం పదాఘాతరథాఙ్గచూర్ణితాదాయోధనాదుల్బణ ఉత్థితస్తదా।**
**రేణుర్దిశః ఖం ద్యుమణిం చ ఛాదయన్ న్యవర్తతాసృక్ స్రుతిభిః పరిప్లుతాత్॥ 38**

**ప్రతిపదార్థము :** తేషామ్=ఆ దేవాసురుల యొక్క, పద+ఆఘాత రథాంగ చూర్ణితాత్=పాదముల త్రొక్కిడుల చేతను, రథచక్రముల చేతను పొడియైన, ఆయోధనాత్=రణభూమి నుండి, ఉత్థితః=పైకి లేచిన, రేణుః=ధూళి, తదా=అప్పుడు, పరిప్లుతః=తడిసినదగుచో, దిశః=దిక్కులను, ఖమ్=ఆకాశమును, ద్యుమణిం చ=సూర్యుని, ఛాదయన్=కప్పుచు, అసృక్ స్రుతిభిః=నెత్తురుల కారుటచే ధారలచే, పరిప్లుతః=తడిసినదై, న్యవర్తత=నివర్తించెను, అడగిపోయెను.

**తాత్పర్యము :** ఆ సురాసురుల పాదముల త్రొక్కిడులచేతను రథచక్రముల చేతను పొడిపొడియైన యా సంగరస్థలము నుండి పైకి లేచి దిక్కులను ఆకసమును సూర్యుని కప్పుచున్న ధూళి అప్పుడు కళేబరముల నుండి చిమ్ముచున్న రక్తధారలచే తడిసి అడఁగిపోయెను.

**శ్లో॥ శిరోభిరుద్ధూతకిరీటకుణ్డలైః సంరమ్భదృగ్భిః పరిదష్టదచ్ఛదైః।**
**మహాభుజైః సాభరణైః సహాయుధైః సా ప్రాస్తృతా భూః కరభోరుభిర్బభౌ॥ 39**

**ప్రతిపదార్థము :** ఉద్ధూత కిరీట కుండలైః=ఖండితములైన కిరీట కుండలములు గలవై, సంరంభ దృగ్భిః=తిరుగుచున్న కన్నులు గల, పరిదష్టదచ్ఛదైః=దంతములతో కొఱకుతున్న పెదవులు గలవైన, శిరోభిః=వీరుల శిరస్సుల చేత, స+ఆభరణైః=ఆభరణములతో గూడినవి, సహ+ఆయుధైః=ఆయుధములతో గూడినవై, మహాభుజైః=దొడ్డ బాహువుల చేత, కరభ+ఊరుభిః=ఏనుగు తొండముల వంటి తొడల చేతను, సా=ఆ, జ్యా=(భూ)=రణభూమి, ప్రాస్తృతా=వ్యాపించెను.

**తాత్పర్యము :** ఖండితములైన కిరీట కుండలములు కలిగి గిరగిర తిరుగుచున్న కన్నులు గలవై దంతములతో గొఱుకుచున్న క్రింది పెదవులు గల శిరస్సుల చేతను తొడవులు గలిగి కైదువులు పూనియున్న దొడ్డ బాహుల చేతను ఏనుగు తొండముల వంటి తొడల చేతను ఆ సంగర ప్రదేశము నిండుకొనెను.

**శ్లో॥ కబన్ధాస్తత్ర చోత్పేతుః పతితస్వశిరోఽక్షిభిః।**
**ఉద్యతాయుధదోర్దణ్డైరాధావన్తో భటాన్ మృధే॥ 40**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ, మృధే=యుద్ధమునందు, కబంధాః=తలలేని మొండెములు, పతితస్వశిరోక్షిభిః=క్రిందబడిన తమ శిరస్సుల కన్నులతో చూచుచు, ఉద్యత్ ఆయుధదోర్దండైః=ఎత్తబడిన ఆయుధములు గల దండముల వంటి బాహువులచే, ఆధావంతః=పరుగిడు చున్నవై, భటాన్=వీరభటులను గూర్చి, ఉత్పేతుః=దుముకులాడుచుండెను.

**తాత్పర్యము :** ఆ యుద్ధమునఁజనిపోయిన వీరుల తలలేని మొండెములు క్రిందబడిన శిరస్సులలోని కన్నులతో జూచుచు ఎత్తబడిన ఆయుధములు గల బాహు దండములతోఁ బరుగిడుచు వీరభటులపైకి దుముకుచుండెను.

చచ్చినను వీరుల మేనులు ఆ క్రోధావేశమున యుద్ధము చేసినట్లుండెను.

**శ్లో॥ బలిర్మహేన్ద్రం దశభిస్త్రిభిరైరావతం శరైః।**
**చతుర్భిశ్చతురో వాహానేకేనారోహమార్దయత్॥ 41**

**ప్రతిపదార్థము :** బలిః=బలి, మహేంద్రమ్=ఇంద్రుని, దశభిః=పది సంఖ్యగల, శరైః =బాణముల చేతను, ఐరావతమ్=ఐరావతమను గజమును, త్రిభిః=మూడు బాణముల చేత, చతుర్భిః=నాలుగింటిచే, చతురః=ఐరావత పాదముల కడ రక్షకునిగా నున్న, వాహాన్=అశ్వములను, ఏకేన=ఒక బాణమున, ఆరోహమ్=మావటీని, ఆర్దయత్=కొట్టెను.

**తాత్పర్యము :** బలి చక్రవర్తి పది బాణములచే ఇంద్రునిపైఁగొట్టెను. మూడమ్ములచే ఐరావతమును నాలుగు తూపులచే ఐరావతము నాలుగు పాదముల కడ రక్షకములుగా నున్న నాలుగు గుఱ్ఱములను ఒక్క బాణమున ఐరావతము మీది మావటివానినిఁబడగొట్టెను.

**శ్లో॥ స తానాపతతః శక్రస్తావద్భిః శీఘ్రవిక్రమైః।**
**చిచ్ఛేద నిశితైర్భల్లైరసమ్ప్రాప్తాన్ హసన్నివ॥ 42**

**ప్రతిపదార్థము :** సః=ఆ, శక్రః=ఇంద్రుడు, ఆపతతః=తనపై బడుచున్న, ఆ బాణములను, అసంప్రాప్తాన్=తన్ను పొందక వానిని నడుమనే, శీఘ్రవిక్రమైః=వడిగాఁబోవునవియు, నిశితైః =వాడియైన, భల్లైః=బాణములచే, హసన్ ఇవ=పరిహసించుచున్నవాడువలె, చిచ్ఛేద= ఖండించెను.

**తాత్పర్యము :** ఇంద్రుడు బలి ప్రయోగించిన బాణములు తనపైకి రాకపూర్వమే మధ్య మార్గములోనే వచ్చువానిని మిగుల వేగముగా బోయిపైబడు వాడి బాణములచేఁ బరిహసించువాని వలె ఖండించెను.

**శ్లో॥ తస్య కర్మోత్తమం వీక్ష్య దుర్మర్షః శక్తిమాదదే।**
**తాం జ్వలన్తీం మహోల్కాభాం హస్తస్థామచ్ఛినద్ధరిః॥ 43**

**ప్రతిపదార్థము :** తస్య=ఆ ఇంద్రుని యొక్క, ఉత్తమం కర్మ=మేలగు తన శరములు ఖండించిన పనిని, వీక్ష్య=చూచి, బలి, దుర్మర్షః=సహింపనివాడై, శక్తిమ్=మంత్రబలము గల శక్తిని, ఆదదే=గ్రహించెను. హరిః=ఇంద్రుడు, తామ్=ఆ, మహా+ఉల్కాభామ్=పెద్ద కొఱవివలె, జ్వలంతీమ్=మండుచున్న, హస్తస్థాం=బలి హస్తమునందున్న దానిని, అచ్ఛినత్=ఖండించెను.

**తాత్పర్యము :** ఇంద్రుడట్లు తన శరములన్నింటిని ఖండించినట్టి మేలి పని చేయుట చూచి సహింపనివాడైన బలి, ఒక పెద్ద శక్తిని ప్రయోగింప సమకట్టెను. పెద్ద కొఱవివలె మండుచున్న ఆ శక్తిని తన పైకి ప్రయోగింపకపూర్వమే ఇంద్రుడు బలి చక్రవర్తి హస్తమునందుండు దానిని తక్షణమే ఖండించివైచెను.

**శ్లో॥ తతః శూలం తతః ప్రాసం తతస్తోమరమృష్టయః।**
**యద్ యచ్ఛస్త్రం సమాదద్యాత్ సర్వం తదచ్ఛినద్ విభుః॥ 44**

**ప్రతిపదార్థము :** తతః=అంత బలి, శూలమ్=త్రిశూలము, తతః=అంతట, ప్రాసమ్=ప్రాసను, తతః=తరువాత, తోమరమృష్టయః=తోమరాదులను, ఆదద్యాత్=గ్రహించెను, తత్=దానిని,



విభుః=ప్రభువు ఇంద్రుడు, అచ్ఛినత్=ఖండించెను. యత్ యత్=దేనిదేనిని బలి, ఆదద్యాత్=గైకొనెనో, తత్ సర్వమ్=దానినంతను, అచ్ఛినత్=ఖండించెను.

**తాత్పర్యము :** అంత బలి కుపితుడై త్రిశూలమును గొనెను. ఇంద్రుడు దానిని ఖండించెను. తర్వాత ఈటెను గొనెను. దానిని ఖండించెను. తర్వాత బల్లెకోలను గొనెను. దానిని ఖండించి బలిదేనినిగొనెనో దానినంతయు నింద్రుడు ఖండించెను.

**శ్లో॥ ససర్జాథాసురీం మాయామన్తర్ధానం గతోఽసురః।**
**తతః ప్రాదురభూచ్ఛైలః సురానీకోపరి ప్రభో॥ 45**

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ రాజా!, అథ=అంతట, అసురః=అసురుడైన బలి, అంతర్ధానం గతః=అంతర్హితుడై, ఆ సురీం మాయామ్=అసుర మాయను, ససర్జ=సృజించెను. తతః=ఆ మాయ వలన, సుర+ఆనీక+ఉపరి=దేవసేనపైన, శైలః=పర్వతము, ప్రాదురభూత్=కన్పట్టెను.

**తాత్పర్యము :** అంత బలి అంతర్హితుడై అసురమాయను సృజించెను. ఆ మాయవలన గొప్ప కొండయొకటి సురసైన్యముపైఁబడునట్లు కన్పట్టెను.

**శ్లో॥ తతో నిపేతుస్తరవో దహ్యమానా దవాగ్నినా।**
**శిలాః స టఙ్కశిఖరాశ్చూర్ణయన్త్యో ద్విషద్బలమ్॥ 46**

**ప్రతిపదార్థము :** తతః=ఆ మాయవలననే, దవాగ్నినా=కాఱుచిచ్చుచే, దహ్యమానాః =తగలబడుచున్నవై, తరవః=వృక్షములు, నిపేతుః=కూలెను. సటంక శిఖరాః=రాతియులులు వలె వాడి మొనలు గల, శిలాః=రాళ్ళు, ద్విషద్బలమ్=శత్రువులగు సురల బలమును, చూర్ణయంత్యః=పిండిపిండిగావించుచు గన్పించెను.

**తాత్పర్యము :** ఆ మాయ యా అసురమాయ వలన జనించిన కాఱుచిచ్చుచే వీక్షములు కాలుచు కూలెను. అట్లు జనించిన రాతియులుల వలె పదునైన ఱాళ్ళు సురబలము పిండిచేయుచు కన్పించెను.

**శ్లో॥ మహోరగాః సముత్పేతుర్దన్దశూకాః సవృశ్చికాః।**
**సింహవ్యాఘ్రవరాహాశ్చ మర్దయన్తో మహాగజాః॥ 47**

**ప్రతిపదార్థము :** మఱియు ఆ మాయవలన, మహా+ఉరగాః=దొడ్డ సర్పములు, దందశూకాః =దంతములతో కఱచు జంతువులు, సవృశ్చికాః=తేళ్ళతో కూడినవియు, సింహవ్యాఘ్ర వరాహాః చ=సింహములు, బెబ్బులులు, అడవి పందులు, మహాగజాః=గొప్ప ఏనుగులు, మర్దయంతః=సురసైన్యములు మర్దించుచున్నవై కన్పించెను.

**తాత్పర్యము :** మఱియు ఆ అసురమాయ వలన గొప్ప సర్పములు, కఱచునట్టి దుష్ట జంతువులు, తేళ్ళు, సింగములు, బెబ్బులులు, అడవి పందులు, పెద్ద గజములు జనించి సురబలమును మర్దించుచుండెను.

**శ్లో॥ యాతుధాన్యశ్చ శతశః శూలహస్తా వివాససః।**
**ఛిన్ధి భిన్ధీతి వాదిన్యస్తథా రక్షోగణాః ప్రభో॥ 48**

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ రాజా!, ఆ మాయవల్ల, శూలహస్తాః=త్రిశూలములు హస్తము లందు గలిగి, వివాససః=విగతవస్త్రలై, శతశః=వందల కొలది, యాతుధాన్యశ్చ=ఆ రక్కసులు,

అట్లే, మూఢ!=ఓరి మూఢుడా!, మాయా+ఈశాన్=మాయకు ప్రభువైన, నః=మమ్మును, మాయాభిః=మాయలచే, నటవత్=నటుడువలె, జిగీషసి=జయింపగోరుచున్నావు.

**తాత్పర్యము :** ఓ మూఢుడా! బలి! నటుడెట్లు తన నాట్యమునకు మురిసి కన్నులు మూసికొని సంభాషించుచు నేమియు తెలియని బాలురవంటివారలను లోబఱచుకొని వారి సొమ్ము దోచుకొనుచున్నాడో అట్లే నీవు మాయేశ్వరులమైన మమ్ము మాయలుసేసి నటుడు వలె జయింపగోరుచున్నావు.

**శ్లో॥ ఆరురుక్షన్తి మాయాభిరుత్సిసృప్సన్తి యే దివమ్।**
**తాన్ దస్యూన్ విధునోమ్యజ్ఞాన్ పూర్వస్మాచ్చాపరాధతః॥** 5

**ప్రతిపదార్థము :** యే=ఎవ్వరు, మాయాభిః=మోసపుఁబనులచే, దివమ్=స్వర్గమును, ఆరురుక్షన్తి=ఎక్కఁగోరుదురో, ఉత్సిసృప్సన్తి=ధర్మమునుల్లఘించి మోక్షమునుఁగోరుచున్నారో, అజ్ఞాన్=అజ్ఞానులైన, తాన్=ఆ, దస్యూన్=ముచ్చులను, పూర్వస్మాత్=తొల్లింటదైన, అపరాధతః =నేరమున కట్టి, విధునోమి=క్రిందికిఁబడగొట్టెదను.

**తాత్పర్యము :** ఎవ్వరు కపటంపుఁబనులొనర్చి స్వర్గమధిష్ఠింపఁగోరుచున్నారో, ధర్మోల్లంఘనము గావించి మోక్షమును గోరుచున్నారో ఆ ముచ్చులను నా వజ్రాయుధమున క్రిందికిఁబద గొట్టెద.

**శ్లో॥ సోఽహం దుర్మాయినస్తేఽద్య వజ్రేణ శతపర్వణా।**
**శిరో హరిష్యే మన్దాత్మన్ ఘటస్వ జ్ఞాతిభిః సహ॥** 6

**ప్రతిపదార్థము :** మందాత్మన్=ఓయి బుద్ధిహీనుడా!, సః+అహమ్=ఆ నేను, దుర్మాయినః= చెడు మాయలుగలవాడవైన, తే=నీయొక్క, శిరః=శిరము, శతపర్వణా=నూఱంచులు గల, వజ్రేణ=వజ్రాయుధముచే, అద్య=ఇప్పుడు, హరిష్యే=కొట్టి వేసెదను, జ్ఞాతిభిస్సహ=నీ బంధువులతో, ఘటస్వ=కూడుకొనుము, ఎదురురమ్ము.

**తాత్పర్యము :** ఓరీ బుద్ధిహీనుడా ! చెడుమాయలు పన్నిన నీ శరీరమునిప్పుడు నూఱంచులు గల నా వజ్రాయుధమున ఖండించెదను. నీ బంధువులతో గూడ రమ్ము.

**శ్రీ బలిరువాచ :** బలి వచించెను.

**శ్లో॥ సఙ్గ్రామే వర్తమానానాం కాలచోదితకర్మణామ్।**
**కీర్తిర్జయోఽజయో మృత్యుః సర్వేషాం స్యురనుక్రమాత్॥** 7

**ప్రతిపదార్థము :** సంగ్రామే=యుద్ధమునందు, వర్తమానానామ్=వర్తించుచున్నవారై, కాలచోదిత కర్మణామ్=కాలముచే ప్రేరితులై యుద్ధమొనర్చువారగు, సర్వేషామ్=ఎల్లరకు, అనుక్రమాత్ =క్రమముగా, కీర్తిః=యశము, జయః=గెలుపు, అజయః=ఓటమి, మృత్యుః=మృతి, స్యుః =అగును.

**తాత్పర్యము :** కాలమునలోఁగి కయ్యమొనర్చువారికి గెలుపు, ఓటమి, యశము, మృతి ఎల్లరుకుఁగ్రమముగాఁ గలుగుచున్నవి.



విధములు, సృజ్యమానాసు=సృజింపబడినవగుచుండగా, సురసైనికాః=దేవసేనలు, విషేదుః =దుఃఖమును పొందిరి.

**తాత్పర్యము :** ఇట్లు మహాభయంకరులై గుర్తింపరాక ఆకసమున సంచరించుచు దారుణులై దైత్యులు పైని పేర్కొన్న విధముఁబెక్కులు సృజింపఁగాంచి సురల సైనికులు దుఃఖము పొందిరి.

**శ్లో॥ న తత్ప్రతివిధిం యత్ర విదురిన్ద్రాదయో నృప।**
**ధ్యాతః ప్రాదురభూత్తత్ర భగవాన్ విశ్వభావనః॥** 53

**ప్రతిపదార్థము :** నృప=ఓరాజా!, యత్ర=ఎప్పుడు, ఆ అసురమాయలందు, ఇంద్ర+ఆదయః =ఇంద్రుడులోనగువారు, తత్ ప్రతినిధిమ్=దానికి బదులుసేతను, న విదుః=ఎఱుంగరైరో, తత్ర=అప్పుడు, భూతభావనః/విశ్వభావనః=ప్రాణులను సృజించువాడైన, భగవాన్=విష్ణు భగవానుడు, ధ్యాతః=ధ్యానింపబడినవాడై, ప్రాదురభూత్=ప్రత్యక్షమయ్యెను.

**తాత్పర్యము :** ఎప్పుడింద్రాదులు ఆయసురుల మాయలకు ప్రతిసేయలేక పోయిరో అప్పుడు భగవానుని ధ్యానించిరి. ప్రాణులను సృజించువాడైన భగవంతుడు విష్ణువు ప్రత్యక్షమయ్యెను.

**శ్లో॥ తతస్సుపర్ణాంసకృతాఙ్ఘ్రిపల్లవః పిశఙ్గవాసా నవకఞ్జలోచనః।**
**అదృశ్యతాష్టాయుధబాహురుల్లసత్శ్రీకౌస్తుభానర్ఘ్యకిరీటకుణ్డలః॥** 54

**ప్రతిపదార్థము :** తతః=అంతట, సుపర్ణ+అంస కృత+అంఘ్రిపల్లవః=గరుడుని భుజములందు ఉంచిన చిగురుటాకుల వంటి పాదములు గలవాడు, పిశంగవాసాః=పసుపు వన్నె బట్ట గలవాడు, నవకంజలోచనః=క్రొత్త తామరల గన్నులు గలవాడు, అష్టాయుధబాహుః=ఎనిమిది ఆయుధములతో గూడిన బాహువులు గలవాడు, ఉల్లసత్+శ్రీ కౌస్తుభ+అనర్ఘ్య కిరీటకుండలః =ప్రకాశించు సిరి, కౌస్తుభమణి, అమూల్యమైన కిరీటము, కుండలములు గలవాడు విష్ణువు, అదృశ్యత=ప్రత్యక్షమయ్యెను.

**తాత్పర్యము :** దేవతల ప్రార్థనమునకు ఒడంబడి మహావిష్ణువు గరుడుని భుజములందు తన పాదపల్లవములుంచి పసుపు పచ్చని పుట్టముదాల్చి, క్రొత్తతామర కన్నులు గలవాడై శంఖచక్రాదులగునెనిమిది యాయుధములతో బాహువులు గలవాడై ఎడమ ప్రకాశించు శ్రీదేవితో కౌస్తుభమణితోడను అమూల్యములైన కిరీటము కుండలములు ధరించి కన్పట్టెను.

**శ్లో॥ తస్మిన్ ప్రవిష్టేఽసురకూటకర్మజా మాయా వినేశురృహినా మహీయసః।**
**స్వప్నో యథా హి ప్రతిబోధ ఆగతే హరిస్మృతిః సర్వవిపద్విమోక్షణమ్॥** 55

**ప్రతిపదార్థము :** తస్మిన్=ఆ విష్ణువు, ప్రవిష్టే సతి=ఆ యుద్ధభూమికి ప్రవేశించినంతనే, మహీయసః=మహాత్ముని యొక్క, మహినా=మహిమచే, అసురకూటకర్మజాః=అసురుల కపట క్రియల వలన జనించిన, మాయాః=మాయలు, వినేశుః=నశించెను. ప్రతిబోధే=మెలకువ, ఆగతే= వచ్చినంతనే, స్వప్నఃయథా=స్వప్నమువలెను నశించెను, హరిస్మృతి=హరి స్మరణము, సర్వవిపత్విమోక్షణమ్=అన్ని ఆపదలను విడుదల చేయునది గదా. ఇక హరియే వచ్చినప్పుడేమి చెప్పవలెను.

**తాత్పర్యము :** అట్లు వెన్నుడు ప్రవేశించుచుండగనే మిక్కిలి ప్రయత్నించి మహిమచే కావించిన అసురుల కపటంపు మాయలన్నియు మెలకువతో 'కల' నశించునట్లు హరి స్మరణము ఎల్ల ఆపదలను నిర్మూలించునది గదా. ఇక హరి వచ్చిన చెప్పెడిదేమి ?

**శ్లో॥ దృష్ట్వా మృధే గరుడవాహమిభారివాహ ఆవిధ్య శూలమహినోదథ కాలనేమిః।**
**తల్లీలయా గరుడమూర్ధ్ని పతద్ గృహీత్వా తేనాహనన్నృప సవాహమరిం త్ర్యధీశః॥**

**ప్రతిపదార్థము :** మృధే=సంగరమందు, గరుడవాహమ్=గరుడు నెక్కివచ్చిన వెన్నుని, దృష్ట్వా=చూచి, కాలనేమిః=కాలనేమియను యసురుడు, ఇభారివాహః=సింహ వాహనము కలవాడు, శూలమ్=త్రిశూలమును, ఆవిధ్య=గిరగిర త్రిప్పి, ఆహినోత్=విష్ణువుపై ప్రయోగించెను. అథ=అంత, గరుడమూర్ధ్ని=గరుడుని శిరమున, ఏతద్=పడుచున్న, తత్=ఆ శూలమును, లీలయా=సునాయాసముగా, గృహీత్వా=తీసుకొని, త్రి+అధీశః=ముల్లోకములకు ప్రభువు, తేన=ఆ శూలము చేత, సవాహమ్=వాహనముతో గూడిన, అరిమ్=శత్రువును, అహనత్=కొట్టి చంపెను.

**తాత్పర్యము :** రణభూమి గరుడునెక్కి కన్పట్టిన వెన్నుని గాంచి కాలనేమియను యసురుడు సింహవాహనుడు త్రిశూలమును గిరగిర త్రిప్పి కొట్టెను. అది గరుడుని శిరమునఁబడబోవు చుండ వెన్నుడు దానిని సునాయాసమునఁగేల గ్రహించి త్రిలోకేశ్వరుడు ఆ శూలముచేతనే వాహనముతోగూడ వానిని జంపెను.

**శ్లో॥ మాలీ సుమాల్యతిబలౌ యుధి పేతతుర్యచ్చక్రేణ కృత్తశిరసావథ మాల్యవాంస్తమ్।**
**ఆహత్య తిగ్మగదయాఽహనదణ్డజేన్ద్రం తావచ్ఛిరోఽచ్ఛినదరేర్నదతోఽరిణాద్యః॥ 57**

**ప్రతిపదార్థము :** మాలీ సుమాలీ=మాలి సుమాలియను పేర్లుగల, అతిబలౌ=ఎక్కువ బల్లిదులసురులు, యుధి=యుద్ధమునందు, పేతతుః=హరిపైఁగవిసిరి. యత్ చక్రేణ=ఏ హరి చక్రముచే, కృత్తశిరసా=ఖండింపబడిన శిరములు గలవారైరి. అథ=అంత, మాల్యవాన్=మాల్యవంతుడు, ఆహత్య=దగ్గరకు వచ్చి, తిగ్మగదయా=బలువైన గదతో, అండజేంద్రమ్=పక్షిరాజు అయిన గరుత్మంతుని, ఆహనత్=కొట్టెను. తావత్=అంతలోన, ఆద్యః=ఎల్లరకు ప్రథముడగు విష్ణువు, నదతః=సింహగర్జనము సేయు, అరేః=పగతుడైన ఆమాల్యవంతుని, శిరః=శిరము, అరిణా=చక్రముతో, అచ్ఛినత్=ఖండించెను.

**తాత్పర్యము :** అంత మాలీసుమాలియను అసురులు సంగరరంగమున వెన్నునిపై దూకిరి. వెంటనేవారు విష్ణువు చక్రమున ఖండిత శిరస్కులైరి. అంత మాల్యవంతుడను అసురుడు వచ్చి పెద్ద గదతో గరుడుని గొట్టెను. వెంటనే జగదాద్యుడగు హరి సింహనాదము చేయు నాపగతుని శిరమును చక్రమున ఖండించివైచెను.

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కంధే దశమో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమునందు అష్టమస్కంధమున పదియవ అధ్యాయము.

## ఏకాదశోఽధ్యాయః

ఈ అధ్యాయమందు భగవత్కృపచే అతిబలోద్ధతులైన అమరులచే బలి ప్రభృతులగు దైత్యులు జితులగుట వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ అథో సురాః ప్రత్యుపలబ్ధచేతసః పరస్య పుంసః పరయానుకమ్పయా।**
**జఘ్నుర్భృశం శక్రసమీరణాదయ-స్తాంస్తాన్ రణే యైరభిసజ్ఞతాః పురా॥ 1**

**ప్రతిపదార్థము :** అథో=అంత, సురాః=దేవతలయిన, శక్రసమీరణాదయః=ఇంద్రుడు, వాయువు లోనగువారు, పరస్య=పరమాత్ముడైన, పుంసః=పురుషోత్తముడగు శ్రీహరియొక్క పరమ+ అనుకంపయా=ఉత్తమ కృపచే, ప్రత్యుపలబ్ధ చేతనః=మెలకువగలవారై, రణే=యుద్ధమునందు, యైః=ఎవ్వరితో, అభిసంగతాః=ఎదుర్కొనబడిరో, తాన్ తాన్=ఆయా యసురులను, భృశమ్= అధికముగ, జఘ్నుః=ఆయుధములచేఁగొట్టిరి.

**తాత్పర్యము :** అంత నా ఇంద్రుడు, వాయువు లోనగు దేవతలు పరమపురుషుడైన శ్రీహరి యొక్క ఉత్తమ కృపచే మెలకువగలవారై తమ్మోడించిన అసురులనెల్ల తీవ్రముగాఁగొట్టిరి.

**శ్లో॥ వైరోచనాయ సంరబ్ధో-భగవాన్ పాకశాసనః।**
**ఉదయచ్ఛద్యదా వజ్రం-ప్రజా హా హేతి చుక్రుశుః॥ 2**

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడైన, పాకశాసనః=ఇంద్రుడు, సంరబ్ధః=కోపోద్రేకము గలవాడై, యదా=ఎప్పుడు, వజ్రమ్=వజ్రాయుధము, ఉదయచ్ఛత్=పైకెత్తినో, ప్రజాః=ప్రజలు, హాహా ఇతి=హాహా యని, చుక్రుశుః=ఆక్రోశించిరి.

**తాత్పర్యము :** పాకుని సంహరించిన ఇంద్రభగవానుడుద్రేకమొంది ఎపుడు వజ్రాయుధము బలిపై ప్రయోగింప పైకెత్తెనో ప్రజలెల్లరు హాహాయని కేకలు వేసిరి.

**శ్లో॥ వజ్రపాణిస్తమాహేదం-తిరస్కృత్య పురః స్థితమ్।**
**మనస్వినం సుసంరబ్ధం-విచరన్తం మహామృధే॥ 3**

**ప్రతిపదార్థము :** వజ్రపాణిః=వజ్రహస్తుడైన ఇంద్రుడు, మనస్వినమ్=మానవంతుడును, సుసంరబ్ధమ్=యుద్ధోద్రేకమునసున్నవాడునై, మహామృధే=ఆ దొడ్డ సంగరమందు, విచరన్తమ్=సంచరించుచున్నవాడును, పురఃస్థితమ్=తనముందున్న, తమ్=ఆ బలిని గూర్చి, తిరస్కృత్య=తిరస్కరించి, ఇదమ్ ఆహ=ఈ మాట చెప్పెను.

**తాత్పర్యము :** వజ్రమును హస్తమున ధరించిన ఇంద్రుడా దొడ్డ సంగరమున సంచరించుచు మానవంతుడై యుద్ధోద్రేకమున తనముందుకు వచ్చిన బలిని ఎద్దేవ చేస్తూ యిట్లు పలికెను.

**శ్లో॥ నటవన్మూఢ! మాయాభిర్మాయేశాన్ నో జిగీషసి।**
**జిత్వా బాలాన్ నిబద్ధాక్షాన్ నటో హరతి తద్ధనమ్॥ 4**

**ప్రతిపదార్థము :** నటః=నటుడు, నిబద్ధ+అక్షాన్=కన్నులు మూసికొన్న, బాలాన్=బాలురను, జిత్వా=కపటమున వశపరచుకొని, తత్ ధనమ్=వారి సొమ్ము, హరతి=ఎట్లు దోచుకొనునో

=మేఘములు, ధారాభిః=వర్షధారలచే, పర్వతమ్ ఇవ=పర్వతమును వలె, శరైః=శరీరములచే, ఇంద్రమ్=ఇంద్రుని, అవాకిరన్=గప్పిరి.

**తాత్పర్యము :** పౌరుషమును బెంచు మాటలచే ఇంద్రుని ఆయువుపట్టులు నొచ్చిపోవునట్లుఁ దూలనాడుచు మేఘములు నీటిధారలచే పర్వతమునువలె, శరములచే నాతని గప్పిరి.

**శ్లో॥ హరీన్ దశశతాన్యాజౌ-హర్యశ్వస్య బలః శరైః।**
**తావద్భిరర్దయామాస-యుగపల్లఘుహస్తవాన్॥** 21

**ప్రతిపదార్థము :** లఘుహస్తవాన్=శర ప్రయోగమునఁజేయి దిరిగినవాడైన, బలః=బలుడు, ఆజౌ=యుద్ధమున, హర్యశ్వస్య=ఇంద్రుని యొక్క, దశశతాని=పదినూఱులైన, హరీన్=అశ్వములు, తావద్భిః=అంత సంఖ్యగల వేయియైన, శరైః=అమ్ములతో, యుగపత్=ఒక్కసారిగా, అర్దయామాస=కొట్టెను.

**తాత్పర్యము :** బలుడు శరసంధానము హస్త నైపుణ్యముగలవాడు, ఇంద్రుని రథాశ్వముల వేయింటిని వేయి బాణములతో నొక్కసారిగా గొట్టెను.

**శ్లో॥ శతాభ్యాం మాతలిం పాకో రథం చ తిలశః పృథక్।**
**సకృత్సన్ధానమోక్షేణ-తదద్భుతమభూద్రణే॥** 22

**ప్రతిపదార్థము :** పాకః=పాకుడు, సకృత్+సంధాన మోక్షేణ=ఒక్కమాఱు శరములను సంధించి విడుచుటచేత, మాతలిమ్=ఇంద్రసారధి మాతలిని, రథంచ=రథమును, పృథక్ శతాభ్యామ్=రెండు వందల బాణములతో, తిలశః=నువ్వులంత తునకలగునట్లు (చేసెను). తత్=వాని శరప్రయోగము, రణే=సంగ్రామమందు, అద్భుతమ్=అచ్చెరువు, అభూత్=ఆయెను.

**తాత్పర్యము :** పాకుడొక్కసారి యమ్ములనారిని సంధించి మాతలిని నూఱింటను, రథమును నువ్వులంత ముక్కలగునట్లు నూఱింటను గొట్టెను. వాని యాప్రయోగకౌశలము కయ్యమున నచ్చెరువుగ ఆయెను.

**శ్లో॥ నముచిః పఞ్చదశభిః స్వర్ణపుఙ్ఖైర్మహేషుభిః।**
**ఆహత్య వ్యనదత్సఙ్ఖ్యే సతోయ ఇవ తోయదః॥** 23

**ప్రతిపదార్థము :** నముచిః=నముచియను దానవుడు, స్వర్ణపుంఖైః=బంగారు పింజలుగల, పంచదశభిః=పదునైదైన, మహా+ఇషుభిః=దొడ్డ అమ్ములతో, ఆహత్య=ఇంద్రునిగొట్టి, సంఖ్యే=యుద్ధరంగమున, సతోయః=నీటితో గూడిన, తోయద ఇవ=మేఘము వలె, వ్యనదత్=సింహనాదము చేసెను.

**తాత్పర్యము :** నముచియను దానవుడు బంగారు పింజలుగల పదునేను దొడ్డ అమ్ములచే ఇంద్రునిగొట్టి, యుద్ధరంగమున నీళ్ళ మేఘమువలె గర్జనము గావించెను.

**శ్లో॥ సర్వతః శరకూటేన శక్రం సరథసారథిమ్।**
**ఛాదయామాసురసురాః-ప్రావృట్ సూర్యమివామ్బుదాః॥** 24

**ప్రతిపదార్థము :** అసురాః=ఆ మువ్వురసురులు, శరకూటేన=అమ్ముల మొత్తముచే, శక్రమ్=ఇంద్రుని, సరథసారథిమ్=రథముతో సారథితో గూడినవానిని, సర్వతః=నలువైపుల, ప్రావృట్+



**శ్లో॥ తమిమం కాలరశనం జనమ్ పశ్యన్తి సూరయః।**
**న హృష్యన్తి న శోచన్తి తత్ర యూయమపణ్డితాః॥** 8

**ప్రతిపదార్థము :** సూరయః=పండితులు, కాలరశనమ్=కాలమను పగ్గమునకు లోగినట్టి, తమ్ ఇమమ్=ఆ ఈ, జనమ్=జనమును గూర్చి, పశ్యన్తి = గాంచుదురు, న హృష్యన్తి=సుఖితులైన సంతోషింపరు, న శోచన్తి=దుఃఖితులైన దుఃఖింపరు, తత్ర=ఈ విషయములో, యూయమ్=మీరు, అపణ్డితాః=తెలివిలేనివారు.

**తాత్పర్యము :** పండితులు కాలమను పాశమున లోఁగిన జనము సుఖితులైనచో సంతసింపరు, దుఃఖితులైనచో దుఃఖింపరు. ఈ విషయములో మీరు తెలివిమాలినవారు.

**శ్లో॥ న వయం మన్యమానానామాత్మానం తత్ర సాధనమ్।**
**గిరో వః సాధుశోచ్యానాం గృహ్ణీమో మర్మతాడనాః॥** 9

**ప్రతిపదార్థము :** తత్ర=జయాపజయములకు, ఆత్మానమ్=దేహమును, సాధనమ్=సాధనముగా, మన్యమానానామ్=తలంచువారును, సాధు శోచ్యానామ్=సాధువులకు శోచనీయులైన, వః=నీయొక్క, మర్మతాడనాః=హృదయమునకు పీడ గలిగించు, గిరః=మాటలను, వయమ్=మేము, న గృహ్ణీమః=గ్రహింపము.

**తాత్పర్యము :** జయాపజయములకు దేహమే సాధనమని తలంచు సాధువులు శోచింపఁదగిన భంగి వర్తించు మీ యొక్క మనఃఖేదావహములైన మాటలను మేము గ్రహించము. మీవలె మేము ఇతరులను నిందింపము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇత్యాక్షిప్య విభుం వీరో నారాచైర్వీరమానదః।**
**ఆకర్ణపూర్ణైరహనదాక్షేపైరాహతం పునః॥** 10

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, విభుమ్=ఇంద్రుని, ఆక్షిప్య=ఆక్షేపించి, వీరమానదః=వీరుల అభిమానము హరించువాడైన, వీరః=వీరుడైన బలి, ఆకర్ణపూర్ణైః=నారిని చెవి వఱకు పూర్తిగా లాగి, నారాచైః=నారసములచే, ఆక్షేపైః=ఆక్షేపవాక్యములతో, ఆహతమ్= కొట్టబడిన వానిని, పునః=మఱల, అహనత్=కొట్టెను.

**తాత్పర్యము :** వీరులకు నభిమానము గలిగించు వీరశ్రేష్ఠుడైన బలి ఇంద్రునాక్షేపించి ఆక్షేపవాక్యములతో కొట్టబడిన ఆతనిని మఱల చెవివఱకు పూర్తిగా లాగిన నారసములతో కొట్టెను.

**శ్లో॥ ఏవం నిరాకృతో దేవో-వైరిణా తథ్యవాదినా।**
**నామృష్యత్తదధిక్షేపం-తోత్రాహత ఇవ ద్విపః॥** 11

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, దేవః=ఇంద్రుడు, తథ్యవాదినా=సత్యవాదియును, వైరిణా=వైరియగు బలిచే, నిరాకృతః=తిరస్కరింపబడినవాడై, తత్+అధిక్షేపమ్=ఆ బలి గావించిన నిందావాక్యము, తోత్ర+ఆహతః=అంకుశముచే గొట్టబడిన, ద్విప ఇవ=గజము వలె, న+అమృష్యత్=సహింపలేదు.

**తాత్పర్యము :** ఇట్లు దేవేంద్రుడు సత్యమును బల్కు బలిచే గొట్టబడిన వాడై అతడు వచించిన ఆక్షేపవాక్యమును అంకుశము దెబ్బదిన్న యేనుగువలె సహింపని వాడయ్యెను.

శ్లో॥ ప్రాహిణోత్కులిశం తస్మై-హ్యమోఘమరిమర్దనమ్।
సయానో న్యపతద్భూమౌ-ఛిన్నపక్ష ఇవాచలః॥ 12

**ప్రతిపదార్థము :** తస్మై=ఆ బలికొఱకు, అమోఘమ్=విఫలము కాని, అరిమర్దనమ్=శత్రువులను మర్దించు, కులిశమ్=వజ్రాయుధమును, ప్రాహిణోత్=పంపెను. సయానః=విమానముతోఁ గూడ ఆ బలి, ఛిన్నపక్షః=తెగిన ఱెక్కలు గల, అచలఃఇవ=పర్వతము వలె, భూమౌ=నేల యందు, న్యపతత్=పడెను.

**తాత్పర్యము :** ఇంద్రుడా బలిని శత్రుమర్దనమైన అమోఘమైన వజ్రాయుధముతో గొట్టెను. అంత బలి విమానముతోఁగూడ ఱెక్కలు తెగిన పర్వతమువలె నేలగూలెను.

శ్లో॥ సఖాయం పతితం దృష్ట్వా-జమ్భో బలిసఖః సుహృత్।
అభ్యయాత్సౌహృదం సఖ్యు-ర్హతస్యాపి విచిన్తయన్॥ 13

**ప్రతిపదార్థము :** పతితమ్=నేలగూలిన, సఖాయమ్=స్నేహితుని, బలిని, దృష్ట్వా=చూచి, జంభః=జంభుడనువాడు, బలిసఖః=బలి స్నేహితుడు, సుహృత్=మంచి మనస్సువాఁడు, హతస్య=కొట్టబడిన, సఖ్యుః=నెయ్యునకు, సౌహృదమ్=మేలును, విచింతయన్=చింతించుచు, అభ్యయాత్=ఇంద్రునెదుర్కొనెను.

**తాత్పర్యము :** నేలగూలిన బలిని చూచి జంభుడు తమ స్నేహమును గుర్తించి బలి పక్షమున ఇంద్రునిపైకి వచ్చెను.

శ్లో॥ స సింహవాహ ఆసాద్య-గదాముద్యమ్య రంహసా।
జత్రావతాడయచ్ఛక్రం గజం చ సుమహాబలః॥ 14

**ప్రతిపదార్థము :** సః=ఆ జంభుడు, సింహవాహః=సింగము వాహనముగఁ గలవాఁడు, సుమహాబలః=మిక్కిలి బలముగలవాడు, ఆసాద్య=ఇంద్రుని సమీపించి, రంహసా=వేగముతో, గదామ్=గదను, ఉద్యమ్య=పైకి ఎత్తి, శక్రమ్=ఇంద్రుని, జత్రౌ=కంఠము భుజము సందు నందు, అతాడయత్=కొట్టెను, గజఞ్చ=ఐరావతమును గొట్టెను.

**తాత్పర్యము :** ఆ జంభుడు సింహవాహనుడై ఇంద్రుని సమీపించి గదను ఒక్క వుదుటన పైకెత్తి ఇంద్రుని కంఠము దగ్గఱ కొట్టెను. ఐరావతమును గూడ కొట్టెను.

శ్లో॥ గదాప్రహారవ్యథితో భృశం విహ్వలితో గజః।
జానుభ్యాం ధరణీం స్పృష్ట్వా-కశ్మలం పరమం యయౌ॥ 15

**ప్రతిపదార్థము :** గదాప్రహారవ్యథితః=గద యొక్క దెబ్బకు బాధనొందినదై, గజః=ఐరావతము, భృశమ్=మిక్కిలి, విహ్వలితః=శక్తిలేనిదై, జానుభ్యామ్=మోకాళ్ళతో, ధరణీమ్=భూమిని, స్పృష్ట్వా=తాకి, పరమమ్=అధికమైన, కశ్మలమ్=దుఃఖమును, యయౌ=పొందెను.

**తాత్పర్యము :** ఐరావతము గదవ్రేటుకు వ్యథనొంది శక్తిలేనిదై నేలకు మొగ్గి మోకాళ్ళ నూనుకొనినది. మిక్కిలి కుందు పొందెను.

శ్లో॥ తతో రథో మాతలినా హరిభిర్దశశతైర్వృతః।
ఆనీతో ద్విపముత్సృజ్య రథమారురుహే విభుః॥ 16



**ప్రతిపదార్థము :** తతః=అంత, మాతలినా=మాతలితో, దశశతైః=వేయి, హరిభిః=అశ్వములతో, యుతః=కూడిన, రథః=అరదము. ఆనీతః=తీసికొనిరాబడెను, విభుః=ఇంద్రుడు, ద్విపమ్=ఐరావత గజమును, ఉత్సృజ్య=వదలి, రథమ్=రథమును, ఆరురుహే= ఎక్కెను.

**తాత్పర్యము :** అంత మాతలి వేయి గుఱ్ఱములను బూన్చిన రథమును దోలుకొని వచ్చెను. ఇంద్రుడైరావతమునుండి దిగి యారథమునధిష్ఠించెను.

శ్లో॥ తస్య తత్పూజయన్ కర్మ యన్తుర్దానవసత్తమః।
శూలేన జ్వలతా తం తు స్మయమానోఽహనన్మృధే॥ 17

**ప్రతిపదార్థము :** దానవసత్తమః=దానవ శ్రేష్ఠుడు జంభుడు, యన్తుః=రథసారధియైన మాతలి యొక్క, తత్ కర్మ=ఆ పనిని (రథము తోలుకొని వచ్చుట), పూజయన్=శ్లాఘించుచు, మృధే=యుద్ధమున, స్మయమానః=నవ్వుచు, తమ్=ఆ మాతలిని, జ్వలతా=మండుచున్న, శూలేన=త్రిశూలముచే, అహనత్=కొట్టెను.

**తాత్పర్యము :** దానవశ్రేష్ఠుడాదంభుడు మాతలియట్లు రథము తోలుకొని వచ్చినందులకు అతనిని శ్లాఘించుచు నవ్వుచు యుద్ధమందు ఆ మాతలిని జ్వలించు త్రిశూలముతో కొట్టెను.

శ్లో॥ సేహే రుజం సుదుర్మర్షాం-సత్త్వమాలమ్బ్య మాతలిః।
ఇన్ద్రో జమ్భస్య సంక్రుద్ధో-వజ్రేణాపాహరచ్ఛిరః॥ 18

**ప్రతిపదార్థము :** మాతలిః=మాతలి, సత్త్వమ్=దిటవు, ఆలంబ్య=ఆలంబించి, సుదుర్మర్షామ్=సహింప శక్యముగాని, రుజమ్=బాధను, సేహే=సహించెను. ఇన్ద్రః=ఇంద్రుడు, సంక్రుద్ధః=క్రోధమొందినవాడై, జంభస్య=జంభుని యొక్క, శిరః=శిరస్సును, వజ్రేణ=వజ్రాయుధముచే, అపాహరత్=ఖండించెను.

**తాత్పర్యము :** మాతలి కొంత దిటవు గలవాడై ఆ త్రిశూలం వేటును సహించెను. ఇంద్రుడలిగి జంభుని శిరస్సును వజ్రాయుధముచే ఖండించెను.

శ్లో॥ జమ్భం శ్రుత్వా హతం తస్య-జ్ఞాతయో నారదాదృషేః।
నముచిశ్చ బలః పాక-స్తత్రాపేతుస్త్వరాన్వితాః॥ 19

**ప్రతిపదార్థము :** జంభమ్=జంభుని, హతమ్=చంపబడినవానినిగా, ఋషేః=ఋషియగు, నారదాత్=నారదుని వలన, శ్రుత్వా=విని, తస్య=అతని యొక్క, జ్ఞాతయః=బంధువులు, నముచిః=నముచి, బలః=బలుడు, పాకః=పాకుడును, త్వర+అన్వితాః=వేగముతోఁ గూడిన వారై, తత్ర=ఆ ఇంద్రుడున్న చోటుకి, ఆపేతుః=సమీపించిరి.

**తాత్పర్యము :** జంభుడు చచ్చెనని నారదునివలె విని, అతని బంధువులు నముచి, బలుడు మరియు పాకుడును ముగ్గురుదానవులతివేగమున నింద్రుని సమీపించిరి.

శ్లో॥ వచోభిః పౌరుషైరిన్ద్రం ఘట్టయన్తోఽస్య మర్మసు।
శరైరవాకిరన్ మేఘా ధారాభిరివ పర్వతమ్॥ 20

**ప్రతిపదార్థము :** పౌరుషైః=శౌర్యమునుబెంచు, వచోభిః=మాటలచే, అస్య=ఇంద్రుని యొక్క మర్మసు=ఆయువు పట్టులందు, ఘట్టయన్తః=నొచ్చిపోవునట్లు తూలనాడుచు, మేఘాః

**శ్లో॥ తపస్సారమయం త్వాష్ట్రం వృత్రో యేన విపాటితః।**
**అన్యే చాపి బలోపేతాః సర్వాస్త్రైరక్షతత్వచః॥ 35**

**ప్రతిపదార్థము :** త్వాష్ట్రమ్=త్వష్టృసంబంధమైన, తపఃసారమయమ్=తపము యొక్క సారము యొక్క స్వరూపమైన, వృత్రః=వృత్రాసురుడు, యేన=ఏ వజ్రముచే, విపాటితః=దునుమాడఁబడసెను, సర్వాస్త్రైః=అస్త్రములచే, అక్షతత్వచః=చొచ్చుకోరాని మేటి చర్మముగలవారైన, బలోపేతాః=బలముతోఁగూడిన, అన్యే చ=ఇతరులు సంహరింపబడినారు.

**తాత్పర్యము :** త్వష్ట యొక్క తపస్సారము యొక్క రూపమైన వృత్రుని గూడ ఈ వజ్రము దునుమాడినది. అస్త్రములు చొరరాని చర్మముగల బలవంతులైన ఇతరులగునసురుల సైతమావజ్రము గూల్చినది.

**శ్లో॥ సోఽయం ప్రతిహతో వజ్రో-మయా ముక్తోఽసురేఽల్పకే।**
**నాహం తదాదదే దణ్డం-బ్రహ్మతేజోఽప్యకారణమ్॥ 36**

**ప్రతిపదార్థము :** సః అయమ్=అట్టి ఈ, వజ్రః=వజ్రము, అల్పకే=స్వల్పుడైన, అసురే=అసురునందు, మయా=నాచే, ముక్తః=విడువబడినదై, ప్రతిహతః=తిరస్కరింపబడినది, బ్రహ్మతేజః=దధీచియను ఋషియొక్క తేజోరూపమైనదియు, అకారణమ్=నిష్కారణముగ, దణ్డమ్=సామాన్యమైన కఱ్ఱవంటిదైనది, అహమ్=నేను, తత్=ఆ వజ్రమును, న+ఆదదే=కైకొనను.

**తాత్పర్యము :** అట్టి ఈ వజ్రము స్వల్పుడైన అసురునందుఁబ్రయుక్తమై వృథాయైనది. ఇది దధీచియను విప్రుని తేజము. నిష్కారణముగానిట్లై, కఱ్ఱవలెనైనది, నేను దీనినిపుడుఁగైకొనను.

**శ్లో॥ ఇతి శక్రం విషీదన్తమాహ వాగశరీరిణీ।**
**నాయం శుష్కైరథో నార్ద్రైర్వధమర్హతి దానవః॥ 37**

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, విషీదన్తమ్=దుఃఖించుచుండగా, శక్రమ్=ఇంద్రుని గూర్చి, అశరీరిణీ= శరీరములేని, వాక్=వాక్కు ఆకాశవాణి, ఇదమ్ ఆహ=ఈమాట చెప్పెను. దానవః=ఈ నముచి దానవుడు, శుష్కైః=ఎండిన వస్తువుల చేతగాని, అథ=మఱి, ఆర్ద్రైః=తడిసిన పచ్చి వస్తువులచేఁగాని, వధమ్=వధను, న అర్హతి=తగడు.

**తాత్పర్యము :** ఇట్లు దుఃఖించుచున్న ఇంద్రునికి అశరీరవాణి ఇట్లు పలికెను. ఓయి ఈ నముచి దానవుని ఎండు వస్తువులచేగాని, పచ్చి వస్తువులచేగాని చంపుటకు సాధ్యముకాదు.

**శ్లో॥ మయాస్మై యద్వరో దత్తో-మృత్యుర్నైవార్ద్రశుష్కయోః।**
**అతోఽన్యశ్చిన్తనీయస్తే-ఉపాయో మఘవన్ రిపోః॥ 38**

**ప్రతిపదార్థము :** మయా=నాచే, అస్మై=ఇతనికి, యత్=ఏ, ఆర్ద్రశుష్కయోః=పచ్చి యెండు వస్తువులచే, న మృత్యుః=మృత్యువు లేనట్లుగా, వరః=వరము, దత్తః=ఈయబడినది. మఘవన్=ఓ ఇంద్రుడా, అతః=ఇందువలన, రిపోః=శత్రువధకు, అన్యః ఉపాయః=ఇతరమగునుపాయము, తే=నీకు, చింతనీయః=చింతింపఁదగినది.

**తాత్పర్యము :** పూర్వము ఈయసురునికి (బ్రహ్మ) పచ్చి వస్తువుచేగాని, ఎండిన వస్తువుచేగాని మృత్యువు రానట్లు వరము ఇచ్చియున్నాను. కావున ఇంద్రుడాపగతుని వధించుటకు మఱేదైన ఉపాయము చూడుము.



సూర్యమ్=వర్షాకాలము నందలి సూర్యుని, అంబుదాః ఇవ=మేఘముల వలె, ఛాదయామాసుః=కప్పివైచిరి.

**తాత్పర్యము :** నముచిపాకబలులను ఆ ముప్పురసురులు అమ్ముల మొత్తముచే ఆ రథములో సారథితో గూడిన ఇంద్రుని వర్షాకాలసూర్యుని మేఘములవలె కప్పివైచిరి.

**శ్లో॥ అలక్షయన్తస్తమతీవ విహ్వలా విచుక్రుశుర్దేవగణాః సహానుగాః।**
**అనాయకాః శత్రుబలేన మర్దితా వణిక్పథా భిన్ననావః యథార్ణవే॥ 25**

**ప్రతిపదార్థము :** తమ్=ఆ ఇంద్రుని, అలక్షయన్తః=కాననివారై, దేవగణాః=వేల్పుల గణములు, సహ+అనుగాః=అనుచరులతో గూడినవారై, అనాయకాః=నాయకుడులేనివారై, శత్రుబలేన=అసుర బలముచే, మర్దితాః=కొట్టబడినవారై, అర్ణవే=సముద్రమునందు, భిన్ననావః=పగిలి పోయిన ఓడలుగల, వణిక్ పథాః యథా=వర్తకుల సమూహములట్లు, అతీవ=మిక్కిలి, విహ్వలాః=దీనభావమునొంది, విచుక్రుశుః=దిక్కుతోచనివారైరి.

**తాత్పర్యము :** ఇంద్రుని గాననివారై సురగణములు అనుచరులతో గూడినవారు, నాయకుడు లేనివారై, శత్రువులగు అసుర సైనికులచే కొట్టబడినవారై, సముద్రమునందు ఓడ పగిలిపోయిన వర్తకులెట్లు మిక్కిలి దిక్కుదోచనివారై దిగులుపొందిరి.

**శ్లో॥ తతస్తురాషాడిషుబద్ధపఞ్జరా-ద్వినిర్గతః సాశ్వరథధ్వజాగ్రణీః।**
**బభౌ దిశః ఖం పృథివీఞ్చ రోచయన్-స్వతేజసా సూర్య ఇవ క్షపాత్యయే॥ 26**

**ప్రతిపదార్థము :** తతః=అంతట, తురాషాట్=ఇంద్రుడు, స+అశ్వరథధ్వజ+అగ్రణీః=గుఱ్ఱములు, రథము, టెక్కెము, సారథి అనువారితో, ఇషుబద్ధపంజరాత్=బాణములచే బద్ధమైన గూటినుండి, వినిర్గతః=బయలువెడలివచ్చినవాడు, క్షపాత్యయే=రాత్రి చివర, ప్రాతఃకాలమునందు, సూర్యః ఇవ=ఉదయించిన సూర్యుడువలె, దిశః=దిక్కులను, ఖమ్=గగనమును, పృథివీఞ్చ=పుడమిని, రోచయన్=వెలిగించుచు, బభౌ=భాసిల్లెను.

**తాత్పర్యము :** అంతనింద్రుడు అశ్వములతో, రథముతో, ధ్వజముతో, సారథితో కూడ, ఆయమ్ముల గూటినుండి బయలువెడలి ప్రాతఃకాలమునందు ఉదయించు సూర్యుడువలె దిక్కులను, గగనమును, భూమిని వెలిగించుచుఁదాను ప్రకాశించెను.

**శ్లో॥ నిరీక్ష్య పృతనాం దేవః పరైరభ్యర్దితాం మృధే।**
**ఉదయచ్ఛద్రిపుం హన్తుం-వజ్రం వజ్రధరో రుషా॥ 27**

**ప్రతిపదార్థము :** దేవః=ఇంద్రుడు, మృధే=యుద్ధరంగమునందు, పరైః=శత్రువులచేత, అభ్యర్దితామ్=చావగొట్టఁబడిన, పృతనామ్=తన దేవసేనను, నిరీక్ష్య=చూచి, వజ్రధరః=ఇంద్రుడు, రుషా=క్రోధముతో, రిపుమ్=శత్రువును, హన్తుమ్=చంపుటకు, వజ్రమ్=వజ్రాయుధమును, ఉదయచ్ఛత్=ఎత్తెను.

**తాత్పర్యము :** ఇంద్రుడు యుద్ధరంగమున శత్రువులచేత చావగొట్టబడిన తన దేవసేనను గాంచి వజ్రధరుడు కోపముతో శత్రువును చంపుటకు వజ్రాయుధమును బైకెత్తెను.

**శ్లో॥ తేనైవ శితధారేణ శిరసీ బలపాకయోః।**
**జ్ఞాతీనాం పశ్యతాం రాజఞ్జహార జనయన్ భయమ్॥** 28

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా, జ్ఞాతీనామ్ పశ్యతామ్=దాయాదులగు దైత్యులు చూడకుండ, శితధారేణ=వాడియైన, తేన+ఏవ=ఆ వజ్రాయుధముతో, బలపాకయోః=బలపాకుల యొక్క, శిరసీ=శిరస్సులను, భయమ్=భయమును, జనయన్=కలిగించుచు, జహార=ఖండించెను.

**తాత్పర్యము :** ఓ రాజా! ఇంద్రుడు దాయాదులగునసురులెల్లరు చూచుచుండ వాడియైన ఆ వజ్రాయుధముచే నెల్లరకు భయము గలిగించుచు, బలుని యొక్కయు, పాకుని యొక్కయు శిరములను ఖండించెను.

**శ్లో॥ నముచిస్తద్వధం దృష్ట్వా-శోకామర్షరుషాన్వితః।**
**జిఘాంసురిన్ద్రం నృపతే-చకార పరమోద్యమమ్॥** 29

**ప్రతిపదార్థము :** నృపతే=ఓ రాజా!, నముచిః=నముచి, తత్+వధమ్=ఆ బలపాకుల చంపుటను, దృష్ట్వా=చూచి, శోక+అమర్ష రుషా=దుఃఖముతో, అసహనముతోను కూడిన క్రోధముతో, అన్వితః=కూడుకొన్నవాడై, ఇంద్రమ్=ఇంద్రుని, జిఘాంసుః=చంపఁగోరినవాడై, పరమ+ఉద్యమమ్=దొడ్డ ప్రయత్నమును, చకార=చేసెను.

**తాత్పర్యము :** ఓ రాజా! బలపాకుల వధను గాంచి, దుఃఖముతో, అసహనముతోను కూడిన క్రోధముతో కూడుకొన్నవాడై ఇంద్రుని చంపగోరి దొడ్డ ప్రయత్నముగావించెను.

**శ్లో॥ అశ్మసారమయం శూలం-ఘణ్టావద్ధేమభూషితమ్।**
**ప్రగృహ్యాభ్యద్రవత్ క్రుద్ధో-హతోఽసీతి విభర్త్సయన్।**
**ప్రాహిణోద్దేవరాజాయ-నినదన్ మృగరాడివ॥** 30

**ప్రతిపదార్థము :** అశ్మసారమయమ్=కేవలము ఉక్కుతోఁజేయబడినదియు, ఘంటావత్=ఘంటాయుక్తమును, హేమభూషితమ్=పసిండిచే నలంకరింపబడినదియునైన, శూలమ్=త్రిశూలమును, ప్రగృహ్య=చేకొని, క్రుద్ధః=క్రోధముండినవాడై, హతః+అసి+ఇతి=ఇదే చచ్చినావని, విభర్త్సయన్=ఇంద్రుని భయపఱచుచు, అభ్యద్రవత్=పైకిఁబర్వెత్తి వచ్చెను. మృగరాట్+ఇవ=సింహమువలె, నినదన్=గర్జించుచు, దేవరాజాయ=దేవరాజుకొఱకై, ప్రాహిణోత్=ఆ శూలమును బంపెను, శూలముతోఁగొట్టెను.

**తాత్పర్యము :** కేవలము ఉక్కుతో నిర్మింపబడినదై గంటలతోను, బంగారముచే నలంకరింపబడినదియైన త్రిశూలమును చేతపట్టి, ఓరీ ఇంద్రా! ఇదే చచ్చితివని బెదిరించుచుఁ బైకి పర్వెత్తి వచ్చి సింహమువలె గర్జించుచు ఆ త్రిశూలముతో దేవేంద్రుని గొట్టెను.

**శ్లో॥ తదాపతద్గగనతలే మహాబలాత్ విచిచ్ఛిదే హరిరిషుభిః సహస్రధా।**
**తథాగతం నృప! కులిశేన కన్ధరే రుషాన్వితస్త్రిదశపతిః శిరోఽహరత్॥** 31

**ప్రతిపదార్థము :** హరిః=ఇంద్రుడు, మహాబలాత్=మహాబలమున, గగనతలే=ఆకాశమున, అపతత్=తనపైఁబడుచున్న, తత్=ఆ త్రిశూలమును, ఇషుభిః=అమ్ములతో, సహస్రధా=వేయి తునకలగునట్లు, విచిచ్ఛిదే=ఖండించెను. నృప=ఓ రాజా, త్రిదశపతిః=దేవేంద్రుడు,



రుషా+అన్వితః=రోషముతో కూడి, తథా=ఆ ప్రకారము, ఆగతమ్=వచ్చిన నముచిని, కులిశేన =వజ్రముతో, కన్ధరే=కంఠమునందు (కొట్టెను), శిరః=శిరస్సును, అహరత్=హరించెను.

**తాత్పర్యము :** ఇంద్రుడా బల్లిదుడు నముచి తనపై ప్రయోగించిన త్రిశూలము ఆకసము నుండి తనపై ఁబడఁబోవుచుండగా దానిని అమ్ములచే వేయి తునకలుగా ఖండించెను. మఱి, ఓ రాజా! దేవరాజు రోషముగలవాడై అట్లు తనపై వచ్చిన నముచిని వజ్రమున కుత్తుక నరికి శిరమును హరించెను.

**శ్లో॥ న తస్య హి త్వచమపి వజ్ర ఊర్జితో బిభేద యః సురపతినౌజసేరితః।**
**తదద్భుతం పరమతివీర్యవృత్రభిత్ తిరస్కృతో నముచిశిరోధరత్వచా॥** 32

**ప్రతిపదార్థము :** సురపతినా=దేవరాజుచే, ఓజసా=బలముతో, ఈరితః=ప్రయోగించబడిన, ఊర్జితః=శక్తివంతమైన, వజ్రః=వజ్రాయుధము, తస్య=ఆ నముచి యొక్క, త్వచమ్+అపి=చర్మమైనను, న బిభేద=ఛేదించలేక పోయెను, అతివీర్యవృత్రభిత్=మిక్కిలి బలాఢ్యుడగు వృత్రుని ఛేదించినదైన వజ్రము, నముచిశిరోధరత్వచా=నముచి కంఠము చర్మముచే, తిరస్కృతః =తిరస్కరింపబడెను. తత్=ఆ, పరమ్=అధికమైన, అద్భుతమ్=ఆశ్చర్యమును (ఎల్లరు చూచిరి).

**తాత్పర్యము :** దేవరాజు బలముతో శక్తివంతమైన వజ్రాయుధమును నముచిపైఁ బ్రయోగించెను. అది వాని చర్మము సైతము చీల్చలేనిదైనది. అప్పుడిన్ద్రుడు మిగుల బలాఢ్యుడైన వృత్రుని సంహరించిన ఈ వజ్రము నముచి కంఠచర్మముచే తిరస్కృతమై వృథాయైనదని ఆ అత్యాశ్చర్యమును తిలకించిరి.

**శ్లో॥ తస్మాదిన్ద్రోఽబిభేచ్ఛత్రోర్వజ్రః ప్రతిహతో యతః।**
**కిమిదం దైవయోగేన-భూతలోకం ముమోహ యత్॥** 33

**ప్రతిపదార్థము :** యతః=ఎందువలన, శత్రోః=శత్రువైన నముచివలన, వజ్రః=వజ్రము, ప్రతిహతః=కొట్టపడి వ్యర్థమైనది, తస్మాత్=అందువలన, ఇంద్రః=ఇంద్రుడు, అబిభేత్=భయము పొందెను, కిమిదమ్=ఇది యేమి?, యత్=ఏది, దైవయోగేన=విధివశమున, భూతలోకమ్=ప్రాణి సమూహమును, ముమోహ=మోహింపజేసెను.

**తాత్పర్యము :** శత్రువగు నముచిచే వజ్రము ప్రతిహతమైనందులకు ఇంద్రుఁడిదియేమి? విధివశమున ప్రాణులెల్లరు మోహము పొందునట్లు నా వజ్రమిట్లైనదేయని భయపడెను.

**శ్లో॥ యేన పూర్వం మహాద్రీణాం-పక్షచ్ఛేదః ప్రజాక్షయే।**
**కృతో నివసతాం భారైః-పతత్రైః పతతాం భువి॥** 34

**ప్రతిపదార్థము :** నివసతామ్=నిల్చియుండుచు, భువి=భూమిపైన, పతతామ్=పడుచు, భారైః =బరువైన, పతత్రైః=ఱెక్కలచే, ప్రజాక్షయే=ప్రజానాశము సంభవించు, పూర్వమ్=పూర్వము, యేన=వజ్రముచే, మహా+అద్రీణామ్=దొడ్డ కొండల యొక్క, పక్షచ్ఛేదః=ఱెక్కల ఖండించుట, కృతః=చేయబడినదో...

**తాత్పర్యము :** ఏది నిల్చియుండుచు బరువైన ఱెక్కలతో భూమిపైఁబడుచు ప్రజానాశము గావించు ఈ దొడ్డకొండల ఱెక్కలనే వజ్రము ఖండించెనో, అది ఇప్పుడు వమ్మయినది.

**శ్లో॥ తాం దైవీం గిరిమాకర్ణ్య మఘవాన్ సుసమాహితః।**
**ధ్యాయన్ ఫేనమథాపశ్యదుపాయముభయాత్మకమ్॥** 39

**ప్రతిపదార్థము :** మఘవాన్=ఇంద్రుడు, తామ్=ఆ, దైవీం గిరమ్=దివ్యవాణిని, ఆకర్ణ్య=విని, సుసమాహితః=ఏకాగ్రచిత్తుఁడై, ధ్యాయన్=కొంతసేపట్లు ధ్యానించుచు, అథ=అంతట, ఉభయాత్మకమ్=పచ్చిది ఎండినది కాని వస్తువు గలది, ఫేనమ్=నురుగును, ఉపాయమ్=వధకు పాయమునుగా, అపశ్యత్=చూచెను.

**తాత్పర్యము :** ఇంద్రుడా దివ్యవాణి నాలకించి కొంతసేపట్లు ఏకాగ్రచిత్తుడై యాలోచించి పచ్చిది యెండుది కానిది నురుగొక్కటి వాని వధించుటకుపాయమని యెఱింగెను.

**శ్లో॥ న శుష్కేణ న చార్ద్రేణ జహార నముచేః శిరః।**
**తం తుష్టువుర్మునిగణా-మాల్యైశ్చావాకిరన్ విభుమ్॥** 40

**ప్రతిపదార్థము :** న శుష్కేణ=ఎండుది గానిదై, న ఆర్ద్రేణ=పచ్చిదిగానిదైన, నురుగుచే, నముచేః=నముచి యొక్క, శిరః=శిరస్సును, జహార=హరించెను, మునిగణాః=ముని గణములు, తమ్=ఆ ఇంద్రుని, తుష్టువుః=స్తుతించిరి, విభుమ్=ఆ దేవప్రభుని, మాల్యైః =పూదండలతో, ఆవాకిరన్=చల్లిరి.

**తాత్పర్యము :** ఎండుది పచ్చిదిగాని నురుగుతో ఆ నముచి శిరమును ఇంద్రుడు ఖండించెను. మునిగణములింద్రుని స్తుతించుచు పుష్పమాలలు పైన వైచిరి.

**శ్లో॥ గన్ధర్వముఖ్యౌ జగతుర్విశ్వావసుపరావసూ।**
**దేవదున్దుభయో నేదుర్నర్తకా నన్నృతుర్ముదా॥** 41

**ప్రతిపదార్థము :** గన్ధర్వముఖ్యౌ=గన్ధర్వ శ్రేష్ఠులు, విశ్వావసు పరావసు=విశ్వావసువు, పరావసువు అనువారలు, జగతుః=గానము చేసిరి. దేవదున్దుభయః=దేవదుందుభులు, నేదుః =మ్రోగినవి, నర్తకాః=నర్తకులు, ముదా=సంతోషమున, నన్నృతుః=నృత్యము చేసిరి.

**తాత్పర్యము :** విశ్వావసువు, పరావసువు అను గంధర్వ శ్రేష్ఠులు గానము చేసిరి. దేవదుందుభులు మ్రోగెను. దేవతా నర్తకులు నృత్యము చేసిరి.

**శ్లో॥ అన్యేஉప్యేవం ప్రతిద్వన్ద్వాన్-వాయ్వగ్నివరుణాదయః।**
**సూదయామాసురసురాన్-మృగాన్ కేసరిణో యథా॥** 42

**ప్రతిపదార్థము :** అన్యే=ఇతరులు, వాయు+అగ్ని-వరుణ+ఆదయః అపి=వాయువు, అగ్ని, వరుణుడు లోనగు దిక్పాలురును, ప్రతిద్వన్ద్వాన్ అసురాన్=శత్రువులగు అసురులను, మృగాన్= జంతువులను, కేసరిణః=సింహములు, యథా=ఎట్లు వధించునో అట్లు, సూదయామాసుః =వధించిరి.

**తాత్పర్యము :** ఇతర దిక్పాలురు వాయువు, అగ్ని, వరుణుడులోనగువారు సైతము శత్రువులగు అసురులను, మృగములను సింహము ఎట్లు వధించునో అట్లు వధించిరి.

**శ్లో॥ బ్రహ్మణా ప్రేషితో దేవో-దేవర్షిర్నారదో నృప।**
**వారయామాస విబుధాన్-దృష్ట్వా దానవసంక్షయమ్॥** 43

## ద్వాదశోஉధ్యాయః

ఈ అధ్యాయమందు మోహినీ విలాసమునాలోకింప నుద్యుక్తుడైన శంభుని హరి మోహపెట్టెను. తర్వాత నూఱడించుట అను కథ వర్ణింపబడును.

**శ్రీ బాదరాయణిరువాచ :** శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ వృషధ్వజో నిశమ్యేదం యోషిద్రూపేణ దానవాన్।**
**మోహయిత్వా సురగణాన్-హరిః సోమమపాయయత్॥** 1

**ప్రతిపదార్థము :** వృషధ్వజః=శివుడు, హరిః=విష్ణువు, యోషిత్+రూపేణ=స్త్రీ రూపముతో, దానవాన్=దానవులను, మోహయిత్వా=మోహపెట్టి, సురగణాన్=దేవతలను, సోమమ్= అమృతమును, అపాయయత్=త్రాగించెను అను, ఇదమ్=ఈ మాటను, నిశమ్య=విని, ఆ రూపమును జూడఁబోయెను.

**తాత్పర్యము :** ఎద్దు టెక్కెముగాగల శివుడు, 'విష్ణువు దానవులను మోహపెట్టి దేవతలకు అమృతమును పంచిపెట్టెను. వారిని గ్రోలఁజేసెను' అను మాటను విని ఆ మోహినీరూపమును చూడఁబోయెను.

**శ్లో॥ వృషమారుహ్య గిరిశః సర్వభూతగణైర్వృతః।**
**సహ దేవ్యా యయౌ ద్రష్టుం-యత్రాస్తే మధుసూదనః॥** 2

**ప్రతిపదార్థము :** గిరిశః=శంభుడు, వృషమ్+ఆరుహ్య=ఆఁబోతునెక్కి, సర్వభూతగణైః=ఎల్ల ప్రమథగణములతో, వృతః=కూడి, దేవ్యా సహ=గౌరీదేవితో గూడా, యత్ర=ఎచ్చోట, మధుసూదనః=విష్ణువు, ఆస్తే=ఉన్నాడో అచ్చోటికి, ద్రష్టుమ్=చూచుటకు, యయౌ=పోయెను.

**తాత్పర్యము :** శివుడావోతునెక్కి ప్రమథగణములతో గూడి గౌరీదేవితో కూడ మధుసూదనుడున్న చోటికి ఆ మోహినీరూపమును జూడఁబోయెను.

**శ్లో॥ సభాజితో భగవతా-సాదరం సోమయా భవః।**
**సూపవిష్ట ఉవాచేదం-ప్రతిపూజ్య స్మయన్ హరిమ్॥** 3

**ప్రతిపదార్థము :** భగవతా=భగవానునిచేత, స+ఉమయా=పార్వతితో, భవః=శివుడు, సాదరమ్ =ఆదరముతో, సభాజితః=ఆనందపఱపబడినవాడై, హరిమ్=హరిని, ప్రతిపూజ్య=బదులు పూజించి, సూపవిష్టః=కూర్చున్నవాడై, ఇదమ్=ఈ మాటను, స్మయన్=నవ్వుచు, ఉవాచ= చెప్పెను.

**తాత్పర్యము :** శ్రీవిష్ణువుచే శంభుడు పార్వతితో గూడ ఆదరముతో పూజింపబడినవాడై, మరల విష్ణువును దాను ప్రతిపూజించి, కూర్చుండి యీ మాట నవ్వుచు చెప్పెను.

**శ్రీ మహాదేవ ఉవాచ :** శ్రీ మహాదేవుడు వచించెను.

**శ్లో॥ దేవదేవ! జగద్వ్యాపిఞ్జగదీశ! జగన్మయ।**
**సర్వేషామపి భావానాం-త్వమాత్మా హేతురీశ్వరః॥** 4

**ప్రతిపదార్థము :** దేవదేవ!=దేవతలకు దేవుడనువాడా!, జగద్వ్యాపిన్=లోకమంతయు వ్యాపించినవాడా!, జగన్మయ!=లోక స్వరూపుడా!, జగదీశ=లోక ప్రభూ!, సర్వేషామ్=ఎల్ల

**ప్రతిపదార్థము :** బ్రహ్మణా=బ్రహ్మచే, ప్రేషితః=పంపఁబడినవాడై, దేవః=దేవుడు, దేవర్షిః =దేవ ఋషియైన, నారదః=నారదుఁడు, దానవ సంక్షయమ్=దానవులు నశించుటను, దృష్ట్వా= చూచి, విబుధాన్=దేవతలను, వారయామాస=యుద్ధము నుండి నివారించెను.

**తాత్పర్యము :** బ్రహ్మ పంపగా వచ్చిన దేవర్షి నారదుడు పెక్కుఱు దానవులు నాశమగుటను గాంచి ఇక యుద్ధము చేయవలదని దేవతలను నివారించెను.

**శ్రీ నారద ఉవాచ :** నారదుడు వచించెను.

**శ్లో॥ భవద్భిరమృతం ప్రాప్తం-నారాయణభుజాశ్రయైః।**
**శ్రియా సమేధితాః సర్వ-ఉపారమత విగ్రహాత్॥ 44**

**ప్రతిపదార్థము :** నారాయణ భుజాశ్రయైః=నారాయణుని ఆశ్రయించినవారగు, భవద్భిః =మీచే, అమృతమ్=అమృతము, ప్రాప్తమ్=పొందబడినది, సర్వే=మీరెల్లరు, శ్రియా=స్వర్గ లక్ష్మిచే, సమేధితాః=పెంపొందింపబడిరి, విగ్రహాత్=రణమునుంచి, ఉపారమత= విరమింపుడు.

**తాత్పర్యము :** శ్రీమన్నారాయణుని భుజబలమునాశ్రయించిన మీరు సుధను గ్రోలిరి. త్రిలోక రాజ్యలక్ష్మిచే పెంపొందిరి. కావున మీరు యుద్ధమును చాలింపుడు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ సంయమ్య మన్యుసంరమ్భం-మానయన్తో మునేర్వచః।**
**ఉపగీయమానానుచరైర్యయుః సర్వే త్రివిష్టపమ్॥ 45**

**ప్రతిపదార్థము :** మునేః=నారద ముని యొక్క, వచః=మాటను, మానయన్తః=మన్నించువారై, మన్యుసంరమ్భమ్=కోపము యొక్క పటాటోపమును, సంయమ్య=అడంచుకొని, ఉపగీయమానానుచరైః=తమ్ము కీర్తించుచున్న అనుచరులతోను, సర్వే=ఎల్లరు, త్రివిష్టపమ్= స్వర్గమును గూర్చి, యయుః=వెళ్ళిరి.

**తాత్పర్యము :** నారదుని మాటను మన్నించి, కోపోద్రేకమునడంచి తమ్ము కీర్తించుచు ననుచరులు వెంటరాగా ఎల్ల దేవతలు స్వర్గమునకుఁబోయిరి.

**శ్లో॥ యేఽవశిష్టా రణే తస్మిన్-నారదానుమతేన తే।**
**బలిం విపన్నమాదాయ-అస్తగ్గిరిముపాగమన్॥ 46**

**ప్రతిపదార్థము :** తస్మిన్ రణే=ఆ సంగ్రామమందు, యే=ఏ అసురులు, అవశిష్టాః=వధింప బడక మిగిలియున్నారో, తే=వారు, నారద+అనుమతేన=నారదుని సమ్మతితో, విపన్నమ్= ఆపదకులోనైన, బలిమ్=బలిని, ఆదాయ=తీసుకొని, అస్తంగిరిమ్=అస్తమను పర్వతమును గూర్చి, ఉపాగమన్=పోయిరి.

**తాత్పర్యము :** ఆ రణమున చావక శేషించిన అసురులు నారదుని మాట మీద దుఃఖము నకు లోనైన మూర్ఛిల్లిన బలినిఁదీసికొని అస్తమనుపర్వతమునకుఁబోయిరి.



**శ్లో॥ తదా వినష్టావయవాన్-విద్యమానశిరోధరాన్।**
**ఉశనా జీవయామాస-సఞ్జీవన్యా స్వవిద్యయా॥ 47**

**ప్రతిపదార్థము :** తదా=అప్పుడు, వినష్ట+అవయవాన్=విఱిగిపోయిన అంగములు గలవారు, విద్యమానశిరోధరాన్=కంఠమున్నవారిని, ఉశనాః=శుక్రుడు, సంజీవన్యా=సంజీవనియను, స్వవిద్యయా=తన విద్యచే, జీవయామాస=బ్రతికించెను.

**తాత్పర్యము :** అప్పుడు చేతులు, కాళ్ళు విఱిగి, కంఠములు శిరస్సులున్నవారిని తన మృత సంజీవని విద్యచే బ్రతికించెను.

**శ్లో॥ బలిశ్చోశనసా స్పృష్టః ప్రత్యాపన్నేన్ద్రియస్మృతిః।**
**పరాజితోఽపి నాఖిద్య-ల్లోకతత్త్వవిచక్షణః॥ 48**

**ప్రతిపదార్థము :** బలిశ్చ=బలియు, ఉశనసా=శుక్రునిచే, స్పృష్టః=స్పృశింపబడినవాడై, ప్రత్యాపన్న+ఇంద్రియస్మృతిః=మరల శక్తిమంతములై యేర్పడిన ఇంద్రియ స్మరణ జ్ఞానము గలవాడయి, పరాజితః+అపి=దేవతలచే నోటమిగాంచిన వాడయ్యు, లోకతత్త్వవిచక్షణః =లోకజ్ఞానమును చక్కగా తెలిసినవాడు కావున, న+అఖిద్యత్=ఖేదమును పొందలేదు.

**తాత్పర్యము :** బలి శుక్రుడు స్పృశించునంతనే మున్నటియట్లు ఇంద్రియములన్నియు శక్తిమంతములై స్మరణ జ్ఞానము ఏర్పడినవాడయ్యెను. తాను దేవతలచే నోటమిపడినను లోకజ్ఞానము గుర్తెరిగినవాడు, జయాపజయములు విధివశములని తెలిసి దుఃఖమును పొందలేదు.

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కంధే ఏకాదశో - ధ్యాయః.

ఇది శ్రీమద్భాగవతమందు అష్టమస్కంధమున ఏకాదశాధ్యాయము.

శ్లో॥ నాహం పరాయుర్ఋషయో న మరీచిముఖ్యా జానన్తి యద్విరచితం ఖలు సత్త్వసర్గాః।
యన్మాయయా ముషితచేతస ఈశ! దైత్యమర్త్యాదయః కిముత శశ్వదభద్రవృత్తాః॥10

ప్రతిపదార్థము : అహమ్=నేను, పరాయుః=పరమాయువుగల బ్రహ్మము, మరీచిముఖ్యాః =మరీచి మొదలగు, ఋషయః=ఋషులు, సత్త్వసర్గాః=సత్త్వగుణముచే సృజింపబడిన వారును, యత్+విరచితమ్=ఏ నీచే సృజింపబడిన విశ్వమును, న జానన్తి ఖలు=నెఱుంగలేరు. మఱి నిన్నెఱుగుట ఎక్కడిది. ఈశ!=ఓ ఈశ్వరా!, అభద్రవృత్తాః=రాజసమునకు, తామసమునకు, ఉత్పత్తియు వృత్తియుగల, దైత్యమర్త్య+ఆదయః=దైత్యులు, మానవులులోనగువారు, కిముత=ఇక నిన్నెట్లు ఎఱుంగుదురు.

తాత్పర్యము : నీచే సృజింపబడిన యీ విశ్వము యొక్క తత్త్వము నేనుగాని, పరమాయువుగల బ్రహ్మగాని యెఱుంగలేకున్నాము. మరీచిలోనగు ఋషులు, సత్త్వగుణమున సృజింపబడిన వారయ్యు ఈ విశ్వతత్త్వమెఱుంగలేకున్నారు. విశ్వమునే యెఱుంగలేనివారు నిన్నెఱుంగుట ఎక్కడిది ? ఇక రజోగుణమునను తమోగుణమునను జనించి రాజస తామస వృత్తులను జేపట్టిన దైత్యులు, మానవులు నిన్ను గూర్చి యెఱుంగుట యనునదెట్లు ?

శ్లో॥ స త్వం సమీహితమవస్థితిజన్మనాశం భూతేహితఞ్చ జగతో భవబన్ధమోక్షౌ।
వాయుర్యథా విశతి ఖఞ్చ చరాచరాఖ్యం సర్వం తదాత్మకతయావగమోఽవరుంక్షే॥11

మఱేమనగా నీవు సర్వము నెఱుంగుదువనుచున్నారు.

ప్రతిపదార్థము : సః త్వమ్=అట్టి నీవు, సమీహితమ్=నీచే సృజింపబడినదైన, జగతః=ఈ జగము యొక్క, అవస్థితిజన్మనాశమ్=స్థితి ఉత్పత్తి లయములను, భూత+ఈహితమ్=ప్రాణుల వాంఛయును, భవబన్ధమోక్షౌ=సంసారబంధమును, మోక్షమును, సర్వమ్=ఈ అంతయు, అవరుంక్షే=వ్యాపించియున్నావు, ఎఱుంగుదువు, చర+అచర+ఆఖ్యమ్=జంగము స్థావరములను పేరుగల ప్రాణుల దేహములను, ఖమ్ చ=ఆకాశమును, వాయుః=వాయువు, యథా=ఏ ప్రకారము, విశతి=ప్రవేశించియున్నదో, ఆ ప్రకారము, తదాత్మకతయా=సర్వ ప్రాణులకు ఆత్మ స్వరూపుడవగుటచే, అవగమః=జ్ఞానస్వరూపుడవై వ్యాపించియున్నావు.

తాత్పర్యము : ఇట్టి నీవు, నీవు సృజించిన ఈ జగము యొక్క సృష్టి స్థితిలయమును, దేహ వాంఛలను, సంసారబంధ మోక్షములను, ఈ సర్వమును నీవెఱుంగుచున్నావు. మఱియు వాయువేప్రకారము ఈ జంగమస్థావరాత్మకములగు ప్రాణుల దేహములందును, ఆకాశము నందును ఎట్లు ప్రవేశించియున్నదో అట్టి నీవు సమస్త ప్రాణులకు ఆత్మవగుటచే జ్ఞాన స్వరూపుడవై అంతట వ్యాపించియున్నావు.

శ్లో॥ అవతారా మయా దృష్టా-రమమాణస్య తే గుణైః।
సోఽహం తద్ద్రష్టుమిచ్ఛామి-యత్తే యోషిద్వపుర్ధృతమ్॥ 12

ఇట్లు స్తుతించి రెండు శ్లోకములచే ప్రస్తుతాంశమును విన్నవించుచున్నారు.

ప్రతిపదార్థము : గుణైః=సత్త్వాది గుణములతో, రమమాణస్య=క్రీడించు, తే=నీయొక్క, అవతారాః=అవతారములు, మయా=నాచే, దృష్టాః=చూడబడినవి, సః అహమ్=ఆ చూచిన



స్థావర జంగములగు సమస్తమైన, భావానామ్=ప్రాణులకు, త్వమ్=నీవు, హేతుః=జన్మ కారణము, ఈశ్వరః=నియామకుడవు, ఆత్మా=ఆత్మవు,

తాత్పర్యము : ఓ దేవా! నీవు దేవతల దేవుడవు. ఎట్లన జగమంతయు వ్యాపించినవాడవు. జగద్రూపుడవు. స్థావర జంగమ ప్రాణులకెల్ల జన్మ కారణుడవు, నియామకుడవు, ఆత్మవు. కాని నీవు జడప్రధానుడవు కావు.

శ్లో॥ ఆద్యన్తావస్య యన్మధ్యమిదమన్యదహం బహిః।
యస్యావ్యయస్య నైతాని-తత్సత్యం బ్రహ్మ చిద్భవాన్॥ 5

ఓయి నన్ను జగన్మయుడని చెప్పుట చేత జగత్తు ఉత్పత్తిలోనగువానిచే అవ్యయమగుట చేత, జడస్వభావముగలదగుట చేత ఆ ధర్మమును నాకును గలుగుచున్నవి కదా! ఏమి నీవు నన్నట్లు వర్ణించుచున్నావనగా, 'అట్లు కాదు' అనుచున్నాడు.

ప్రతిపదార్థము : అస్య=ఈ జగమునకు, ఆది+అంతౌ=సృష్టిలయములును, మధ్యమ్=స్థితియు, యత్=ఏ బ్రహ్మము వలన కలుగుచున్నవో, అవ్యయస్య=నాశరహితుడైన, యస్య=ఏ బ్రహ్మమునకు, ఏతాని=ఈ ఆదిమధ్యాంతములు, న=లేవో, ఇదమ్=కార్యసదృశము దృశ్యమగు జగత్తు, అహమ్=కారణాస్పదమును ద్రష్టయై, బహిః=భోగవస్తుజాతము, అన్యత్=భోక్తయు అయియున్నాడు. తత్=అది, సత్యమ్=నిత్యము, చిత్=జ్ఞాన స్వరూపమును, బ్రహ్మ=బ్రహ్మవు, భవాన్=నీవు.

తాత్పర్యము : ఓ దేవా! ఏ బ్రహ్మము వలన ఈ జగమునకు సృష్టి స్థితిలయములు లేవో, ఏ బ్రహ్మమునకు ఈ ఆదిమధ్యాంతములు లేవో, ఏ బ్రహ్మము - కార్యములకు ఆస్పదమై దృశ్యరూపము జగత్తై, కారణాస్పదమైన ద్రష్టయై భోగ్యవస్తుజాతయై, భోక్తయై తోచుచున్నదో ఆ బ్రహ్మము సత్యము, జ్ఞానస్వరూపమును ఆ బ్రహ్మమే నీవు అయి యున్నావు.

శ్లో॥ తవైవ చరణామ్భోజం శ్రేయస్కామా నిరాశిషః।
విసృజ్యోభయతః సఙ్గం మునయః సముపాసతే॥ 6

నీవు ఇట్టి వాడనుటకు ముముక్షువుల ఆచారమే ప్రమాణమై యున్నదనుచున్నాడు.

ప్రతిపదార్థము : శ్రేయస్కామాః=ముక్తినిగోరువారగు, మునయః=మునులు, నిరాశిషః=ఆశలు లేనివారై, ఉభయతః=ఇహ పరలోకముల సుఖము వలన, సంగమ్=ఆసక్తిని, విసృజ్య=త్యజించి, తవ=నీ యొక్క, చరణాంభోజమ్ ఏవ=పాదములనే, సముపాసతే=ఉపాసించుచున్నారు.

తాత్పర్యము : మోక్షకాములగు మునులు ఆశను వర్జించి ఇహపరముల సుఖాసక్తిని త్యజించి నీ పాదకమలములనే ధ్యానించుచున్నారు.

శ్లో॥ త్వం బ్రహ్మ పూర్ణమమృతం విగుణం విశోకమానన్దమాత్రమవికారమనన్యదన్యత్।
విశ్వస్య హేతురుదయస్థితిసంయమానామాత్మేశ్వరశ్చ తదపేక్షతయానపేక్షః॥ 7

ఓయి! నేను బ్రహ్మమేయైన యెడల, అట్టి అసంగుడనై, ఉదాసీనుడనైన నా పాదకమలము లభించుటవలన వారికేమి ప్రయోజనము అనగా దానిని గూర్చి చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు బ్రహ్మయైనను అత్యంతము ఉదాసీనుడవు కావు మఱియును, విశ్వస్య=ప్రపంచము యొక్క, ఉదయస్థితిసంయమానామ్=సృష్టిస్థితిలయములకు, హేతుః =కారణమై యున్నావు. ఆత్మ+ఈశ్వరఃచ=అవిద్యోపాధులగు ఆత్మలైన జీవులకు ఈశ్వరుడవు, వారి కర్మఫలదాతవు, అట్లయి నేను రాజులులోనగువారివలె ఏదయిన అపేక్షతో సేవకులకు నేను ఫలము ఇచ్చుచున్నానా ఏమి, అనగా అట్లు కాదు, అనపేక్షః=ఏ అపేక్షలు లేనివాడవు, అట్లయిన నేనీశ్వరుడగుట వారికేమి ప్రయోజనమందువా, చెప్పెదను. తత్+అపేక్షతయా=ఆ జీవులచే వారివారికిఁదగ్గ ఫలములనొసంగుట కొఱకు మాత్రము నీవు వారిచే నపేక్షింప బడుచున్నవాడగుటచే, నీవు ఈశ్వరుడవగుచున్నావు. అట్టి అనపేక్షత్వము తెలుపుటకు ఆ యీశ్వరునికి సంబంధించి బ్రహ్మభావమును విశేషించి వర్ణించుచున్నారు.

త్వమ్=నీవు, బ్రహ్మ=అందఱికంటె గొప్పవాడవు గనుక బ్రహ్మయై యున్నావు, పూర్ణమ్=సర్వవ్యాపి, పరిపూర్ణము, అమృతమ్=మరణ ధర్మరహితము కాబట్టి సుఖస్వరూపము, మఱి విషయ సుఖవైలక్షణ్యార్థమును చెప్పుచున్నాడు. అవికారమ్=వికారములేని నిత్యము, ఆనంద మాత్రమ్=కేవలానందరూపము. ఏలయన విశోకమ్=ఏ విధమైన దుఃఖములేని, అది ఎందువలనా ? విగుణమ్=సత్త్వాది గుణరహితములు, అనన్యత్=దీనికంటె అన్యము లేదు, నీ కంటె వ్యతిరిక్తమైనది లేదు, కాబట్టి నీవు నిరపేక్షుడవని యర్థము. అట్లయి, సర్వాత్మకుడగుటచే ఆయా జీవుల సుఖదుఃఖములు సంబంధముల కలుగుచు దుర్వార మగుచున్నావు. దానికి జెప్పుచున్నాడు. అన్యత్=అన్నింటికంటె వ్యతిరిక్తమై కారణమైయున్నావు. ఇటువంటి సుఖాత్మకమగు బ్రహ్మస్వరూపమయినందున నీకు అన్యాపేక్ష లేదు. అందువలన కేవలము భక్తులననుగ్రహించుటకు మాత్రమే నీ ఐశ్వర్యముకాని, స్వార్థము కాదని అర్థము. దేవానాం బ్రహ్మమైన కేవలముదాసీనుడుగనుండువాడవు కావు, మఱేమనగా ఈ ప్రపంచమునకు సృష్టిస్థితి లయకారణుడై యున్నావు. మఱి అవిద్యోపాధికులగు జీవులకు వారివారి కర్మానుసారముగ ఫలమునిచ్చునీశ్వరుడవు నీవు. కాబట్టి జీవులు వారికి ఫలము నొసగు నిన్నపేక్షించుచున్నారు. కాని నీవు ఏ అపేక్షలేనివాడవు.

**తాత్పర్యము :** నీవు సర్వవ్యాపివగుట మఱి పూర్ణము, మరణధర్మ రహితము, అమృతము, సుఖస్వరూపము, వికారరహితము గనుక నిత్యము. కేవలానందస్వరూపము, శోకము లేనిది, గుణరహితము. ఆ బ్రహ్మముకంటె నితరమగునదేదియు లేదు కావున నీవు నిరపేక్షుడవై యున్నావు. ఇట్టి సుఖాత్మకమై బ్రహ్మస్వరూపుడగు నీకు ఏ యితర అపేక్ష లేదు. కేవలం భక్తుల ననుగ్రహించుట కొఱకై నీ యైశ్వర్యమున్నది. నీ స్వార్థమునకు కాదు.

**శ్లో॥ ఏకస్త్వమేవ సదసద్ద్వయమద్వయం చ స్వర్ణం కృతాకృతమివేహ న వస్తుభేదః।**
**అజ్ఞానతస్త్వయి జనైర్విహితో వికల్పో యస్మాద్గుణవ్యతికరో నిరుపాధికస్య॥ 8**

**ప్రతిపదార్థము :** అన్యత్వము (అన్నింటికి వేఱుగనుండుట), అనన్యత్వము (అన్నింటికి వేఱుగా నుండి, యెట్లని ఆశంకించి దృష్టాంతముతో నుపపాదించుచున్నారు.

సత్+అసత్+ద్వయమ్=కార్యమగు సత్తును కారణమగు అసత్తునకు, ఈ రెండును, అద్వయఇచ=రెండవదిలేనిదైన పరమకారణము, త్వమ్+ఏక ఏవ=నీవొక్కడవే యగుచున్నావు.



కృత+అకృతమ్=కుండలాది రూపమున ద్వయముగాని, రెండుగాను, కుండలాదికము చేయని బంగారు రూపమున, కేవలమద్వయమైన, రెండవది లేనిదై, స్వర్ణం ఇవ=బంగారు ఎట్లు ఒకటి రెండుగానుండునో అట్లే, నీయందు, న వస్తుభేదః=వాస్తవముగ భేదరూపములేదు, అదెట్లు అనగా, త్వయి=నీ యందు, జనైః=జనులచే, అజ్ఞానతః=అజ్ఞానమున, వికల్పః =భేదము, విహితః=కావింపబడినది, యస్మాత్=ఏ కారణమున, నిరుపాధికస్య=ఉపాధి రహితుడైన నీకు, గుణైః=సత్త్వాదిగుణములచే, వ్యతికరః=భేదము గలుగుచున్నదో.

**తాత్పర్యము :** కుండలాది రూపమగు కార్యావస్థను పొందినదియు, కారణరూపమున నుండు స్వర్ణమును రెండును నొక్కటియగునట్లు, కార్యరూపమగు జగమును, కారణరూపమైన మాయయు, ఈ రెండు పరమకారణమైన రెండవది లేనివాడవైన నీవయగుచున్నావు. జనులు నీయందు అజ్ఞానము వలన భేదము గల్పించుచున్నారు. నిరుపాధికుడవగు నీకు గుణములను బట్టి గలుగుచున్నవి. స్వయముగ భేదము లేదు.

**శ్లో॥ త్వాం బ్రహ్మ కేచిదవయన్త్యుత ధర్మమేక ఏకే పరం సదసతోః పురుషం పరేశమ్।**
**అన్యేఽవయన్తి నవశక్తియుతం పరం త్వాం కేచిన్మహాపురుషమవ్యయమాత్మతన్త్రమ్॥ 9**

ఇందు నిన్ను బహురూపునిగ వర్ణించుచున్నారు. వాస్తవముగ నిన్ను ఎవ్వరును ఎఱుంగలేకున్నారు అనుచున్నారు.

**ప్రతిపదార్థము :** త్వామ్=నిన్ను, బ్రహ్మ=బ్రహ్మమునుగా, కేచిత్=కొందఱు వేదాంతులు, అవయన్తి=తలంచుచున్నారు మఱియు, త్వామ్=నిన్ను, ధర్మమ్=ధర్మస్వరూపునిగ, అన్యే= ఇతరులు మీమాంసకులు, (మన్యంతే=తలంచుచున్నారు), సత్+అసతోః=ప్రకృతిపురుషులకు, పరమ్=పరునిగా, పురుషోత్తమునిగా, మన్యన్తే=సాంఖ్యులు తలంచుచున్నారు. త్వామ్=నిన్ను, నవశక్తియుతమ్=తొమ్మిది శక్తులతో గూడిన, పరమ్=పరమేశ్వరుని, అన్యే=ఇతరులు, పాంచరాత్రులు, (పాంచరాత్రమను వైష్ణవాగమమును పాటించు వైష్ణవులు) మన్యన్తే=తలంచు చున్నారు.

నవశక్తులెవ్వియనగా - ***విమలోత్కర్షిణీ జ్ఞానక్రియాయోగాః తథైవ చ।***
***ప్రజ్ఞా సత్యా తథేశానా - నుగ్రహా నవశక్తయః॥***

విమల, ఉత్కర్షిణి, జ్ఞాన, క్రియ, యోగ, ప్రజ్ఞ, సత్య, ఈశాన, అనుగ్రహ అనునవి భగవంతునికి గల తొమ్మిది శక్తులు.

అవ్యయమ్=నాశరహితమై నిర్వికారమై, ఆత్మతన్త్రమ్=పరమాత్మతత్త్వమైన, మహాపురుషమ్=పురుషశ్రేష్ఠుడగు ఈశ్వరునిగా, ఏకే=కొందఱు, పాతంజలులు, మన్యన్తే= తలంచుచున్నారు.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా! వేదాంతులు నిన్ను బ్రహ్మయనియు, మీమాంసకులు ధర్మమనియు, సాంఖ్యులు ప్రకృతిపురుషులకుఁబరుడనియు, పాతంజలులు అవ్యయమై ఆత్మతత్త్వమై మహాపురుషుడైన ఈశ్వరుడనియు, పాంచరాత్రులు విమలాదులగు తొమ్మిది శక్తులతో గూడిన పరమేశ్వరుడనియు తలంచుచున్నారు.

=హరింపబడినవాఁడైన, స్త్రీ...త్మా, స్త్రీ ప్రేక్షణ=ఆ మోహిని యొక్క చూపును, ప్రతిసమీక్షణ=బదులు మరలచూచుట చేత, విహ్వల+ఆత్మా=నివ్వెరఁబోయిన బుద్ధిగలవాడై, అన్తికే=సమీపముననున్న, ఉమామ్=పార్వతిని, స్వగణాఞ్చ=తన ప్రమథగణములను, న ఆత్మానం వేద=తన్ను ఎఱుంగలేదు.

**తాత్పర్యము :** శివుడా మోహినిని జూచి ఆమె విలాసముతో బంతినెగురవైచుచు, సిగ్గుతో కూడిన చిరునవ్వుతోఁ దెలియనగు కడగంటి చూపు తన మనస్సునువారింప, ఆ చెలువ చూపునకుఁదానుఁ బదులు చూచినంతనే తన మనస్సు నివ్వెరపోగా, ప్రక్కనున్న పార్వతిని, ఎదురుగనున్న ప్రమథగణములను ఎఱుంగలేదు.

**శ్లో॥ తస్యాః కరాగ్రాత్ స తు కన్దుకో యథా గతో విదూరం తమనువ్రజన్త్యాః।**
**వాసః ససూత్రం లఘుమారుతోఽహరద్ భవస్య దేవస్య కిలానుపశ్యతః॥ 23**

**ప్రతిపదార్థము :** తస్యాః=ఆమె యొక్క, కర+అగ్రాత్=చేతికొననుండి, సః కన్దుకః తు=ఆ బంతి, యథా=ఏ ప్రకారము, విదూరమ్=మిక్కిలి దూరము, గతః=పోయినంతనే, తమ్=ఆ బంతిని, అనువ్రజన్త్యాః=అనుసరించి వెళ్ళుచున్న ఆమె యొక్క, స సూత్రమ్=మొల నూలుతో గూడిన, వాసః=కట్టు చీరను, దేవస్య=దేవుడైన, భవస్య=శివుడు, పశ్యతః=చూచుచుండ, లఘుమారుతః=చిఱుగాలి, అహరత్=హరించెను.

**తాత్పర్యము :** తన చేతినుండి బంతి చాలదూరమెగిరిపోఁగా ఆమె దాని వెంట పరుగిడిపోవుచుండెను. శివుడామె వంక చూచుచుండెను. అప్పుడొక చిఱుగాలి మొలనూలుతో గూడిన కట్టుకోకను క్రిందికి జారవేసెను.

**శ్లో॥ ఏవం తాం రుచిపారాఙ్గీం దర్శనీయాం మనోరమామ్।**
**దృష్ట్వా తస్యాం మనశ్చక్రే విసజ్జన్త్యాం భవః కిల॥ 24**

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఇట్లైన (చీర వీడిపోయిన), రుచిర+అపాంగీమ్=సుందరమైన కనుగొనలు గలదై, దర్శనీయామ్=చూడదగినదై, మనోరమామ్=మనస్సు రమింపజేయునదైన, తామ్=ఆమెను, దృష్ట్వా=చూచి, విసజ్జన్త్యామ్=సిగ్గుచే సంకుచితములైన కడకంటి చూపులచేఁ దన్ను చూచు, తస్యామ్=ఆమెయందు, మనః చక్రే కిల=మనస్సు నిల్పెను గదా!

**తాత్పర్యము :** ఇట్లు చీర విడిపోగా చూడదగినదై మనస్సు రమింపు నా మోహినిని చూచి ఈశ్వరుడు సిగ్గుచే కుటిలములైన కంటి చూపులను దనపై బ్రసరింపఁజేయు నామె యందు మనస్సు నిల్పెను.

**శ్లో॥ తయాపహృతవిజ్ఞానస్తత్కృతస్మరవిహ్వలః।**
**భవాన్యా అపి పశ్యన్త్యా గతహ్రీస్తత్పదం యయౌ॥ 25**

**ప్రతిపదార్థము :** తయా=ఆ మోహినిచే, అపహృత విజ్ఞానః=వివేకమును గోలుపోయినవాడై, తత్కృతస్మరవిహ్వలః=ఆమెచే ప్రకటమైన మన్మథునిచే నిశ్చేష్టుడై, భవాన్యాః=పార్వతి, పశ్యన్త్యాః=చూచుచున్నదైనను, గతహ్రీః=పోయిన సిగ్గుగలవాడై, తత్పదమ్=ఆమె సమీపమును గూర్చి, యయౌ=పోయెను.



నేను, తే=నీయొక్క, తత్ ధృతమ్ యోషిత్ వపుః=ఆ ధరించిన నారీరూపమును, ద్రష్టుమ్=చూచుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

**తాత్పర్యము :** ఓ దేవా! నీవు గుణములు గ్రహించి క్రీడారూపమున అవతరించిన నీ అవతారములు పెక్కులు నేను చూచియున్నాను. ఇప్పుడు నీవు ధరించిన స్త్రీమూర్తి, మోహినీ రూపమును జూడగోరుచున్నాను.

**శ్లో॥ యేన సమ్మోహితా దైత్యాః-పాయితాశ్చామృతం సురాః।**
**తద్దిదృక్షవ ఆయాతాః-పరం కౌతూహలం హి నః॥ 13**

**ప్రతిపదార్థము :** యేన=ఏ మోహినీరూపముచే, దైత్యాః=దానవులు, సమ్మోహితాః=మోహింపబడిరో, సురాః=వేల్పులు, అమృతమ్=అమృతమును, పాయితాశ్చ=త్రావింపబడిరో, తద్=ఆ, మోహినీరూపమును, దిదృక్షవః=చూడగోరినవారమై, ఆయాతాః=ఇచటికి వచ్చితిమి, నః=మాకు, పరమ్=అధికమైన, కౌతూహలమ్=ఉత్సాహము గలదు.

**తాత్పర్యము :** నీవు ఏ మోహినీరూపమొంది దైత్యులను వంచించి, సురలకు అమృతమును బంచి గ్రోలఁజేసితివో, ఆ మోహినివైన నిన్నుఁజూడఁగోరి వచ్చినాము. అందులకై మేము మిగుల నువ్విళ్ళూరుచున్నాము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవమభ్యర్థితో విష్ణుర్భగవాన్ శూలపాణినా।**
**ప్రహస్య భావగమ్భీరం గిరిశం ప్రత్యభాషత॥ 14**

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, శూలపాణినా=శూలము హస్తమునందు గలవాడైన శివునిచే, భగవాన్ విష్ణుః=భగవంతుడైన విష్ణువు, అభ్యర్థితః=ప్రార్థింపబడినవాడై, ప్రహస్య=నవ్వి, భావగమ్భీరమ్=అభిప్రాయగర్భితముగా, ప్రత్యభాషత=బదులు మాట చెప్పెను.

**తాత్పర్యము :** ఇట్లు శంకరుడుఁదన్ను ప్రార్థింప భగవానుడు విష్ణువు అభిప్రాయగర్భితముగా శివునితో ఇట్లు పలికెను.

**శ్రీ భగవానువాచ :** భగవానుడు పలికెను.

**శ్లో॥ కౌతూహలాయ దైత్యానాం-యోషిద్వేషో మయా ధృతః।**
**పశ్యతా సురకార్యాణి-గతే పీయూషభాజనే॥ 15**

**ప్రతిపదార్థము :** పీయూషభాజనే=అమృతపాత్రము, గతే=దైత్యులచే చిక్కినదికాగా, సురకార్యాణి=దేవతల పనులు, పశ్యతా=స్త్రీ వేషమున గావచ్చునని గ్రహించు, మయా=నాచే, దైత్యానామ్ =దైత్యుల యొక్క, కౌతూహలాయ=వేడుక కొఱకు, యోషిత్+వేషః=స్త్రీ వేషము, ధృతః=ధరించబడినది.

**తాత్పర్యము :** అమృతపాత్రము దైత్యులు గ్రహించినందున వేల్పుల కార్యములు స్త్రీ వేషమున గావచ్చునని తలచి దైత్యులకు వినోదముగానుండుటకై నే స్త్రీవేషమును ధరించితిని.

తప్పక ఇప్పుడున్మత్తులైన దైత్యులను వంచించి దేవతలకు అమృతము ఈయదగునని ఇట్టి వైషమ్యమైన మతియొక రూపమునఁజేయగాదనియు నట్లు చేసితిని.

**శ్లో॥ తత్తేఽహం దర్శయిష్యామి దిదృక్షోః సురసత్తమ।**
**కామినాం బహు మన్తవ్యం సఙ్కల్పప్రభవోదయమ్॥ 16**

**ప్రతిపదార్థము :** సురసత్తమ=ఓ దేవతాశ్రేష్ఠుడా!, కామినామ్=కాముకులకు, బహుమన్తవ్యమ్=మిక్కిలి మననము చేయదగినదియు, సంకల్ప ప్రభవ+ఉదయమ్=సంకల్పము చేతనే జనించు కాముని యొక్క పుట్టుకగలదైన, తత్=ఆ స్త్రీ రూపమును, దిదృక్షోః=చూడఁగోరిన, తే=నీకు, అహమ్=నేను, దర్శయిష్యామి=చూపగలను.

**తాత్పర్యము :** ఓ దేవతాశ్రేష్ఠుడా! కాముకులు మిక్కిలి తలంచునదియు, కాముని జన్మకారణమైన ఆ స్త్రీరూపమును చూడగోరిన నీకు చూపెదను.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ ఇతి బ్రువాణో భగవాం-స్తత్రైవాన్తరధీయత।**
**సర్వతశ్చారయంశ్చక్షు-ర్భవ ఆస్తే సహోమయా॥ 17**

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, బ్రువాణః=వచించుచు, భగవాన్=భగవంతుడు, హరి, తత్ర+ఏవ+అన్తరధీయత=అచటనే అంతర్ధానము పొందెను. భవః=శివుడు, చక్షుః=తన నేత్రములను, సర్వతః=అన్ని దిశలను, చారయన్=ప్రసరింపజేయుచు, ఉమయా సహ=పార్వతితో, ఆస్తే=అచటనే యుండెను.

**తాత్పర్యము :** ఇట్లు వచించి మహావిష్ణువు అచ్చోటనే అంతర్హితుడయ్యెను, శివుడు నాలుగు దిక్కులనుఁజూచుచు పార్వతితో నచట నుండెను.

**శ్లో॥ తతో దదర్శోపవనే వరస్త్రియం విచిత్రపుష్పారుణపల్లవద్రుమే।**
**విక్రీడతీం కన్దుకలీలయా లసద్దుకూలపర్యస్తనితమ్బమేఖలామ్॥ 18**

**ప్రతిపదార్థము :** తతః=అంతట, విచిత్ర పుష్ప+అరుణ పల్లవ ద్రుమే=పలువన్నెల పువ్వులను, ఎఱ్ఱని చివుళ్ళనుగల వృక్షములు గల, ఉపవనే=ఉద్యానవనమునందు, కందుకలీలయా=బంతి ఆటచేత, విక్రీడతీమ్=క్రీడించుచున్నదియు, లసత్...మేఖలామ్, లసత్=ప్రకాశించు, దుకూల=పట్టుపటముచే, పర్యస్త=ఆవృతమైన, నితంబ=పిఱుదులందు, మేఖలామ్=మొలనూలు గలదియునగు, వరస్త్రియమ్=ఉత్తమాంగనను, దదర్శ=(శివుడు) చూచెను.

**తాత్పర్యము :** అంత పలువన్నెల పువ్వులతో కెంపు చిగురాకులతో కూడిన వృక్షములు గల పూఁదోటయందు బంతియాటయాడుచు తళతళ మెఱయు పట్టుచీరతోడి నితంబ వస్త్రమునందు రత్నాల మొలనూలునుగలదైన ఆ ఉత్తమ స్త్రీని శివుడు చూచెను.

**శ్లో॥ ఆవర్తనోద్వర్తనకమ్పితస్తనప్రకృష్టహారోరుభరైః పదే పదే।**
**ప్రభజ్యమానామివ మధ్యతశ్చలత్పదప్రవాలం నయతీం తతస్తతః॥ 19**

**ప్రతిపదార్థము :** ఆవర్త...భరైః, ఆవర్తన+ఉద్వర్తన=ఎగురుచుఁగన్పట్టు బంతి యొక్క విలాసము చేతనై, ఆవర్తన=క్రిందఁబడుట, ఉద్వర్తన=పైకి యెగరుట అనువానిచే, కంపిత=కదలుచున్న, స్తన=స్తనమునందు, ప్రకృష్ట=ఎగురుచు మనోహరములగు, హార=రత్నాల హారముల యొక్క, ఉరుభరైః=గొప్ప భారముచే, పదే పదే=అడుగడుగునందు, ప్రభజ్యమానామ్=వ్రాలుచు లేచుచు



నుండునదై, మధ్యతః=నడుమ నడుమ, చలత్పదప్రవాళమ్=చలించుచున్న పాదపల్లవమును, తతః తతః=అప్పటికప్పటికి, నయతీమ్=ముందుకు నడుచుచున్న ఆ స్త్రీని చూచెను.

**తాత్పర్యము :** బంతి క్రిందికి బైకి యెగురువేయుచుఁదానును క్రిందికిఁబైకి వ్రాలుచు లేచుచు చున్నది. చలించుచున్న ఆమె స్తనముపైని రత్నాలహారములు మెఱయుచుండెను. వాని బరువుచే అడుగడుగునకు గదలుచు గన్పట్టెను. నడుమ నడుమ చిగురుటాకువంటి పాదముల నెత్తి యుంచుచుఁగననయ్యెను.

**శ్లో॥ దిక్షు భ్రమత్కన్దుకచాపలైర్భృశం ప్రోద్విగ్నతారాయతలోలలోచనామ్।**
**స్వకర్ణవిభ్రాజితకుణ్డలోల్లసత్కపోలనీలాలకమణ్డితాననామ్॥ 20**

**ప్రతిపదార్థము :** దిక్షు=దిక్కులందు, భ్రమత్+కన్దుక+చాపలైః=ఎగురుచున్న బంతి యొక్క కదలికలచే, భృశమ్=మిక్కిలి, ప్రోద్విగ్న...నామ్, ప్రోద్విగ్న తార=అటునిటు చలించుచు తిరుగుచున్న నల్లగ్రుడ్లుగల, ఆయతలోలలోచనామ్=విశాలములై చలించు కన్నులు గలదియు, స్వ...నామ్, స్వకర్ణ=తన చెవులందు, విభ్రాజిత=మెఱయు, కుండల=కమ్మలచే, ఉల్లసత్=ప్రకాశించు, కపోల=చెక్కిళ్ళను, నీల+అలక=నల్లని ముంగురులచే, మండిత=అలంకరింపబడిన, ఆననామ్=నెమ్మొగము గలిగియున్నది.

**తాత్పర్యము :** ఆ మోహిని నలుగడలనెగురుచున్న బంతితోపాటుగ నటునిటు చలించుచు తిరుగుచున్న నల్లని గ్రుడ్లు గలిగి విశాలములై చలించు కన్నులు గలదై తన చెవులందు ధరించి మెఱయు కుండలములచే ప్రకాశించు చెక్కిళ్ళను, నల్లముంగురులతో నలంకృతమైనది యునగు మొగము గలదై యుంది.

**శ్లో॥ శ్లథద్దుకూలం కబరీం చ విచ్యుతాం సన్నహ్యతీం వామకరేణ వల్గునా।**
**వినిఘ్నతీమన్యకరేణ కన్దుకం విమోహయన్తీం జగదాత్మమాయయా॥ 21**

**ప్రతిపదార్థము :** శ్లథత్+దుకూలమ్=జారిపోవు పట్టుచీరను, విచ్యుతామ్=విడిపోయిన, కబరీమ్ చ=జడముడిని, వల్గునా=అందమైన, వామకరేణ=ఎడమ చేతితో, సంనహ్యతీమ్=పట్టుకొనుచున్నదియు, అన్యకరేణ=రెండవదైన కుడిచేతితో, కందుకమ్=బంతిని, వినిఘ్నతీమ్=కొట్టుచున్నదియు,ఆత్మమాయయా=తన మాయచేతన, జగత్=లోకమును, విమోహయన్తీమ్=మోహింపఁజేయుచున్నదై యుండెను.

**తాత్పర్యము :** జాఱిపోవు తన పట్టుచీరను, విడిపోవు జడముడిని ఎడమ చేతితో పట్టుకొనుచు, కుడిచేతితో బంతిని కొట్టుచు, తన మాయా విలాసమున లోకమును మోహింపజేయు చుండెను.

**శ్లో॥ తాం వీక్ష్య దేవ ఇతి కన్దుకలీలయేషద్ వ్రీడాస్ఫుటస్మితవిసృష్టకటాక్షముష్టః।**
**స్త్రీప్రేక్షణ ప్రతిసమీక్షణవిహ్వలాత్మా నాత్మానమన్తిక ఉమాం స్వగణాంశ్చ వేద॥22**

**ప్రతిపదార్థము :** తామ్=ఆ మోహినిని, వీక్ష్య=చూచి, దేవః=శివుడు, ఇతి=ఇట్లు... కందుక లీలయా=బంతియాటలో విలాసముతో, ఈషత్...ముష్టః, ఈషత్=ఇంచుక, వ్రీడా=సిగ్గుచే, స్ఫుట=వ్యక్తమైన, స్మిత=చిరునగవుచే, విసృష్ట=వ్యక్తమైన, కటాక్ష=కడకంటి చూపుచే, ముష్టః

**తాత్పర్యము :** నిశ్చేష్టుడుగాక సిగ్గుపీడియున్న శివునిగాంచి విష్ణువు మిగుల ప్రీతిబొంది తన సహజమగు పురుషస్వరూపమును బొందుచునిట్లు వచించెను.

**శ్రీ భగవానువాచ :** భగవానుడు పలికెను.

**శ్లో॥ దిష్ట్యా త్వం విబుధశ్రేష్ఠ స్వాం నిష్ఠామాత్మనా స్థితః।**
**యన్మే స్త్రీరూపయా స్వైరం మోహితోఽప్యఙ్గ మాయయా॥** 38

**ప్రతిపదార్థము :** అఙ్గ!=ఓ శంకరా!, విబుధశ్రేష్ఠ!=దేవతలందు శ్రేష్ఠుడా!, త్వమ్=నీవు, స్వామ్=స్వీయమైన (ప్రకృతిమ్), స్వభావమును, ఆత్మనా=స్వయముగనే, దిష్ట్యా=భాగ్యవశమున, స్థితః=పొందగలిగితివి, యత్=ఏ, మే=నాయొక్క, స్త్రీరూపయా=స్త్రీరూపమున, మాయయా=నా యొక్క మాయచేత, స్వైరమ్=స్వేచ్ఛగను, మోహితః=మోహమును పొందితివి.

**తాత్పర్యము :** ఓ సురశ్రేష్ఠుడా! శంకరుడా! నీవు సౌభాగ్యవశమున కామవివేకముతో స్వయముగనే నీ సహజ స్వభావమునుఁబొందగలిగితివి. నా మాయచే నీవు నా స్త్రీరూపమును గాంచి స్వేచ్ఛతో మోహమును బొందితివి.

**శ్లో॥ కో ను మేఽతితరేన్మాయాం-విషక్తస్త్వదృతే పుమాన్।**
**తాఁ స్తాన్విసృజతీం భావాన్-దుస్తరామకృతాత్మభిః॥** 39

**ప్రతిపదార్థము :** విషక్తః=విషమమైన కామాసక్తుడగు, పుమాన్=పురుషుడు, త్వత్+ఋతే=నీవు తప్ప, కః=ఎవడు, తాన్ తాన్=ఆయా, అకృతాత్మభిః=సంస్కారము పొందనిబుద్ధిగలవారలకు, దుస్తరామ్=దాటనలవిగాని, భావాన్=శృంగారాది విలాసభావములను కామములను, విసృజతీమ్=సృజించునట్టి, మే మాయామ్=నా యొక్క మాయను, కః=ఎవ్వడు, అతితరేత్=దాటును.

**తాత్పర్యము :** కామాసక్తుడైన పురుషుడు నీవు తప్ప మఱియెవ్వడు సంస్కారము పొందని బుద్ధిగలవారలకు దాటనలవిగాని ఆయా శృంగారభావములను సృజించు నా మాయను నెవ్వడు దాటగలఁడు.

**శ్లో॥ సేయం గుణమయీ మాయా-న త్వామభిభవిష్యతి।**
**మయా సమేతా కాలేన-కాలరూపేణ భాగశః॥** 40

**ప్రతిపదార్థము :** కాలేన=సృష్టిలోనగువానికి కారణమై, కాలరూపేణ=కాల స్వభావుడైన, మయా=నా తోడను, భాగశః=రజోగుణములోనగు గుణములు అంశములుగా, సమేతా=కూడిన, గుణమయీ=త్రిగుణాత్మికయు, సా+ఇయమ్=సేయమ్=ఆ యీ, మాయా=నా మాయ, త్వామ్=నిన్ను, న అభిభవిష్యతి=ఇక నిన్ను తిరస్కరింపదు.

**తాత్పర్యము :** సృష్టిలోనగునవి కావించుటకై కాలస్వరూపముపొందిన నాతో రజోగుణము లోనగు గుణముల అంశములతో గూడి నా స్వాధీనమై త్రిగుణములు గల మాయ ఇక నిన్ను మోహపెట్టదు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పచించెను.

**శ్లో॥ ఏవం భగవతా రాజన్-శ్రీవత్సాఙ్కేన సత్కృతః।**
**ఆమన్త్ర్య తం పరిక్రమ్య-సగణః స్వాలయం యయౌ॥** 41



**తాత్పర్యము :** ఆ మోహినిచే వివేకమును గోలుపోయినవాడైన శివుడు ఆమె వలన ప్రకటమైన మన్మథునిచే నిశ్చేష్టుడై పార్వతి చూచుచున్నను పోయిన సిగ్గుగలవాడై ఆ మోహిని దగ్గఱకుఁ బోయెను.

**శ్లో॥ సా తమాయాన్తమాలోక్య వివస్త్రా వ్రీడితా భృశమ్।**
**విలీయమానా వృక్షేషు-హసన్తీ నాన్వతిష్ఠత॥** 26

**ప్రతిపదార్థము :** సా=ఆ మోహిని, ఆయాన్తమ్=తన చెంతకు వచ్చు, తమ్=ఆ శివుని, ఆలోక్య=చూచి, వివస్త్రా=వస్త్రము లేనిదై, భృశమ్=మిక్కిలి, వ్రీడితా=సిగ్గుపొందినదై, వృక్షేషు=చెట్ల నడుమ, విలీయమానా=దాగుచున్నదై, హసన్తీ=నవ్వుచు, న+అన్వతిష్ఠత=నిలువక పోయెను.

**తాత్పర్యము :** ఆమె తన చెంతకు వచ్చు శివుని జూచి తాను వస్త్రములేనిదగుట వలన మిగులు సిగ్గుపడి, చెట్లనడుమ దాగుచు నవ్వుచుఁబోదొడంగెను.

**శ్లో॥ తామన్వగచ్ఛద్భగవాన్ భవః ప్రమథితేన్ద్రియః।**
**కామస్య చ వశం నీతః-కరేణుమివ యూథపః॥** 27

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడైన, భవః=శివుడు, ప్రమథిత+ఇంద్రియః=ఆకులపడిన చక్షురాదింద్రియములు గలవాడై, కామస్య=కామునికి, వశమ్=లోగోరుక, నీతః=పొందినవాడై, కరేణుమ్=ఆడేనుగును, యూథప ఇవ=గజనాథుడు వలె, తామ్=ఆ మోహినిని, అన్వగచ్ఛత్=అనుసరించి వెళ్ళెను.

**తాత్పర్యము :** భగవంతుడు శివుడు తన ఇంద్రియములాకులపాటైనవాడును, కామవశుడై ఆడేనుగును గజనాథుడువలె ఆ మోహినిననుసరించి పోయెను.

**శ్లో॥ సోఽనువ్రజ్యాతివేగేన గృహీత్వానిచ్ఛతీం స్త్రియమ్।**
**కేశబన్ధ ఉపానీయ బాహుభ్యాం పరిషస్వజే॥** 28

**ప్రతిపదార్థము :** సః=ఆ శివుడు, అతివేగేన=మిగుల వేగముతో, అనువ్రజ్య=ఆమెను పరువెత్తి పోయి, అనిచ్ఛతీమ్=తన్నుఁగోరని, స్త్రియమ్=స్త్రీని, కేశబన్ధే=జడయందు, గృహీత్వా=పట్టుకొని, ఉపానీయ=దగ్గఱకు లాగుకొని, బాహుభ్యామ్=తన రెండు చేతులతో, పరిషస్వజే=ఆలింగనము చేసికొనెను.

**తాత్పర్యము :** ఆ శివుడామెననుసరించి వడిగాఁబరువెత్తిపోయి, తన్నువాంఛించనిదైన ఆ మోహినిని జడయందు పట్టుకొని తన చెంతకు లాఁగుకొని తన రెండు చేతులతోఁగౌగలించు కొనెను.

**శ్లో॥ సోపగూఢా భగవతా-కరిణా కరిణీ యథా।**
**ఇతస్తతః ప్రసర్పన్తీ-విప్రకీర్ణశిరోరుహా॥** 29

**ప్రతిపదార్థము :** సా=ఆ మోహిని, భగవతా=శివునిచే, కరిణా=ఏనుగుచే, కరిణీ యథా=ఆడేనుగువలె, ఉపగూఢా=కౌగలింపబడినదై, విప్రకీర్ణశిరోరుహా=వీడి చెల్లజెదురగుచున్న తలవెంద్రుకలు గలదై, ఇతః తతః=ఇటునటు, ప్రసర్పన్తీ=పరుగెత్తసాగెను.

**తాత్పర్యము :** మగయేనుగు ఆడు ఏనుంగును బోలె తన్ను ఆ శివుడు గౌగిలించుకొనగా వీడి చెదరిన తలవెంట్రుకలతో ఆ మోహిని ఇటునటు పరువెత్తసాగెను.

**శ్లో॥ ఆత్మానం మోచయిత్వాఙ్గ సురర్షభభుజాన్తరాత్।**
**ప్రాద్రవత్సా పృథుశ్రోణీ మాయా విష్ణువినిర్మితా॥ 30**

**ప్రతిపదార్థము :** విష్ణు వినిర్మితా=వెన్నునిచే సృజింపబడినదై, మాయా=మాయయై, పృథుశ్రోణీ =గొప్ప పిఱుదులు గలదైన, సా=ఆ మోహిని, సురర్షభభుజాన్తరాత్=దేవతాశ్రేష్ఠుని బాహువులనడిమి ప్రదేశమునుండి, ఆత్మానమ్=తన్ను, మోచయిత్వా=విడిపించుకొని, ప్రాద్రవత్=పరుగెత్తిపోయెను.

**తాత్పర్యము :** విష్ణువు సృజించిన మాయయై, గొప్ప పిఱుదులు గల ఆ మోహిని దేవతా శ్రేష్ఠుడైన ఆ శివుని బాహువుల నడుమనుండి తన్ను విడిపించుకొని పరుగెత్తిపోయెను.

**శ్లో॥ తస్యాసౌ పదవీం రుద్రో విష్ణోరద్భుతకర్మణః।**
**ప్రత్యపద్యత కామేన వైరిణేవ వినిర్జితః॥ 31**

**ప్రతిపదార్థము :** అసౌ రుద్రః=ఈ శివుడు, అద్భుతకర్మణః=అచ్చెరువు గొల్పు పనిజేయువాడైన, తస్య విష్ణోః=ఆ విష్ణువు యొక్క, పదవీమ్=మార్గము, వైరిణా=తనకు పగతుడైన, కామేన= కామునిచే, వినిర్జితః=జయింపబడినవానివలె, ప్రత్యపద్యత=పొంది వెళ్ళెను.

**తాత్పర్యము :** ఈ రుద్రుడు వింతగొల్పుపనిచేసిన యా వెన్నుని దానిని బట్టి తన పగతుడగు మరునిచే జయింపబడినవానివలె పరుగెత్తి వెళ్ళెను.

**శ్లో॥ తస్యానుధావతో రేతశ్చస్కన్దామోఘరేతసః।**
**శుష్మిణో యూథపస్యేవ వాసితామనుధావతః॥ 32**

**ప్రతిపదార్థము :** అమోఘరేతసః=విఫలముగాని వీర్యముగల, తస్య=ఆ రుద్రుని యొక్క, రేతః=వీర్యము, వాసితామ్=ఋతువు దొరకొన్న ఆడేనుగు గూర్చి, అనుధావతః=అనుసరించి పర్వెత్తు, యూథపస్య+ఇవ=గజనాథుని యొక్క వలె, చస్కంద=స్ఖలనమయ్యెను.

**తాత్పర్యము :** వృథవోని వీర్యముగలవాడైన ఆ రుద్రుడు మోహినివెంట పరుగిడుచుండగా ఋతుకాలయోగ్యమైన ఆడేనుగు వెంబడి పరుగెత్తు మత్తుగొన్న గజనాథునికింబలె వీర్యము స్ఖలనమాయెను.

**శ్లో॥ యత్ర యత్రాపతన్మార్గే రేతస్తస్య మహాత్మనః।**
**తాని రౌప్యస్య హేమ్నశ్చ-క్షేత్రాణ్యాసన్ మహీపతే॥ 33**

**ప్రతిపదార్థము :** మహీపతే=ఓ రాజా!, మహాత్మనః=మహానుభావుడగు, తస్య=ఆ రుద్రుని, రేతః=వీర్యము, యత్ర యత్ర=ఎచ్చటెచ్చట, మార్గే=మార్గమునందు, అపతత్=పడెనో, తాని=ఆ ప్రదేశములు, రౌప్యస్య=వెండికిని, హేమ్నశ్చ=బంగారమునకు, క్షేత్రాణి=స్థానములు, ఆసన్= ఆయెను.

**తాత్పర్యము :** ఓ రాజా! మహానుభావుడైన ఆ రుద్రుని వీర్యము మార్గమునందు ఎచ్చటెచ్చట పడెనో, ఆ చోట్లన్నియు వెండికిని, బంగారునకు స్థానములై వెలసెను.



**శ్లో॥ సరిత్సరస్సు శైలేషు-వనేషూపవనేషు చ।**
**యత్ర క్వ చాసన్నృషయస్తత్ర సన్నిహితో హరః॥ 34**

**ప్రతిపదార్థము :** హరః=శివుడు, ఇట్లు మోహిని వెంటఁబరుగిడుచు, సరిత్+సరస్సు= నదులందును, కొలనులందును, శైలేషు=కొండలదరులందు, వనేషు=కానలపొంతకును, ఉపవనేషు=పూదోటల చెంతకును, యత్ర క్వ చ=ఏ చోట్లయందు, ఋషయః=ఋషులు, ఆసన్=ఉండిరో, తత్ర=ఆ స్థలములందును, సన్నిహితః=సంచరించినవాడయ్యెను.

**తాత్పర్యము :** శివుడా స్త్రీవెంట పర్వెత్తుచు నదుల చేరువకు, కొలనుల సమీపమునకు, కొండల దరికి, కానల చెంతకు, పూదోటల చెంతకును ఋషులున్న యాశ్రమముల దాపునకును బోయెను.

**శ్లో॥ స్కన్నే రేతసి సోఽపశ్యదాత్మానం విష్ణుమాయయా।**
**జడీకృతం నృపశ్రేష్ఠ సంన్యవర్తత కశ్మలాత్॥ 35**

**ప్రతిపదార్థము :** నృపశ్రేష్ఠ=ఓ రాజా!, సః=ఆ హరుడు, రేతసి=వీర్యము, స్కన్నే=స్ఖలనమైనది కాగా, విష్ణుమాయయా=విష్ణుమాయచే, జడీకృతమ్=కర్తవ్యాకర్తవ్యవిచారశూన్యుడుగాఁ జేయబడిన, ఆత్మానమ్=తను, అపశ్యత్=చూచెను. కశ్మలాత్=మోహాతిరేకమున, సంన్యవర్తత= చక్కగా మరలి వచ్చెను.

**తాత్పర్యము :** విష్ణుమాయచేఁదాను ఇది చేయఁదగినది, ఇది చేయదగనిది అను వివేకము గోలుపోయిన దన్నుఁదెలిసికొని మోహాతిశయమున నిట్లయినదనుకొని ఆమె వెంట పర్వెత్తుట మాని మరలి వచ్చెను.

**శ్లో॥ అథావగతమాహాత్మ్య ఆత్మనో జగదాత్మనః।**
**అపరిజ్ఞేయవీర్యస్య న-మేనే తదిహాద్భుతమ్॥ 36**

**ప్రతిపదార్థము :** అథ=తరువాత, జగదాత్మనః=జగత్స్వరూపుడై, అపరిజ్ఞేయవీర్యస్య=తెలిసి కోరాని బలము గలిగిన, ఆత్మనః=పరమాత్మయగు విష్ణువు యొక్క, అవగతమాహాత్మ్యః= తెలిసికొన్న మహిమగలవాడైన శివుడు, ఇహ=ఇప్పుడు, తత్=తనకు సంభవించిన మోహావేశమును, అద్భుతమ్=ఆశ్చర్యమునుగా, న మేనే=తలంచలేదు.

**తాత్పర్యము :** జగద్రూపుడై తెలసికోరాని బలముగలవాడై పరమాత్మయైన విష్ణువు యొక్క మహిమను తెలుసుకొన్నవాడైన శివుడు తనకు సంభవించిన మోహావేశమును అచ్చెరువుగా నెంచలేదు. విష్ణుమాయా ప్రభావమున నిట్లగుట సహజమని తలంచెనని భావము.

**శ్లో॥ తమవిక్లబమవ్రీడమాలక్ష్య మధుసూదనః।**
**ఉవాచ పరమప్రీతో బిభ్రత్ స్వాం పౌరుషీం తనుమ్॥ 37**

**ప్రతిపదార్థము :** అవిక్లబమ్=నివ్వెరపోని, అవ్రీడమ్=సిగ్గుచెందని, తమ్=ఆ శివుని, ఆలక్ష్య= చూచి, మధుసూదనః=విష్ణువు, పరమప్రీతః=మిగుల సంతోషించినవాడై, స్వామ్=స్వీయమైన, పౌరుషీమ్=పురుషసంబంధమైన, తనుమ్=శరీరమును, బిభ్రత్=ధరించుచు, ఉవాచ=ఇట్లు పలికెను.

## త్రయోదశోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ మనుర్వివస్వతః పుత్రః-శ్రాద్ధదేవ ఇతి శ్రుతః।**
**సప్తమో వర్తమానో య-స్తదపత్యాని మే శృణు॥ 1**

**ప్రతిపదార్థము :** వివస్వతః=సూర్యుని యొక్క, పుత్రః=పుత్రుడు, మనుః=మనువు, శ్రాద్ధదేవః ఇతి శ్రుతః=శ్రాద్ధదేవుడను నామమున వ్యవహరింపబడు, సప్తమః=ఏడవవాడు, యః=ఎవడు, వర్తమానః=ఇప్పుడున్నాడో, తత్+అపత్యాని=వాని సంతానములను, మే శృణు=నావలన వినుము.

**తాత్పర్యము :** ఓ రాజా! సూర్యుని పుత్రుడు వైవస్వతమనువు శ్రాద్ధదేవుడని ప్రసిద్ధికెక్కినవాడు ఏడవ మనువు. ఇక్కాలముననున్నవాడు, ఆతని పుత్రపౌత్రసంతతిని గూర్చి చెప్పెదను వినుము.

**శ్లో॥ ఇక్ష్వాకుర్నభగశ్చైవ-ధృష్ట శ్శర్యాతిరేవ చ।**
**నరిష్యన్తోఽథ నాభాగః-సప్తమో దిష్ట ఉచ్యతే॥ 2**

**శ్లో॥ కరూషశ్చః పృషధ్రశ్చ-దశమో వసుమాన్ స్మృతః।**
**మనోర్వైవస్వతస్యైతే-దశ పుత్రాః పరన్తప॥ 3**

**ప్రతిపదార్థము :** పరన్తప!=ఓ శ్రేష్టమైన తపస్సుగలవాడా!, ఇక్ష్వాకుః+నభగః+చ+ఏవ= ఇక్ష్వాకుడు, నభగుడును, ధృష్టః+శర్యాతిః+ఏవ=ధృష్టుడు, శర్యాతియు, నరిష్యన్తః=నరిష్యన్తుడు, అథ=తర్వాత, నాభాగః=నాభాగుడు, సప్తమః=ఏడవవాడు, దిష్టః=దిష్టుడని, ఉచ్యతే= జెప్పబడును. కరూషః, పృషధ్రఃచ=కరూషుడు, పృషధ్రుడును, దశమః=పదియవ వాడు, వసుమాన్=వసుమంతుడని, మనోః=మనువైన, వైవస్వతస్య=వైవస్వతునకు, ఏతే దశ=ఈ పదుగురు, పుత్రాః=పుత్రులైరి.

**తాత్పర్యము :** ఈ వైవస్వతమనువుకు ఇక్ష్వాకువు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, నరిష్యన్తుడు, నాభాగుడు, ఏడవవాడు దిష్టుడు, కరూషుడు, పృషధ్రుడు, పదియవవాడు వసుమంతుడని పదుగురు కుమారులు గలరు.

**శ్లో॥ ఆదిత్యా వసవో రుద్రా-విశ్వేదేవా మరుద్గణాః।**
**అశ్వినావృభవో రాజన్నిన్ద్రస్తేషాం పురన్దరః॥ 4**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓరాజా!, తేషామ్=వారలకు, ఇంద్రః=ఇంద్రుడు, పురందరః =పురందరుడయ్యెను.

**తాత్పర్యము :** ఆ వైవస్వతుని మన్వంతరమునందు ఆదిత్యులు, వసువులు, రుద్రులు, విశ్వేదేవతలు, మరుద్గణములు, అశ్వినులు, ఋభువులు అనువారు దేవతలైరి. వారలకు ఁబురందరుడు ఇంద్రుడయ్యెను.

**శ్లో॥ కశ్యపోఽత్రిర్వశిష్ఠశ్చ-విశ్వామిత్రోఽథ గౌతమః।**
**జమదగ్నిర్భరద్వాజ-ఇతి తే ఋషయః స్మృతాః॥ 5**



**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, శ్రీవత్సాంకేన=శ్రీవత్సమను పుట్టుమచ్చ ఔమ్మున చిహ్నముగాగల, భగవతా=విష్ణుభగవానునిచే, సత్కృతః=సత్కరింపబడినవాడై (శివుని గౌగిలించుకొని సత్కరించెనని ధ్వని), తమ్=ఆ విష్ణువును, పరిక్రమ్య=ప్రదక్షిణము చేసి, ఆమన్త్ర్య=వీడ్కొని, సగణః=ప్రమథగణములతో గూడినవాడై, స్వ+ఆలయమ్=తన స్థానమును కైలాసమును గూర్చి, యయౌ=పోయెను.

**తాత్పర్యము :** ఇట్లు శ్రీవత్సమను పుట్టుమచ్చ ఔమ్మున చిహ్నముగా గల భోగవంతుడగు విష్ణువు తన్ను సత్కరింప (కౌగిలింప) రుద్రుడు ఆ వెన్నునకు బ్రదక్షిణము చేసి వీడ్కొని ప్రమథ గణములతో గూడి తన స్థానమునకు కైలాసమునకుఁబోయెను.

**శ్లో॥ స్వాత్మానుభూతాం తాం మాయాం భవానీం భగవాన్ భవః।**
**శృణ్వతామృషిముఖ్యానాం ప్రీత్యాచష్టాథ భారత॥ 42**

**ప్రతిపదార్థము :** భారత!=భారతా!, అథ=అంతట, భగవాన్=భగవంతుడగు, భవః=శివుడు, స్వ+ఆత్మ+అనుభూతామ్=(భవానికి విశేషముగాఁజెప్పబడియున్న) తనకు బుద్ధికనుభవమైన, తాం మాయామ్=ఆ మాయను గూర్చి, ఋషిముఖ్యానామ్=ఋషి శ్రేష్ఠులకు, శృణ్వతామ్= వినుచుండగ, ప్రీత్యా=సంతోషముతో, భవానీమ్=పార్వతిని గూర్చి, ఆచష్ట=వచించెను.

**తాత్పర్యము :** అంత భగవంతుడైన శివుడు పార్వతితో ఋషిశ్రేష్ఠులెల్లరు వినుచుండ తనకనుభవమైన విష్ణుమాయను గూర్చి యిట్లు వచించెను.

**శ్లో॥ అయి వ్యపశ్యస్త్వమజస్య మాయాం పరస్య పుంసః పరదేవతాయాః।**
**అహం కలానామృషభో విముహ్యే-యయావశోఽన్యే కిముతాస్వతన్త్రాః॥ 43**

**ప్రతిపదార్థము :** అయి=ఓ పార్వతీ!, త్వమ్=నీవు, పరదేవతాయాః=పరదేవతయై, అజస్య= జన్మములేని, పరస్య=పరమాత్మయై, పుంసః=పురుషోత్తముఁడైన విష్ణువు యొక్క, మాయామ్= మాయను, వ్యపశ్యః=చూచితివిగదా!, కలానామ్=అణిమాదివిద్యలకు, ఋషభః=ప్రభువగు, అహమ్=నేను, యయా=ఏ మాయచే, అవశః=వివశుడనై, విముహ్యే=మోహమును బొందితిని. అస్వతంత్రాః=స్వతంత్రులుకాని, అన్యే=ఇతరులు, కిముత=ఏమగుదురు. ఆ మాయకు వశులగుదురని చెప్పవలయునా తప్పక యగుదురని భావము.

**తాత్పర్యము :** ఓయి పార్వతీ! పరదేవతయై జన్మాదులు లేనివాడైన పరమపురుషుని యొక్క మాయచేసిన పనిని జూచితివి కదా! నేను అణిమాది సిద్ధులకు ఎల్లవిద్యలకు ప్రభువునై యుండి, ఆ మాయకు వశుడనై అవస్థను పొందితిని. కామాదులకు లోఁబడిన సురాసురులు మానవులు శ్రీవిష్ణుమాయకు లోనగుదురనుటలో సందేహమేమి గలదు.

**శ్లో॥ యం మామపృచ్ఛస్త్వముపేత్య యోగాత్ సమాస్సహస్రాన్త ఉపారతం వై।**
**స ఏష సాక్షాత్పురుషః పురాణో న యత్ర కాలో విశతే న వేదః॥ 44**

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, యోగాత్=సమాధినుండి, సమాః సహస్రాన్తే=సంవత్సరము వేయి అయినంతనే కడపట, ఉపారతమ్=విరమించుకొనివచ్చిన, మామ్=నన్ను, ఉపేత్య= సమీపించి, యత్=దేనిని గోరి (ఏ దేవతనుపాసించితివని), అపృచ్ఛః=అడిగితివో, సః=ఆ,

పురుషః ఏవ=పురుషుడే, సాక్షాత్ పురాణః=అతిప్రాచీనుడు (నేను ఉపాసించితిని), యత్ర= ఎవని యందు, కాలః=కాలము, న విశతే=చొచ్చుకొనదో, న వేదః=ఎవ్వరెఱుంగలేరో, అతడన్నియు నెఱుంగువాడగుచున్నాడు.

**తాత్పర్యము :** వేయి సంవత్సరములు యోగసమాధి నుండి, దానిని విరమించుకొని వచ్చిన నన్ను గాంచి నీవు 'ఏ దేవతనుపాసించితివి' అని అడిగితివి గదా! ఎవడు అతి ప్రాచీనుడగుట వలన బురాణపురుషుఁడని పేరొందెనో అతడే ఇప్పుడు సాక్షాత్తుగ గన్పట్టినవాడు నాకు ఉపాస్యదైవమును. ఎవనియందు కాలవిభాగము లేదో, ఎవ్వన్ని ఎవ్వడెఱుంగలేడో అతడన్నియు నెఱుంగువాడగుచున్నాడు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇతి తేఽభిహితస్తాత విక్రమః శార్ఙ్గధన్వనః।**
**సిన్ధోర్నిర్మథనే యేన-ధృతః పృష్ఠే మహాచలః॥ 45**

**ప్రతిపదార్థము :** తాత – నాయనా! ఓ పరీక్షిత్తు, సింధోః=సముద్రము యొక్క, నిర్మథనే= మథించునప్పుడు, యేన=ఎవనిచేత, మహా+అచలః=దొడ్డ కొండ, పృష్ఠే=వీపునందు, ధృతః =ధరింపబడినదో, ఆ, శార్ఙ్గధన్వనః=శార్ఙ్గమను విల్లుగలవాడైన విష్ణువు యొక్క, విక్రమః =పరాక్రమము, ఇతి=ఇవ్విధముగా, తే=నీకు, అభిహితః=చెప్పబడినది.

**తాత్పర్యము :** ఓ పరీక్షిత్తూ! క్షీరసాగరమందెవ్వడు కూర్మరూపుడై తన వీపుపైన దొడ్డ కొండను, ధరించెనో, శార్ఙ్గమను విల్లును ధరించిన ఆ వెన్నుని పరాక్రమము వర్ణించి నీకుఁజెప్పినాను.

**శ్లో॥ ఏతన్ముహుః కీర్తయతోఽనుశృణ్వతో-న రిష్యతే జాతు సముద్యమః క్వచిత్।**
**యదుత్తమ శ్లోకగుణానువర్ణనం-సమస్తసంసారపరిశ్రమాపహమ్॥ 46**

దీనిని కీర్తించుట వలన ఫలమును జెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఏతత్=శివుడు మోహినిని మోహించిన ఈ కథను, ముహుః=మాటిమాటికి, కీర్తయతః=కీర్తించుచు, అనుశృణ్వతః=పెద్దల వలన వినుచున్నవాని యొక్క, సముద్యమః =చక్కని ప్రయత్నము, జాతు=ఒకానొకప్పుడు, క్వచిత్=ఎచ్చోటను, న రిష్యతే=విఫలము కాదు, యత్+ఉత్తమ శ్లోక గుణ+అనువర్ణనమ్=ఏ పుణ్యశ్లోకుని గుణములను వర్ణించుట, సమస్త సంసారపరిశ్రమ+అపహమ్=అన్ని సంసార ఖేదములను బోనడంచునది అగును.

**తాత్పర్యము :** శివుడు మోహినిని మోహించిన ఈ కథను గీర్తించుచుఁబెద్దల వలన వినుచున్నవాని ప్రయత్నమొకటెచ్చోటను వ్యర్థముగాదు. పుణ్యశ్లోకుడు హరి గుణములను వర్ణనము సమస్తసంసారదుఃఖములనుఁబోగొట్టునదిగదా!

**శ్లో॥ అసదవిషయమఙ్ఘ్రిం భావగమ్యం ప్రపన్నాన్**
**అమృతమమరవర్యానాశయత్ సిన్ధుమధ్యమ్।**
**కపటయువతివేషో మోహయన్ యః సురారీం**
**స్తమహముపసృతానాం కామపూరం నతోఽస్మి॥ 47**

భగవంతుడు గావించిన భక్తపక్షపాతమును స్మరించుచున్నాను.



**ప్రతిపదార్థము :** అసత్+అవిషయమ్=అసత్పురుషులకు గోచరించనివాడు, భావగమ్యమ్= భజనముచే పొందదగిన, అంఘ్రిమ్=మూలమైనవాడు, ప్రపన్నాన్=తనను శరణుపొందిన, అమరవర్యాన్=సురశ్రేష్ఠులను, యః=ఎవడు, సింధుమధ్యమ్=సాగరమధ్యమందు, అమృతమ్ =అమృతమును, ఆశయత్=భుజింపఁజేసెనో, కపటయువతివేషః=మోసపు స్త్రీ వేషముగల వాడై, యః=ఎవడు, సురా+అరీన్=దేవతల శత్రువులైన అసురులను, మోహయన్=మోహింప జేసెనో, ఉపసృతానామ్=తన్నాశ్రయించినవారి, కామపూరమ్=కోర్కెలనిండించునట్టి, తమ్=ఆ హరిని గూర్చి, అహమ్=నీకు, నతః+అస్మి=నమస్కారము చేసిన వాడనగుచున్నాను.

**తాత్పర్యము :** ఎవడు మోసమగు స్త్రీ వేషము ధరించి యసురులను మోహింపఁజేసి సురశ్రేష్ఠులకు అమృతమును బంచి వారిచే సుధను భుజింపఁజేసెనో, ఎవడు జెడునడవడి గల పురుషులకు గోచరముకానివాడో, ఎవడు భజనముచేఁబొందదగినవాఁడో, ఎవడాశ్రితుల వాంఛలనిండించువాడో ఆ హరిని గూర్చి నేను నమస్కరించుచున్నవాడనగుచున్నాను.

*ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కన్ధే శంకరమాయామోహనం నామ ద్వాదశో–ధ్యాయః*

*ఇది శ్రీమద్భాగవతమున అష్టమస్కంధమున శంకరమాయామోహనమను పేరుగల 12వ అధ్యాయము.*



**ప్రతిపదార్థము :** నవమః=తొమ్మిదవవాడు, మనుః=మనువు, వరుణసంభవః=వరుణుని వలన జనించినవాడు, దక్షసావర్ణిః=దక్షసావర్ణియగును, తత్ సుతాః=ఆతని కుమారులు, ధృతకేతుః, దీప్తకేతుః ఇతి+ఆద్యాః=ధృతకేతువు, దీప్తకేతువు అను మొదలగువారు, నృపాః =రాజులు (కాగలరు).

**శ్లో॥ పరో మరీచిర్గర్గాద్యా-దేవా ఇన్ద్రోఽద్భుతః స్మృతః।**
**ద్యుతిమత్ప్రముఖాస్తత్ర-భవిష్యన్త్యృషయస్తతః॥** 19

**ప్రతిపదార్థము :** పరః=పరుడు, మరీచిః=మరీచి, గర్గ+ఆద్యాః=గర్గుడులోనగువారు, దేవాః =దేవతలు, అద్భుతః=అద్భుతుడు, ఇన్ద్రః=ఇంద్రుడు అని, స్మృతః=తెలుపబడెను. ద్యుతిమత్+ ప్రముఖాః=ద్యుతిమంతుడులోనగువారు, ఋషయః=సప్తర్షులు, భవిష్యన్తి=కాగలరు, తతః =తర్వాత,

**తాత్పర్యము :** దక్షసావర్ణిమన్వన్తరమున పరుడు, మరీచి, గర్గుడులోనగువారు దేవతలు. అద్భుతుడు అను వాడింద్రుడు. ద్యుతిమంతుడు లోనగువారు సప్తర్షులు కాగలరు. తర్వాత.

**శ్లో॥ ఆయుష్మతోఽమ్బుధారాయామృషభో భగవత్కలా।**
**భవితా యేన సంరాద్ధాం త్రిలోకీం భోక్ష్యతేఽద్భుతః॥** 20

**ప్రతిపదార్థము :** భగవత్కళా=విష్ణువు భగవంతునియంశము, ఆయుష్మతః=ఆయుష్మంతుని వలన, అంబుధారాయామ్=అంబుధారకు, ఋషభః=ఋషభుడు, భవితా=పుట్టగలడు, యేన=ఏ ఋషభునిచే, సంరాద్ధామ్=వశము చేసికోబడిన, త్రిలోకీమ్=ముల్లోకములను, అద్భుతః=అద్భుతుడు, భోక్ష్యతే=అనుభవింపగలడో.

**తాత్పర్యము :** దక్షసావర్ణిమన్వన్తరమున భగవంతుడు ఆయుష్మంతుడనువానికి అంబుధార యను భార్యయందు ఋషభుడను పేర జన్మించి ముల్లోకములను రక్షించుచుండ, నద్భుతుడను ఇంద్రుడు వానిననుభవించును.

**శ్లో॥ దశమో బ్రహ్మసావర్ణిరుపశ్లోకసుతో మనుః।**
**తత్సుతా భూరిషేణాద్యా హవిష్మత్ప్రముఖా నృపాః॥** 21

**ప్రతిపదార్థము :** ఉపశ్లోకసుతః=ఉపశ్లోకుని కుమారుడు, బ్రహ్మసావర్ణిః=బ్రహ్మ సావర్ణి, దశమః మనుః=పదియవ మనువు, తత్సుతాః=ఆతని కుమారులు, భూరిషేణ+ఆద్యాః= భూరిషేణుడు లోనగువారు, హవిష్మత్ప్రముఖాః=హవిష్మంతుడు లోనగువారు, నృపాః=రాజులు కాగలరు.

**తాత్పర్యము :** పదియవ మనువు, ఉపశ్లోకుని కుమారుడగు బ్రహ్మసావర్ణి. అతని కుమారులు భూరిషేణాదులు, హవిష్మంతుడు లోనగువారు రాజులగుదురు.

**శ్లో॥ తత్రాపి జన్మ భవితా-హరేర్విశ్వసృజో గృహే।**
**అమూర్తిరితి విఖ్యాతో-యేనాప్యాయతే వై జగత్॥** 22

**ప్రతిపదార్థము :** తత్ర+అపి=బ్రహ్మసావర్ణిమన్వన్తరమున, హరేః=విష్ణువు యొక్క, జన్మ=జన్మము, విశ్వసృజః గృహే=విశ్వసృజగృహమునందు, భవితా=కాగలదు. అమూర్తిః



**ప్రతిపదార్థము :** ఇతి=అని, తే=వారు, ఋషయః=సప్తర్షులని, స్మృతాః=చెప్పబడిరి - కశ్యపుడు, అత్రి, వసిష్ఠుడు, విశ్వామిత్రుడు, మఱి గౌతముడు, జమదగ్ని, భరద్వాజుడను వారలు సప్తర్షులైరి.

**శ్లో॥ అత్రాపి భగవజ్జన్మ కశ్యపాదదితేరభూత్।**
**ఆదిత్యానామవరజో-విష్ణుర్వామనరూపధృక్॥** 6

**ప్రతిపదార్థము :** అత్ర+అపి=ఈ వైవస్వతమన్వన్తరమునందును, భగవత్+జన్మ=భగవంతుని అవతారము, కశ్యపాత్=కశ్యపుని వలన, అదితేః=అదితికి, అభూత్=కలిగెను. ఆదిత్యానామ్= ద్వాదశాదిత్యులకు, అవరజః=కడగొట్టువాడు, విష్ణుః=వెన్నుడు, వామనరూపధృక్=పొట్టివాని రూపమును ధరించి అవతరించెను.

**తాత్పర్యము :** ఈ మన్వంతరమునందును భగవంతుడు, విష్ణువు ద్వాదశాదిత్యులకు జిన్నవాడై వామనరూపమును ధరించి కశ్యపప్రజాపతి వలన అదితికి కలిగెను.

**శ్లో॥ సంక్షేపతో మయోక్తాని-సప్త మన్వన్తరాణి తే।**
**భవిష్యాణ్యథ వక్ష్యామి-విష్ణోః శక్త్యన్వితాని చ॥** 7

**ప్రతిపదార్థము :** మయా=నాచే, తే=నీకు, సప్త మన్వన్తరాణి=ఏడు మన్వన్తరములు, సంక్షేపతః =సంగ్రహముగా, ఉక్తాని=చెప్పబడినవి, విష్ణోః=విష్ణువు యొక్క, శక్త్యన్వితాని=అవతారములతో ఁగూడుకొనినవియగు, భవిష్యాణి=రాబోవు మన్వన్తరములను, అథ=పిమ్మట, వక్ష్యామి= చెప్పెదను.

**తాత్పర్యము :** నేను నీకు ఏడు మన్వన్తరములను సంగ్రహముగా వచించితిని. ఇఁక రాబోవు తక్కిన మన్వన్తరములను విష్ణునవతారములతో గూడిన వానిని వాకొనెదను, వినుము.

**శ్లో॥ వివస్వతశ్చ ద్వే జాయే-విశ్వకర్మసుతే ఉభే।**
**సంజ్ఞా ఛాయా చ రాజేన్ద్ర-యే ప్రాగభిహితే తవ॥** 8

**ప్రతిపదార్థము :** రాజ+ఇన్ద్ర=ఓ రాజశ్రేష్ఠుడా!, విశ్వకర్మసుతే=విశ్వకర్మకూతులు, సంజ్ఞా ఛాయా చ=సంజ్ఞ, ఛాయలను, ఉభే=ఇరువురు, వివస్వతః=సూర్యునికి, ద్వే జాయే=ఇరువురు భార్యలని, తవ=నీకు, ప్రాక్=ముందు, అభిహితే=చెప్పియున్నాను.

**తాత్పర్యము :** విశ్వకర్మకూతులు సంజ్ఞ, ఛాయ అను వారిర్వురును సూర్యుని భార్యలని నీకు ముందు చెప్పియున్నాను.

**శ్లో॥ తృతీయాం బడబామేకే తాసాం సంజ్ఞాసుతాస్త్రయః।**
**యమో యమీ శ్రాద్ధదేవశ్ఛాయాయాశ్చ సుతాఞ్ఛృణు॥** 9

**శ్లో॥ సావర్ణిస్తపతీ కన్యా-భార్యా సంవరణస్య యా।**
**శనైశ్చరస్తృతీయోఽభూ-దశ్వినౌ బడబాత్మజౌ॥** 10

**ప్రతిపదార్థము :** బడబామ్=బడబను (ఆడు గుఱ్ఱపు రూపు పొందినదానిని), తృతీయామ్= సూర్యునికి మూడవభార్యనుగా, ఏకే=కొందఱు (చెప్పుదురు). సంజ్ఞయను భార్యయే బడబయైనదని-నా మతము). (ఆ సంజ్ఞయే బడబారూపిణియై అశ్వనిదేవతలను గనెనని

చెప్పబడినది). సంజ్ఞాసుతాః=సంజ్ఞాదేవి బిడ్డలు, యమః=యముడు, యమీ=యమున, శ్రాద్ధదేవః=శ్రాద్ధదేవుడనుపేరుగల వైవస్వతమనువు, త్రయః=ముగ్గురైరి. ఛాయయా=ఛాయా దేవియొక్క, సుతాన్=పుత్రులను, శృణు=వినుము. సావర్ణిః=సావర్ణిఅను కుమారుడు, తపతీ కన్యా=తపతియను కూతురు, యా=ఎవ్వతె, సంవరణస్య=కురువంశపురాజు సంవరణునికి, భార్యా=భార్య అయ్యెను. తృతీయః=మూడవవాడు, శనైశ్చరః=శనైశ్చరుడు, అభూత్=అయ్యెను, అశ్వినౌ=అశ్వినీకుమారులు, బడబాత్మజౌ=బడబారూపిణియైన సంజ్ఞకు కుమారులు.

**తాత్పర్యము :** వీరిర్వురుగాక బడబయను నామెను మూడవ భార్యగాఁగొందరు వచింతురు. సంజ్ఞాదేవియే బడబారూపిణి. (ఆమె గుఱ్ఱము రూపుపొందెను. గావున ఇద్దరు భార్యలేయని చెప్పవలెను.) ఈ ముగ్గురు భార్యలందు సంజ్ఞాదేవికి సావర్ణి, తపతియను కన్య. ఈమె సంవరణుని భార్య. మూడవవాడు శనైశ్చరుడు, అని ఇరువురు కుమారులు, ఒక కూతురు గలిగిరి. బడబాదేవికి కుమారులిర్వురు, అశ్వనిదేవతలు గలిగిరి.

**శ్లో॥ అష్టమేఽన్తర ఆయాతే-సావర్ణిర్భవితా మనుః।**
**నిర్మోహవిరజస్కాద్యాః-సావర్ణేస్తనయా నృపాః॥** 11

**ప్రతిపదార్థము :** అష్టమే=ఎనిమిదవదగు, అంతరే=మన్వన్తరము, ఆయాతే సతి=వచ్చినది కాగా, సావర్ణిః=సావర్ణి, మనుః=మనువు, భవితా=కాగలడు. నిర్మోహ విరజస్క+ఆద్యాః =నిర్మోహుడు, విరజస్కుడులోనగువారు, సావర్ణేః=సావర్ణి యొక్క, తనయాః=తనయులు, నృపాః=రాజులగుదురు.

**తాత్పర్యము** : ఎనిమిదవ మన్వన్తరమురాగానే సావర్ణి మనువగును. ఆతని పుత్రులు నిర్మోహుడు, విరజస్కుడు లోనగువారు రాజులగుదురు.

**శ్లో॥ తత్ర దేవాః సుతపసో-విరజా అమృతప్రభాః।**
**తేషాం విరోచనసుతో-బలిరిన్ద్రో భవిష్యతి॥** 12

**ప్రతిపదార్థము :** తత్ర=ఎనిమిదవదగు సావర్ణిమన్వన్తరమునందు, సుతపసః=సుతపసులు, విరజాః=విరజులు, అమృతప్రభాః=అమృతప్రభులు, దేవాః=దేవతలగుదురు. తేషామ్= వారలలో, విరోచనసుతః=విరోచనుని కుమారుడు, బలిః=బలి, ఇంద్రః=ఇంద్రుడు, భవిష్యతి= కాగలడు.

**తాత్పర్యము :** ఆ సావర్ణి మన్వన్తరమునందు సుతపసులు, విరజులు, అమృతప్రభులను వారు దేవతలగుదురు. వారలలో విరోచనకుమారుడు బలి ఇంద్రుఁడగును.

**శ్లో॥ దత్త్వేమాం యాచమానాయ విష్ణవే యః పదత్రయమ్।**
**రాద్ధమిన్ద్రపదం భుక్త్వా తతః సిద్ధిమవాప్స్యతి॥** 13

**ప్రతిపదార్థము :** యః=ఏ బలి, సప్తమమగు వైవస్వతమన్వంతరమందు, యాచమానాయ= తన్ను యాచించిన, విష్ణవే=విష్ణువు కొఱకు, పదత్రయమ్=మూడడుగులు, ఇమామ్=ఈ, సమస్త భూమిని, దత్త్వా=ఇచ్చి, అష్టమమగు సావర్ణిమన్వన్తరమందు, రాద్ధమ్=విష్ణు ప్రసాద లబ్ధమైన, ఇంద్రపదమ్=ఇంద్రపదవిని, భుక్త్వా=అనుభవించి, తతః=తర్వాత, సిద్ధిమ్= మోక్షమును, అవాప్స్యతి=పొందగలడు.



**తాత్పర్యము :** బలి ఏడవదగు వైవస్వత మన్వన్తరమందు తన్ను మూడడుగులిమ్మని యాచించిన విష్ణువుకు ఈ సమస్త భూమినొసంగి, అష్టమమగు సావర్ణిమన్వన్తరమున తత్ఫలితముగా విష్ణుప్రసాదలబ్ధమైన ఇంద్రపదవిననుభవించి తరువాత మోక్షమును బొందగలడు.

**శ్లో॥ యోఽసౌ భగవతా బద్ధః-ప్రీతేన సుతలే పునః।**
**నివేశితోఽధికే స్వర్గా-దధునాస్తే స్వరాడివ॥** 14

**ప్రతిపదార్థము :** యః+అసౌ=ఏ ఈ బలి, ప్రీతేన=ప్రీతుడైన, భగవతా=విష్ణుభగవానునిచే, బద్ధః=కట్టబడినవాడై, పునః, స్వర్గాత్=స్వర్గముకంటె, అధికే=అధికమైన, సుతలే=సుతలము నందు, నివేశితః=ఉంచబడినవాడై, అధునా=ఇపుడు, స్వరాట్+ఇవ=చక్రవర్తివలె, ఆస్తే= ఉన్నాడో,

**తాత్పర్యము :** ఈ బలి ప్రీతుడైన విష్ణుభగవానునిచే బంధింపబడి, స్వర్గముకంటె మిన్నయైన సుతలలోకమునందుంచబడెను. ఇప్పుడతడు చక్రవర్తివలెనున్నాడు.

**శ్లో॥ గాలవో దీప్తిమాన్ రామో-ద్రోణపుత్రః కృపస్తథా।**
**ఋష్యశృఙ్గః పితాస్మాకం భగవాన్ బాదరాయణః॥** 15

**శ్లో॥ ఇమే సప్తర్షయస్తత్ర-భవిష్యన్తి స్వయోగతః।**
**ఇదానీమాసతే రాజన్-స్వే స్వే ఆశ్రమమణ్డలే॥** 16

**ప్రతిపదార్థము :** గాలవుడు, దీప్తిమంతుడైన పరశురాముడు, ద్రోణుని పుత్రుడైన అశ్వత్థామ, తథా=ఆ ప్రకారము, కృపుడు, ఋష్యశృంగుడు, అస్మాకం పితా=మా తండ్రియగు, భగవాన్ =భగవంతుడైన, బాదరాయణః=బాదరాయణుడు, ఇమే=వీరు, తస్మిన్=ఆ సావర్ణిమన్వన్తరము నందు, స్వయోగతః=తమ యోగబలమున, సప్తర్షయః=సప్తర్షులు, భవిష్యన్తి=కాగలరు. రాజన్=ఓ రాజా!, ఇదానీమ్=ఇప్పుడు, వీరు, స్వే స్వే=తమ తమ, ఆశ్రమమణ్డలే=ఆశ్రమము లందు, ఆసతే=ఉన్నారు.

**తాత్పర్యము :** గాలవుడు, తేజోవంతుడగు పరశురాముడు, ద్రోణపుత్రుడశ్వత్థామ, కృపుడు, ఋష్యశృంగుడు, మా తండ్రి వేదవ్యాసుడు, వీరు ఆ సావర్ణి మన్వన్తరమున సప్తర్షులుగా నుండగలరు. ఇపుడు వీరు తమ తమ ఆశ్రమములందు వసించియున్నారు.

**శ్లో॥ దేవగుహ్యాత్ సరస్వత్యాం-సార్వభౌమ ఇతి ప్రభుః।**
**స్థానం పురన్దరాద్ధృత్వా-బలయే దాస్యతీశ్వరః॥** 17

**ప్రతిపదార్థము :** దేవగుహ్యాత్=దేవగుహ్యుడనువాని వలన, సరస్వత్యామ్=సరస్వతియను స్త్రీయందు, సార్వభౌమః ఇతి=సార్వభౌముడును, ప్రభుః=ప్రభువును అగు, ఈశ్వరః =పరమేశ్వరుడు, పురన్దరాత్=ఇంద్రునుండి, బలాత్=బలవంతముగా, హృత్వా=ఇంద్ర పదవిని హరించి, స్థానమ్=ఇంద్రస్థానమును, బలయే=బలి కొఱకు, దాస్యతి=ఈయగలడు.

**తాత్పర్యము :** అప్పుడు విష్ణువు దేవగుహ్యుడనువానికి సరస్వతియను స్త్రీయందు సార్వభౌముడై జనించి, ఇంద్రునుండి బలవంతముగాగైకొని ఆ ఇంద్రపదవిని బలికి నొసంగగలడు.

**శ్లో॥ నవమో దక్షసావర్ణిర్మనుర్వరుణసమ్భవః।**
**భూతకేతుర్దీప్తకేతు-రిత్యాద్యాస్తత్సుతా నృపాః॥** 18

**తాత్పర్యము :** ఈ మన్వన్తరమున పవిత్రులు, చాక్షుషులు దేవతలగుదురు. శుచియనువాడు ఇంద్రుడగును. అగ్ని, బాహువు, శుచి, శుద్ధుడు, మాగధుడులోనగువారు సప్తర్షులు కాగలరు.

**శ్లో॥ సత్త్రాయణస్య తనయో బృహద్భానుస్తదా హరిః।**
**వితానాయాం మహారాజ-క్రియాతన్తూన్ వితాయితా॥** 36

**ప్రతిపదార్థము :** మహారాజ!=ఓ మహారాజా!, తదా=ఆ మన్వన్తరమున, హరిః=విష్ణువు, సత్త్రాయణస్య=సత్త్రాయణునికి, బృహద్భానుః=బృహద్భానుడను, తనయః=సుతుడై, క్రియాతన్తూన్=క్రియాకలాపములను, వితాయితా=విస్తరింపజేయగలడు.

**తాత్పర్యము :** ఓ మహారాజా! ఆ మన్వన్తరమున విష్ణువు సత్త్రాయణునికి బృహద్భానువనువాడు తనయుడై జనించి యాగాదికర్మ సంతతులను విస్తరింపజేయగలడు.

**శ్లో॥ రాజంశ్చతుర్దశైతాని త్రికాలానుగతాని తే।**
**ప్రోక్తాన్యేభిర్మితః కల్పో-యుగసాహస్రపర్యయః॥** 37

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, త్రికాలానుగతాని=మూడు కాలములందును వచ్చునట్టి, ఏతాని=ఈ, చతుర్దశ=పదునాలుగు మన్వన్తరములును, తే=నీకు, ప్రోక్తాని=చెప్పబడినవి. ఏభిః=ఈ పదునాల్గింటిచే, యుగసాహస్రపర్యయః=చతుర్యుగములు వేయిమారులు ప్రవర్తించిన ప్రయాణము, కల్పః=కల్పమగును.

**తాత్పర్యము :** ఇట్లు భూతభవిష్యద్వర్తమాన కాలములందు వర్తించు ఈ 14 మన్వన్తరములు నీకు చెప్పినాను. ఈ పదునాలుగు మన్వన్తరకాలము కృతత్రేతాద్వాపర కలియుగములు వేయిమారులు ప్రవర్తించిన ప్రమాణము కల్పమగుచున్నది.

*ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కన్ధే త్రయోదశో - ధ్యాయః*

*ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున త్రయోదశాధ్యాయము.*



+ఇతి= అమూర్తి అని, విఖ్యాతః=ప్రసిద్ధుడగును. యేన=ఎవ్వనిచే, జగత్=లోకము, ఆప్యాయతే వై=సుఖమునుఁబడయునో.

**శ్లో॥ హవిష్మాన్ సుకృతః సత్యో-జటామూర్తిస్తదా ద్విజాః।**
**సుత్రామాణవిబుద్ధాద్యా-దేవాశ్శమ్భుస్సురేశ్వరః॥** 23

**ప్రతిపదార్థము :** హవిష్మాన్=హవిష్మంతుడు, సుకృతః, సత్యః, జటామూర్తిః అనువారు, తదా=అప్పుడు, ద్విజాః=సప్తర్షులు, సుత్రామాణ=సుత్రామాణుడు, విబుద్ధ+ఆద్యాః=విబుద్ధుడు లోనగువారు, దేవాః=దేవతలు, శమ్భుః=శమ్భుడనువాడు, సుర+ఈశ్వరః=ఇంద్రుడగును.

**తాత్పర్యము :** ఆ బ్రహ్మసావర్ణిమన్వన్తరమున హవిష్మంతుడు, సుకృతుడు, సత్యుడు, జటామూర్తి లోనగువారు సప్తర్షులగుదురు. సుత్రామాణుడు, విబుద్ధుడులోనగువారు దేవతలగుదురు. శంభుడనువాడింద్రుడగును.

**శ్లో॥ విష్వక్సేనో విషూచ్యాన్తు-శమ్భోః శక్తిం విధాస్యతి।**
**జాతోఽంశాంశేన భగవాన్ గృహే విశ్వసృజో విభుః॥** 24

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడు, విష్వక్సేనః=విష్ణువు, విశ్వసృజః=విశ్వసృజుని యొక్క, గృహే=గృహమునందు, విషూచ్యాంతు=విషూచియను నామెయందు, అంశ+అంశేన= తనయంశము చేత, జాతః=పుట్టినవాడై, శంభోః=శంభుడనునింద్రునికి, శక్తిమ్=సామర్థ్యమును, విధాస్యతి=కలిగించును.

**తాత్పర్యము :** ఆ మన్వన్తరమున విష్ణు భగవానుడు విశ్వసృజునికి విషూచియను భార్యయందు తన యంశమున జన్మించి శంభునికి సామర్థ్యమును గలిగించి సాయపడును.

**శ్లో॥ మనుర్వై ధర్మసావర్ణిరేకాదశమ ఆత్మవాన్।**
**అనాగతాస్తత్సుతాశ్చ-సత్యధర్మాదయో దశ॥** 25

**ప్రతిపదార్థము :** ఏకాదశమః=పదునొకండువాడు, ధర్మసావర్ణిః=ధర్మసావర్ణి, మనుః=మనువు, ఆత్మవాన్=జ్ఞాని, బుద్ధిమంతుడు, తత్ సుతాః=ఆతని కుమారులు, సత్యధర్మా+ఆదయః =సత్యధర్ముడులోనగువారు, దశ=పదిమంది, అనాగతాః=కలుగుదురు.

**తాత్పర్యము :** పదునొకండవ మనువు ధర్మసావర్ణి. బుద్ధిమంతుడు, జ్ఞాని. ఆతని కొడుకులు సత్యధర్ముడులోనగువారు పదిమంది కలుగుదురు.

**శ్లో॥ విహఙ్గమాః కామగమా నిర్వాణరుచయః సురాః।**
**ఇన్ద్రశ్చ వైధృతస్తేషామృషయశ్చారుణాదయః॥** 26

**ప్రతిపదార్థము :** విహంగమాః=విహంగములు, కామగమాః=కామగమనముగలవారు, నిర్వాణరుచయః=నిర్వాణరుచులు అనువారు, సురాః=దేవతలు, తేషామ్=వారలకు, ఇంద్రః =ఇంద్రుడు, వైధృతః=వైధృతుడగును. అరుణాదయః=అరుణుడు లోనగువారు, ఋషయః =సప్తర్షులగుదురు.

**తాత్పర్యము :** ఆ మన్వన్తరమునందు విహంగములు, కామగాములు, నిర్వాణరుచులు దేవతలు. వారలకింద్రుడు వైధృతుడగును. అరుణుడు లోనగువారు సప్తర్షులగుదురు.

**శ్లో॥ సూర్యకస్య సుతస్తత్ర ధర్మసేతురితి స్మృతః।**
**వైధృతో యో హరేరంశస్త్రిలోకీం ధారయిష్యతి॥ 26**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ మన్వన్తరమునందు, యః=ఏ, హరేః=హరియొక్క, అంశః=భాగము, సూర్యకస్య=సూర్యకుడనువానికి, వైధృతః=వైధృతియను నామెయందు జన్మించి, సుతః=సుతుడై, ధర్మసేతుః ఇతి స్మృతః=ధర్మసేతువు అను పేరునొంది, త్రిలోకీమ్=ముజ్జగములను, ధారయిష్యతి=ధరింపగలడు.

**తాత్పర్యము :** ఆ మన్వన్తరమున విష్ణువు సూర్యకుడనువానికి వైధృతియందు ధర్మసేతువను కుమారుడై జన్మించి మూడులోకములను భరించును.

**శ్లో॥ భవితా భద్రసావర్ణీ రాజన్ ద్వాదశమో మనుః।**
**దేవవానుపదేవశ్చ దేవజ్యేష్ఠాదయః సుతాః॥ 28**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, ద్వాదశమః=పండ్రెండవవాడు, మనుః=మనువు, భద్రసావర్ణీ=భద్రసావర్ణి, భవితా=కాగలడు. దేవవాన్=దేవవంతుడు, ఉపదేవఃచ=ఉపదేవుడును, దేవజ్యేష్ఠ+ఆదయః=దేవజ్యేష్ఠుడులోనగువారు, సుతాః=దేవతలు.

**తాత్పర్యము :** పండ్రెండవ మనువు భద్రసావర్ణి. దేవవంతుడు, ఉపదేవుడు, దేవజ్యేష్ఠుడు లోనగువారు ఆతని కుమారులగుదురు.

**శ్లో॥ ఋతధామా చ తత్రేన్ద్రో దేవాశ్చ హరితాదయః।**
**ఋషయశ్చ తపోమూర్తి-స్తపస్వ్యగ్నీధ్రకాదయః॥ 29**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ మన్వన్తరమున, ఋతధామా=ఋతధాముడు, ఇన్ద్రః=ఇంద్రుడు, హరితాదయః=హరితాదులు, దేవాఃచ=దేవతలగుదురు. తపోమూర్తిః=తపోమూర్తి, తపస్వీ+అగ్నీధ్రక+ఆదయః=తపస్వియగు అగ్నీధ్రక్కులోనగువారు, ఋషయః+చ=సప్తర్షులు అగుదురు.

**తాత్పర్యము :** ఆ మన్వన్తరమున ఋతధాముడు ఇంద్రుడగును. హరితాదులు దేవతలగుదురు. తపోమూర్తి, తపస్వియగు అగ్నీధ్రక్కులోనగువారు సప్తర్షులు అగుదురు.

**శ్లో॥ స్వధామాఖ్యో హరేరంశః సాధయిష్యతి తన్మనోః।**
**అన్తరం సత్యసహసః-సూనృతాయాః సుతో విభుః॥ 30**

**ప్రతిపదార్థము :** స్వధామ+ఆఖ్యః=స్వధాముడను పేర, హరేః+అంశః=హరియొక్క అంశము, సత్యసహసః=సత్యసహుడనువానికి, సూనృతాయాః=సూనృతయను నామెయందు జన్మించి, సుతః=సుతుడై, తన్మనోః అంతరమ్=ఈ మన్వన్తరమును, సాధయిష్యతి=పాలించును.

**తాత్పర్యము :** స్వధాముడను పేర శ్రీహరియంశరూపుడు సత్యసహుడనువానికి సూనృతయను నామెయందు జన్మించి సుతుడై ఈ మన్వన్తరమును పాలించును.

**శ్లో॥ మనుస్త్రయోదశో భావ్యో దేవసావర్ణిరాత్మవాన్।**
**చిత్రసేనవిచిత్రాద్యా-దేవసావర్ణిదేహజాః॥ 31**

**ప్రతిపదార్థము :** త్రయోదశః=పదుమూడవవాడు, ఆత్మవాన్=ఆత్మతత్త్వజ్ఞుడగు, దేవసావర్ణిః



=దేవసావర్ణి, మనుః=మనువు, భావ్యః=అగును. చిత్రసేనవిచిత్ర+ఆద్యాః=చిత్రసేనుడు, విచిత్రుడులోనగువారు, దేవసావర్ణిదేహజాః=దేవసావర్ణి పుత్రులు.

**తాత్పర్యము :** ఆత్మతత్త్వజ్ఞుడగు దేవసావర్ణి మనువు పదుమూడవవాడు. చిత్రసేనుడు, విచిత్రుడులోనగువారు దేవసావర్ణి పుత్రులగుదురు.

**శ్లో॥ దేవాః సుకర్మసుత్రామసంజ్ఞా ఇన్ద్రో దివస్పతిః।**
**నిర్మోకతత్త్వదర్శాద్యా-భవిష్యన్త్యృషయస్తదా॥ 32**

**ప్రతిపదార్థము :** తదా=13వ మన్వన్తరమున, సుకర్మసుత్రామసంజ్ఞాః=సుకర్ముడు, సుత్రాముడు అను నామములుగలవారు, దేవాః=దేవతలు, దివస్పతిః=దివస్పతియనువాడు, ఇన్ద్రః=ఇంద్రుడు, నిర్మోకతత్త్వదర్శ+ఆద్యాః=నిర్మోకుడు, తత్త్వదర్శనుడులోనగువారు, ఋషయః=సప్తర్షులు, భవిష్యన్తి=కాగలరు.

**తాత్పర్యము :** 13వ మన్వన్తరమున సుకర్ముడు, సుత్రాముడు అను నామములుగలవారు దేవతలగుదురు. దివస్పతియనువాడింద్రుడగును. నిర్మోకుడు, తత్త్వదర్శనుడులోనగువారు సప్తర్షులు కాగలరు.

**శ్లో॥ దేవహోత్రస్య తనయ-ఉపహర్తా దివస్పతేః।**
**యోగేశ్వరో హరేరంశో-బృహత్యాం సమ్భవిష్యతి॥ 33**

**ప్రతిపదార్థము :** దేవహోత్రస్య=దేవహోత్రుని యొక్క, తనయః=కుమారుడగు, యోగేశ్వరః=యోగేశ్వరుడు, హరేః=విష్ణువు యొక్క, అంశః=అంశము, బృహత్యామ్=బృహతికి, సంభవిష్యతి=పుట్టగలడు. దివస్పతేః=ఇంద్రుడగు దివస్పతికి, ఉపహర్తా=చేదోడు అగును.

**తాత్పర్యము :** దేవహోత్రుని యొక్క కుమారుడు యోగేశ్వరుడు విష్ణువు యొక్క అంశమున జన్మించును. ఆయన బృహతీగర్భసంజాతుడై దివస్పతియను ఇంద్రునికి చేదోడగును.

**శ్లో॥ మనుర్వా ఇన్ద్రసావర్ణిశ్చతుర్దశమ ఏష్యతి।**
**ఉరుగమ్భీరబుధాద్యా-ఇన్ద్రసావర్ణివీర్యజాః॥ 34**

**ప్రతిపదార్థము :** చతుర్దశమః=14వ మన్వన్తరమున, ఇంద్రసావర్ణిః=ఇంద్రసావర్ణి, మనుః=మనువు, ఏష్యతి=అగును. ఉరు-గంభీర-బుధ+ఆద్యాః=ఉరువు, గంభీరుడు, బుధుడు లోనగువారు, ఇన్ద్రసావర్ణివీర్యజాః=ఇంద్రసావర్ణి పుత్రులగుదురు.

**తాత్పర్యము :** ఇంద్రసావర్ణియనువాడు 14వ మనువగును. ఉరువు, గంభీరుడు, బుధుడు లోనగువారు ఆతని పుత్రులు.

**శ్లో॥ పవిత్రాశ్చాక్షుషా దేవాః-శుచిరిన్ద్రో భవిష్యతి।**
**అగ్నిర్బాహుః శుచిః శుద్ధో-మాగధాద్యాస్తపస్వినః॥ 35**

**ప్రతిపదార్థము :** పవిత్రాః=పవిత్రులు, చాక్షుషాః=చాక్షుషులు, దేవాః=దేవతలగుదురు. శుచిః=శుచియనువాడు, ఇన్ద్రః=ఇంద్రుడు, భవిష్యతి=కాగలడు. అగ్నిః+బాహుః, శుచిః-శుద్ధః-మాగధ+ఆద్యాః=అగ్ని, బాహువు, శుచి, శుద్ధుడు, మాగధుడు లోనగువారు, తపస్వినః=సప్తర్షులు కాగలరు.

ఇట్లు ప్రసంగికమును నిరూపించి ప్రస్తుతముచే ఉపసంహరించుచున్నాడు.

**శ్లో॥ ఏతత్ కల్పవికల్పస్య ప్రమాణం పరికీర్తితమ్।**
**యత్ర మన్వన్తరాణ్యాహుశ్చతుర్దశ పురావిదః॥ 11**

**ప్రతిపదార్థము :** ఏతత్కల్పవికల్పస్య=ఈ బ్రహ్మాది ఈ అవాంతర కల్పము యొక్క, ప్రమాణమ్=ప్రమాణము, పరికీర్తితమ్=చెప్పబడినది. యత్ర=ఏ కల్పమందు, చతుర్దశ మన్వంతరాణి=పదునాలుగు మన్వంతరములు ప్రవర్తిల్లునని, పురావిదః=ప్రాచీనులగు మహర్షులు, ఆహుః=చెప్పుదురు.

**తాత్పర్యము :** దేనియందు పదునాలుగు మన్వంతరముల కాలము ప్రవర్తించునో ఆ కాలమును బ్రహ్మదేవుని యొక దిన ప్రమాణమగు కల్పకాలమని ప్రాచీనులగు మహర్షులు వచింతురు.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే చతుర్దశో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున పదునాలుగవ అధ్యాయము.

## చతుర్దశోఽధ్యాయః

**రాజోవాచ :** విష్ణుభక్తుడు వచించెను.

**శ్లో॥ మన్వన్తరేషు భగవన్ యథా మన్వాదయ స్త్విమే।**
**యస్మిన్ కర్మణి యే యేన నియుక్తాస్తద్ వదస్వ మే॥ 1**

ఈ అధ్యాయమునందు మనువులులోనగు నెల్లవారికి వారివారికిఁదగిన కర్మలు వేఱువేఱుగ వర్ణింపబడును.

**ప్రతిపదార్థము :** భగవన్=ఓ భగవానుడా!, మన్వంతరేషు=ఆయా మనువుల పరిపాలన కాలమందు, యథా=ఏ ప్రకారము, ఇమే=ఈ, మను+ఆదయః=మనువులు లోనగువారు, యే యే=ఎవరెవరు, యస్మిన్ కర్మణి=ఏయే కర్మలయందు, నియుక్తాః=నియోగింపబడిరో, తత్=ఆ విధమును, మే=నాకు, వదస్వ=చెప్పుము.

**తాత్పర్యము :** ఓ శుకయోగీ! ఈ మన్వంతరములందు ఎవరెవరు ఏయే పనులందు నియోగింపబడియుందురో ఆ సంగతిని నాకుఁదెలియజెప్పుము.

**బ్రహ్మోవాచ :** బ్రహ్మజ్ఞాని శుకుడు వచించెను.

**శ్లో॥ మనవో మనుపుత్రాశ్చ మునయశ్చ మహీపతే।**
**ఇంద్రాః సురగణాశ్చైవ సర్వే పురుషశాసనాః॥ 2**

**ప్రతిపదార్థము :** మహీపతే!=ఓ భూపాలా!, ఓ రాజా, మనవః=మనువులు, మనుపుత్రాశ్చ=మనువుల పుత్రులు, మునయశ్చ=మునులు, ఇంద్రాః=ఇంద్రులు, సురగణాఃచ+ఏవ=దేవ గణములును, సర్వే=ఎల్లఱు, పురుషశాసనాః=ఈశ్వరుడైన విష్ణువుచే యజ్ఞుడు లోనగు నవతారములెత్త నియోగింపబడుదురు.

**తాత్పర్యము :** ఓ రాజా! మనువులు, మనువుల పుత్రులు, ఇంద్రులు, సప్తర్షులు దేవగణములు వీరెల్లరు యజ్ఞుడులోనగు నవతారములెత్త విష్ణువుచే నియుక్తులగుచుందురు.

**శ్లో॥ యజ్ఞాదయో యాః కథితాః పౌరుష్యస్తనవో నృప।**
**మన్వాదయో జగద్యాత్రాం నయన్త్యాభిః ప్రచోదితాః॥ 3**

**ప్రతిపదార్థము :** నృప!= ఓ రాజా!, యజ్ఞ+ఆదయః=యజ్ఞుడు లోనగువారు, యాః=ఏ, పౌరుష్యః=పురుషుడగు విష్ణువునకు సంబంధించిన, తనవః=అవతారమూర్తులు, కథితాః=చెప్పబడిరో, తాభిః=ఆ మూర్తులచే, ప్రచోదితాః=ఆజ్ఞాపింపబడిన, మన్వాదయః=మనువు లోనగువారు, జగత్+యాత్రామ్=లోకమున యాత్రను, నయంతి=చక్కగా పోషించి నడుపుదురు.

**తాత్పర్యము :** అవతారమూర్తులచే నాజ్ఞాపింపబడినవారై మనువులులోనగు వారు లోకమున ధర్మములను చక్కగా నడుపుదురు.

**శ్లో॥ చతుర్యుగాన్తే కాలేన గ్రస్తాన్ఛ్రుతిగణాన్ యథా।**
**తపసా ఋషయోఽపశ్యన్ యతో ధర్మః సనాతనః॥ 4**

**ప్రతిపదార్థము :** చతుః యుగాంతే=కృతాది నాలుగు యుగముల సమాప్తియందు, యథా=ఏ ప్రకారము, గ్రస్తాన్=అడఁగిన (అణగిపోయిన), శ్రుతిగణాన్=శ్రుతుల సమూహములను, ఋషయః=సప్తర్షులు, తపసా=తమ తపశ్శక్తిచే, అపశ్యన్=తెలుసుకొందురో, యతః=ఏ శ్రుతుల వలన, సనాతనః=చిరకాలమునుండియున్న, ధర్మః=ఎల్ల ధర్మములు తెలియనగునో.

**తాత్పర్యము :** కృత త్రేతాది చతుర్యుగములచే ఒక్క మహాయుగము డెబ్బదియొక్క మాఱులు పరివర్తించినచో నొక్క మనువు కాలమగును. ఆ మనుకాలము సమాప్తి వేదములన్నియు నధ్యయనములేక కాలగర్భమున నడగిపోవును కాని మరల మనుప్రారంభ కాలమున సప్తర్షులు, తమ శక్తిచే తెలిసికొందురు. వానివలననే లోకమున సనాతన ధర్మము వర్ధిల్లును.

**శ్లో॥ తతో ధర్మం చతుష్పాదం మనవో హరిణోదితాః।**
**యుక్తాః సఞ్చారయన్త్యద్ధా స్వే స్వే కాలే మహీం నృప॥** 5

**ప్రతిపదార్థము :** నృప!=ఓ రాజా!, తతః=అంతట, మనవః=మనువులు, హరిణోదితాః =విష్ణువుచే చెప్పబడినవారై, యుక్తాః=యోగ్యులై, స్వేస్వే=తమతమ, కాలే=కాలమునందు, చతుష్పాదమ్=నాలుగు పాదములుగల, ధర్మమ్=ధర్మమును, మహీమ్=భూమియందు, సంచారయన్తి=ప్రవర్తింపజేయుదురు.

**తాత్పర్యము :** అట్లు సప్తర్షులు వేద ప్రకాశనముగావించిన తర్వాత మనువులు యోగ్యత గలిగినవారై శ్రీవిష్ణువు బోధింప నా ప్రకారము భూతలమందు ధర్మమును నాలుగు పాదముల నడిపించుదురు.

**శ్లో॥ పాలయన్తి ప్రజాపాలా యావదన్తం విభాగశః।**
**యజ్ఞభాగభుజో దేవా యే చ తత్రాన్వితాశ్చ తైః॥** 6

**ప్రతిపదార్థము :** ప్రజాపాలాః=మనుపుత్రులు ప్రభువులై, యావత్+అంతమ్=మనువు కాలము పూర్తియగు వరకు, విభాగశః=తాము పుత్రపౌత్రాదుల క్రమమున, పాలయంతి=ఆ ధర్మమును పాలింతురు. దేవాః=దేవతలు, యేచ=ఎవరు, అత్ర=ఈ సందర్భము, అనుకీర్తితాః=వచించ బడినదో, అన్యే=ఇతరులు, దివి, పృథివిలోనగువారు, ఈ కర్మయందు భోక్తలుగా చెప్పబడినవారు. వారితోఁగూడి యజ్ఞభాగభుజః=యజ్ఞములందు హవిర్భాగములను భుజించుచుందురు.

**తాత్పర్యము :** మనుపుత్రులు మనుకాలము సమాప్తియగు వరకు పుత్రపౌత్రాది క్రమమున ఆ మనుధర్మమును పాలింతురు. దేవతలు దివి, పృథివిలోనగువారితోఁగూడి యజ్ఞములందు హవిర్భాగములను భుజించుచు ప్రజల వాంఛలను తీర్చుచుందురు.

**శ్లో॥ ఇన్ద్రో భగవతా దత్తాం త్రైలోక్యశ్రియమూర్జితామ్।**
**భుఞ్జానః పాతి లోకాంస్త్రీన్ కామం లోకే ప్రవర్షతి॥** 7

**ప్రతిపదార్థము :** ఇంద్రః=ఇంద్రుడు, భగవతా=భగవంతునిచే, దత్తామ్=ఈయబడిన, ఊర్జితామ్=సమృద్ధిగల, త్రైలోక్యశ్రియమ్=ముజ్జగముల రాజ్యలక్ష్మిని, భుంజానః =అనుభవించుచు, త్రీన్‌లోకాన్=మూడు లోకములను, పాతి=పాలించును, లోకే=లోకము నందు, కామమ్=మిక్కిలి, ప్రవర్షతి=వర్షించును.



**తాత్పర్యము :** ఇంద్రుడు భగవంతుడిచ్చిన సమృద్ధవంతమైన ముల్లోకముల రాజ్యలక్ష్మిని పొంది భోగములనుభవించును. లోకమునందు మిక్కిలి వర్షించును.

**శ్లో॥ జ్ఞానఞ్చానుయుగం బ్రూతే హరిః సిద్ధేశరూపధృక్।**
**ఋషిరూపధరః కర్మయోగం యోగేశరూపధృక్॥** 8

ప్రసంగవశమున రూపాంతరములచేతను లోకయాత్ర ప్రవర్తించుటను రెండు శ్లోకములచే చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** హరిః=విష్ణువు, అనుయుగఞ్చ=ప్రతియుగమును, సిద్ధ+ఈశరూపధృక్=సిద్ధ శ్రేష్ఠులైన సనకాదుల రూపమును ధరించి, జ్ఞానమ్=జ్ఞానమును, ఋషిరూపధరః =యాజ్ఞవల్క్యాది ఋషుల రూపమున, కర్మ=కర్మ, యోగమ్=యోగ విధానము, యోగేశ రూపధృక్=దత్తాత్రేయుడు లోనగు యోగేంద్రుల రూపు ధరించి, యోగమార్గమును, బ్రూతే=వచించుచున్నాడు.

**తాత్పర్యము :** విష్ణువు ప్రతి మన్వంతరమునందును సనకాది సిద్ధులరూపమును ధరించి జ్ఞానమార్గమును, యాజ్ఞవల్క్యాది ఋషుల రూపమున అవతరించి కర్మమార్గమును, దత్తాత్రేయాది యోగుల రూపమునవతరించి యోగమార్గమును బోధించుచున్నాడు.

**శ్లో॥ సర్గం ప్రజేశరూపేణ దస్యూన్ హన్యాత్ స్వరాట్ వపుః।**
**కాలరూపేణ సర్వేషామభావాయ పృథగ్గుణః॥** 9

**ప్రతిపదార్థము :** ప్రజా+ఈశరూపేణ=ప్రజాపతులగు మరీచ్యాదుల రూపముచే, సర్గమ్= ప్రజావృద్ధిని చేయును. స్వరాట్ వపుః=రాజశరీరధారియై, దస్యూన్=దుష్టులను, హన్యాత్= వధించును. పృథక్+గుణః=శీతోష్ణాది భిన్న భిన్న గుణములుకలవాడై, కాలరూపేణ=కాల స్వరూపము వలన, సర్వేషామ్=ఎల్ల ప్రాణుల యొక్క, అభావాయ=లయము కొఱకు అగుచున్నాడు.

**తాత్పర్యము :** ఆ విష్ణువు మరీచిలోనగు ప్రజాపతుల రూపమునఁబ్రజావృద్ధి చేయును. రాజమూర్తియై దుష్టుల దండించుచు శీతోష్ణాది గుణములుకల కాలస్వరూపుడై ఎల్ల ప్రాణుల నంతమొందించుచున్నాడు.

**శ్లో॥ స్తూయమానో జనైరేభిర్మాయయా నామరూపయా।**
**విమోహితాత్మభిర్నానాదర్శనైర్న చ దృశ్యతే॥** 10

**ప్రతిపదార్థము :** నామరూపయా=నామరూపములుగా కన్పట్టు, మాయయా=విష్ణుమాయచే (ప్రపంచముచే), విమోహిత+ఆత్మభిః=మోహమునుఁబొందిన, ఏభిః=ఈ, జనైః=జనుల చేత, నానాదర్శనైః=సమస్త శాస్త్రములచేతను, స్తూయమానః=స్తుతింపబడుచుండువాడును, న చ దృశ్యతే=కన్పట్టువాడు కాదు.

**తాత్పర్యము :** మాయచే నామరూపాత్మకముగా గన్పట్టు విశ్వము గాంచి మోహమును పొందిన జనుల చేతను, సమస్త శాస్త్రములచేతను స్తుతింపబడుచున్న ఆ పరమాత్మ కన్పట్టువాడు కాదు.

శ్లో॥ **తుల్యైశ్వర్యబలశ్రీభి-స్స్వరథై ర్దైత్యయూథపైః।**
**పిబద్భిరివ ఖం దృగ్భిర్దహద్భిః పరిధీనివ॥** 10

**ప్రతిపదార్థము :** తుల్య+ఐశ్వర్యబల-శ్రీభిః=తనకు సమానమైన ప్రభుశక్తి బలము సంపద గలిగి, సరథైః=రథములతోఁగూడి, దృగ్భిః=కన్నులతో, ఖమ్=ఆకాశమును, పిబద్భిః ఇవ= త్రాగుచున్నవారి వలె, పరిధీన్=దిక్కులను, దహద్భిః ఇవ=హరించుచున్నవారి వలెను, దైత్యయూథపైః=దైత్యసేనాపతులతో కూడుకొని,

**తాత్పర్యము :** తనతో సాటి ప్రభుశక్తియు, బలము, సంపదగలిగి రథములతో గూడి కన్నులతో ఆకాశమును ద్రాగువారివలెను, దిక్కులను హరించువారివలెనగు దైత్య సేనాపతులతోఁగూడుకొని,

శ్లో॥ **వృతో వికర్షన్మహతీమాసురీం ధ్వజినీం విభుః।**
**యయావిన్ద్రపురీం స్వృద్ధాం కమ్పయన్నివ రోదసీ॥** 11

**ప్రతిపదార్థము :** వృతః=ఆ సేనాపతులతోఁగూడినవాడై, విభుః=ప్రభువగు బలి, మహతీమ్= దొడ్డదైన, ఆసురీమ్=అసురులు గల, ధ్వజినీమ్=సేనను, వికర్షన్=వెంటగొని, ఋద్ధామ్= మిగుల సమృద్ధిమంతమైన, ఇంద్రపురీమ్=అమరావతిని గూర్చి, రోదసీ=భూమ్యాకాశములను, కమ్పయన్ ఇవ=వడకించువాడువలె, యయౌ=పోయెను.

**తాత్పర్యము :** ప్రభువగు ఆ బలి సేనాపతులతో గూడి పెద్దదైన అసురసేనను వెంటగొని సకల సమృద్ధిమంతమగు నింద్రపురియగు స్వర్గమును గూర్చి, భూమ్యాకాశములను వడకించుచు బ్రోయెను.

శ్లో॥ **రమ్యాముపవనోద్యానైః శ్రీమద్భిర్నన్దనాదిభిః।**
**కూజద్విహఙ్గమిథునై-ర్గాయన్మత్తమధుకరైః॥** 12

**ప్రతిపదార్థము :** ఉపవన+ఉద్యానైః=ఫలములొసగుచు సమీపమునున్న తోటలచేత, పుష్ప ప్రధానములై దూరమునున్న పూదోటలు గలవియు, కూజత్+విహంగమిథునైః=కూయుచున్న విహంగమిథునములు గలవియు, గాయత్+మత్తమధుకరైః=పాడుచున్న ఉన్మత్తములైన తుమ్మెదలు గలవియు, శ్రీమద్భిః=శోభగలవియు, నందన+ఆదిభిః=నందనములోనగు నుద్యానములచే, రమ్యామ్=సుందరమైనదై యుండెను.

**తాత్పర్యము :** ఆ ఇంద్రునిపురి పండ్లనొసగుచు దగ్గఱనున్న తోటలు, పువ్వులకు నిలయములైన పూదోటలు గలదియు కోయిలలులోనగు పక్షులు కూయుచుండునదియు, మదించిన కొండ తుమ్మెదల ఝుంకారములు గలదియునై శోభిల్లునదైన నందనములోనగు నుద్యానములచే సుందరమై యుండెను.

శ్లో॥ **ప్రవాళఫలపుష్పోరుభారశాఖామరద్రుమైః।**
**హంససారసచక్రాహ్వకారణ్డవకులాకులాః॥** 13

**ప్రతిపదార్థము :** ప్రవాళ...ద్రుమైః, ప్రవాళ=చిగుళ్ళు, ఫల=పండ్లు, పుష్ప=పువ్వులు, ఉరుః గురుతరమగు, భార=బరువుతో, శాఖా=కొమ్మలు, అమరద్రుమైః=దేవతాతరువులచే,

## పంచదశోఽధ్యాయః

### వామనావతార కథ

ఈ అధ్యాయము మొదలు తొమ్మిది అధ్యాయములు శ్రీ మహావిష్ణువు వామనుడై అవతరించి చేసిన సుందరమైన చేష్టలను బలిని మోసమున నిగ్రహించి అనుగ్రహము జూపుటయు వర్ణింపబడి – ఈ పదునైదవ అధ్యాయమందు ఆచార్యులు బలిచే విశ్వజిద్యాగమును యజింపచేసిరి. అందువలన అతడు స్వర్గమును జయించెను.

**రాజోవాచ :** రాజు వచించెను.

శ్లో॥ **బలేః పదత్రయం భూమేః కస్మాద్ధరిరయాచత।**
**భూతేశ్వరః కృపణవల్లబ్ధార్థోఽపి బబన్ధ తమ్॥** 1

**ప్రతిపదార్థము :** హరిః=శ్రీమహావిష్ణువు, భూత+ఈశ్వరః=ప్రాణులకెల్ల ప్రభువు, కృపణవత్= దీనుడవలె, బలేః=బలివలన, భూమేః=భూమియొక్క, పదత్రయమ్=మూడు అడుగులను, అయాచత=కోరెను. లబ్ధ+అర్థః+అపి=పొందిన ప్రయోజనముగలవాడు అయినా, తమ్=ఆ బలిని, కస్మాత్= ఎందువలన, బబంధ=బంధించెను.

**తాత్పర్యము :** ఆ శ్రీమహావిష్ణువు సర్వప్రాణులను సృజించు ప్రభువైనవాడు తాను స్వయముగా దీనుడువలె బలిని మూడడుగుల భూమినిమ్మని ఏల కోరెను. అట్లు కోర్కె సఫలమైనను బలినేల బంధించెను.

శ్లో॥ **ఏతద్ వేదితుమిచ్ఛామో మహత్ కౌతూహలం హి నః।**
**యజ్ఞేశ్వరస్య పూర్ణస్య బన్ధనం చాప్యనాగసః॥** 2

**ప్రతిపదార్థము :** యజ్ఞ+ఈశ్వరస్య=యజ్ఞఫలదాతయు, పూర్ణస్య=అపరాధమేమియు జేయని బలియొక్క, బంధనఇచ్ఛ=బంధించుటయు, ఏతత్=ఈ విషయమును, వేదితుమ్=తెలిసి కొనుటకు, ఇచ్ఛామః=కోరుచున్నాము. నః=మాకు, దీని విషయమై మహత్=గొప్ప, కౌతూహలమ్=విను వేడుక గలదు.

**తాత్పర్యము :** యజ్ఞఫల ప్రదాతయై పరిపూర్ణకాముఁడైన విష్ణువు యాచించుట నిరపరాధియైన బలిని బంధించుటయు అను నీ వృత్తాంతమును తెలిసికోగోరుచున్నాము. ఇందు మాకు మిగుల వినవేడుక గలదు.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ **పరాజితశ్రీరసుభిశ్చ హాపితో హీంద్రేణ రాజన్ భృగుభిః స జీవితః।**
**సర్వాత్మనా తానభజద్ భృగూన్ బలిః శిష్యో మహాత్మార్థనివేదనేన॥** 3

ఇప్పుడిచ్చట విష్ణువు బలివలన త్రిలోకములను అపహరించుటకు కపట యాచనను జేసినాడని చెప్పుచు భార్గవునారాధించిన బలమున బలికి కాలము కానప్పుడు గూడా స్వర్గవిజయము సంభవించినదని దాని క్రమమును జెప్పుచున్నాడు. ఇది అధ్యాయము సమాప్తివరకూ వర్ణింపబడినది.

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, బలిః=బలి, యుద్ధమున, పరాజితశ్రీః=కోలుపోయిన రాజ్యసంపద గలవాడై, ఇంద్రేణ=ఇంద్రునిచే, అసుభిశ్చ=ప్రాణములచేత, హాపిత=వీడబడిన వాడు, సః=ఆ బలి, భృగుభిః=శుక్రాచార్యులచే, జీవితః=బ్రతికింపబడినవాడైన బలి, మహాత్మా=ఉదారచిత్తుడై, శిష్యః=శిష్యుడై, అర్థనివేదనేన=ధనకనకాది పదార్థముల నివేదించుటచే, సర్వాత్మనా=పరిపూర్తిగా, తాన్=ఆ, భృగూన్=శుక్రాచార్యులను, అభజత్=సేవించెను.

**తాత్పర్యము :** బలి యుద్ధమునఁదన సకల రాజ్యసంపదలను గోలుపోయి ఇంద్రునిచే ప్రాణములు వీడిన బలి మరల శుక్రాచార్యుల వలన బ్రతికి ఉదారచిత్తుడై ధనకనకాది పదార్థములను సమర్పించి ఆ శుక్రాచార్యునికి శిష్యుడై పరిపూర్తిగా సేవించెను.

**శ్లో॥ తమ్బ్రాహ్మణా భృగవః ప్రీయమాణా అయాజయన్ విశ్వజితా త్రిణాకమ్।**
**జిగీషమాణం విధినాభిషిచ్య మహాభిషేకేణ మహానుభావాః॥** 4

**ప్రతిపదార్థము :** భృగవః=భృగు వంశీయులగు, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, ప్రీయమాణాః=బలియందు ప్రీతిగలవారై, మహానుభావాః=గొప్ప ప్రభావముగలవారు, త్రిణాకమ్=స్వర్గమును, జిగీషమాణమ్=జయింప గోరు, తమ్=ఆ బలిని, విధినా=వేదోక్తవిధానమున, మహాభిషేకేణ=బహువిధ బ్రాహ్మణ ప్రస్తుతమై ఇంద్రసంబంధమైన మంత్రములచే, అభిషిచ్య=అభిషేకము చేసి, విశ్వజితా=విశ్వజిత్తను యాగము, అయాజయన్=యాజింపచేసిరి.

**తాత్పర్యము :** భృగువంశ్యులగు శుక్రాచార్యుడులోనగు బ్రాహ్మణులు బలియెడ మిగులఁ బ్రీతిగలవారు స్వర్గమును జయింపగోరు బలిని బహ్వృచ బ్రాహ్మణమున పేర్కొనబడిన ఇంద్ర సంబంధమైన మహాభిషేక మంత్రములునభిషేకింప ఆ మహాశాస్త్ర ప్రభావము గలవారు బలిచేత విశ్వజిత్తను యాగము చేయించిరి.

**శ్లో॥ తతో రథః కాఞ్చనపట్టనద్ధో హయాశ్చ హర్యశ్వతురఙ్గవర్ణాః।**
**ధ్వజశ్చ సింహేన విరాజమానో హుతాశనాదాస హవిర్భిరిష్టాత్॥** 5

**ప్రతిపదార్థము :** తతః=ఆ యాగము చేసినంతట, హవిర్భిః=సోమాజ్య పయస్సులోనగు, హవిర్భాగముల చేత, ఇష్టాత్=పూజింపబడిన, హుతాశనాత్=అగ్నివలన, కాంచన పట్టనద్ధః=బంగారు రేకుచే కూర్చబడినది, కాంచనాదులు గలదియైన, రథః=రథము, హర్యశ్వతురంగ వర్ణాః=ఇంద్రుని అశ్వములకు వలె, ఆకుపచ్చ వన్నెగల, హయాశ్చ=అశ్వములను, సింహేన=సింహప్రతిమతో, విరాజమానః=విరాజిల్లుచుండు, ధ్వజశ్చ=టెక్కెమును, ఆస=ఆవిర్భవించెను.

**తాత్పర్యము :** ఆ యాగము చివర నెయ్యి పాలులోనగు హవిర్భాగముల సమర్పణముచేఁ దృప్తిగాంచి ప్రియుడైన అగ్నినుండి స్వర్ణమయమైన రథము ఇంద్రునశ్వముల వంటి ఆకుపచ్చ వన్నెగల గుఱ్ఱములు సింహవిగ్రహమున విరాజిల్లు ధ్వజమును ఉద్భవించెను.

**శ్లో॥ ధనుశ్చ దివ్యం పురటోపనద్ధం తూణావరిక్తౌ కవచం చ దివ్యమ్।**
**పితామహస్తస్య దదౌ చ మాలామమ్లానపుష్పాం జలజం చ శుక్రః॥** 6

**ప్రతిపదార్థము :** పితామహః=ప్రహ్లాదుడు, తస్య=ఆ బలికి, పురట+ఉపనద్ధమ్=బంగారంతో నిర్మింపబడిన, దివ్యమ్=ఉత్తమమైన, ధనుశ్చ=విల్లును, అరిక్తౌ=అక్షయ శరములు గల, తూణౌ=అమ్ములపొదలును, దివ్యమ్=మేలైన, కవచఞ్చ=కవచమును, అమ్లానపుష్పామ్=వాడని తామరలుగల, మాలాఞ్చ=పూవుల మాలను, దదౌ=ఇచ్చెను. శుక్రఃచ=శుక్రుడు కూడా, జలజమ్=శంఖమును, దదౌ=ఇచ్చెను.



**తాత్పర్యము :** తాత ప్రహ్లాదుడు తన మనుమడైన బలికి సువర్ణధనుస్సును, అక్షయ బాణములు గల అమ్ములపొదలును, ఉత్తమ కవచమును వాడిపోని కమలములు గల పూలదండను ఇచ్చెను. శుక్రుడు శంఖమును ఇచ్చెను.

**శ్లో॥ ఏవం స విప్రార్జితయోధనార్థస్తైః కల్పితస్వస్త్యయనోఽథ విప్రాన్।**
**ప్రదక్షిణీకృత్య కృతప్రణామః ప్రహ్రాదమామన్త్ర్య నమశ్చకార॥** 7

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, విప్ర+ఆర్జితయోధన+అర్థః=విప్రులచే సంపాదింపబడిన యుద్ధపరికరములు గలవాడై, సః=ఆ బలి, కల్పితస్వస్తి+అయనః=కావింపబడిన మంగళవాచకము గలవాడై, అథ=అంత, విప్రాన్=బ్రాహ్మణులను, ప్రదక్షిణీకృత్య=ప్రదక్షిణము చేసి, కృతప్రణామః=చేసిన నమస్కారముగలవాడై, ప్రహ్రాదమ్=ప్రహ్లాదుని, ఆమన్త్ర్య=అనుజ్ఞ నడిగి, నమః+చకార=నమస్కారము చేసెను.

**తాత్పర్యము :** ఇటు తనకు విప్రులు వలయు యుద్ధపరికరములన్నింటిని సమకూర్చిరి. ఆ బలి విప్రులు మంగళవచనములు గావింప వారలకుఁబ్రదక్షిణ మాచరించి, నమస్కరించి ప్రహ్లాదునను జ్ఞ వడసి ఆయనకు నమస్కరించెను.

**శ్లో॥ అథారుహ్య రథం దివ్యం భృగుదత్తం మహారథః।**
**సుస్రగ్ధరస్సరభసో-ధన్వీ ఖడ్గీ ధృతేషుధిః॥** 8

**ప్రతిపదార్థము :** అథ=అంత, మహారథః=మహారథుడైన బలి, భృగుదత్తమ్=భృగుదత్తమగు, దివ్యమ్=ఉత్తమమైన, రథమ్=రథమును, ఆరుహ్య=ఎక్కి, సుస్రక్+ధరః=శుభమగు మాలను ధరించి, ధన్వీ=ధనువు గలిగి, ఖడ్గీ=ఖడ్గము గలిగి, ధృత+ఇషుధిః=ధరించిన అమ్ముల పొదులు గలవాడై, సరభసః=వేగిరపాటు గలవాడయ్యెను.

**తాత్పర్యము :** అంత మహారథుడైన బలి భృగుదత్తమగు ఉత్తమమైన రథమును ఎక్కి మంగళకరమైన మాలను ధరించి, ధనుస్సును చేత ఖడ్గమునుగొని, అమ్ములపొదులను వహించి వేగముగలవాడయ్యెను.

**శ్లో॥ హేమాఙ్గదలసద్బాహుః స్ఫురన్మకరకుణ్డలః।**
**రరాజ రథమారూఢో-ధిష్ణ్యస్థ ఇవ హవ్యవాట్॥** 9

**ప్రతిపదార్థము :** హేమ+అంగదలసత్+బాహుః=స్వర్ణమయమైన భుజకీర్తులు బాహువులందు ధరించినవాడును, స్ఫురత్+మకరకుండలః=ప్రకాశించు మకరకుండలములు గలవాడును, రథమ్=రథమును, ఆరూఢః=అధిష్ఠించినవాడై, హవ్యవాట్ ఇవ=ఆహవనీయాగ్నివలె, రరాజ=శోభిల్లుచుండెను.

**తాత్పర్యము :** స్వర్ణమయమైన భుజకీర్తులు భుజములందు ధరించినవాడును, ప్రకాశించు మకరకుండలములు గలవాడును, రథమును అధిష్ఠించినవాడై ఆహవనీయాగ్నివలె శోభిల్లుచుండెను.

**తాత్పర్యము :** అసురసేనాధిపతియైన ఆ బలి దేవతలరాజధానిని బయటనుండి నలుదిశల సైన్యముతో ముట్టడించెను. ఇంద్రుని భార్యలకు భయమును కలిగించుచు, గురువగు శుక్రాచార్యునిచే నీయబడిన శంఖమును ప్రయోగించెను.

**శ్లో॥ మఘవాంస్తదభిప్రేత్య-బలేః పరమముద్యమమ్।**
**సర్వదేవగణోపేతో-గురుమేతదువాచ హ॥ 24**

**ప్రతిపదార్థము :** బలేః=బలియొక్క, పరమమ్=గొప్పదైన, తత్ ఉద్యమమ్=ఆ సన్నాహమును, అభిప్రేత్య=నెఱింగిన, మఘవాన్=ఇంద్రుడు, సర్వదేవగణోపేతః=సర్వదేవతలతో కూడి వెళ్ళి, గురుమ్=గురువగు బృహస్పతిని గూర్చి, ఏతత్ ఉవాచ=దానిని చెప్పెను.

**తాత్పర్యము :** బలియొక్క గొప్పదైన ఆ సన్నాహమును నెఱింగి, ఇంద్రుడు సర్వదేవతలతో కూడి బృహస్పతి కడకు వెళ్ళి దానిని చెప్పెను.

**శ్లో॥ భగవన్నుద్యమో భూయాన్-బలేర్నః పూర్వవైరిణః।**
**అవిషహ్యమిమం మన్యే-కేనాసీత్ తేజసోర్జితః॥ 25**

**ప్రతిపదార్థము :** భగవన్=ఓ ఆచార్యదేవా!, నః=మాకు, పూర్వవైరిణః=పూర్వశత్రువగు, బలేః=బలియొక్క ఉద్యమః=సన్నాహము, భూయాన్=పెద్దది, ఇమమ్=దీనిని, అవిషహ్యమ్=సహింపరానిదిగా, మన్యే=నేను తలంచుచున్నాను. కేన=ఎవ్విధమున, తేజసోర్జిత=బలోపేతుడు, ఆసీత్=ఆయెనో-

**తాత్పర్యము :** ఓ ఆచార్యదేవా! మాకు పూర్వశత్రువగు బలియొక్క ఈ సన్నాహము సహించుటకు అసమర్థుడనని నేను తలంచుచున్నాను. ఎవ్విధమున ఈ బలి బలోపేతుడాయెనో!

**శ్లో॥ నైనం కశ్చిత్కుతో వాపి ప్రతివోఢుమధీశ్వరః।**
**పిబన్నివ ముఖేనేదం లిహన్నివ దిశో దశ।**
**దహన్నివ దిశో దృగ్భిః-సంవర్తాగ్నిరివోత్థితః॥ 26**

**ప్రతిపదార్థము :** ముఖేన=నోటిద్వారా, ఇదమ్=ఈ విశ్వమును, పిబన్+ఇవ=పానము చేయుచున్నవానివలె, దిశః దశ=దశదిశలను, లిహన్+ఇవ=ఆస్వాదించుచున్నవానివలె, దృగ్భిః =చక్షువులచే, దిశః=దిక్కులను, దహన్+ఇవ=దహించుచున్నవానివలె, సంవర్తాగ్నిః+ఇవ= ప్రళయాగ్నివలె, ఉత్థితః=లేచుచున్నాడు.

**తాత్పర్యము :** ఈ బలి నోటిద్వారా విశ్వమును పానము చేయుచున్నవానివలె దశదిశలను ఆస్వాదించుచున్నవానివలె, చక్షువులచే దిక్కులను దహించుచున్నవానివలె, ప్రళయాగ్నివలె లేచుచున్నాడు.

**శ్లో॥ బ్రూహి కారణమేతస్య దుర్ధర్షత్వస్య మద్రిపోః।**
**ఓజః సహో బలం తేజో-యత ఏతత్సముద్యమః॥ 27**

**ప్రతిపదార్థము :** ఏతస్య=దీనికి, కారణమ్=కారణము, బ్రూహి=చెప్పుము, అస్య మద్రిపోః =నా శత్రువుకు, ఓజః=ఓజము (శక్తి), సహః=సాహసము, బలమ్=బలము, తేజః=తేజము, యతః=దేని నుండి, ఏతత్=ఇతనియొక్క, సముద్యమః=దండెత్తుట సాధ్యమయినదో.



హంస...కులాః, హంస=అంచలు, సారస=బెగ్గురు, చక్రాహ్వ=జక్కవలు, కారణ్డవ=నీటి కాకులు, కుల+ఆకులాః=తెగలచే సందడిగలవైన-

**తాత్పర్యము :** చిగుళ్ళు, పండ్లు, పువ్వులలోనగువాని బరువుతోడి కొమ్మలుగల దేవతా తరువులచే రమ్యముగా నుండెను. మఱి రాయంచలు, బెగ్గురు పిట్టలు, జక్కవలు, నీటికాకులు లోనగువాని తెగల సందడిగలవైన-

**శ్లో॥ నళిన్యో యత్ర క్రీడన్తి ప్రమదాస్సురసేవితాః।**
**ఆకాశగఙ్గయా దేవ్యా వృతాం పరిఖభూతయా॥ 14**

**ప్రతిపదార్థము :** నళిన్యః=తామర కొలనులుగల, యత్ర=ఆ ప్రదేశమున, సురసేవితాః =సురలచే సేవింపబడు, ప్రమదాః=దేవాంగనలు, క్రీడన్తి=క్రీడించుచుందురు. ఆకాశగంగయా= ఆకాశగంగచేత, వృతామ్=చుట్టబడియుండి, పరిఖభూతయా=అగడ్తవలె నుండెను.

**తాత్పర్యము :** తామరకొలనులు గల ఆ ప్రదేశమున సురలచే సేవింపబడు దేవాంగనలు క్రీడించుచుందురు. దేవతయైన ఆకాశగంగ ఆ పురిచుట్టు అగడ్తవలె నుండెను.

**శ్లో॥ ప్రాకారేణాగ్నివర్ణేన-సాట్టాలేనోన్నతేన చ।**
**రుక్మపట్టకపాటైశ్చ-ద్వారైః స్ఫటికగోపురైః॥ 15**

**ప్రతిపదార్థము :** అగ్నివర్ణేన=స్వర్ణకాంతిగలదైన, సాట్టాలేన=నలువైపుల బురుజులుగలదైన, ఉన్నతేన=ఎత్తైన, ప్రాకారేణ=ప్రాకారము చేతను, రుక్మపట్టకపాటైః=బంగారు పట్టీల తలుపులు గల, ద్వారైః=గృహద్వారముల చేత, స్ఫటిక గోపురైః=స్ఫటికమణిమయములై పురద్వారముల చేత నొప్పారుచుండిన -

**తాత్పర్యము :** ఆ పురి స్వర్ణకాంతి శోభిల్లుచు యుద్ధసమయములందు శత్రుసేనలను జూచుటకై చివరన గట్టబడిన బురుజులుగలదై ఎత్తైన కోటగోడచేతను, బంగారు పట్టీల తలుపులు గల గృహద్వారముల చేత, స్ఫటికమణులతో గట్టబడిన పురద్వారములచేత నొప్పారు చుండిన-

**శ్లో॥ జుష్టాం విభక్తప్రపథాం విశ్వకర్మవినిర్మితామ్।**
**సభాచత్వరరథ్యాఢ్యాం-విమానైర్న్యర్బుదైర్వృతామ్।**
**శృఙ్గాటకైర్మణిమయైర్వజ్రవిద్రుమవేదిభిః॥ 16**

**ప్రతిపదార్థము :** జుష్టామ్=కూడినదియు, విభక్తప్రపథామ్=వేఱువేఱుగ దీర్ఘమైన రాజ మార్గములు గలదియు, విశ్వకర్మవినిర్మితామ్=విశ్వకర్మచే నిర్మింపబడినదియు, సభాచత్వరరథ్యా+ఆఢ్యామ్=రచ్చబండలు, ఇండ్లముంగిళ్ళు, రథములు పోవుమార్గములు లోనగువాటితో గూడినదియు, న్యర్బుదైః=పదికోట్ల సంఖ్య, విమానైః=విమానములచేత, మణిమయైః=రత్నఖచితములైన, శృంగాటకైః=చదుకములచేత (నాలుగు వీథులుగలదియు), వజ్రవిద్రుమవేదిభిః=వజ్ర మణిమయములైన వృక్షములతోడి అరుగులుగలదై,

**తాత్పర్యము :** ఆ పురి చక్కగ నేర్పరచిన రాజమార్గములు గలదై, విశ్వకర్మచే నిర్మింప బడినదియు, రచ్చబండలు, ముంగిళ్ళు, రథములుపోవు మార్గములులోనగువాటితో

గూడినదియు, పదికోట్ల విమానములతోను, రత్నఖచితములు వజ్రమణులచే నిర్మించిన వృక్షములతోడి అరుగులుగలదై నాలుగు వీథులు గలదై నొప్పారుచుండెను.

**శ్లో॥ యత్ర నిత్యవయోరూపాః శ్యామా విరజవాససః।**
**భ్రాజన్తే రూపవన్నార్యో హ్యర్చిర్భిరివ వహ్నయః॥ 17**

**ప్రతిపదార్థము :** యత్ర=ఏ ఇంద్రపురియందు, నిత్యవయోరూపాః=మార్పులేని జవ్వనము రూపముగలవారును, శ్యామాః=జవ్వనమున నొప్పారుచున్నవారును, విరజవాససః =నిర్మలములైన వస్త్రములుగలవారును, రూపవత్+నార్యః=రూపవతులునగు రమణీమణులు, అర్చిర్భిః=శిఖలచే, వహ్నయః+ఇవ=అగ్నులవలె, భ్రాజన్తే=విరాజిల్లుచున్నారో–

**తాత్పర్యము :** ఏ ఇంద్రపురియందు మార్పులేని జవ్వనముచే అందముగలవారును, స్థిరమైన రూపముగలవారును, నిర్మలములైన వస్త్రములుగలవారును, రూపవతులునగు రమణీమణులు శిఖలచే గూడిన అగ్నులవలె విరాజిల్లుచున్నారో–

**శ్లో॥ సురస్త్రీకేశవిభ్రష్టనవసౌగన్ధికస్రజామ్।**
**యత్రామోదముపాదాయ మార్గ ఆవాతి మారుతః॥ 18**

**ప్రతిపదార్థము :** యత్ర=ఏ ఇంద్రపురియందు, సుర...జామ్, సురస్త్రీ=వేల్పులేమల యొక్క కేశ విభ్రష్ట=శిరోజములనుండి జాఱిన, నవ..స్రజామ్=కలువపూదండల, ఆమోదమ్=ఎక్కువ పరిమళమును, ఉపాదాయ=గ్రహించి, మారుతః=వాయువు, మార్గే=రాజమార్గమునందు, ఆవాతి=వీచుచుండునో–

**తాత్పర్యము :** ఏ ఇంద్రపురియందు వేల్పులేమల శిరోజములనుండి జాఱిన కలువపూదండల పరిమళమును గ్రహించి వాయువు రాజమార్గమునందు వీచుచుండునో–

**శ్లో॥ హేమజాలాక్షనిర్గచ్ఛద్ధూమేనాగురుగన్ధినా।**
**పాణ్డురేణ ప్రతిచ్ఛన్నమార్గే యాన్తి సురస్త్రియః॥ 19**

**ప్రతిపదార్థము :** హేమజాల=బంగారు గవాక్షములనుండి, నిర్గచ్ఛత్=బయలువెడలు, అగురుగన్ధినా=చందనము పరిమళముతోను, పాణ్డురేణ=తెల్లనైన, ధూమేన=ధూమముచే, ప్రతిచ్ఛన్నమార్గే=వ్యాప్తమైన మార్గమున, సురస్త్రియః=అప్సరసలు, యాన్తి=పోవుచుందురు.

**తాత్పర్యము :** బంగారు గవాక్షములనుండి బయలువెడలు చందనము పరిమళముతోను, తెల్లనైన ధూపముచే వ్యాప్తమైన మార్గమునందు అప్సరసలు పోవుచుందురు.

**శ్లో॥ ముక్తావితానైర్మణిహేమకేతుభిః నానాపతాకావలభీభిరావృతామ్।**
**శిఖణ్డిపారావతభృఙ్గనాదితాం వైమానికస్త్రీకలగీతమఙ్గలామ్॥ 20**

**ప్రతిపదార్థము :** (యత్ర=ఆ ఇంద్రపురియందు), ముక్తావితానైః=ముత్తెముల చాందినీల చేతను, మణిహేమకేతుభిః=మణులతో గూడిన స్వర్ణధ్వజములచేతను, నానాపతాకావలభీభిః ఆవృతామ్=నానావిధములగు పతాకములచేత నలంకృతమైన మేడలతోను, శిఖణ్డి... నాదితామ్=నెమళ్ళు, పావురములు, తుమ్మెదలులోనగువానిచే మ్రోగుచున్నదియు, వైమానిక... మంగలామ్=విమానములందు విహరించు దేవతాస్త్రీల అవ్యక్తమధురమైన గానముచే మంగలమయమై యున్నదో–



**తాత్పర్యము :** ఏ పురి ముత్తెముల చాందినీలచేతను, రత్నఖచితములై స్వర్ణధ్వజముల చేతను, మణులతో కూడిన స్వర్ణధ్వజముల చేతను, నానా విధములగు పతాకములచేత నలంకృతమైన మేడలతోను, నెమళ్ళు, పావురములు, తుమ్మెదలు లోనగువాని కూతలుచే మ్రోగుచున్నదియు, విమానములందు విహరించు దేవతాస్త్రీల అవ్యక్తమధురగానముచే మంగలమయమై యున్నదో–

**శ్లో॥ మృదఙ్గశఙ్ఖానకదున్దుభిస్వనైః సతాలవీణామురజేష్టవేణుభిః।**
**నృత్యైః సవాద్యైరుపదేవగీతకైర్మనోరమాం స్వప్రభయా జితప్రభామ్॥ 21**

**ప్రతిపదార్థము :** మృద...స్వనైః=మృదంగములు, శంఖములు, తప్పెటలు అనువాని మ్రోతల చేతను, సతాల...వేణుభిః=తాళములతో గూడిన వీణ, మద్దెల, వేణురవముల చేతను, సవాద్యైః=వాద్యములతో గూడిన, నృత్యైః=నృత్యములచేతను, ఉపదేవగీతకైః=గంధర్వుల గానముల చేతను, మనోరమామ్=మనస్సునకింపు గొల్పుచు, స్వప్రభయా=తన తేజముతో, జితప్రభామ్=జయించునట్లుగ నుండెను.

**తాత్పర్యము :** తాళములు, వీణలు, చిఱుమద్దియలు గూడిన మద్దెలలు, శంఖములు, తప్పెటలు, భేరులులోనగువాని మ్రోతల చేత, పిల్లనగ్రోవుల చేత, వాద్యములతోను నృత్యముల చేతను, గంధర్వుల గానము మనస్సుకింపుగొల్పుచు తన తేజమున దీప్తిదేవతనునై యుండెను.

**శ్లో॥ న యాం వ్రజన్త్యధర్మిష్ఠా భూతధర్మద్రుహశ్శఠాః।**
**మానినః కామినో లుబ్ధా షడ్భిర్హీనా వ్రజన్తి యత్॥ 22**

**ప్రతిపదార్థము :** యామ్=ఏ ఇంద్రపురిని గూర్చి, అధర్మిష్ఠాః=అధర్మపరులు, భూతధర్మద్రుహః =ప్రాణులకును, ధర్మమునకు ద్రోహమాచరించువారును, శఠాః=శఠులును, మానినః =అహంకారము గలవారును, కామినః=కాముకులును, లుబ్ధాః=లోభులును, న వ్రజన్తి=పోరో, షడ్భిః=కామాదులగు అరిషడ్వర్గములు, హీనాః=లేనివారు, వ్రజన్తి=పోదురు.

**తాత్పర్యము :** ఏ ఇంద్రపురిని అధర్మపరులు, భూతములకు, ధర్మమునకు ద్రోహమాచరించు వారు, అభిమానులు, కాముకులు, లోభులు స్వర్గమునకుఁబోవరో కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యములను అరిషడ్వర్గములు లేనివారు మాత్రము ఆ ఇంద్రపురికి పోదురు.

**శ్లో॥ తాం దేవధానీం స వరూథినీపతిర్బహిః సమన్తాద్రురుధే పృతన్యయా।**
**ఆచార్యదత్తం జలజం మహాస్వనం దధ్మౌ ప్రయుఞ్జన్ భయమిన్ద్రయోషితామ్॥ 23**

**ప్రతిపదార్థము :** వరూథినీపతిః=అసుర సేనాధిపతియైన, సః=ఆ బలి, దేవధానీమ్=దేవతల రాజధానిని, బహిః=బయట నుండి, సమన్తాత్=నలువైపుల, పృతన్యయా=సైన్యముతో, రురుధే =ముట్టడించెను. ఇంద్రయోషితామ్=ఇంద్రుని భార్యలకు, భయమ్=భయమును, ప్రయుంజన్ =కలిగించుచు, ఆచార్యదత్తమ్=గురువగు శుక్రాచార్యునిచే నీయబడిన, జలజమ్=శంఖమును, దధ్మౌ=మ్రోగించెను.

## షోడశోఽ ధ్యాయః

దేవమాత అదితి శోకించుట, ఆమె ప్రార్థననుసరించి పతియగు కశ్యపుడామెకు పయోవ్రతమునుపదేశించుటయను విషయములు వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ ఏవం పుత్రేషు నష్టేషు-దేవమాతాదితిస్తథా।**
**హృతే త్రివిష్టపే దైత్యైః-పర్యతప్యదనాథవత్॥** 1

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, పుత్రేషు=తన కుమారులు, నష్టేషు సత్సు=కనపడని వారుకాగా, తథా=అట్లే, త్రివిష్టపే=స్వర్గము, దైత్యైః=దైత్యులచే, హృతే=అపహరింపబడగా, దేవమాతా=దేవతల తల్లి, అదితిః=అదితి, అనాథవత్=నాథుడులేనిదానివలె, పర్యతప్యత్= మిగుల సంతాపమొందెను.

**తాత్పర్యము :** ఇట్లు దేవతలెల్ల దిక్కులకు బారి దాగుకొనగా, దైత్యులు స్వర్గమును ఆక్రమింపగాఁజూచి దేవతల తల్లి అదితి దిక్కులేనిదానివలె మిగుల సంతాపమొందెను.

**శ్లో॥ ఏకదా కశ్యపస్తస్యా ఆశ్రమం భగవానగాత్।**
**నిరుత్సవం నిరానన్దం-సమాధేర్విరతశ్చిరాత్॥** 2

**ప్రతిపదార్థము :** ఏకదా=ఒకప్పుడు, చిరాత్=తడవు కాలము, సమాధేః=సమాధినుండి, విరతః =చాలించినవాడై, భగవాన్=భగవంతుడగు, కశ్యపః=కశ్యపుడు, తస్యాః=ఆ అదితి యొక్క, నిరుత్సవమ్=వేడుకలేనిదియు,నిరానన్దమ్=హాయిగొల్పనిదియునగు, ఆశ్రమమ్=ఆశ్రమమును గూర్చి, అగాత్=వెళ్ళెను.

**తాత్పర్యము :** ఒకప్పుడు కశ్యపభగవానుడు తడవుకాలము సమాధినుండి చాలించినవాడై, మంగళకరముగానిదై, ఆనందములేనిదైన ఆమె ఆశ్రమమునకు వెళ్ళెను.

**శ్లో॥ స పత్నీం దీనవదనాం-కృతాసనపరిగ్రహః।**
**సమ్భావితో యథాన్యాయ-మిదమాహ కురూద్వహ॥** 3

**ప్రతిపదార్థము :** కురూద్వహ!=ఓ కురువంశీయుడా!, యథాన్యాయమ్=ధర్మపద్ధతి ననుసరించి, కృత+ఆసన పరిగ్రహః=కావించిన పీఠమును గ్రహించినవాడై, సంభావితః =గౌరవింపబడినవాడై, దీనవదనామ్=దిగులుపడిన వదనము గలదియు, పత్నీమ్=భార్యయు నగు అదితిని గూర్చి, ఇదమ్+ఆహ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము :** ఓ కురువంశీయుడా! తగిన విధమున నాదరింపబడినవాడై కశ్యపుడు ఆసనమును పరిగ్రహించినవాడై దీనవదనయు, భార్యయునగు నదితితో నిట్లు పలికెను.

**శ్లో॥ అప్యభద్రం న విప్రాణాం-భద్రే లోకేఽ ధునాగతమ్।**
**న ధర్మస్య న లోకస్య-మృత్యోశ్ఛన్దానువర్తినః॥** 4

దీన భావమున గన్పట్టుముఖముగల అదితిని గాంచి - ఇట్లు చెప్పుచున్నాడు. ఏడు శ్లోకములచే.



**తాత్పర్యము :** ఓ గురుదేవా! నా శత్రువగు బలికి ఓజము, సాహసము, బలము, తేజము ఎవని నుండి ఉద్యమించినవో దానికి కారణము చెప్పుము.

**శ్రీ గురురువాచ :** దేవగురువు బృహస్పతి పలికెను.

**శ్లో॥ జానామి మఘవఞ్ఛత్రోరున్నతేరస్య కారణమ్।**
**శిష్యాయోపభృతం తేజో-భృగుభిర్బ్రహ్మవాదిభిః॥** 28

**ప్రతిపదార్థము :** మఘవన్=ఓ మహేంద్రా!, అస్య=ఈ, శత్రోః=శత్రువగు బలియొక్క, ఉన్నతేః =అభ్యున్నతికి, కారణమ్=కారణమును, జానామి=నేనెఱుంగుదును. బ్రహ్మవాదిభిః= బ్రహ్మజ్ఞులగు, భృగుభిః=భృంగువంశీయులచేత, తేజః=తేజస్సు, శిష్యాయోపభృతమ్=ఈ శిష్యునకు కలుగజేసిరి.

**తాత్పర్యము :** ఓ మహేంద్రా! శత్రువగు బలియొక్క అభ్యున్నతికి కారణమును నేనెఱుంగుదును. బ్రహ్మజ్ఞులగు భృగువంశీయులచేత ఈ తేజస్సు శిష్యుడగు బలికి చేకూరినది.

**శ్లో॥ ఓజస్వినం బలిం జేతుం న సమర్థోఽస్తి కశ్చన**
**భవద్విధో భవాన్ వాపి వర్జయిత్వేశ్వరం హరిమ్।**

**శ్లో॥ విజేష్యతి న కోఽప్యేనం బ్రహ్మతేజస్సమేధితమ్**
**నాస్య శక్తః పురః స్థాతుం-కృతాన్తస్య యథా జనాః॥** 29

**ప్రతిపదార్థము :** ఓజస్వినమ్=బలశాలియగు, బలిమ్=బలిచక్రవర్తిని, జేతుమ్=జయించుటకు, కశ్చన=ఎవ్వడును, సమర్థః=సమర్థుడు, న అస్తి=కాలేడు, ఈశ్వరమ్=భగవంతుడగు, హరిమ్=హరిని, వర్జయిత్వా=మినహాయించి, భవాన్=నీవుగాని, భవద్విధః అపి=నీవంటివారు గాని, కః అపి=ఎవ్వడును, బ్రహ్మతేజ స్సమేధితమ్=బ్రహ్మతేజస్సుచే వెలుగొందుచున్న, ఏనమ్=వీనిని, న విజేష్యతి=జయింపజాలడు. కృతాన్తస్య=యమునికి, పురః=యెదుట, యథా జనాః=మానవులవలె, అస్య పురః=ఈ బలిచక్రవర్తి యెదుట, స్థాతుమ్=నిలుచుటకు, న శక్తః=సమర్థుడు కాడు.

**తాత్పర్యము :** బలశాలియగు బలిచక్రవర్తిని జయించుటకు ఎవ్వడును సమర్థుడు కాలేడు. భగవంతుడగు శ్రీహరి తప్ప నీవుగాని, నీవంటివారుగాని ఎవ్వడును బ్రహ్మతేజముచే వెలుగొందుచున్న వీనిని జయింపజాలడు. యమునికి ఎదుట మానవులవలె, ఈ బలి చక్రవర్తి యెదుట నిలుచుటకు సమర్థులు కారు.

**శ్లో॥ తస్మాన్నిలయముత్సృజ్య యూయం సర్వే త్రివిష్టపమ్।**
**యాత కాలం ప్రతీక్షన్తో యతః శత్రోర్విపర్యయః॥** 30

**ప్రతిపదార్థము :** తస్మాత్=అందువలన, యూయమ్=మీరు, సర్వే=ఎల్లరు, త్రివిష్టపమ్=దేవ నగరమును, ఉత్సృజ్య=విసర్జించి, నిలయమ్=కనబడక, యాత=పొందు. యతః శత్రోః =పగతునికి, విపర్యయః=చెడుకాలముకలుగునో, కాలమ్=ఆ కాలమును, ప్రతీక్షన్తః =నిరీక్షించుచుండుడు.

**తాత్పర్యము :** అందువలన మీరందరు స్వర్గమును వీడి కనపడక పోయి దాఁగికొనుడు. పగతుడైన బలికి మరలనెప్పుడు చెడుకాలము సంప్రాప్తించునో దానిని వేచి యుండుడు.

**శ్లో॥ ఏష విప్రబలోదర్కః సమ్ప్రత్యూర్జితవిక్రమః।**
**తేషామేవావమానేన సానుబన్ధో వినఙ్క్ష్యతి॥ 31**

**ప్రతిపదార్థము :** ఏషః=ఈ బలి, సంప్రతి=ఇపుడు, విప్రబల+ఉదర్కః=బ్రాహ్మణుల తేజోబలముచే నుత్తరోత్తరమధికమగు బలము కలుగువాడై, ఊర్జిత విక్రమః=దృఢమైన పరాక్రమము గలవాడైనాడు, తేషామ్=ఆ విప్రులయొక్క, అవమానేన=అవమానముచే, స+అనుబన్ధః=తన బంధుపరివారముతో గూడ, వినంక్ష్యతి=నశింపగలడు.

**తాత్పర్యము :** ఈ బలి యిప్పుడు బ్రాహ్మణుల తేజోబలముచేనుత్తరోత్తరమధికమగు బలము గలిగి దిట్టమైన పరాక్రమము గలవాడైయున్నాడు. ఆ బ్రాహ్మణుల నవమానించుటచే నితడు బంధుపరివారముతో నశింపగలడు.

**శ్లో॥ ఏవమ్ సుమన్త్రితార్థాస్తే గురుణార్థానుదర్శినా।**
**హిత్వా త్రివిష్టపం జగ్ముర్గీర్వాణాః కామరూపిణః॥ 32**

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, అర్థ+అనుదర్శినా=చేయదగినపనిని తెలుపుటతో, గురుణా=బృహస్పతిచే, సుమన్త్రితార్థాః=ఆలోచింపబడిన ప్రస్తుతకార్యము గలవారై, తే=ఆ, గీర్వాణాః=దేవతలు, కామరూపిణః=ఇచ్చవచ్చిన రూపములు గలవారు, త్రివిష్టపమ్=స్వర్గమును, హిత్వా=వీడి, జగ్ముః=పోయిరి.

**తాత్పర్యము :** ఇట్లు కార్యవిదుడైన బృహస్పతి ప్రస్తుతము చేయవలసిన పనిని తెలుపుటతో ఆ దేవతలు కామరూపులై స్వర్గమును వీడిపోయిరి.

**శ్లో॥ దేవేష్వథ నిలీనేషు బలిర్వైరోచనః పురీమ్।**
**దేవధానీమధిష్ఠాయ వశం నిన్యే జగత్త్రయమ్॥ 33**

**ప్రతిపదార్థము :** దేవేషు=దేవతలు, నిలీనేషు=స్వర్గమును వీడి దాగినవారు కాగా, అథ=అంత, వైరోచనః=విరోచనుని కుమారుడు, బలిః=బలి, దేవధానీమ్=దేవతల రాజధానియగు, పురీమ్=ఇంద్రపురిని, అధిష్ఠాయ=అధిష్ఠించి, జగత్+త్రయమ్=స్వర్గమర్త్యపాతాళములను మూడు లోకములను, వశమ్=తన వశము, నిన్యే=తీసుకొనెను.

**తాత్పర్యము :** దేవతలు పోయి దాగినంతనే విరోచనునికుమారుడగు బలి ఇంద్రపురిని జొచ్చి ఇంద్రునిస్థానమునాక్రమించుకొని ముల్లోకములను తనకు వశము చేసుకొనెను.

**శ్లో॥ తం విశ్వజయినం శిష్యం భృగవః శిష్యవత్సలాః।**
**శతేన హయమేధానామనువ్రతమయాజయన్॥ 34**

**ప్రతిపదార్థము :** శిష్యవత్సలాః=శిష్యులందు ప్రేమగలవారైన, భృగవః=భృగు వంశజులు, శుక్రాచార్యాదులు, అనువ్రతమ్=తమ్మనుసరించియున్న, విశ్వజయినమ్=విశ్వజేతయైన, శిష్యమ్=శిష్యుడైన, తమ్=ఆ బలిని (చే), హయమేధానామ్=అశ్వమేధముల యొక్క, శతేన=నూటిచే, అయాజయన్=యాజింపజేసిరి.



**తాత్పర్యము :** శిష్యులందు వాత్సల్యముగల శుక్రాచార్యుదులోనగు భృగువంశీయులు విశ్వజేతయై తమ్మనుసరించియున్న శిష్యుడగు ఆ బలిచేత ఇంద్రపదవి స్థిరపడుటకై నూఱు అశ్వమేధయాగములు చేయించిరి.

**శ్లో॥ తతస్తదనుభావేన-భువనత్రయవిశ్రుతామ్।**
**కీర్తిం దిక్షు వితన్వానః-స రేజ ఉడురాడివ॥ 35**

**ప్రతిపదార్థము :** తతః=పిమ్మట, తత్+అనుభావేన=ఆ అశ్వమేధముల ప్రభావముచే, భువన త్రయవిశ్రుతామ్=త్రిలోక విశ్రుతమగు, కీర్తిమ్=కీర్తిని, దిక్షు=దిక్కులందు, వితన్వానః= విస్తరింపజేయుచు, సః=ఆ బలి, ఉడురాట్+ఇవ=నక్షత్రములకు రాజైన చంద్రుడు వలె, రేజే=విరాజిల్లెను.

**తాత్పర్యము :** అంత నా నూఱశ్వమేధముల ప్రభావమువలన ఆ బలి ముల్లోకములందు వ్యాపించిన తన కీర్తిని దశదిశలందు విస్తరింపజేయుచు చంద్రునివలె నొప్పెను.

**శ్లో॥ బుభుజే చ శ్రియం స్వృద్ధాం ద్విజదేవోపలమ్భితామ్।**
**కృతకృత్యమివాత్మానం మన్యమానో మహామనాః॥ 36**

**ప్రతిపదార్థము :** మహామనాః=దొడ్డ మనస్సుగలవాడైన బలి, ద్విజదేవ+ఉపలమ్భితామ్ =దేవతలతో సమానులైన విప్రులచే ప్రాపింపబడిన, సు+ఋద్ధామ్=సమృద్ధిశాలినియగు, శ్రియమ్=త్రిలోకరాజ్యలక్ష్మిని, ఆత్మానమ్=తన్ను, కృతకృత్యమ్ ఇవ=ధన్యునిగా, మన్యమానః =తలంచుచు, బుభుజే=అనుభవించెను.

**తాత్పర్యము :** దొడ్డవాడైన బలి తన్ను ధన్యునిగాఁదలంచుచు విప్రవర్యులచే సంపాదింపబడిన త్రిలోకరాజ్యలక్ష్మిననుభవించెను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కన్ధే పఞ్చదశో - ధ్యాయః.

ఇది శ్రీ మద్భాగవతమహాపురాణమున అష్టమస్కన్ధమున పఞ్చదశాధ్యాయము.

**తాత్పర్యము :** ఓ ఈశ! నిన్ను సేవించుటచే నా శ్రేయస్సును గూర్చి యాలోచింపుము. దైత్యులచే హరింపబడిన సంపదలు, హరింపబడిన రాజ్యము గల మమ్ము రక్షింపుము.

**శ్లో॥ పరైర్వివాసితా సాహం-మగ్నా వ్యసనసాగరే।**
**ఐశ్వర్యం శ్రీర్యశః స్థానం-హృతాని ప్రబలైర్మమ॥ 16**

**ప్రతిపదార్థము :** సా+అహమ్=ఆ నేను, పరైః=శత్రువులచే, వివాసితా=వేరు దేశమునకు వెడలుగొట్టబడినదానినై, వ్యసనసాగరే=దుఃఖసముద్రమునందు, మగ్నా=మునిగియున్నాను. ప్రబలైః=బలవంతులచే, మమ=నా యొక్క, ఐశ్వర్యమ్=సంపదను (ప్రభుత్వము), శ్రీః =రాజ్యము, యశః=కీర్తి, స్థానమ్=చోటు, హృతాని=హరింపబడినవి.

**తాత్పర్యము :** ఆ నేను శత్రువులచే వేరు దేశమునకు వెడలుగొట్టబడినదానినై దుఃఖసముద్రము నందు మునిగియున్నాను. బలవంతులచే నాయొక్క ప్రభుత్వము, రాజ్యము, కీర్తి, చోటు హరింపబడినవి.

**శ్లో॥ యథా తాని పునః సాధో!-ప్రపద్యేరన్ మమాత్మజాః।**
**తథా విధేహి కళ్యాణం-ధియా కల్యాణకృత్తమ॥ 17**

**ప్రతిపదార్థము :** యథా=ఏ విధంగా, మమ+ఆత్మజాః=నా పుత్రులు దేవతలు, పునః=మరల, తాని=ఆ పోగొట్టుకొనిన వానిని, ప్రపద్యేరన్=పొందగలరో, సాధో=ఓ సత్పురుషుడా!, కల్యాణ కృత్తమ!=శుభమును గలిగించువారిలోనుత్తముడా!, తథా=ఆ విధముగా, కల్యాణమ్= శుభమును, ధియా=బుద్ధితో, విధేహి=కావింపుము.

**తాత్పర్యము :** ఓ మేలుజేయుగోరువాడా! ఓ సత్పురుషుడా! నా కుమారులు ఆ పోగొట్టుకొనిన వానిని ఏ విధముగా మరల పొందగలరో, ఆ విధముగ శుభమును మనస్సుతో నాచరింపుము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీశుకుడు వచించెను.

**శ్లో॥ ఏవమభ్యర్థితోఽదిత్యా-కస్తామాహ హసన్నివ। 18**

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఈ ప్రకారము, అదిత్యా=అదితిచే, అభ్యర్థితః=యాచింపబడిన, కః=కశ్యపుడు, తామ్=ఆయదితిని గూర్చి, హసన్+ఇవ=నవ్వుచున్నవాని వలె, ఆహ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** అదితి తన్ను నిట్లు యాచింపగా కశ్యపుడు నవ్వుచు నిట్లనెను.

**కశ్యప ఉవాచ :** కశ్యపుడు వచించెను.

**శ్లో॥ అహో మాయా బలం విష్ణోః స్నేహబద్ధమిదం జగత్।**
**క్వ దేహో భౌతికోఽనాత్మా-క్వ చాత్మా ప్రకృతేః పరః।**
**కస్య కే పతిపుత్రాద్యా-మోహ ఏవ హి కారణమ్॥ 19**

**ప్రతిపదార్థము :** విష్ణోః=విష్ణువు యొక్క, మాయాబలమ్=మాయ యొక్క బలము, అహో= ఓరా ఏమి?, ఇదమ్ జగత్=ఈ జగము, స్నేహబద్ధమ్=ఒండొరులపై నెయ్యమున గట్టుబడినది, భౌతికః=పంచభూతముల అంశమైన, అనాత్మా=ఆత్మకాని, దేహః=శరీరము,



**ప్రతిపదార్థము :** భద్రే=ఓ మంగలశాలినీ!, లోకే=లోకమున, అధునా=ఇప్పుడు, విప్రాణామ్= విప్రులకు, అపి+అభద్రమ్+న=అశుభములేదుగదా!, ధర్మస్య=ధర్మమునకు, న=కీడులేదు గదా!, న లోకస్య=లోకమునకు చెడులేదు కదా!, మృత్యోః=మృత్యుదేవత యొక్క, ఛంద+అనువర్తినః=ఇష్టము మీద వర్తించు జనమునకు, న=అమంగళము లేదు గదా!,

**తాత్పర్యము :** ఓ మంగలశాలినీ! లోకమునందిప్పుడు విప్రులకు అశుభము లేదు గదా! ధర్మమునకు, లోకమునకు మృత్యువునకధీనులై వర్తించు జనములకు అమంగళము పొరలుదు గదా!

**శ్లో॥ అపి వా కుశలం కిఞ్చిద్గృహేషు గృహమేధిని।**
**ధర్మస్యార్థస్య కామస్య-యత్ర యోగో హ్యయోగినామ్॥ 5**

**ప్రతిపదార్థము :** గృహమేధిని=ఓ ఇల్లాలా!, గృహేషు=గృహస్థుల గృహములందు, కించిత్= ఇంచుక, అపి వా కుశలమ్=అమంగళము కలిగినదా?, అయోగినామ్=యోగనిష్ఠలేనివారికిని, యత్ర=ఏ గృహములందు, ధర్మస్య=ధర్మమునకును, అర్థస్య=అర్థమునకు, కామస్య= కామమునకు, యోగః హి=యోగఫలము గలుగునో-

**తాత్పర్యము :** ఓ ఇల్లాలా! ఏ గృహములందు యోగనిష్ఠలేని గృహస్థులకు సైతము ధర్మార్థ కామ ఫలములు గలుగుచుండునో అట్టి గృహమున ఇంచుక అమంగళము కలిగినదా?

**శ్లో॥ అపి వాతిథయో హ్యత్ర కుటుమ్బాసక్తయా త్వయా।**
**గృహాదపూజితా యాతాః-ప్రత్యుత్థానేన వా క్వచిత్॥ 6**

**ప్రతిపదార్థము :** యత్ర=ఈ నీ యాశ్రమమునందు, అతిథయః=అతిథులు, కుటుంబ+ ఆసక్తయా=కుటుంబమునందు వాంఛగల, త్వయా=నీచేత, గృహాత్=గృహమునుండి, క్వచిత్=ఎప్పుడైనా, ప్రత్యుత్థానేన=ఎదుర్కోలు లేకయు, అపూజితాః=పూజింపబడనివారై, అపి హి యాతాః=వెడలిపోయినారా ఏమి?

**తాత్పర్యము :** నీ యాశ్రమమునకు వచ్చిన యతిథులు పుత్రాదులకుటుంబములందు మిగుల నాసక్తిగల నీ చేత ఎదుర్కోలు లేక పూజింపబడకయు నీ గృహమునుండి మరలిపోయిరా ఏమి?

**శ్లో॥ గృహేషు యేష్వతిథయో నార్చితాః సలిలైరపి।**
**యది నిర్యాన్తి తే నూనం ఫేరురాజగృహోపమాః॥ 7**

**ప్రతిపదార్థము :** యేషు గృహేషు=ఏ గృహములందు, అతిథయః=అతిథులు, సలిలైః+అపి= ఉదకములచేతనైనను, న+అర్చితాః=పూజింపబడనివారై, యది నిర్యాన్తి=మరలిపోయినవారగు నేని, తే=ఆ గృహములు, ఫేరురాజగృహ+ఉపమాః=నక్కల రాయని బొక్కలతో సమానమైనవి.

**తాత్పర్యము :** ఏ గృహములకు వచ్చి అతిథులు జలముచేనైనను సత్కారముపొందక మరలి పోవుదురో ఆ గృహములు నక్కలరాయని నివసించు బొక్కలతో సమానమైనవి.

**శ్లో॥ అప్యగ్నయస్తు వేలాయాం-న హుతా హవిషా సతి।**
**త్వయోద్విగ్నధియా భద్రే-ప్రోషితే మయి కర్హిచిత్॥ 8**

**ప్రతిపదార్థము :** సతి=ఓ సాధ్వీ, భద్రే=ఓ మంగళశీలా!, మయి=నేను, ప్రోషితే=నిన్ను విడిచిపోయినవాడను కాగా, ఉద్విగ్నధియా=వ్యథనొందిన మనస్సుతో, త్వయా=నీ చేత, కర్హిచిత్=ఎప్పుడైన, వేలాయామ్=తగిన వేళయందు, తే=ఆ, అగ్నయః=త్రేతాగ్నులు, హవిషా=హవిస్సు చేత, న హుతా అపి=వ్రేల్వబడలేదా!

**తాత్పర్యము :** ఓ సాధ్వీ! మంగళశీలా! నేను నిన్ను విడిచిపోయిన తరువాత, నీవు వ్యథ చెందిన మనస్సుతో నెప్పుడైన తగినవేళకు అగ్నులందు హవిస్సుతో హోమము చేయక పోయినావా!

త్రేత+అగ్నులు=ఆహవనీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అనునవి.

**శ్లో॥ యత్పూజయా కామదుఘాన్ యాతి లోకాన్ గృహాన్వితః।**
**బ్రాహ్మణోఽగ్నిశ్చ వై విష్ణోః-సర్వదేవాత్మనో ముఖమ్॥ 9**

**ప్రతిపదార్థము :** గృహాన్వితః=స్వధర్మనియమముననుండు గృహస్థుడు, యత్+పూజయా=ఏ అగ్నిపూజచే, కామదుఘాన్=ఇష్టములను పెంచునట్టి, లోకాన్=లోకములను గూర్చి, యాతి=పోవుచున్నాడు. బ్రాహ్మణః=బ్రాహ్మణుడు, అగ్నిః+చ=అగ్నియు, సర్వదేవాత్మనః=సర్వ దేవమయుడగు, విష్ణోః=విష్ణువుయొక్క, ముఖమ్=ముఖమగును.

**తాత్పర్యము :** స్వధర్మపరుడై గృహస్థుడగ్ని పూజచేయువాడగునేని సమస్తసుఖములఁగూర్చు స్వర్గాదిలోకములు పొందుచున్నాడు. సర్వదేవతామయుడగు విష్ణువునకు బ్రాహ్మణుడు, అగ్నియు ముఖమై యున్నారు.

**శ్లో॥ అపి సర్వే కుశలినస్తవ పుత్రా మనస్విని!।**
**లక్షయేఽస్వస్థమాత్మానం భవత్యా లక్షణైరహమ్॥ 10**

**ప్రతిపదార్థము :** మనస్విని!=ఓ మానవతీ!, తవ=నీ యొక్క, సర్వే పుత్రాః=పుత్రులెల్లరు, అపి కుశలినః=కుశలులే కదా!, భవత్యాః=నీ యొక్క లక్షణైః=చిహ్నముల చేత, అహమ్=నేను, ఆత్మానమ్=నన్ను, అస్వస్థమ్=వెతగూడినవానినిగా, లక్షయే=ఊహించుచున్నాను.

**అదితిరువాచ :** అదితి వచించెను.

**శ్లో॥ భద్రం ద్విజగవాం బ్రహ్మన్! ధర్మస్యాస్య జనస్య చ।**
**త్రివర్గస్య పరం క్షేత్రం గృహమేధిన్ గృహా ఇమే॥ 11**

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా!, గృహమేధిన్=ఓ గృహమేధీ!, ద్విజగవామ్=బ్రాహ్మణులకు, గోవులకు, ధర్మస్య=అనుష్ఠించిన ధర్మమునకు, అస్య జనస్య=ఈ జనమునకు, ఇమే గృహాః=ఈ గృహములు, త్రివర్గస్య=ధర్మార్థకామములకు, పరమ్=ఉత్తమమై, క్షేత్రమ్=ఉద్భవస్థానమై, భద్రమ్=కుశలముగ నున్నది.

**తాత్పర్యము :** ఓ విప్రోత్తమా!, ఓ గృహస్థా!, బ్రాహ్మణులకు, గోవులకు, స్వధర్మానుష్ఠాన పరులకు, ఈ జనమునకు, ఎల్లరకుఁగుశలమే. ఈ గృహము త్రివర్గమునకుత్తమమై ఉద్భవ స్థానమై క్షేమముగనే వర్తించుచున్నది.



**శ్లో॥ అగ్నయోఽతిథయో భృత్యా భిక్షవో యే చ లిప్సవః।**
**సర్వం భగవతో బ్రహ్మన్ననుధ్యానాన్న రిష్యతి॥ 12**

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ బ్రాహ్మణోత్తమా, అగ్నయః=అగ్నులు, అతిథయః=అతిథులు, భృత్యాః=సేవకులు, భిక్షవః=యాచకులు, యే=ఎవ్వరు, లిప్సవః=భిక్షకులు, సర్వమ్=వీరందఱు, భగవతః=భగవంతుడవగు నీయొక్క, అనుధ్యానాత్=ధ్యాన ప్రభావము వలన, న రిష్యతి=తక్కువ చేయబడలేదు.

**తాత్పర్యము :** ఓ బ్రాహ్మణోత్తమా! అగ్నులు, అతిథులు, సేవకులు, యాచకులు, భిక్షకులెల్లరు భగవంతుడవగు నీ ధ్యానప్రభావము వలన తక్కువ చేయబడలేదు.

**శ్లో॥ కో ను మే భగవన్! కామో న సమ్పద్యేత మానసః।**
**యస్యా భవాన్ ప్రజాధ్యక్ష-ఏవం ధర్మాన్ ప్రభాషతే॥ 13**

**ప్రతిపదార్థము :** యస్యాః=ఎవతెకు, ప్రజాధ్యక్షః=ప్రజాపతియైన, భవాన్=నీవు భర్తవై, ఏవమ్=ఈ ప్రకారము, ధర్మాన్=ధర్మములను, ప్రభాషతే=సంభాషించుచున్నావో, భగవన్=ఓ భగవానుడా!, మే=నా యొక్క, మానసః=మనస్సులోని, కోను కామః=ఏ వాంఛ, న సంపద్యేత=పొందకుండునో.

**తాత్పర్యము :** ఓ భగవానుడా! ప్రజాపతివైన నీవు నాకు భర్తవై యిట్టి ధర్మముల నుపదేశించుటచే నా యొక్క మనస్సు ఏ వాంఛ పొందకుండును.

**శ్లో॥ తవైవ హే దేవ మనః శరీరజాః ప్రజా ఇమాః సత్త్వరజస్తమోజుషః।**
**సమో భవాంస్తాస్వసురాదిషు ప్రభో తథాపి భక్తం భజతే మహేశ్వరః॥ 14**

**ప్రతిపదార్థము :** హే దేవ!=ఓ భగవంతుడా!, మనః శరీరజాః=మనస్సునుండియు, శరీరము నుండియు జనించిన, ఇమాః ప్రజాః=నీ పుత్రులైన సురాసురులు, సత్త్వరజస్తమోజుషః=సత్త్వము, రజస్సు, తమస్సు అను గుణములుగలవారై యున్నారు. ప్రభో=ఓ ప్రభూ!, మహేశ్వరః=మహాదేవుడు, భక్తమ్=భక్తులపై, భజతే తథాపి=స్నేహమును చూపునట్లే, భవాన్=నీవు, తాసు=ఆ, సురాదిషు=దేవతలులోనగువారియందు, సమః=సమదృష్టి యున్నాడవు.

**తాత్పర్యము :** ఓ దేవా! మనస్సునుండియు, శరీరమునుండియు జనించిన నీ పుత్రులైన సురాసురులు సత్త్వరజస్తమోగుణములు గలవారై యున్నారు. ఓ ప్రభు, మహాదేవుడు భక్తులపై స్నేహమును చూపునట్లే నీవు ఆ సురాసురులందు సమదృష్టియున్నాడవు.

**శ్లో॥ తస్మాదీశ! భజన్త్యా మే శ్రేయశ్చిన్తయ సువ్రత।**
**హృతశ్రియో హృతస్థానాన్ సపత్నైః పాహి నః ప్రభో॥ 15**

**ప్రతిపదార్థము :** తస్మాత్=అందువలన, ఈశ! ప్రభో=ఓ ప్రభూ, సువ్రత=ఓ సువ్రతా!, భజన్త్యాః=నిన్ను సేవించుటచే, మే=నా యొక్క, శ్రేయః=శ్రేయస్సును గూర్చి, చిన్తయ=ఆలోచింపుము. సపత్నైః=దైత్యులచే, హృతశ్రియః=హరింపబడిన సంపదలుగల, హృతస్థానాన్=హరింపబడిన రాజ్యముగల, నః=మమ్ము, పాహి=రక్షింపుము.

**ప్రతిపదార్థము :** ద్విశీర్ష్ణే=ప్రాయణీయము, ఉదయనీయము - అను రెండు క్రియలు శిరస్సులు గలవాడవు, త్రిపదే=ప్రాతర్మధ్యాహ్నసాయం సమయములను మూడుఁబాదములు గల వాడవు, చతుఃశృఙ్గాయ=ఏడు ఛందస్సులు హస్తమునగలవాడవు, త్రయీవిద్యా+ఆత్మనే =ఋగ్యజుస్సామములను విద్యయందు ఆత్మకుడవు, యజ్ఞాయ=యజ్ఞరూపుడవు, తన్తవే= యజ్ఞ ఫల విస్తారకుడవైన, తుభ్యమ్=నీ కొఱకు, నమః=నమస్సు.

**తాత్పర్యము :** ద్విశీర్షుడు, త్రిపదుడు, చతుఃశృంగుడు, సప్తహస్తుడు, త్రయీవిద్యాత్మకుడు, యజ్ఞుడు, యజ్ఞఫల విస్తారకుడవైన నీ కొఱకు నమస్సు.

**శ్లో॥ నమశ్శివాయ రుద్రాయ-నమశ్శక్తిధరాయ చ।**
**నమస్సర్వాధిపతయే-భూతానాం పతయే నమః॥** 32

**ప్రతిపదార్థము :** శివాయ=శివుడగు, రుద్రాయ=రుద్రుని కొఱకు, నమః=నమస్సు, శక్తిధరాయ =గౌరిరూపమగు శక్తిని ధరించినవాని కొఱకు, నమః=నమస్కారము. సర్వ+ అధిపతయే =సమస్త జగమునకు అధిపతియైనవాని కొఱకు, నమః=నమస్కారము, భూతానామ్= భూతముల యొక్క, పతయే=పతి కొఱకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** శివుడు, రుద్రుడు, శక్తిధరుడు, సర్వాధిపతి, భూతపతి కొఱకు నమస్కారము. అట్టి విష్ణువునకు నమస్కారము.

**శ్లో॥ నమో హిరణ్యగర్భాయ-ప్రాణాయ జగదాత్మనే।**
**యోగైశ్వర్యశరీరాయ-నమస్తే యోగహేతవే॥** 33

**ప్రతిపదార్థము :** హిరణ్యగర్భాయ=హిరణ్యగర్భుడవు, ప్రాణాయ=ప్రాణస్వరూపుడవు, జగత్+ ఆత్మనే=జగజ్జీవనుడవు, యోగైశ్వర్యశరీరాయ=యోగైశ్వర్యమయుడవు, యోగహేతవే= యోగమునకు కారణభూతుడవగు, తే=నీ కొఱకు, నమః=నమస్కారము.

**శ్లో॥ నమస్తే ఆదిదేవాయ సాక్షిభూతాయ తే నమః।**
**నారాయణాయ ఋషయే నరాయ హరయే నమః॥** 34

**ప్రతిపదార్థము :** ఆదిదేవాయ=ఆదిదేవుడవు, సాక్షిభూతాయ=సాక్షి స్వరూపుడవు అగు, తే=నీ కొఱకు, నమః=నమస్కారము, నారాయణాయ=నారాయణుడవు, ఋషయే=ఋషివి, హరయే=హరివినగు, తే=నీ కొఱకు, నమః=నమస్కారము.

**శ్లో॥ నమో మరకతశ్యామవపుషేఽధిగతశ్రియే।**
**కేశవాయ నమస్తుభ్యం నమస్తే పీతవాససే॥** 35

**ప్రతిపదార్థము :** మరకతశ్యామవపుషే=గరుడపచ్చవలె శ్యామలవర్ణ దేహమును ధరించిన వాడవు, అధిగతశ్రియే=శ్రీని పొందినవాడవగు, తే=నీ కొఱకు నమస్కారము. కేశవాయ= కేశవుడగు, తుభ్యమ్=నీ కొఱకు నమస్కారము. పీతవాససే=పీతాంబరుడవగు, తే=నీ కొఱకు నమస్కారము.

**శ్లో॥ త్వం సర్వవరదః పుంసాం-వరేణ్య! వరదర్షభ!।**
**అతస్తే శ్రేయసే ధీరాః-పాదరేణుముపాసతే॥** 36



క్వ=ఎక్కడ, ప్రకృతేః=మాయకంటె, పరః=వేఱైన, ఆత్మా=పరమాత్మ, క్వ=ఎక్కడ, కస్య=ఏ జనునికి, పతిపుత్రాద్యాః=భర్త పుత్రుడులోనగువారు, కే=ఎవరు, మోహః ఏవ హి=మోహమే కదా, కారణమ్=దానికంతటికి కారణము.

**తాత్పర్యము :** విష్ణుమాయ యొక్క బలము ఔరా ఏమి? జగమంతయు స్నేహబద్ధమై యున్నది కదా! పంచభూతాత్మకమగు ఆత్మకాని శరీరము ఎక్కడ? ప్రకృతికంటె వేఱైన పరమాత్మ యెక్కడ? ఏ జనునికి భర్తపుత్రుడు లోనగువారు ఎవరు? మోహమే దానికంతటికి కారణము గాదా!

**శ్లో॥ ఉపతిష్ఠస్వ పురుషం-భగవన్తం జనార్దనమ్।**
**సర్వభూతగుహావాసం-వాసుదేవం జగద్గురుమ్॥** 20

**ప్రతిపదార్థము :** పురుషమ్=పురుషోత్తముడు, భగవన్తమ్=షడ్గుణైశ్వర్య సంపన్నుడు, జనార్దనమ్ =శత్రునాశము చేయ సమర్థుడు, సర్వభూతగుహ+ఆవాసమ్=సర్వప్రాణుల హృదయమందు వసించువాడు, వాసుదేవమ్=శుద్ధచిత్తముతో జనించిన ప్రాణులకు శుభమును జేకూర్చు వాడగు, జగద్గురుమ్=లోకగురుని, శ్రీకృష్ణభగవానుని, ఉపతిష్ఠస్వ=ఉపాసింపుము.

**తాత్పర్యము :** పురుషోత్తముడు, భగవన్తుడు, జనార్దనుడు, సర్వప్రాణుల హృదయమందు వసించువాడు, వాసుదేవుడు, జగద్గురువగు శ్రీకృష్ణభగవానుని ఉపాసింపుము.

**శ్లో॥ స విధాస్యతి తే కామాన్-హరిర్దీనానుకమ్పనః।**
**అమోఘా భగవత్సేవా నేతరేతి మతిర్మమ॥** 21

**ప్రతిపదార్థము :** దీనానుకంపనః=దీనులయందు దయాళువును, సః హరిః=ఆ విష్ణువు, తే= నీయొక్క, కామాన్=వాంఛలను, విధాస్యతి=సమకూర్చగలడు. భగవత్+సేవా=భగవన్తుని సేవ, అమోఘా=విఫలము గానిది, న+ఇతరా+ఇతి=ఇతరము గాదని, మమ=నాయొక్క మతిః=అభిప్రాయము.

**తాత్పర్యము :** దీనుల రక్షణయందు దయాళువైన విష్ణువు నీ కోర్కెలనీడేర్చగలడు. భగవన్తుని సేవ వ్యర్థముగాదు సుమా! ఇతర సేవలేవియు దానికి సాటిరావని నా అభిప్రాయము.

**శ్రీ అదితిరువాచ :** అదితి వచించెను.

**శ్లో॥ కేనాహం విధినా బ్రహ్మన్నుపస్థాస్యే జగత్పతిమ్।**
**యథా మే సత్యసఙ్కల్పో విదధ్యాచ్చ మనోరథమ్॥** 22

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ మహాత్మా!, అహమ్=నేను, కేన విధినా= ఏ విధిననుసరించి, జగత్పతిమ్=జగద్గురువును, ఉపస్థాస్యే=ఆరాధింపవలెను. సత్యసంకల్పః=సత్యసంకల్పుడగు, సః=ఆ శ్రీహరి, మే=నా యొక్క, మనోరథమ్=మనోరథమును, యథా=ఎట్లు, విదధ్యాత్= ఈడేర్చునో.

**తాత్పర్యము :** ఓ మహాత్మా! నేను ఏ విధిననుసరించి జగద్గురువును ఆరాధింపవలెను. సత్యసంకల్పుడగు శ్రీహరి నా మనోరథమునెట్లు ఈడేర్చును.

**శ్లో॥ ఆదిశ త్వం ద్విజశ్రేష్ఠ! విధిం తదుపధావనమ్।**
**ఆశు తుష్యతి మే దేవః-సీదన్త్యాః సహ పుత్రకైః॥** 23

ప్రతిపదార్థము : ద్విజశ్రేష్ఠ=ఓ విప్రోత్తమా!, దేవః=విష్ణు భగవానుడు, పుత్రకైస్సహ=పుత్రులతో గూడి, సీదన్త్యాః=దుఃఖమునుపొందు, మే=నాకు, ఆశు=శీఘ్రముగా, తుష్యతి=సంతోషించునో, తత్+ఉపధావనమ్=అయ్యారాధనచేయు, విధిమ్=విధిని, ఆదిశ=ఆనతిమ్ము.

తాత్పర్యము : ఓ విప్రోత్తమా! విష్ణు భగవానుడు పుత్రులతో గూడి దుఃఖమును పొందిన నాకు శీఘ్రముగా ప్రసన్నుడగునో, అయ్యారాధనావిధిని నాకుపదేశింపుము.

శ్రీ కశ్యప ఉవాచ : శ్రీ కశ్యపుడు వచించెను.

శ్లో॥ ఏతన్మే భగవాన్ పృష్టః-ప్రజాకామస్య పద్మజః।
యదాహ తే ప్రవక్ష్యామి-వ్రతం కేశవతోషణమ్॥ 24

ప్రతిపదార్థము : భగవాన్=భగవంతుడైన, పద్మజః=కమలసంభవుడైన బ్రహ్మదేవుడు, ఏతత్=ఈ విషయమై, పృష్టః=అడుగబడినవాడై, ప్రజాకామస్య=పుత్రకాంక్షగల, మే=నాకు, యత్=ఏ వ్రతం, ఆహ=చెప్పెనో, కేశవతోషణమ్=విష్ణువునకు సంప్రీతినిచ్చు, వ్రతమ్=ఆ వ్రతమును, తే=నీకు, ప్రవక్ష్యామి=చెప్పగలను.

తాత్పర్యము : భగవంతుడగు బ్రహ్మదేవుడు పుత్రకాంక్షపై అడుగబడినవాడై నాకు ఏ వ్రతము చెప్పెనో, విష్ణువుకు సంప్రీతినిచ్చు వ్రతమును నీకు చెప్పెదను, వినుము.

శ్లో॥ ఫాల్గునస్యామలే పక్షే-ద్వాదశాహం పయోవ్రతమ్।
అర్చయేదరవిన్దాక్షం-భక్త్యా పరమయాన్వితః॥ 25

ప్రతిపదార్థము : ఫాల్గునస్య=ఫాల్గుణమాసము యొక్క, అమలే పక్షే=శుక్లపక్షమున, ద్వాదశాహమ్=పండ్రెండు దినములు, పయోవ్రతమ్=దుగ్ధపాన వ్రతమును, భక్త్యా=భక్తితో, పరమయాన్వితః=చక్కగానాచరించి, అరవిన్దాక్షమ్=కమలలోచనుడగు విష్ణుభగవానుని, అర్చయేత్=అర్చింపవలెను.

తాత్పర్యము : ఫాల్గున మాస శుక్లపక్షమునందు పండ్రెండు దినములు దుగ్ధపానవ్రతమును భక్తితో చక్కగనాచరించి కమలలోచనుని అర్చింపవలెను.

శ్లో॥ సినీవాల్యాం మృదాలిప్య-స్నాయాత్ క్రోడవిదీర్ణయా।
యది లభ్యేత వై స్రోతస్యేతం మన్త్రముదీరయేత్॥ 26

ప్రతిపదార్థము : యదిలభ్యేత=దొరికినచో, క్రోడవిదీర్ణయా=అడవిపందిచే త్రవ్వబడిన, మృదా=మట్టితో, సినీవాల్యామ్=అమావాస్యదివసమున, ఆలిప్య=దేహమునకు బూసికొని, స్రోతసి=నదీ ప్రవాహమున, స్నాయాత్=స్నానము చేయవలెను, ఏతమ్=ఈ, మంత్రమ్=మంత్రమును, ఉదీరయేత్=జపింపవలెను.

తాత్పర్యము : అడవిపందిచే త్రవ్వబడిన మట్టిని పొంది దానిని అమావాస్య దివసమున దేహమునకు బూసికొని, నదీప్రవాహమున స్నానముచేసి మంత్రమును జపింపవలెను.

శ్లో॥ త్వం దేవ్యాదివరాహేణ-రసాయాః స్థానమిచ్ఛతా।
ఉద్ధృతాసి నమస్తుభ్యం-పాప్మానం మే ప్రణాశయ॥ 27



ప్రతిపదార్థము : దేవి!=ఓ పృథ్వీదేవి!, స్థానమిచ్ఛతా=స్థానాభిలాషియు, ఆదివరాహేణ=ఆది వరాహరూపుడునగు భగవానునిచే, త్వమ్=నీవు, మే=నా యొక్క, పాప్మానమ్=సర్వ పాపములను, ప్రణాశయ=నాశము చేయుము. తుభ్యమ్=నీకు, నమః=నమస్కారము.

తాత్పర్యము : ఓ పృథ్వీదేవి! స్థానాభిలాషియు, ఆదివరాహరూపుడగు భగవానునిచే నీవు రసాతలము నుండి పైకి తీసుకొనిరాబడితివి. నీవు నా సర్వపాపములను నాశము చేయుము. నీకు నమస్సు.

శ్లో॥ నిర్వర్తితాత్మనియమో-దేవమర్చేత్ సమాహితః।
అర్చాయాం స్థణ్డిలే సూర్యే-జలే వహ్నౌ గురావపి॥ 28

ప్రతిపదార్థము : నిర్వర్తిత+ఆత్మనియమః=నిత్యనైమిత్తిక నియమమును నెరవేర్చినవాడై, సమాహిత=చక్కగా శ్రద్ధగలవాడై, దేవమ్=భగవంతుని, అర్చాయామ్=అర్చామూర్తిని, స్థణ్డిలే=భూమియందు, సూర్యే= సూర్యునియందు, జలే=ఉదకమందు, వహ్నౌ=అగ్నియందు, గురౌ+అపి=గురువునందును, అర్చేత్=అర్చింపవలెను.

తాత్పర్యము : పిమ్మట, నిత్యనైమితిక నియమమును చక్కగా పూర్తిచేసి భగవంతుని అర్చామూర్తిని భూమియందు (యజ్ఞ ప్రదేశమందు), సూర్యుని యందు, ఉదకమందు, అగ్నియందు, గురువునందును అర్చింపవలయును.

శ్లో॥ నమస్తుభ్యం భగవతే-పురుషాయ మహీయసే।
సర్వభూతనివాసాయ-వాసుదేవాయ సాక్షిణే॥ 29

ప్రతిపదార్థము : దేవ!=ఓ దేవా!, మహీయసే=మహనీయుడవు, పురుషాయ=పరమ పురుషుడవు, సర్వభూతనివాసాయ=సర్వప్రాణులకు ఆశ్రయమైనవాడవు, వాసుదేవాయ=వాసుదేవుడవు, సాక్షిణే=సర్వసాక్షిస్వరూపుడవు, భగవతే=భగవంతుడవగు, తుభ్యమ్=నీ కొఱకు, నమః=నమస్సు.

తాత్పర్యము : ఓ దేవా! మహనీయుడవు, పురుషోత్తముడవు, సర్వప్రాణులకు ఆధారభూతుడవు, వాసుదేవుడవు, సాక్షిస్వరూపుడవు, భగవంతుడవగు నీకొఱకు నమస్సు.

శ్లో॥ నమోఽవ్యక్తాయ సూక్ష్మాయ-ప్రధానపురుషాయ చ।
చతుర్వింశద్గుణజ్ఞాయ-గుణసఙ్ఖ్యానహేతవే॥ 30

ప్రతిపదార్థము : అవ్యక్తాయ=వ్యక్తముకానివాడవు, సూక్ష్మాయ=సూక్ష్ముడవు, పరమపురుషాయ=పరమ పురుషుడవును, చతుర్వింశద్గుణజ్ఞాయ=ఇరువది నాలుగు గుణముల తత్త్వము నెఱింగిన వాడవు, గుణసంఖ్యాన హేతవే=సాంఖ్యమును ప్రవర్తిల్లచేసిన వాడవును అగు, (తుభ్యమ్=నీ కొఱకు), నమః=నమస్కారము.

తాత్పర్యము : వ్యక్తముకాని వాడవు, సూక్ష్ముడవు, పరమ పురుషుడవు, చతుర్వింశతి గుణముల తత్త్వము నెఱింగినవాడవు, సాంఖ్యప్రవర్తకుడవగు నీ కొఱకు నమస్సు.

శ్లో॥ నమో ద్విశీర్ష్ణే త్రిపదే చతుఃశృఙ్గాయ తన్తవే।
సప్తహస్తాయ యజ్ఞాయ-త్రయీవిద్యాత్మనే నమః॥ 31

**శ్లో॥ హరేరారాధనం హోమమర్హణం ద్విజతర్పణమ్।**
**ప్రతిపద్దినమారభ్య యావచ్ఛుక్లత్రయోదశీమ్॥ 48**

**ప్రతిపదార్థము :** హరేః=విష్ణువు యొక్క, ఆరాధనమ్=పూజను, హోమమ్=హోమమును, అర్హణమ్=స్తుతిని, ద్విజతర్పణమ్=బ్రాహ్మణ సంతర్పణమును, ప్రతిపత్+దినమ్=శుక్ల పాడ్యమిని, ఆరభ్య=మొదలుకొని, యావత్+శుక్లత్రయోదశీమ్=శుద్ధ త్రయోదశి పర్యన్తము, (కుర్యాత్=చేయవలయును).

**తాత్పర్యము :** విష్ణుపూజ, హోమము, స్తుతి, బ్రాహ్మణసంతర్పణము, ప్రతిదినమాచరించ వలెను. ఇట్లు పాడ్యమి మొదలు శుద్ధ త్రయోదశి పర్యన్తము చేయవలెను.

**శ్లో॥ బ్రహ్మచర్యమథః స్వప్నం స్నానం త్రిషవణం చరేత్।**
**వర్జయేదసదాలాపం-భోగానుచ్చావచాంస్తథా॥ 49**

**ప్రతిపదార్థము :** బ్రహ్మచర్యమ్=బ్రహ్మచర్యమును, అథ=తర్వాత, స్వప్నమ్=శయనమును, త్రిషవణమ్=ప్రతిదినమున మూడు వేళల, స్నానమ్=స్నానమును, చరేత్=ఆచరించవలెను. అసత్+ఆలాపమ్=చెడ్డ సంభాషణము, తథా=అట్లే, భోగానుచ్చావచాన్=నానా విషయ భోగములను, వర్జయేత్=త్యజింపవలయును.

**తాత్పర్యము :** బ్రహ్మచర్యమవలంబించి రాత్రులయందు భూశయనమును, ప్రతిదినమున మూడు వేళల స్నానము చేయుచుండవలెను. దుష్ట సంభాషణమును, అధికమైన భోగానుభావములను వర్జింపవలయును.

**శ్లో॥ అహింస్రః సర్వభూతానాం-వాసుదేవపరాయణః।**
**త్రయోదశ్యామథో విష్ణోః-స్నపనం పఞ్చకైర్విభోః॥ 50**

**ప్రతిపదార్థము :** సర్వభూతానామ్=ఎల్ల ప్రాణులకు, అహింస్రః=హింస చేయనివాడు, వాసుదేవ పరాయణః=వాసుదేవునియందు భక్తిగలిగినవాడు, అథ=అంతట, త్రయోదశ్యామ్=త్రయోదశి యందు, విభోః=ప్రభువగు, విష్ణోః=విష్ణువు కొఱకు, పంచకైః=(గోక్షీరము, దధి, ఘృతము, ఉదకము, తేనె అనునవి) పంచామృతములచే, స్నపనమ్=అభిషేకము, కుర్యాత్=చేయవలయును.

**తాత్పర్యము :** వాసుదేవునందు భక్తిగలిగి సర్వప్రాణులకు హింసకుడు గాక త్రయోదశినందు విష్ణువును పంచామృతములచే స్నానము చేయవలయును.

**శ్లో॥ కారయేచ్ఛాస్త్రదృష్టేన-విధినా విధికోవిదైః।**
**పూజాం చ మహతీం-కుర్యాద్విత్తశాఠ్యవివర్జితః॥ 51**

**ప్రతిపదార్థము :** శాస్త్రదృష్టేన=శాస్త్రమునందు దెల్పబడిన, విధినా=విధితో, విధికోవిదైః=ఆ శాస్త్రవిధి తెలిసిన పండితులతో, విత్తశాఠ్య వివర్జితః=ధనలోపము చేయుటను వర్జించినవాడై, మహతీమ్ పూజామ్ చ=దొడ్డ పూజను, కుర్యాత్=చేయవలెను.

**తాత్పర్యము :** శాస్త్రమునందుఁజెప్పబడిన విధి ప్రకారము, శాస్త్రవిధి తెలిసిన పండితులతో గూడి ధనముండియు లోపము చేయక చాలా గొప్పగ విష్ణువునుఁబూజించుము.



**ప్రతిపదార్థము :** వరేణ్య!=వరేణ్యా!, వరదర్షభ!=వరద శ్రేష్ఠా!, త్వమ్=నీవు, పుంసామ్=జీవులకు, సర్వవరదః=కోరిన కోర్కెలనీడేర్చువాడవు, అతః=అందువలన, ధీరాః=బుద్ధి మంతులు, వివేకులు, శ్రేయసే=శ్రేయస్సుకొఱకు, తే=నీ యొక్క, పాదరేణుమ్=పాద రేణువును, ఉపాసతే=పూజింతురు.

**తాత్పర్యము :** వరేణ్యా, వరదశ్రేష్ఠా! నీవు జీవులందఱకు వాంఛిత ఫలములనిచ్చువాడవు, అందువలన వివేకులు శ్రేయస్సు కొఱకై నీ పాదరేణువులనుపాసింతురు.

**శ్లో॥ అన్వవర్తన్త యం దేవాః-శ్రీశ్చ యత్పాదపద్మయోః।**
**స్పృహయన్త ఇవామోదం-భగవాన్ మే ప్రసీదతామ్॥ 37**

**ప్రతిపదార్థము :** దేవాః=దేవతలు, శ్రీః చ=లక్ష్మీదేవియు, యత్+పాదపద్మయోః=ఎవ్వని యడుగుఁదామరల, ఆమోదమ్=తావిని, స్పృహయన్త ఇవ=కోరుచున్నవారు వలె, యమ్=ఎవనిని, అన్వవర్తన్త=అనువర్తించుదురో, భగవాన్=ఆ విష్ణు భగవానుడు, మే=నాకు, ప్రసీదతామ్=అనుగ్రహము గలవాడఁగుగాక.

**తాత్పర్యము :** దేవతలు సిరియు నెవ్వని పాదకమలముల పరిమళమును వాంఛించువాని వలె నెవ్వని ననువర్తించుచున్నారో ఆ భగవానుడు విష్ణువు నాకు ప్రసన్నుడగు గాక.

**శ్లో॥ ఏతైర్మన్త్రైర్హృషీకేశమావాహనపురస్కృతమ్।**
**అర్చయేచ్ఛ్రద్ధయా యుక్తః పాద్యోపస్పర్శనాదిభిః॥ 38**

**ప్రతిపదార్థము :** ఏతైః+మన్త్రైః=ఈ మంత్రములచే, హృషీకేశమ్=విష్ణువును, ఆవాహన పురస్కృతమ్=ఆవాహనము గావించుట వలన, పాద్య+ఉపస్పర్శన+ఆదిభిః=పాద్యము, ఆచమనము లోనగువానిచే, శ్రద్ధయా=శ్రద్ధతో, యుక్తః=కూడినవాడై, అర్చయేత్=పూజింప వలెను.

**తాత్పర్యము :** ఈ మంత్రములచే విష్ణువును ఆవాహనము గావించుట వలన పాద్యము ఆచమనము లోనగునుపచారములచే శ్రద్ధతోఁగూడినవాడై పూజించవలెను.

**శ్లో॥ అర్చయిత్వా గన్ధమాల్యైః పయసా స్నాపయేద్విభుమ్।**
**వస్త్రోపవీతాభరణ-పాద్యోపస్పర్శనైస్తతః॥ 39**

**ప్రతిపదార్థము :** విభుమ్=ప్రభువును, గంధమాల్యైః=చందనముచే, పూవుదండలచే, అర్చయిత్వా=పూజించి, పయసా=పాలతో, స్నాపయేత్=అభిషేకించవలెను. తతః=తర్వాత, వస్త్ర+ఉపవీత+ఆభరణ+పాద్య+ఉపస్పర్శనైః=వస్త్రము, యజ్ఞోపవీతము, భూషణము, పాద్యము, ఆచమనము లోనగువానిచే పూజింపవలెను.

**తాత్పర్యము :** తొల్త విష్ణువును పాలతోనభిషేకము చేసి తర్వాత వస్త్రము, జందెము, నగలు, గంధము, పుష్పమాలలు సమర్పించి పూజింపవలెను.

**శ్లో॥ గన్ధపుష్పాదిభిశ్చార్చే-ద్ద్వాదశాక్షరవిద్యయా।**
**శృతం పయసి నైవేద్యం శాల్యన్నం విభవే సతి॥ 40**

**ప్రతిపదార్థము :** సతి!=ఓ సతీ అదితీ!, ద్వాదశాక్షరవిద్యయా=ద్వాదశాక్షరమంత్రముచే,

('ఓమ్ నమో భగవతే వాసుదేవాయ'), గన్ధపుష్పాదిభిః=గంధము, పువ్వులచే, అర్చేత్=పూజింపవలెను. పయసి=పాలయందు, శృతమ్=పక్వమైన, శాల్యన్నమ్=వరియన్నమును, విభవే=విష్ణువు కొఱకు, నైవేద్యమ్=నైవేద్యమును...

**తాత్పర్యము :** ఓ అదితీ! 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను ద్వాదశాక్షరమంత్రముచే విష్ణువును గంధపుష్పములచేఁబూజించవలెను. తర్వాత ఆ విష్ణువుకొఱకు పాయసాన్నమును పాలతోనుడికించిన వరియన్నమును నైవేద్యము పెట్టవలెను.

**శ్లో॥ ససర్పిస్సగుడం దత్త్వా-జుహుయాన్మూలవిద్యయా।**
**నివేదితం తద్భక్తాయ-దద్యాద్భుఞ్జీత వా స్వయమ్॥ 41**

**ప్రతిపదార్థము :** ససర్పిః=నేతితో గూడినదియు, సగుడమ్=బెల్లంతో గూడినదియు నైవేద్యమును, మూలవిద్యయా=ద్వాదశాక్షరమంత్రముతో, జుహుయాత్=ఆ పాలయన్నమును అగ్నియందు హోమము చేయవలయును. తత్ నివేదితమ్=భగవంతునికి నివేదనమయిన యన్నమును, భక్తాయ=భక్తునికి, దద్యాత్=పెట్టవలెను. స్వయమ్=తాను, భుంజీత వా=భుజించవలెను.

**తాత్పర్యము :** నేయితో, బెల్లముతో గూడిన శాల్యన్నమును ద్వాదశాక్షరమంత్రముతో హోమము చేయవలయును. ఆ భగవంతునికి నివేదనమయిన ఆ శాల్యాన్నమును భక్తునికి పెట్టి తాను భుజింపవలెను.

**శ్లో॥ దత్త్వాచమనమర్చిత్వా తామ్బూలం చ నివేదయేత్।**
**జపేదష్టోత్తరశతం స్తువీత స్తుతిభిః ప్రభుమ్॥ 42**

**ప్రతిపదార్థము :** ఆచమనమ్=ఆచమనమును, దత్త్వా=ఒసగి, అర్చిత్వా=పూజించి, తామ్బూలమ్=తాంబూలమును, నివేదయేత్=నివేదించవలయును. ప్రభుమ్=ప్రభువును, స్తుతిభి=స్తుతులచే, స్తువీత=స్తుతింపవలెను. అష్టోత్తరశతమ్=నూటయెనిమిది మారులు, 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను మంత్రమును, జపేత్=జపింపవలయును.

**తాత్పర్యము :** ఆచమనమును ఒసగి పూజించి తాంబూలమును నివేదించవలయును. ప్రభువును స్తుతులచే స్తుతించవలెను. నూటయెనిమిది మార్లు 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను మంత్రమును జపించవలయును.

**శ్లో॥ కృత్వా ప్రదక్షిణం భూమౌ ప్రణమేద్దణ్డవన్ముదా।**
**ధృత్వా శిరసి తచ్ఛేషం దేవముద్వాసయేత్తతః॥ 43**

**ప్రతిపదార్థము :** ప్రదక్షిణమ్=ప్రదక్షిణమును, కృత్వా=చేసి, ముదా=సంతోషముగ, భూమౌ=భూమియందు, దణ్డవత్=దండమువలె, ప్రణమేత్=నమస్కారము చేయవలయును. తత్శేషమ్=ఆ నిర్మాల్యమును, శిరసి=శిరమునందు, ధృత్వా=ధరించి, తతః=పిమ్మట, దేవమ్=ఆ దేవుని, ఉద్వాసయేత్=ఉద్వాసము చేయవలయును.

**తాత్పర్యము :** దేవునకు ప్రదక్షిణము చేసి దండప్రణామమాచరించి పూజాశేషమును శిరమున ధరించి అంత దేవునుద్వాసనము చేయవలయును. (పూజ పూర్తిచేయుటయే ఉద్వాసనము)



**శ్లో॥ ద్వ్యవరాన్ భోజయేద్విప్రాన్ పాయసేన యథోచితమ్।**
**భుఞ్జీత తైరనుజ్ఞాతశ్శేషం సేష్టః సభాజితైః॥ 44**

**ప్రతిపదార్థము :** ద్వి+అరాన్=ఇరువురు, విప్రాన్=బ్రాహ్మణులను గూర్చి, పాయసేన=ఆ పాయసాన్నముతో, యథోచితమ్=తగిన సత్కారముతో, భోజయేత్=భుజింపచేయవలయును. తైః సభాజితైః=ఆ బ్రాహ్మణులచే, అనుజ్ఞాతః=అనుమతింపఁబడిన, స+ఇష్టః= తన బంధువులతోఁగూడి, భుంజీత=భుజింపవలయును.

**తాత్పర్యము :** ఇరువురు బ్రాహ్మణులకు పాయసాన్నముతో భోజనము పెట్టి సత్కారము చేయవలయును. పిమ్మట వారి అనుమతిని తీసికొని తన బంధుమిత్రులతో గూడి భుజింపవలెను.

**శ్లో॥ బ్రహ్మచార్యథ తద్రాత్ర్యాం-శ్వో భూతే ప్రథమేఽహని॥**
**స్నాతః శుచిర్యథోక్తేన విధినా సుసమాహితః॥ 45**

**ప్రతిపదార్థము :** ప్రథమే+అహని=ఆ మొదటి దినమునందు, తత్+రాత్ర్యామ్=ఆ రాత్రి యందు, బ్రహ్మచారీ=బ్రహ్మచారియై యుండి, అథ=తర్వాత, శ్వః+భూతే=ఉదయ కాలము రాగానే, స్నాతః=స్నానము చేసి, శుచిః=పరిశుద్ధుడై, యథా+ఉక్తేన=మున్ను చెప్పిన విధానమున, సుసమాహితః=చిత్తసమాధానము గలవాడై,

**తాత్పర్యము :** ఆ మొదటి దినమునందు ఆ రాత్రియందు బ్రహ్మచర్యమున గడపి వేకువలేచి, స్నానము చేసి, పరిశుద్ధుడై పూర్వము చెప్పబడిన ప్రకారము చిత్త సమాధానముగలవాడై

**శ్లో॥ పయసా స్నాపయిత్వార్చేద్యావద్వ్రత సమాపనమ్।**
**పయోభక్షవ్రతమిదం చరే ద్విష్ణ్వర్చనావృతః॥ 46**

**ప్రతిపదార్థము:** పయసా=పాలతో, స్నాపయిత్వా=హరినభిషేకించి, యావత్+ వ్రతసమాపనమ్ =వ్రతము సమాప్తియగు పర్యన్తము (12 దినములు), అర్చేత్=పూజింపవలె. విష్ణు+అర్చన+ ఆవృతః=విష్ణువును బూజించుటయందు ఆదరము గలవాడై, ఇదమ్=ఈ, పయోభక్షవ్రతమ్= పయోభక్షవ్రతమును, చరేత్=ఆచరింపవలయును.

**తాత్పర్యము :** పాలతో హరినభిషేకించి వ్రతము సమాప్తియగు పర్యంతము పూజింప వలెను. విష్ణుపూజనమునందు ఆదరముగలవాడై ఈ పయోభక్ష వ్రతమును ఆచరింపవలెను.

**శ్లో॥ పూర్వవజ్జుహుయాదగ్నిం-బ్రాహ్మణాంశ్చాపి భోజయేత్।**
**ఏవం త్వహరహః కుర్యా-ద్ద్వాదశాహం పయోవ్రతమ్॥ 47**

**ప్రతిపదార్థము :** పూర్వవత్=పూర్వము వలె, అగ్నిమ్=అగ్నిని, జుహుయాత్=హోమము చేయవలెను, బ్రాహ్మణాన్+చ+అపి=బ్రాహ్మణులను సైతము, భోజయేత్=భుజింపజేయ వలయును. ఏవమ్=ఈ ప్రకారము, అహః అహః=ప్రతిదినము, ద్వాదశాహమ్=12 దినములు, పయోవ్రతమ్=పయోవ్రతమును చేయవలయును.

**తాత్పర్యము :** పూర్వమువలె అగ్నిహోమముగావించవలయును. బ్రాహ్మణులకు భోజనము పెట్టించ వలయును. ఇట్లు దివసముగావించుచు 12 దివసములు పయోవ్రతము చేయవలయును.

## సప్తదశోऽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥** **ఇత్యుక్తా సాదితీ రాజన్!-స్వభర్త్రా కశ్యపేన వై।**
**అన్వతిష్ఠద్వ్రతమిదం -ద్వాదశాహమతన్ద్రితా॥** 1

ఈ అధ్యాయమందు అదితి పయోవ్రతమాచరించినందుకు హరి ప్రీతుడై ఆమె వాంఛనెరవేర్చుటకై ఆమెకుఁగుమారుడై జన్మించుట-వర్ణింపబడును.

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, సా=ఆ, అదితిః=అదితి, స్వభర్త్రా=తన భర్తయగు, కశ్యపేన=కశ్యపునిచే, ఇతి=ఇట్లు, ఉక్తా=చెప్పగా, అతన్ద్రితా=స్థిరచిత్తయై, ఇదమ్ వ్రతమ్=ఈ పయోవ్రతమును, ద్వాదశాహమ్=12 దినములు, అన్వతిష్ఠత్=అనుష్ఠించెను.

**తాత్పర్యము :** ఆ అదితి తన భర్త కశ్యపుడు ఇట్లు చెప్పగావిని, స్థిరచిత్తయై ఈ పయోవ్రతమును 12 దినములు అనుష్ఠించెను.

**శ్లో॥** **చిన్తయన్త్యేకయా బుద్ధ్యా మహాపురుషమీశ్వరమ్।**
**ప్రగృహ్యేన్ద్రియదుష్టాశ్వాన్-మనసా బుద్ధిసారథిః॥** 2

**ప్రతిపదార్థము :** మహాపురుషమ్=విరాట్పురుషుడైన, ఈశ్వరమ్=పరమేశ్వరుని, ఏకయా=ఏకాగ్రమైన, బుద్ధ్యా=చిత్తముతో, చిన్తయన్తీ=ధ్యానము జేయుచున్నదై, ఇంద్రియదుష్టాశ్వాన్=ఇంద్రియములను పోకిరిగుఱ్ఱములను, మనసా=మనస్సుచే, ప్రగృహ్యా=నిగ్రహించి, బుద్ధిసారథిః=బుద్ధియే సారథిగ గలదాయెను.

**తాత్పర్యము :** విరాట్స్వరూపుడైన పరమేశ్వరుని ఏకాగ్రబుద్ధితో ధ్యానించుచున్నదై, ఇంద్రియములను దుష్టాశ్వములను మనస్సుచే నిగ్రహించి బుద్ధియే సారథిగ గలదాయెను.

**శ్లో॥** **మనశ్చైకాగ్రయా బుద్ధ్యా-భగవత్యఖిలాత్మని।**
**వాసుదేవే సమాధాయ-చచార హ పయోవ్రతమ్॥** 3

**ప్రతిపదార్థము :** ఏకాగ్రయా=లక్ష్యమునందే నెలకొన్న, బుద్ధ్యా=బుద్ధితో, మనః=మనస్సు, అఖిలాత్మని=సర్వాత్మకుడైన, వాసుదేవే=వాసుదేవునందు, సమాధాయ=ఉంచి, భగవతీ=పూజ్యురాలు అదితి, పయోవ్రతమ్=పయోవ్రతమును, చచార=ఆచరించెను.

**తాత్పర్యము :** బుద్ధిని స్థిరముచేసి మనస్సు సర్వాత్మకుడైన భగవంతుడైన వాసుదేవునందుంచి అదితి పయోవ్రతమును ఆచరించెను.

**శ్లో॥** **తస్యాః ప్రాదురభూత్తాత భగవానాదిపూరుషః।**
**పీతవాసాశ్చతుర్బాహుః-శఙ్ఖచక్రగదాధరః॥** 4

**ప్రతిపదార్థము :** తాత!=ఓ నాయనా!, భగవాన్=భగవంతుడు, ఆదిపురుషః=ఆది పురుషుడు, పీతవాసాః=పసుపు పుట్టముగలవాడు, చతుర్బాహుః=నాలుగు బాహువులు గలవాడు, శంఖచక్రగధాధరః=శంఖము, చక్రము, గదను ధరించినవాడు, తస్యాః=ఆమెకు, ప్రాదురభూత్=ప్రత్యక్షమయ్యెను.



**శ్లో॥** **చరుం నిరూప్య పయసి శిపివిష్టాయ విష్ణవే।**
**సూక్తేన తేన పురుషం యజేత సుసమాహితః॥** 52

**ప్రతిపదార్థము :** సుసమాహితః=నియమితపరుడై, పయసి=పాలయందు, చరుమ్=అన్నము, నిరూప్య=ఉడికించి, శిపివిష్టాయ=శిపివిష్టుడగు విష్ణువు కొఱకు, తేన సూక్తేన=ఆ పురుష సూక్తముతో, పురుషమ్=విష్ణువును, యజేత=యజించవలయును.

**తాత్పర్యము :** నియమపరుడై శిపివిష్టుడగు విష్ణువు కొఱకు పాలయందు నుడికించి నన్నమును, పురుషసూక్తముతో అగ్నియందు విష్ణువు గూర్చి హోమము చేయవలెను.

**శ్లో॥** **నైవేద్యం చాదిగుణవద్దద్యాత్పురుషతుష్టయే।**
**ఆచార్యం జ్ఞానసమ్పన్నం వస్త్రాభరణధేనుభిః (తోషయత్)॥** 53

**ప్రతిపదార్థము :** పురుషతుష్టయే=ఆ పురుషోత్తముని సంతృప్తి కొఱకు, అధిగుణవత్=మిక్కిలి మేలైన, షడ్రసోపేతమైన, నైవేద్యమ్=నైవేద్యమును, దద్యాత్=ఒసగవలెను. జ్ఞానసంపన్నమ్=జ్ఞానయుతుడై, ఆచార్యమ్=గురువును, వస్త్ర+ఆభరణధేనుభిః=వస్త్రముల చేతను, ఆభరణముల చేతను, గోవులులోనగువానిచేత, తోషయేత్=సంతోషపరుపవలెను.

**తాత్పర్యము :** ఆ పురుషోత్తమునికిఁదృప్తిగలుగునట్లు మేలైన షడ్రసోపేతమైన నైవేద్యము పెట్టి జ్ఞానసంపదగల గురువును వస్త్రము చేతను, ఆభరణముల చేతను, గోవుల చేతను సంతోషపెట్టవలెను.

**శ్లో॥** **తోషయేదృత్విజశ్చైవ-తద్విద్ధ్యారాధనం హరేః।**
**భోజయేత్తాన్ గుణవతా-సదన్నేన శుచిస్మితే!॥** 54

**ప్రతిపదార్థము :** శుచిస్మితే!=శుచిస్మితా, తెల్లని చిరునగవుగలదానా!, ఋత్విజః+చ+ఏవ=ఋత్విక్కులను గూడనట్లే, గుణవతా=గుణవంతమైన, సత్+అన్నేన=రుచ్యమైన మేలి యన్నముచే, భోజయేత్=భుజింపజేయవలెను. తత్+హి=అదియే, హరేః=విష్ణువునకు, ఆరాధనమ్=పూజ కదా!

**తాత్పర్యము :** ఓ అదితీ! ఋత్విజులను గూడనట్లే రుచ్యమైన మేలియన్నముచే భుజింపఁ జేయవలయును. ఇదియే హరి సమారాధానమగుచున్నది.

**శ్లో॥** **అన్యాంశ్చ బ్రాహ్మణాఞ్ఛక్త్యా-యే చ తత్ర సమాగతాః।**
**దక్షిణాం గురవే దద్యాదృత్విగ్భ్యశ్చ యథార్హతః॥** 55

**ప్రతిపదార్థము :** యేచ=ఎవరు, తత్ర=అచ్చోటకు, సమాగతాః=వచ్చువారు ఐన, అన్యాన్=ఇతరులైన, యుక్తాన్=యోగ్యులైన, బ్రాహ్మణాన్=బ్రాహ్మణులను, భోజయేత్=భుజింపజేయ వలయును. గురవే=గురువునకు (కొఱకు), ఋత్విగ్భ్యః+చ=ఋత్విక్కులకు (కొఱకు), యథార్హతః=వారి యోగ్యతను బట్టి, దక్షిణామ్=దక్షిణలను, దద్యాత్=ఈయవలెను.

**తాత్పర్యము :** అచ్చోటకు వచ్చునితరులైన మాన్యులైన బ్రాహ్మణులకు సంతృప్తిగా భోజనము ఁబెట్టి, గురువునకు, ఋత్విక్కులకు వారి యోగ్యతను బట్టి దక్షిణలను ఈయవలెను.

**శ్లో॥ అన్నాద్యేనాశ్వపాకేభ్యః-ప్రీణయేత్సముపాగతాన్।**
**భుక్తవత్సు చ సర్వేషు-దీనాన్ధకృపణాదిషు॥** 56

**ప్రతిపదార్థము :** సముపాగతాన్=అచటికేతెంచినవారు, అన్నాద్యేన ఆశ్వపాకేభ్యః=చండాలాది సర్వవర్గములవారి కొఱకు, ప్రీణయేత్=అన్నాదికములతో తృప్తిపఱచవలెను. సర్వేషు=ఎల్ల, దీనాన్ధకృపణాదిషు=దీనులు, అంధులు, అల్పులు, భుక్తవత్సు=అన్నము భుజించినవారుకాగా..

**తాత్పర్యము :** అచ్చోటకి వచ్చిన చండాలాది సర్వవర్గములవారికి అన్నమొసగి భుజింపచేయ వలెను. దిక్కులేనివారు, గ్రుడ్డివారు, దరిద్రులు లోనగువారందఱికి అన్నమిడి వారందఱు తృప్తిచెందిన (తర్వాత)

**శ్లో॥ విష్ణోస్తత్ప్రీణనం విద్వాన్-భుఞ్జీత సహ బన్ధుభిః।**
**నృత్యవాదిత్రగీతైశ్చ-స్తుతిభిః స్వస్తివాచకైః॥** 57

**ప్రతిపదార్థము :** విద్వాన్=విద్వాంసుడు, సః=ఆ వ్రతముచేయు పురుషుడు, బంధుభిః సహ=బంధువులతోగూడి, నృత్యవాదిత్రగీతైః+చ=ఆట, వాయిద్యము, పాటలోనగువానిచేత, స్తుతిభిః=స్తోత్రములచేత, స్వస్తివాచకైః=మంగళపాఠముల చేత, విష్ణోః=విష్ణువుకు, తత్+ప్రీణనమ్=వానికి సంతోషమునుగావించి, బందుభిఃసహ=బంధువులతోగూడి, భుంజీత =భుజింపవలయును.

**తాత్పర్యము :** నృత్యము, వాద్యము, గానములోనగువానిచేతను, స్తోత్రములచేతను, మంగళపాఠములచేతను విష్ణువునకు ప్రీతిగావించు ఆ విద్వాంసుడు బంధువులతో గూడి భుజించవలయును.

**శ్లో॥ కారయేత్తత్కథాభిశ్చ-పూజాం భగవతోఽన్వహమ్।**
**ఏతత్పయోవ్రతం నామ-పురుషారాధనం పరమ్॥** 58

**ప్రతిపదార్థము :** భగవతః=భగవంతునికి, తత్+కథాభిః+చ=ఆ విష్ణుకథలచే, పూజామ్= పూజను, కారయేత్=చేయవలయును, ఏతత్=ఇది, పయోవ్రతమ్ నామ=పయోవ్రతమని, పురుష+ఆరాధనమ్=పురుషోత్తముని ఆరాధించవలెను, పరమ్=శ్రేష్ఠమైనదిగా నున్నది.

**తాత్పర్యము :** భగవంతుని ఆ విష్ణువు కథలచేతను బూజింపవలెను. ఇది పురుషోత్తముని యుత్తమారాధనమైన పయోవ్రతమని ప్రసిద్ధికెక్కియున్నది.

**శ్లో॥ పితామహేనాభిహితం మయా తే సముదాహృతమ్।**
**త్వం చానేన మహాభాగే సమ్యగర్చయ కేశవమ్॥** 59

**ప్రతిపదార్థము :** పితామహేన=బ్రహ్మచే, అభిహితమ్=చెప్పబడినది, తే=నీకు, మయా= నాచే, సముదాహృతమ్=చెప్పబడినది. త్వమ్ చ=నీవును, అనేన=ఈ పయోవ్రతముచే, కేశవమ్ =విష్ణువును, సమ్యక్=చక్కగ, అర్చయ=పూజింపుము.

**తాత్పర్యము :** ఓ పూజ్యులారా! బ్రహ్మచెప్పిన ఈ వ్రతమును, నీకు నేను చెప్పినాను. నీవీ వ్రతమును గ్రహించిఁజక్కగాఁబూజింపుము.



**శ్లో॥ ఆత్మనా శుద్ధభావేన-నియతాత్మా భజావ్యయమ్।**
**అయం వై సర్వయజ్ఞాఖ్యః-సర్వవ్రతమితి స్మృతమ్॥** 60

**ప్రతిపదార్థము :**శుద్ధభావేన=నిర్మలాశయముగల, ఆత్మనా=బుద్ధితో, నియతాత్మా=నియమించ బడిన దేహేంద్రియమనస్సులు గలదానివై, అవ్యయమ్=అవ్యయుడైన విష్ణువును, భజ= సేవింపుము. అయం వై=ఇది, సర్వయజ్ఞాఖ్యః=సర్వయజ్ఞమను పేరుగల, సర్వవ్రతమ్ ఇతి= సర్వవ్రతమని, స్మృతమ్=చెప్పబడినది.

**తాత్పర్యము :** నిర్మలభావముగల బుద్ధితో నియమితచిత్తవై అవ్యయుడైన విష్ణువును సేవింపుము. ఇది సర్వయజ్ఞమను పేరుగలది. సర్వవ్రతమని చెప్పబడినది.

**శ్లో॥ తపస్సారమిదం భద్రే-దానం చేశ్వరతర్పణమ్।**
**త ఏవ నియమాః సాక్షా-త్త ఏవ చ క్రతూత్తమాః॥** 61

**ప్రతిపదార్థము :** భద్రే=ఓ మంగళశీలా!, ఈశ్వరతర్పణమ్=పరమేశ్వరునికి తృప్తిని గావించునవి, దానమ్=దానము, తే+ఏవ=ఈశ్వరప్రీతికరములైనవే, సాక్షాత్=ప్రత్యక్షముగా, నియమాః=నియమములు, తే+ఏవ=అవియే, క్రతూత్తమాః=క్రతువులందు శ్రేష్ఠమైనవి.

**తాత్పర్యము :** ఓ మంగళశీలా! పరమేశ్వరునికి తృప్తిగావించునవి దానాదికములు. ఈ పయోవ్రతము అన్ని వ్రతములసారమై యున్నది. ఈశ్వర ప్రీతికరములైన పద్ధతులేవి గలవో అవియే నియమములు. అవియే క్రతువులందు శ్రేష్ఠములని తెలియుము.

**శ్లో॥ తస్మాదేతత్ వ్రతం భద్రే-ప్రయతా శ్రద్ధయాయజ।**
**భగవాన్ పరితుష్టస్తే-వరమాశు విధాస్యతి॥** 62

**ప్రతిపదార్థము :** తస్మాత్=అతి శ్రేష్ఠమైనదగుట వలన, ఏతత్+వ్రతమ్=ఈ వ్రతము, ప్రయతా =నియమవంతురాలవై, శ్రద్ధయా=శ్రద్ధతో, యజ=కావింపుము. భగవాన్= భగవంతుడు, పరితుష్టః=సంతుష్టుడై, తే=నీకు, వరమ్=వరమును, ఆశు=శీఘ్రముగా, విధాస్యతి= ఈయగలడు.

**తాత్పర్యము :** ఈ వ్రతము శ్రేష్ఠమైనది కావున ఈ వ్రతమును నీవు నియమవంతురాలవై శ్రద్ధతోఁజేయుము. భగవంతుడు సంతుష్టుడై నీకు వరమును శీఘ్రముగా ఈయగలడు.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కన్ధే పయోవ్రతకథనం నామ షోడశో-ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కన్ధమున షోడశాధ్యాయము.

**శ్లో॥ ఆత్మజాన్ సుసమృద్ధాంస్త్వం ప్రత్యాహృతయశఃశ్రియః।**
**నాకపృష్ఠమధిష్ఠాయ-క్రీడతో ద్రష్టుమిచ్ఛసి॥** 15

**ప్రతిపదార్థము :** ప్రత్యాహృతయశఃశ్రియః=పోగొట్టుకున్న యశశ్రీలను పొందిన, ఆత్మజాన్=నీ పుత్రులు, సుసమృద్ధాన్=సుసమృద్ధులై, నాకపృష్ఠమ్=స్వర్గలోకమును, అధిష్ఠాయ =అధిష్ఠించి, క్రీడతః=విహరించుటను, ద్రష్టుమ్ ఇచ్ఛసి=చూడదలంచుచున్నావు.

**తాత్పర్యము :** పోగొట్టుకొన్న యశశ్శ్రీలను పొందిన నీ పుత్రులు సుసమృద్ధులై స్వర్గలోకమును అధిష్ఠించి విహరించుటను చూడదలంచుచున్నావు.

**శ్లో॥ ప్రాయోఽధునా తేఽసురయూథనాథా అపారణీయా ఇతి దేవి! మే మతిః।**
**యత్తేఽనుకూలేశ్వరవిప్రగుప్తా న విక్రమస్తత్ర సుఖం దదాతి॥** 16

**ప్రతిపదార్థము :** దేవి!=ఓ అదితిదేవీ!, ప్రాయః=తఱచుగా, అధునా=ఇప్పుడు, తే=నీకు, అసురయూథనాథాః=అసుర ప్రభువులు, సేనాపతులు, తే=వారు, యత్=ఎందువలన, అనుకూల+ ఈశ్వర విప్రగుప్తాః=ఈశ్వరుడనుకూలముగానున్న విప్రులచే రక్షింపబడినవారో, అందువలన, తే=వారు, అపారణీయాః=జయించుటకు సాధ్యముగానివారు, ఇతి మే మతిః =అని నాయభిప్రాయము. తత్ర=వారియందు, విక్రమః=పరాక్రమము, సుఖమ్=సుఖమును, న దదాతి=ఈయదు.

**తాత్పర్యము :** ఇప్పుడు అసురప్రభువులు జయింపసాధ్యముగానివారని నా యభిప్రాయము. ఏలయన వారికి కాలమనుకూలించి యున్నది. శుక్రుడులోనగు బ్రాహ్మణులచే వారు రక్షితులైయున్నారు. వారిపై పరాక్రమము చూపుట సుఖమును ఈయదు.

**శ్లో॥ అథాప్యుపాయో మమ దేవి చిన్త్యః సన్తోషితస్య వ్రతచర్యయా తే।**
**మమార్చనం నార్హతి గన్తుమన్యథా-శ్రద్ధానురూపం ఫలహేతుకత్వాత్॥** 17

**ప్రతిపదార్థము :** అథ+అపి=అట్లు అసురులజేయులైనను, తే=నీయొక్క, వ్రతచర్యయా= వ్రతానుష్ఠానముచే, సన్తోషితస్య=సంతోషమును పొందిన, మమ=నాకు, ఉపాయ= ఉపాయము, చిన్త్యః=ఆలోచింపఁదగినది. మమ+అర్చనమ్=నా యారాధనము, న గన్తుమ్+అన్యథా అర్హతి=వేఱువిధముగపోదు, శ్రద్ధా+అనురూపమ్=శ్రద్ధకు అనుకూలముగా, ఫలహేతుకత్వాత్=ఫలమునొసగు కారణమైనదగును.

**తాత్పర్యము :** దేవీ! అట్లు అసురులజేయులైనను, నీ వ్రతానుష్ఠానముచే సంతుష్టుడనైన నేను నీకై ఉపాయము యాలోచింపవలెను. ఏలయన శ్రద్ధకు తగిన ఫలమునొసగు కారణమైన నాయారాధన యెప్పుడును వృథా కానేరదు.

**శ్లో॥ త్వయార్చితశ్చాహమపత్యగుప్తయే పయోవ్రతేనానుగుణం సమీడితః।**
**స్వాంశేన పుత్రత్వముపేత్య తే సుతాన్ గోప్తాస్మి మారీచతపస్యధిష్ఠితః॥** 18

**ప్రతిపదార్థము :** అపత్యగుప్తయే=సంతాన రక్షణము కొఱకు, త్వయా=నీ, పయోవ్రతేన= పయోవ్రతముచే, అహమ్=నేను, అనుగుణమ్=తగినట్లుగా, అర్చితః=పూజింపబడితిని, సమీడితః=స్తుతింపబడినాను. మారీచతపసి=కశ్యపుని యొక్క తపస్సునందు, అధిష్ఠితః=ఉండి,



**తాత్పర్యము :** వత్సా! పరీక్షిత్తూ! భగవంతుడు, ఆదిపురుషుడు, చతుర్భుజుడు, పీతాంబరుడు, శంఖచక్రగదాధారి అదితికి సాక్షాత్కరించెను.

**శ్లో॥ తం నేత్రగోచరం వీక్ష్య-సహసోత్థాయ సాదరమ్।**
**ననామ భువి కాయేన-దణ్డవత్ప్రీతివిహ్వలా॥** 5

**ప్రతిపదార్థము :** నేత్రగోచరమ్=కంటికి గోచరించిన, తమ్=ఆ విష్ణువును, వీక్ష్య=చూచి, సహసా=వెంటనే, సాదరమ్=ఆదరమున, ఉత్థాయ=లేచి, ప్రీతివిహ్వలా=సంతోషమున మైమఱచినదైన అదితి, భువి=భూమియందు, కాయేన=శరీరముతో, దణ్డవత్=దండమువలె, ననామ=మ్రొక్కెను.

**తాత్పర్యము :** కంటికి గోచరించిన ఆ విష్ణువును చూచి వెంటనే సాదరమున లేచి సంతోషమున మైమఱచినదై నేలపై దండమువలె సాగిలబడి మ్రొక్కెను.

**శ్లో॥ సోత్థాయ బద్ధాఞ్జలిరీడితుం స్థితా నోత్సేహ ఆనన్దజలాకులేక్షణా।**
**బభూవ తూష్ణీం పులకాకులాకృతిస్తద్దర్శనాత్యుత్సవగాత్రవేపథుః॥** 6

**ప్రతిపదార్థము :** సా=ప్రేమాతిశయముగలదైన అదితి, ఉత్థాయ=లేచి, బద్ధ+అంజలిః =చేతులు దోయిలించినదై, స్థితా=నిలువబడి, ఈడితుమ్=స్తుతించుటకు, న+ఉత్సేహే= సమర్థురాలు కాకపోయెను, ఆనందజల+ఆకుల+ఈక్షణా=ఆనందబాష్పములచే నిండిన నేత్రములు గలదై, తూష్ణీమ్ బభూవ=మిన్నకుండిపోయెను. పులక+ఆకుల+ఆకృతిః =గగుర్పాటు వ్యాపించిన దేహముగలదియు, తత్+దర్శనాత్=ఆ భగవద్దర్శనము వలన, అతి+ఉత్సవగాత్రవేపథుః=అధికముగా గలిగిన సంతోషము చేత శరీరము కంపింపసాగెను.

**తాత్పర్యము :** అదితి లేచి చేతులు దోయిలించి నిల్చి భగవంతుని స్తుతింప సమర్థురాలు కాకపోయెను. మఱి, ఆనందబాష్పములచే నేత్రములు దొలుకాడె, దేహమంతయు గగుర్పాటు చెందె, భగవంతుని దర్శనమున జనించిన సంతోషమున మేనువడకుచుండ మిన్నకుండి పోయెను.

**శ్లో॥ ప్రీత్యా శనైర్గద్గదయా గిరా హరిం తుష్టావ సా దేవ్యదితిః కురూద్వహ।**
**ఉద్వీక్షతీ సా పిబతీవ చక్షుషా-రమాపతిం యజ్ఞపతిం జగత్పతిమ్॥** 7

**ప్రతిపదార్థము :** కురూద్వహ=ఓ కురువంశోత్తమా!, సా=ఆ, అదితిః దేవీ=అదితి దేవి!, ప్రీత్యా=సంతోషముతో, శనైః=మెల్లగా, గద్గదయా=గద్గద స్వరముగల, గిరా=వాక్కుచే, హరిమ్ =విష్ణువును, తుష్టావ=స్తుతించెను. సా=ఆ దేవి, రమాపతిమ్=లక్ష్మీవల్లభుని, యజ్ఞపతిమ్= యజ్ఞఫలదాతను, జగత్పతిమ్=లోకప్రభువునగు విష్ణువును, చక్షుషా=నేత్రములచే, పిబతీవ= పానము చేయుచున్నదానివలె, ఉద్వీక్షతీ=చూచుచున్నదాయెను.

**తాత్పర్యము :** ఓ కురువంశోత్తమా! ఆ అదితిదేవి సంతోషముతో మెల్లగా గద్గదస్వరము గలదై విష్ణువును స్తుతించెను. అదితి యజ్ఞఫలదాతయు, లక్ష్మీవల్లభుడును, లోకప్రభువగు శ్రీవిష్ణుభగవానుని నేత్రములచే పానము చేయుచున్నదానివలె చూచుచున్నదాయెను.

**శ్రీ అదితిరువాచ :** అదితి వచించెను.

**శ్లో॥ యజ్ఞేశ! యజ్ఞపురుషాచ్యుత! తీర్థపాద! తీర్థశ్రవః! శ్రవణమంగళనామధేయ!।**
**ఆపన్నలోకవృజినోపశమోదయాద్య! శం నః కృధీశ! భగవన్నసి దీననాథః॥ 8**

'యజ్ఞేశ' అను శ్లోకము మొదలు 10 శ్లోకములచే సంబోధనములచే నీకు అశక్యమేదియు లేదనుచు ప్రార్థించుచున్నది.

**ప్రతిపదార్థము :** యజ్ఞ+ఈశ=యజ్ఞఫలదాతా!, యజ్ఞపురుష!=యజ్ఞ స్వరూపుడైన పురుషుడా!, అచ్యుత!=స్థానభ్రంశములేనివాడా!, తీర్థపాద!=తీర్థపాదా!, తీర్థశ్రవః=పరిశుభ్రమైన కీర్తి గలవాడా!, శ్రవణమంగళనామధేయ=వినుటయే మంగళమైన పేరుగలవాడా!, ఆపన్నలోక వృజిన+ఉపశమ+ఉదయాద్య!=శరణుపొందిన జనుల పాపములను శమించు పుట్టుక కలవాడా!, దీననాథః=దీననాథుడవు, అసి=అగుచున్నావు. ఈశ!=పరమేశ్వరా!, నః=మాకు, శమ్= శుభమును, కృధి=కలిగింపుము.

**తాత్పర్యము :** యజ్ఞేశా! యజ్ఞపురుషా! అచ్యుతా! పరమేశ్వరా! దిక్కులేనివారికి దిక్కగుదువు. మాకు శుభములను గలిగింపుము.

**శ్లో॥ విశ్వాయ విశ్వభవనస్థితిసంయమాయ స్వైరం గృహీతపురుశక్తిగుణాయ భూమ్నే।**
**స్వస్థాయ శశ్వదుపబృంహితపూర్ణబోధవ్యాపాదితాత్మతమసే హరయే నమస్తే॥9**

**ప్రతిపదార్థము :** విశ్వాయ=జగత్స్వరూపుడు, విశ్వ...య=ప్రపంచము యొక్క సృష్టి స్థితి లయముల కొఱకు, స్వైరమ్=స్వేచ్ఛతో, గృహీత...గుణాయ=గ్రహించిన దొడ్డ శక్తియైన మరియు గుణములు గలవాడును, భూమ్నే=దొడ్డవాడు, స్వస్థాయ=స్వస్థుడైయున్నవాడు, శశ్వత్...తమసే=ఎల్లప్పుడు విస్తరించిన సంపూర్ణజ్ఞానముచే జీవునందు నెలకొన్న మాయా లక్షణమైన తమస్సును, అజ్ఞానము లోనగునట్లువాడగు, హరయే=విష్ణువు అయిన, తే=నీకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** భూమస్వరూపుడు, చాల దొడ్డవాడు, మహత్తు అయినవానికి నమస్కారము. అందుకుఁగారణము విశ్వస్వరూపుడు. మఱి జగము సృజింపను, పెంపను, హరింపను, దొడ్డశక్తియైన గుణములు గైకొన్నవాడు. అట్లు గుణములు గ్రహించినను స్వస్థుడై యుండువాడు. అనగా వికారమునొందని, భ్రంశము పొందని స్వరూపము గలవాడు ఏలయన ఎల్లప్పుడు విస్తరించిన సంపూర్ణ జ్ఞానముచే జీవునందు నెలకొన్న మాయాలక్షణమైన తమస్సును అజ్ఞానమును లోనగువాడగు విష్ణువునకు నీకు నమస్కారము.

**శ్లో॥ ఆయుః పరం వపురభీష్టమతుల్యలక్ష్మీర్ద్యోభూరసాః సకలయోగగుణాస్త్రివర్గః।**
**జ్ఞానం చ కేవలమనన్త భవన్తి తుష్టాత్ త్వత్తో నృణాం కిము సపత్నజయాదిరాశీః॥10**

**ప్రతిపదార్థము :** అనన్త!=ఓ అనంతుడా!, త్వత్తః తుష్టాత్=నీవు సంతుష్టుడవైన, ఆయుః పరమ్=పరమాయువు, వపుః=అభీష్టమ్=అభీష్టమగు దేహము, అతుల్యలక్ష్మీః=సాటిలేని ధనము, ద్యోభూరసాః=స్వర్గమర్త్య పాతాళములు, సకలయోగగుణాః+త్రివర్గః=ధర్మార్థ కామములు, జ్ఞానమ్+చ కేవలమ్=కేవల జ్ఞానము, భవన్తి=సులభసాధ్యమగుచున్నవి. నృణామ్=నరులకు, సపత్నజయాదిరాశీః=శత్రుజయాది విషయములగూర్చి, కిము= చెప్పున దేమున్నది. సర్వమూ సులభసాధ్యమని భావము.



**శ్రీ శుకఉవాచ :** శుకుడు వచించెను.

**శ్లో॥ అదిత్యైవం స్తుతో రాజన్-భగవాన్ పుష్కరేక్షణః।**
**క్షేత్రజ్ఞః సర్వభూతానామితి హోవాచ భారత॥ 11**

**ప్రతిపదార్థము :** భారత=ఓ భారతా!, రాజన్=రాజా, అదిత్యా+ఏవమ్=అదితిచేత యిట్లు, స్తుతః=స్తుతింపబడినవాడై, భగవాన్=భగవంతుడగు, పుష్కరేక్షణః=కమలలోచనుడు, సర్వభూతానాం క్షేత్రజ్ఞః=సర్వభూతాంతర్యామి, ఉవాచ హ=ఇట్లు వచింపసాగెను.

**తాత్పర్యము :** ఓ రాజా! అదితి యిట్లు స్తుతింపగా భగవంతుడగు కమలలోచనుడిట్లు వచించెను.

**శ్రీ భగవానువాచ :** భగవానుడు వచించెను.

**శ్లో॥ దేవమాతర్భవత్యా మే-విజ్ఞాతం చిరకాంక్షితమ్।**
**యత్సపత్నైర్హృతశ్రీణాం-చ్యావితానాం స్వధామతః॥ 12**

**ప్రతిపదార్థము :** దేవమాతః=దేవమాతా!, సపత్నైః+హృతశ్రీణామ్=శత్రువులచే నపహృతులగు సంపదగలవారు, స్వధామతః=స్వస్థానములనుండి, చ్యావితానామ్=తొలగించబడిన పుత్రులను గూర్చిన, భవత్యాః=నీయొక్క, చిరకాంక్షితమ్=బహుకాల వాంఛితమును, మే=నాకు, విజ్ఞాతమ్ =తెలిసినది.

**తాత్పర్యము :** దేవమాతా! శత్రువులచే అపహరింపబడిన సంపద గలవారు, స్వస్థానము నుండి వెడలినవారునగు పుత్రులను గూర్చిన నీయొక్క చిరవాంఛితమును నేను దెలిసికొంటిని.

**శ్లో॥ తాన్ వినిర్జిత్య సమరే-దుర్మదానసురర్షభాన్।**
**ప్రతిలబ్ధజయశ్రీభిః-పుత్రైరిచ్ఛస్యుపాసితమ్॥ 13**

**ప్రతిపదార్థము :** దేవమాతః=ఓ దేవమాతా!, తాన్=ఆ, దుర్మదాన్=మదోద్ధతులగు, అసురర్షభాన్=అసుర శ్రేష్ఠులను, సమరే=సంగ్రామమున, వినిర్జిత్య=జయించి, ప్రతిలబ్ధజయశ్రీభిః=జయసంపదను తిరిగి పొందిన, పుత్రైః=పుత్రులతో, ఉపాసితమ్= ఉండుటకు, ఇచ్ఛసి=ఇష్టపడుచున్నావు.

**తాత్పర్యము :** దేవమాతా! మదోద్ధతులగు అసురశ్రేష్ఠులను సంగ్రామమున జయించి జయసంపదను తిరిగి పొందిన పుత్రులతో కలసి ఉండుటకిష్టపడుచున్నావు.

**శ్లో॥ ఇన్ద్రజ్యేష్ఠైః స్వతనయైర్హతానాం యుధి విద్విషామ్।**
**స్త్రియో రుదన్తీరాసాద్య ద్రష్టుమిచ్ఛసి దుఃఖితాః॥ 14**

**ప్రతిపదార్థము :** స్వతనయైః=తన పుత్రులగు, ఇన్ద్రజ్యేష్ఠైః=ఇంద్రాదులచే, యుధి= సంగ్రామమున, విద్విషామ్=శత్రువులను, హతానామ్=సంహరింపగా, రుదన్తీః=విషాదమున దుఃఖించుచున్న, స్త్రియః దుఃఖితాః=ఆ శత్రువుల భార్యలను, ఆసాద్య=పొంది, ద్రష్టుమ్= చూచుటకు, ఇచ్ఛసి=నీవు ఇచ్ఛగించుచున్నావు.

**తాత్పర్యము :** తన పుత్రులగు ఇంద్రాదులచే సంగ్రామమున శత్రువులను సంహరింపగా, విషాదమున దుఃఖించుచున్న ఆ శత్రువుల భార్యలను చూచుటకు నీవు ఇచ్ఛగించుచున్నావు.

## అష్టాదశోఽధ్యాయః

ఈ అధ్యాయమునందు హరి వామనుడై జనించియెల్లరచే సత్కరింపబడి బలియజ్ఞ వాటమునకుఁబోవుట. బలివరము కోరుకొనుమనుట – వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇత్థం విరిఞ్చస్తుతకర్మవీర్యః ప్రాదుర్బభూవామృతభూరదిత్యామ్।**
**చతుర్భుజః శఙ్ఖగదాబ్జచక్రః పిశఙ్గవాసా నళినాయతేక్షణః॥** 1

**ప్రతిపదార్థము :** ఇత్థమ్=ఈ విధముగా, విరించిస్తుతకర్మవీర్యః=బ్రహ్మచే స్తుతింపబడిన దేవకార్యము ప్రభావముగలవాడై, అమృతభూః=మృత్యువు జన్మము లేనివాడగు విష్ణువు, చతుర్భుజః=నాలుగు బాహువులుగలిగి, శంఖగదా+అబ్జచక్రః=శంఖము, గద, పద్మము, చక్రముగలవాడై, పిశంగవాసాః=పీతవసనముగలిగి, నళిన+ఆయత+ఈక్షణః=తామరరేకువలె విశాలమైన నేత్రములు గలవాడై, అదిత్యామ్=అదితియందు, ప్రాదుర్బభూవ=ఆవిర్భవించెను.

**తాత్పర్యము :** ఈ విధముగా, బ్రహ్మచే స్తుతింపబడిన విష్ణుభగవానుడు అదితియందు ఆవిర్భవించెను.

**శ్లో॥ శ్యామావదాతో ఝషరాజకుణ్డలత్విషోల్లసచ్ఛ్రీవదనామ్బుజః పుమాన్।**
**శ్రీవత్సవక్షా వలయాఙ్గదోల్లసత్ కిరీటకాఞ్చీగుణహారనూపురః॥** 2

**ప్రతిపదార్థము :** శ్యామ+అవదాతః=ఆకుపసరు వన్నెచే నిర్మలమైన దేహముగలవాడు, ఝషరాజకుండలత్విషః=మొసలి ఆకారముగల కుండలములు గలవాడు, ఉల్లసత్+శ్రీవదన+అంబుజః=ప్రకాశించు సిరిగల మొగము గలవాడు, శ్రీవత్సవక్షాః=శ్రీవత్సమను పుట్టుమచ్చ వక్షమున గలవాడు, వలయాం...పురః, వలయ=కడియములు, అంగద=భుజకీర్తులు, ఉల్లసత్=ప్రకాశించు, కిరీట=కిరీటము, కాంచీగుణ=మొలత్రాడు, హార=ముత్తెములపేరు, నూపురః=అందెలుగలవాడు...

**తాత్పర్యము :** అచ్చమైన యాకుపచ్చవన్నె మేనిగలవాడును, మకరకుండలములు గలవాడు, ప్రకాశించు సిరిగల మొగముగలవాడు, శ్రీవత్సమను పుట్టుమచ్చ వక్షమున గలవాడు, కడియములు, భుజకీర్తులు, ప్రకాశించు కిరీటము, మొలత్రాడు, ముత్తెముల పేరు, అందెలు గలవాడునై (ఆవిర్భవించెను).

**శ్లో॥ మధువ్రతవ్రాతవిఘుష్టయా స్వయా విరాజితః శ్రీవనమాలయా హరిః।**
**ప్రజాపతేర్వేశ్మతమః స్వరోచిషా వినాశయన్ కణ్ఠనివిష్టకౌస్తుభః॥** 3

**ప్రతిపదార్థము :**మధువ్రతవ్రాతవిఘుష్టయా=తుమ్మెద మొత్తముల మ్రోతగల, శ్రీవనమాలయా =ప్రకాశించు తోమాలచే, విరాజితః=విరాజిల్లు, హరిః=విష్ణువు, కంఠనివిష్ట కౌస్తుభః =కంఠమున ధరించిన కౌస్తుభమణిగలవాడై, స్వరోచిషా=తన శోభచే, ప్రజాపతేః=కశ్యప ప్రజాపతియొక్క, వేశ్మతమః=ఇంటియందున్న చీకటిని, వినాశయన్=నశింపఁజేయుచు... (ఆవిర్భవించెను).

**తాత్పర్యము :** తుమ్మెదల మొత్తముల మ్రోతగల, శోభిల్లువనమాలచే విరాజిల్లు శ్రీహరి



స్వ+అంశేన=నాయంశముతో, పుత్రత్వమ్=నీకు పుత్రునిగ, ఉపేత్య=జనించి (పొంది), తే=నీయొక్క, సుతాన్=పుత్రులను, గోప్తా+అస్మి=నేను రక్షించెదను.

**తాత్పర్యము :** సంతానరక్షణముకై పయోవ్రతమునాచరించి నన్ను తగినట్లుగా పూజించితివి, స్తుతించితివి. సంతానరక్షణముకై నీవు పయోవ్రతమునాచరించి నాయంశముతో నీకు కొమరునిగ జనించి నీ పుత్రులను రక్షింతును.

**శ్లో॥ ఉపధావ పతిం భద్రే-ప్రజాపతిమకల్మషమ్।**
**మాం చ భావయతీ పత్యా దేవరూపమవస్థితమ్॥** 19

**ప్రతిపదార్థము :** భద్రే=ఓ మంగళశీలా!, అకల్మషమ్=పాపరహితుడైన, ప్రజాపతిమ్=ప్రజాపతి యగు భర్తను, ఉపధావ=సేవింపుము. దేవరూపమ్=దైవస్వరూపుడనై, అవస్థితమ్=నెలకొన్న, మామ్=నన్ను, పత్యా=నీ భర్తలో, భావయతీ=భావించుచుండుము.

**తాత్పర్యము :** ఓ మంగళస్వభావా! నీవు పాపములేవియు లేక నిర్మలుడు, ప్రజాపతియునగు నీ భర్తను సేవింపుము. దైవస్వరూపుడనై నెలకొన్న నన్ను నీవు నీ భర్తలో భావించుచుండుము.

**శ్లో॥ నైతత్పరస్మా ఆఖ్యేయం పృష్టయాపి కథఞ్చన।**
**సర్వం సమ్పద్యతే దేవి-దేవగుహ్యం సుసంవృతమ్॥** 20

**ప్రతిపదార్థము :** దేవగుహ్యమ్=దేవరహస్యమగు, ఏతత్=దీనిని, పరస్మై=ఇతరులకి, కథంచన =ఎట్లును, న పృష్టయాపి=అడుగబడినను, న ఆఖ్యేయమ్=చెప్పదగినది కాదు. దేవి!=ఓ అదితీ!, దేవగుహ్యమ్=దేవరహస్యము, సుసంవృతమ్ సర్వమ్=అంతయు గూఢముగనున్న, సంపద్యతే=ఫలప్రదమగును.

**తాత్పర్యము :** ఓ దేవీ! దేవరహస్యమగు దీనిని ఇతరులకి ఎట్లును చెప్పదగినది కాదు. దేవరహస్యము అంతయు గూఢముగనున్న ఫలప్రదమగును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పలికెను.

**శ్లో॥ ఏతావదుక్త్వా భగవాంస్తత్రైవాన్తరధీయత।**
**అదితిర్దుర్లభం లబ్ధ్వా-హరేర్జన్మాత్మని ప్రభో॥** 21

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ రాజా!, భగవాన్=భగవంతుడు, ఏతావత్=ఇంతమాత్రమే, ఉక్త్వా= చెప్పి, తత్ర+ఏవ=అచటనే, అన్తరధీయత=అంతర్ధానమాయెను. అదితిః=అదితిదేవి, దుర్లభమ్ =లభింప శక్యముగాని, హరేః=విష్ణువు యొక్క, జన్మ=పుట్టుక, ఆత్మని=తనయాత్మయందు, లబ్ధ్వా=పొంది....

**తాత్పర్యము :** ఓ రాజా!, భగవంతుడు ఇంతమాత్రమే చెప్పి అచటనే అంతర్ధానమాయెను. అదితిదేవి లభింపశక్యముగాని విష్ణువు యొక్క పుట్టుక తనయాత్మయందు పొంది....

**శ్లో॥ ఉపాధావత్పతిం భక్త్యా-పరయా కృతకృత్యవత్।**
**స వై సమాధియోగేన-కశ్యపస్తదబుధ్యత।**
**ప్రవిష్టమాత్మని హరేరంశం హ్యవితథేక్షణః॥** 22

**ప్రతిపదార్థము :** కృతకృత్యవత్=కృతార్థురాలైనదై, పరయా భక్త్యా=పరమభక్తితో, పతిమ్= భర్తను, ఉపాధావత్=పోయి సేవించెను. సః=ఆ, కశ్యపః=కశ్యపుడు, ఆత్మని=తనయందు,

ప్రవిష్టమ్=ప్రవేశించిన, హరేః=హరియొక్క, అంశమ్=అంశను, అవితథ+ఈక్షణః=వృథకాని దృష్టి, దివ్యదృష్టిగలవాడై, సమాధియోగేన=సమాధి యోగముచే, తత్=ఆ ప్రవేశించుట, అబుధ్యత=తెలిసికొనెను.

**తాత్పర్యము :** అదితిదేవి కృతార్థురాలై పతినిబోయి భజించెను. ఆ కశ్యపుడు హరి యంశ తనయందు ప్రవేశించినట్లు దివ్యదృష్టిగలవాడై భగవద్ధ్యానముచే తెలిసికొనెను.

**శ్లో॥ సోఽదిత్యాం వీర్యమాధత్త తపసా చిరసమ్భృతమ్।**
**సమాహితమనా రాజన్-దారుణ్యగ్నిం యథానిలః॥** 23

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, అనిలః=వాయువు, దారుణి=దారువు, కొయ్యయందు, అగ్నిమ్=అగ్నిని, ఆధత్త+ఇవ=ఉంచుటవలె, సః=ఆ కశ్యపుడు, సమాహితమనా=నియమిత చిత్తుడై, తపసా=తపస్సుచే, చిరసంభృతమ్=తడవు కాలమునుండి ధరింపబడిన, వీర్యమ్=వీర్యమును, అదిత్యామ్=అదితిదేవియందు, ఆధత్త=ఉంచెను.

**తాత్పర్యము :** అన్నిచోట్ల సమానముగా నుండునదైనను వాయువేవిధముగా సంఘర్షమున వనమును దహించునదైన దావాగ్ని దారువునందుంచుచున్నదో, అట్లే కశ్యపుడు దాను చిరకాలము నుండి ధరించియున్న తన వీర్యమును చిత్తసమాధానము చేసికొని అదితిదేవి యందుంచెను. అనగా భార్యతో సంగమముసల్పి గర్భధారణము గావించెనని భావము.

**శ్లో॥ అదితేఽధిష్ఠితం గర్భం-భగవన్తం సనాతనమ్।**
**హిరణ్యగర్భో విజ్ఞాయ-సమీడే గుహ్యనామభిః॥** 24

**ప్రతిపదార్థము :** అదితేః=అదితియొక్క, గర్భమ్=గర్భమును, అధిష్ఠితమ్=పొందియున్న, సనాతనమ్=పురాణపురుషుడైన, భగవన్తమ్=భగవన్తుని, విజ్ఞాయ=ఎఱింగి, హిరణ్యగర్భః=బ్రహ్మ, గుహ్యనామభిః=వేదోక్తములైన నామములచే, సమీడే=స్తుతించెను.

**తాత్పర్యము :** అదితిదేవి గర్భమునుఁబొందియున్న పురాణపురుషుడైన భగవంతునెఱింగి బ్రహ్మ వేదోక్తములైన నామములచే స్తుతించెను.

**బ్రహ్మోవాచ :** బ్రహ్మ వచించెను.

**శ్లో॥ జయోరుగాయ భగవన్నురుక్రమ నమోఽస్తు తే।**
**నమస్తే పృశ్నిగర్భాయ వేదగర్భాయ వేధసే।**
**త్రినాభాయ త్రిపృష్ఠాయ శిపివిష్టాయ విష్ణవే॥** 25

**ప్రతిపదార్థము :** ఉరుగాయ=విశ్వమునంతటను వ్యాపించినవాడును, ఉరుక్రమ=గొప్పగా వ్యాపించు పాద విన్యాసముగలవాడును, పదత్రయమున లోకములాక్రమించువాడని భావము, భగవన్=ఓ దేవా!, జయ=సర్వోత్కర్షను పొందు, పృశ్నిగర్భాయ=పూర్వజన్మమున ఈ అదితియే పృశ్నియను సాధ్వియై యుండగ ఆమె గర్భమునుండి జన్మించినవాడు, వేదగర్భాయ=వేదములను ప్రకాశింపఁజేయువాడు, వేధసే=సృష్టికర్త, త్రినాభాయ=మూడు లోకములు నాభియందు కలవాడును, త్రిపృష్ఠాయ=మూడు లోకములకుఁబైన నుండువాడు, శిపివిష్టాయ =జీవులందు అంతర్యామిగానుండువాడు అగు, విష్ణవే=సర్వము వ్యాపించిన, తే=నీకు, నమః =నమస్కారము, అస్తు=అగుగాక!



**శ్లో॥ త్వమాదిరన్తో భువనస్య మధ్యమనన్తశక్తిం పురుషం యమాహుః।**
**కాలో భవానాక్షిపతీశ! విశ్వం స్రోతో యథాన్తః పతితం గభీరమ్॥** 26

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, భువనస్య=ప్రపంచమునకు, ఆదిః=మొదలు, మధ్యమ్=నడుమ, అంతః=తుదయై యున్నావు. యమ్=ఏ నిన్ను, అనంతశక్తిమ్=లెక్కలేని, నాశములేని, జ్ఞానైశ్వర్యాది శక్తులుగల, పురుషమ్=పురుషునిగా, ఆహుః=పెద్దలు చెప్పుదురో, ఈశ=ఓ పరమేశా!, అన్తఃపతితమ్=తనలోఁబడిన తృణాదికమును, గభీరమ్=లోతైన, స్రోతః యథా= ప్రవాహమెట్లు, ఆక్షిపతి=ఆకర్షించునో, తథా=అట్లు, భవాన్=నీవు, కాలః=కాల స్వరూపుడవై, విశ్వమ్=విశ్వమును, ఆక్షిపతి=ఆకర్షించుచున్నావు.

**తాత్పర్యము :** ఓ పరమేశ్వరా! నీవు విశ్వమునకు ఆది మధ్యాంతముయైన వాడవు. లేక సృష్టి స్థితిలయకారకుడవు. పెద్దలు నిన్ను లెక్కలేని జ్ఞానైశ్వర్యాది శక్తులుగలవానినిగ వచింతురు. తనలోఁబడిన తృణాదికమును, లోతైన ప్రవాహమెట్లు లాగుకొనిపోవునో అట్లే నీవు కాలస్వరూపుడవై విశ్వము నాకర్షించుచున్నావు.

**శ్లో॥ త్వం వై ప్రజానాం స్థిరజఙ్గమానాం ప్రజాపతీనామసి సమ్భవిష్ణుః।**
**దివౌకసాం దేవ! దివశ్చ్యుతానాం పరాయణం నౌరివమజ్జతోఽప్సు॥** 28

**ప్రతిపదార్థము :** దేవ!=ఓదేవా!, స్థిరజంగమానామ్=స్థావర జంగమములైన, ప్రజానామ్= ప్రాణులకు, ప్రజాపతీనామ్=బ్రహ్మ, అత్రిలోనగు ప్రజాపతులకు, త్వమ్=నీవు, సంభవిష్ణుః =పుట్టించువాడవు, దివశ్చ్యుతానామ్=దివః+చ్యుతానామ్=స్వర్గమునుండి భూమిని పడిన, దివ+ఓకసామ్=స్వర్గవాసులకు, అప్సు=ఉదకములందు, మజ్జతః=మునుగుచున్నవానికి, నౌః +ఇవ=ఓడవలె, పరాయణమ్= ఆశ్రయుడవు.

**తాత్పర్యము :** ఓ దేవా! స్థావరజంగమములైన ప్రాణులకు, బ్రహ్మలోనగు ప్రజాపతులకు, నీవు పుట్టించువాడవు. స్వర్గమునుండి భూమినబడిన స్వర్గవాసులకు నీళ్ళయందు మునిగిపోవు వారికి ఓడవలె ఆశ్రయుడవై యున్నావు.

దేవతలకుఁబరమాశ్రయుడవై వారి కార్యము సాధించుటకై ఈ అవతారమై యున్నది అని భావము.

ఇతి శ్రీమద్భాగవతమహాపురాణే అష్టమస్కన్ధే సప్తదశో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున సప్తదశాధ్యాయము.

**ప్రతిపదార్థము :** మహారాజ=ఓ మహారాజా!, అవ్యయాత్మనః=అవ్యయుడగు ఆవామనునకు, వేదగర్భః=బ్రహ్మ, కమణ్డలమ్=కమండలమును, సప్తర్షయః=సప్తర్షులు, కుశాన్=దర్భలను, సరస్వతీ=సరస్వతి, అక్షమాలామ్=అక్షమాలను, జపమాలను, దదుః=ఇచ్చిరి.

**శ్లో॥ తస్మా ఇత్యుపనీతాయ యక్షరాట్ పాత్రికామదాత్।**
**భిక్షాం భగవతీ సాక్షా-దుమాదాదమ్బికా సతీ॥ 17**

**ప్రతిపదార్థము :** యక్షరాట్=కుబేరుడు, తస్మై+ఇతి+ఉపనీతాయ=ఇట్లు ఉపనీతుడగు ఆ వామన భగవానునకు, పాత్రికామ్=భిక్షా పాత్రమును, భగవతీ=భగవతియగు, సతీ=భవానీదేవి, సాక్షాత్=ప్రత్యక్షంగా, భిక్షామ్=భిక్షమును, అదాత్=ఒసంగిరి.

**శ్లో॥ స బ్రహ్మవర్చసేనైవం - సభాం సమ్భావితో వటుః।**
**బ్రహ్మర్షిగణసఞ్జుష్టామత్యరోచత మారిషః॥ 18**

**ప్రతిపదార్థము :** మారిషః=ఆ కశ్యపప్రజాపతి పుత్రుడగు, వటుః=వామన భగవానుడు, ఏవమ్=ఇట్లు, సంభావితః=సత్కృతుడై, తేజస్సుగల, బ్రహ్మవర్చసేన=బ్రహ్మవర్చస్సుతో, బ్రహ్మర్షిగణసంజుష్టామ్=బ్రహ్మతేజస్సుగల బ్రహ్మర్షులచే సమన్వితమగు, సభామ్=ఆ సభను, అత్యరోచత=అతిక్రమించి శోభిల్లుచుండెను.

**శ్లో॥ సమిద్ధమాహితం వహ్నిం-కృత్వా పరిసమూహనమ్।**
**పరిస్తీర్య సమభ్యర్చ్య-సమిద్భిరజుహోద్విభుః॥ 19**

**ప్రతిపదార్థము :** విభుః=ఆ వామనభగవానుడు, సమిద్ధమ్+ఆహితమ్=యజ్ఞసంబంధమైన, వహ్నిమ్=అనలమును, పరిసమూహనమ్=ఋజుభావముతో, కృత్వా=కల్పించి, పరిస్తీర్య= విస్తరింపజేసి, సమభ్యర్చ్య=అర్చించి, సమిద్భిః=సమిధలచే, అజుహోత్=హోమము గావించెను.

**తాత్పర్యము :** వామనభగవానుడు జ్వలితమగు యజ్ఞసంబంధమైన అనలమును ఋజు భావముతో కల్పించి, విస్తరింపజేసి, అర్చించి, దానియందు సమిధలచే హోమము గావించెను.

**శ్లో॥ శ్రుత్వాశ్వమేధైర్యజమానమూర్జితం బలిం భృగూణాముపకల్పితైస్తతః।**
**జగామ తత్రాఖిలసారసమ్భృతో-భారేణ గాం సన్నమయన్ పదే పదే॥ 20**

**ప్రతిపదార్థము :** భృగూణాముపకల్పితైః=భృగువంశీయులకు కల్పితములగు, అశ్వమేధైః= అశ్వమేధములచే, యజమానమూర్జితమ్=యజ్ఞములను చేయువాడు, అఖిలసారసంభృతః =సమృద్ధిశాలియునగు, బలిమ్=బలిని గూర్చి, శ్రుత్వా=విని, తతః=పిమ్మట, వామనుడు, పదే పదే=ప్రతిపదమునందును, భారేణ=భారముచే, గామ్=భూమిని, సన్నమయన్= అవనతము చేయుచు, తత్ర=బలికడకు, జగామ=వెడలెను.

**తాత్పర్యము :** భృగువంశీయులచే కల్పితములగు అశ్వమేధములచే యజ్ఞములనుచేయువాడు, సమృద్ధిశాలియునగు బలిని గూర్చి విని, పిమ్మట వామనుడు ప్రతిపదము నందును భారముచే భూమిని అవనతము చేయుచు బలికడకు వెడలెను.

**శ్లో॥ తం నర్మదాయాస్తట ఉత్తరే బలేర్యే ఋత్విజస్తే భృగుకచ్ఛసంజ్ఞకే।**
**ప్రవర్తయన్తో భృగవః క్రతూత్తమమ్-వ్యచక్షతారాదుదితం యథా రవిమ్॥ 21**



కౌస్తుభమణి కంఠమునందు ధరించినవాడు తన శోభచే కశ్యపప్రజాపతి గృహము నావరించిన చీకటిని బోదోలుచు నావిర్భవించెను.

**శ్లో॥ దిశః ప్రసేదుః సలిలాశయాస్తదా ప్రజాః ప్రహృష్టా ఋతవో గుణాన్వితాః।**
**ద్యౌరన్తరీక్షం క్షితిరగ్నిజిహ్వా గావో ద్విజాః సఞ్జహృషుర్నగాశ్చ॥ 4**

**ప్రతిపదార్థము :** ఆ హరిజన్మమందు, దిశః=దిక్కులు, సలిలాశయాః=నీటి కొలనులు, ప్రసేదుః =తేటగించినవి. ప్రజాః=ప్రజలు, ప్రహృష్టాః=సంతసిల్లిరి. ఋతవః=వసంతాది ఋతువులు, గుణ+అన్వితాః=వాని లక్షణములతోఁగూడుకొన్నవి. ద్యౌః=స్వర్గము, అన్తరీక్షమ్=ఆకాశము, క్షితిః=భూమి, అగ్నిజిహ్వాః=అగ్నియే నాలుకగాగలవాడు అనుట ద్వారా హవిస్సులనుఁ గొనువారగు దేవతలు, గావః=గోవులు, ద్విజాః=విప్రులు, నగాః+చ=పర్వతములును, సంజహృషుః=హర్షమును పొందెను.

**తాత్పర్యము :** ఆ వామను జన్మమప్పుడు దిక్కులు, జలాశయములు తేటగించినవి. ప్రజలు సంతసిల్లిరి. ఋతువులు వాని వాని గుణములతో గూడి శోభిల్లినవి. స్వర్గము, గగనము, భూమి, దేవతలు, విప్రులు, కొండలును హర్షించెను.

ఆ వామను ప్రాదుర్భావసమయమునుఁజెప్పుచున్నాడు.

**శ్లో॥ శ్రోణాయాం భాద్రద్వాదశ్యాం ముహూర్తేఽభిజితి ప్రభుః।**
**సర్వనక్షత్రతారాద్యా-శ్చక్రుస్తజ్జన్మ దక్షిణమ్॥ 5**

**ప్రతిపదార్థము :** భాద్రద్వాదశ్యామ్=భాద్రపదశుక్ల ద్వాదశియందు, శ్రోణాయామ్=శ్రవణ నక్షత్రమందు చంద్రుడుండగా, శ్రవణము యొక్క ప్రథమాంశమున, అభిజితి=అభిజిత్తను నక్షత్రమున, ముహూర్తే=ముహూర్తమునందు, ప్రభుః=జగత్ప్రభువు (జన్మించెను). సర్వనక్షత్రతారాద్యాః=ఎల్ల నక్షత్రములు, గురుశుక్రాది గ్రహములు, తత్+జన్మ=ఆ దేవుని జన్మము, దక్షిణమ్=ఉదారమునుగా, చక్రుః=చేసెను.

**తాత్పర్యము :** భాద్రపద శుద్ధ ద్వాదశినాడు శ్రవణమునందు చంద్రుడుండ, శ్రవణ ప్రథమాంశము అశ్విన్యాది నక్షత్రములెల్ల, గురుశుక్రాది గ్రహములెల్లను ఆ హరిజన్మము సుగుణసంపత్తిని జేకూర్చుస్థానములందు వెలసెను.

అభిజిత్తను నక్షత్రమొందు గలదు. శ్రుతిచేఁదెల్పబడినది.

"అభిజిన్నామ నక్షత్రం ఉపరిష్టాదాషాఢానాం...యాం" అభిజిత్తను నక్షత్రము పూర్వాషాఢాది నక్షత్రములకుఁబైనను, శ్రవణమునకు దిగువను గలదు.

**శ్లో॥ ద్వాదశ్యాం సవితాతిష్ఠన్మధ్యన్దినగతో నృప।**
**విజయా నామ సా ప్రోక్తా-యస్యాం జన్మ విదుర్హరేః॥ 6**

**ప్రతిపదార్థము :** నృప!=ఓ రాజా!, హరేః=శ్రీహరి యొక్క, జన్మ=జన్మము, ద్వాదశ్యామ్=ఆ ద్వాదశీ తిథియందు, సవితా=సూర్యుడు, తిష్ఠత్+మధ్యన్దినగతః=మధ్యందినగతుడయ్యెను అని, విదుః=తెలిసికొనిరి. సా=ఆ ద్వాదశి, విజయా నామ='విజయ' నామముతో, ప్రోక్తా= చెప్పబడినది.

**తాత్పర్యము :** ఓ రాజా! శ్రీహరి జన్మము ద్వాదశీతిథియందు సూర్యుడు మధ్యందినగతుడయ్యెనని తెలిసికొనిరి. ఆ ద్వాదశి విజయ నామముతో చెప్పబడినది.

**శ్లో॥ శఙ్ఖదున్దుభయో నేదుర్మృదఙ్గపణవానకాః।**
**చిత్రవాదిత్రతూర్యాణాం-నిర్ఘోషస్తుములోఽభవత్॥ 7**

**ప్రతిపదార్థము :** శంఖదున్దుభయః=శంఖదుందుభులు, మృదఙ్గపణవానకాః= మృదంగములు, పణవములు, ఆనకములులోనగు వాద్యములు, నేదుః=ధ్వనించెను. చిత్రవాదిత్రతూర్యాణామ్ =విచిత్రములగునావాద్యయంత్రములనుండి, తుముల= తుములమగు, నిర్ఘోషః=శబ్దము, అభవత్=కలిగెను.

**తాత్పర్యము :** అపుడు శంఖదుందుభులు, మృదంగాదివాద్యములు ధ్వనించెను.

**శ్లో॥ ప్రీతాశ్చాప్సరసోఽనృత్యన్ గన్ధర్వప్రవరా జగుః।**
**తుష్టువుర్మునయో దేవా-మనవః పితరోఽగ్నయః॥ 8**

**ప్రతిపదార్థము :** అప్సరసః=అప్సరసలు, ప్రీతాః+చ=ఆనందముతో, అనృత్యన్=నృత్యము చేసిరి, గన్ధర్వప్రవరాః=గంధర్వులు, జగుః=గానమొనర్చిరి, మునయః=మునులు, దేవాః =దేవతలు, మనవః=మనువులు, పితరః=పితరులు, అగ్నయః=అగ్నులు, తుష్టువుః =స్తుతించిరి.

**తాత్పర్యము :** అప్సరసలు ఆనందముతో నృత్యము చేసిరి. మునులులోనగువారు స్తుతించిరి.

**శ్లో॥ సిద్ధవిద్యాధరగణాః సకిమ్పురుషకిన్నరాః।**
**చారణా యక్షరక్షాంసి-సుపర్ణా భుజగోత్తమాః॥ 9**

**ప్రతిపదార్థము :** సిద్ధవిద్యాధరగణాః=సిద్ధులు, విద్యాధరులు, సకింపురుషకిన్నరాః =కింపురుషులు, కిన్నెరలు, చారణాః=చారణులు, యక్షరక్షాంసి=యక్షులు, రాక్షసులు, సుపర్ణాః =సుపర్ణులు, భుజగోత్తమాః=శ్రేష్ఠములైన నాగులు...

**శ్లో॥ గాయన్తోఽతిప్రశంసన్తో నృత్యన్తో విబుధానుగాః।**
**అదిత్యా ఆశ్రమపదం కుసుమైః సమవాకిరన్॥ 10**

**ప్రతిపదార్థము :** గాయన్తః=గుణగానము చేయుచు, అతిప్రశంసన్తః=మిక్కిలి ప్రశంసించుచు, నృత్యన్తః=నృత్యము చేయుచు, అదిత్యాః=అదితియొక్క ఆశ్రమపదమ్=ఆశ్రమమును, కుసుమైః =పూలచే, సమవాకిరన్=వర్షము కురిపించిరి.

**తాత్పర్యము :** భగవానునిపై దేవగణములు పూలవాన కురిపించిరి.

**శ్లో॥ దృష్ట్వాదితిస్తం నిజగర్భసమ్భవం పరం పుమాంసం ముదమాప విస్మితా।**
**గృహీతదేహం నిజయోగమాయయా ప్రజాపతిశ్చాహ జయేతి విస్మితః॥ 11**

**ప్రతిపదార్థము :** నిజయోగమాయయా=తన యోగమాయచే, గృహీత దేహమ్=శరీరమును ధరించినవాడు అగు, పురమ్ పుమాంసమ్=పరమపురుషుడు, నిజగర్భసంభవమ్=తన గర్భమున నుద్భవించుట, దృష్ట్వా=చూచి, అదితిః=అదితి, విస్మితా=విస్మితయునై, ముదమ్= హర్షమును, ఆప=పొందెను. ప్రజాపతిః+చ=కశ్యప ప్రజాపతియు, తమ్=ఆ పరమ పురుషుని, దృష్ట్వా=చూచి, విస్మితః=విస్మయముతో, జయ+ఇతి='జయ'కారమును, ఆహ=ఒనరించెను.

**తాత్పర్యము :** తన యోగమాయచే శరీరమును ధరించిన పరమపురుషుడు తన గర్భమున నుద్భవించుట గాంచి యదితి విస్మితయై హర్షాన్వితయయ్యెను. కశ్యప ప్రజాపతియు చూచి విస్మయముతో జయకారము పలికెను.



**శ్లో॥ యత్తద్వపుర్భాతి విభూషణాయుధైరవ్యక్తచిద్వ్యక్తమధారయద్ధరిః।**
**బభూవ తేనైవ స వామనో వటుః సమ్పశ్యతోర్దివ్యగతిర్యథా నటః॥ 12**

**ప్రతిపదార్థము :** హరిః=విష్ణువు, అవ్యక్తచిత్=అవ్యక్త జ్ఞానస్వరూపమయిన, యత్=ఏ, వపుః =శరీరమును, అధారయత్=ధరించునట్లు ప్రకటించెనో, తత్=అది, విభూషణాయుధైః =సొమ్ములతో, ఆయుధములతో, వ్యక్తమ్=స్పష్టముగా, భాతి=ప్రకాశించుచున్నది. తేనైవ=ఆ శరీరము చేతనే, సంపశ్యతోః=తల్లిదండ్రులయిన అదితికశ్యపులు చూచుచుండగా, దివ్యగతిః =దివ్య జన్మకర్మలు గల, సః=ఆ విష్ణువు, నటః యథా=నటునివలె, వామనః=వామనుడుగా, బభూవ=అయ్యెను.

**తాత్పర్యము :** అవ్యక్త జ్ఞానస్వరూపధారి అయిన భగవంతుడు ఆయుధాభరణోజ్జ్వలమయిన శరీరమును వ్యక్తము చేసెను. అదితికశ్యపులు చూచుచుండగనే దివ్యలీలానిలయుడైన భగవంతుడు నటునివలె "వామన" రూపుడయ్యెను.

**శ్లో॥ తం వటుం వామనం దృష్ట్వా-మోదమానా మహర్షయః।**
**కర్మాణి కారయామాసుః-పురస్కృత్య ప్రజాపతిమ్॥ 13**

**ప్రతిపదార్థము :** మహర్షయః=మహర్షులు, తమ్=ఆ, వటుమ్=విప్రుడైన, వామనమ్= వామనుని, దృష్ట్వా=చూచి, మోదమానాః=సంప్రీతులైనారు. ప్రజాపతిమ్=కశ్యపుని, పురస్కృత్య =ముందుంచుకొని, కర్మాణి=జాతక కర్మాదులు, కారయామాసుః=ఒనరించిరి.

**శ్లో॥ తస్యోపనీయమానస్య సావిత్రీం సవితాబ్రవీత్।**
**బృహస్పతిర్బ్రహ్మసూత్రమ్-మేఖలాం కశ్యపోఽదదాత్॥ 14**

**ప్రతిపదార్థము :** తస్య=ఆ వామనుని, ఉపనీయమానస్య=ఉపనయన కాలమున, సవితా= సవితృ దేవుడు, సావిత్రీమ్=సావిత్రిని, అబ్రవీత్=ఉపదేశించెను. బృహస్పతిః=బృహస్పతి, బ్రహ్మసూత్రమ్=యజ్ఞసూత్రమును, కశ్యపః=తండ్రియగు కశ్యపుడు, మేఖలామ్=మేఖలను, అదదాత్=ఒసంగిరి.

**శ్లో॥ దదౌ కృష్ణాజినం భూమిర్దణ్డం సోమో వనస్పతిః।**
**కౌపీనాచ్ఛాదనం మాతా ద్యౌశ్ఛత్రం జగతః పతేః॥ 15**

**ప్రతిపదార్థము :** భూమిః=భూదేవి, కృష్ణాజినమ్=కృష్ణాజినమును జింకతోలును, వనస్పతిః =వనస్పతియగు, సోమః=సోముడు, చంద్రుడు, దణ్డమ్=దండమును, మాతా=తల్లియగు అదితి, కౌపీనాచ్ఛాదనమ్=గోచిని, ద్యౌః=స్వర్గము, జగతః=జగత్తుకు, పతేః=నాథుడగు వామనునికి, ఛత్రమ్=ఛత్రమును, దదౌ=ఒసంగినవి.

**శ్లో॥ కమణ్డలుం వేదగర్భః-కుశాన్ సప్తర్షయో దదుః।**
**అక్షమాలాం మహారాజ-సరస్వత్యవ్యయాత్మనః॥ 16**

సువర్ణము, అథ=ఇంకను, గుణవత్=సకల సంపదలుగల, ధామ వా=గృహమైనా, తథా=అట్లే, మృష్టమ్=షడ్రసోపేతమైన, అన్నపేయమ్=అన్నము, పానీయమును, ఉత=అట్లుగాక, విప్రకన్యామ్=బ్రాహ్మణ కన్య, సమృద్ధాన్=సుక్షేత్రముల నొప్పారు, గ్రామాన్=గ్రామములను, తురగాన్=అశ్వములను, తథా=అట్లే, ఉత్తమాన్=మేలైన, గజాన్ వా=ఏనుగులనైనను, అర్హత్తమ!=ఓ పరమపూజ్యుడా!, మే=నా వలన, సంప్రతీచ్ఛ=గ్రహింపుము.

**తాత్పర్యము :** ఓ విప్రకుమారా! నీవు యాచకుడుగా వచ్చినవానిగ తలంచెదను. నీకేమి కావలయునని వాంఛింతువో వానినెల్ల నావలన గైకొనుము. నా వలన పసిడిని, సిరిసంపదల నొప్పు భవనమును గొనుము. రుచివంతమైన అన్నము లేక నీకుఁదగిన విప్రకన్యనా, సకల సంపదలనిండుకొన్న గ్రామములను, అశ్వములను, ఉత్తమ గజములనుగాని, ఓ పరమపూజ్యుడా! నా వలన గ్రహింపుము.

ఇతి శ్రీమద్భాగవతమహాపురాణే అష్టమస్కన్ధే అష్టాదశో - ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున అష్టాదశాధ్యాయము.



**ప్రతిపదార్థము :** నర్మదాయాః=నర్మదానదికి, తటే+ఉత్తరే=ఉత్తరతీరమున, భృగుకచ్ఛసంజ్ఞకే='భృగుకచ్ఛ'మను క్షేత్రమున, బలేః=బలియొక్క, క్రతూత్తమమ్=యజ్ఞకర్మమును, ప్రవర్తయన్తః=నిమగ్నులైయున్నవారు, యే తే=ఎవరో వారు, భృగవః=భృగువంశ బ్రాహ్మణులు, ఉదితమ్=ఉదయించుచున్న, రవిమ్ యథా=సూర్యుని వలె, వ్యచక్షత=దర్శించిరి.

**తాత్పర్యము :** నర్మదానదికి ఉత్తరతీరమున 'భృగుకచ్ఛ'మను క్షేత్రమున బలియొక్క యజ్ఞ కర్మమున నిమగ్నులైయున్నవారగు భృగుబ్రాహ్మణులు ఉదయించుచున్న సూర్యునివలె వెలుగు వామన భగవానుని దర్శించిరి.

**శ్లో॥ తే ఋత్విజో యజమానః సదస్యా హతత్విషో వామనతేజసా నృప।**
**సూర్యః కిలాయాత్యుత వా విభావసుః సనత్కుమారోఽథ దిదృక్షయా క్రతోః॥ 22**

**ప్రతిపదార్థము :** నృప!=ఓ రాజా, వామన తేజసా=వామనుని తేజోబలముచే, హతత్విషః=తేజోహీనులైన, ఋత్విజః=ఋత్విక్కులు, యజమానః=యజమానియగు బలి, సదస్యాః=సదస్యులు, క్రతోః=యజ్ఞముయొక్క, దిదృక్షయా=దర్శనాభిలాషతో, సూర్యః=సూర్యుడు, వా=లేదా, విభావసుః=అగ్ని, ఉత=కాదేని, సనత్కుమారః=సనత్కుమారుడు, కిల+ఆయాతి=వచ్చినాడా ఏమి అని (తర్కించుకొనసాగిరి).

**తాత్పర్యము :** ఓ రాజా! వామనుని తేజోబలముచే తేజోవిహీనులైన ఋత్విక్కులు, యజమాని యగు బలి, సదస్యులు - యజ్ఞ దర్శనాభిలాషతో సూర్యుడు లేదా అగ్ని లేదా సనత్కుమారుడు వచ్చినాడా ఏమి? అని తర్కించుకొనిరి.

**శ్లో॥ ఇత్థం సశిష్యేషు భృగుష్వనేకధా వితర్క్యమాణో భగవాన్ స వామనః।**
**ఛత్రం సదణ్డం సజలం కమణ్డలుం వివేశ బిభ్రద్ధయమేధవాటమ్॥ 23**

**ప్రతిపదార్థము :** సశిష్యేషు=శిష్యులతోబాటు, భృగుషు=భృగువంశ బ్రాహ్మణులలో, ఇత్థమ్=ఇట్లు, అనేకధా=బహు విధములుగా, వితర్క్యమాణః=తర్కించుకొనబడుచున్న, భగవాన్=భగవంతుడగు, సః వామనః=ఆ వామనుడు, సదణ్డమ్=దండమును, ఛత్రమ్=ఛత్రమును, సజలమ్ కమణ్డలుమ్=జలముతో కూడిన కమండలమును, బిభ్రత్ =ధరించి, హయమేధవాటమ్=బలి చక్రవర్తియొక్క అశ్వమేధయజ్ఞమండపమును, వివేశ=ప్రవేశించెను.

**తాత్పర్యము :** శిష్యులతోబాటు భృగువంశ బ్రాహ్మణులు ఇట్లు బహువిధములుగ తర్కించు కొనసాగిరి. ఆ వామన భగవానుడు దండమును, ఛత్రమును, జలభరిత కమండలమును పట్టుకొని బలిచక్రవర్తి అశ్వమేధయజ్ఞ మండపమును ప్రవేశించెను.

**శ్లో॥ మౌఞ్జ్యా మేఖలయా వీతముపవీతాజినోత్తరమ్।**
**జటిలం వామనం విప్రం-మాయామాణవకం హరిమ్॥ 24**

**ప్రతిపదార్థము :** మౌంజ్యా=ముంజదర్భమొలత్రాడుగల, మేఖలయా=మేఖలతో, ఉపవీత+అజినోత్తరమ్=ఉపవీతాకారముతో అజినోత్తరీయముగలవాడును, వీతమ్=చుట్టుకొనబడిన వాడున్నూ, జటిలమ్=జటాధారియు, వామనమ్=వామనుడును, విప్రమ్=విప్రుడును, మాయామాణవకమ్=మాయారూపుడగు బాలకుడును అగు, హరిమ్=శ్రీహరి...

శ్లో॥ ప్రవిష్టం వీక్ష్య భృగవః-సశిష్యాస్తే సహాగ్నిభిః।
ప్రత్యగృహ్ణన్ సముత్థాయ-సంక్షిప్తాస్తస్య తేజసా॥ 25

**ప్రతిపదార్థము :** ప్రవిష్టమ్=ప్రవేశించిన వటువును, వీక్ష్య=చూచి, తస్య తేజసా=ఆయన తేజః ప్రభావముచే, సహ+అగ్నిభిః=అగ్నితోబాటు, సశిష్యాః=శిష్యసహితులగు, తే=ఆ భృగువంశ బ్రాహ్మణులు, సముత్థాయ=యాసనములనుండి లేచి, ప్రత్యగృహ్ణన్=స్వాగతించిరి.

**తాత్పర్యము :** వామన భగవానుడు ఆ యజ్ఞవాటికను ప్రవేశించగా భగవానుని చూచి ఆయన తేజః ప్రభావముచే అగ్నితోబాటు, శిష్యసమేతులగు ఆ భృగువంశ బ్రాహ్మణులు అభిభూతులై యాసనముల నుండి లేచి స్వాగతించిరి.

శ్లో॥ యజమానః సముదితో దర్శనీయం మనోరమమ్।
రూపానురూపావయవం తస్మా ఆసనమాహరత్॥ 26

**ప్రతిపదార్థము :** యజమానః=యజమానుడగు, సః=ఆ బలిచక్రవర్తి, ముదితః=సంతుష్ట చిత్తుడై, దర్శనీయమ్=దర్శనీయము, మనోరమమ్=పరమసుందరము, రూపాను రూపావయవమ్=రూపమునకు దగిన అవయవ శోభితమైన, తస్మై=వామనుని కొఱకు, ఆసనమ్=ఆసనమును, ఆహరత్=ఒసంగెను.

**తాత్పర్యము :** బలిచక్రవర్తి కూడా అపురూప సౌందర్యశోభితుడగు ఆ వామనభగవానుని కొఱకు ఆసనమును ఒసంగెను.

శ్లో॥ స్వాగతేనాభినన్ద్యాథ పాదౌ భగవతో బలిః।
అవనిజ్యార్చయామాస ముక్తసఙ్గమనోరమమ్॥ 27

**ప్రతిపదార్థము :** అథ=పిమ్మట, బలిః=బలిచక్రవర్తి, ముక్తసఙ్గమనోరమమ్=ఆత్మయందు రమించువారికి హృదయానందముగలిగించు వామనుని స్వాగతముతో, అభినన్ద్య= అభినందించి, భగవతః=భగవంతుడగు వామనుని యొక్క, పాదౌ=పాదములను, అవనిజ్య= కడగి, అర్చయామాస= అర్చించెను.

**తాత్పర్యము :** పిమ్మట బలిచక్రవర్తి ఆత్మయందు రమించువారికి హృదయానందప్రదుడునగు వామనభగవానుని స్వాగతవచనములతో అభినందించి, పాదములను కడిగి అర్చించెను.

శ్లో॥ తత్పాదశౌచం జనకల్మషాపహం స ధర్మవిన్మూర్ధ్న్యదధాత్ సుమఙ్గలమ్।
యద్దేవదేవో గిరిశశ్చన్ద్రమౌళిర్దధార మూర్ధ్నా పరయా చ భక్త్యా॥ 28

**ప్రతిపదార్థము :** దేవదేవః=దేవదేవుడు, గిరిశః=కొండయల్లుడు అగు, చన్ద్రమౌళిః= చంద్రచూడుడు, పరయా చ భక్త్యా=పరమభక్తితో, యత్=ఏ చరణోదకమును, మూర్ధ్నా= శిరస్సున, దధార=ధరించెనో, తత్=ఆ, పాదశౌచమ్=పాదప్రక్షాళన జలమును, ధర్మవిత్= ధర్మజ్ఞుడగు, సః=ఆ బలిచక్రవర్తి, జనకల్మషాపహమ్=సమస్త కులపాపమును నశింపజేయు నట్టిది, సుమఙ్గలమ్=సర్వశుభములనిచ్చుదానిని, మూర్ధ్ని=శిరస్సునందు, అదధాత్=ధరించెను.

**తాత్పర్యము :** దేవదేవుడు, కొండయల్లుడుఅగు చంద్రచూడుడు పరమభక్తితో ఏ చరణోదకమును శిరస్సున ధరించెనో ఆ పాదప్రక్షాళన జలమును ధర్మజ్ఞుడగు ఆ బలిచక్రవర్తియు శిరస్సునందు ధరించెను.



**శ్రీ బలిరువాచ :** బలిచక్రవర్తి వచించెను.

శ్లో॥ స్వాగతం తే నమస్తుభ్యం-బ్రహ్మన్ కిం కరవామ తే।
బ్రహ్మర్షీణాం తపః సాక్షా-న్మన్యే త్వార్య! వపుర్ధరమ్॥ 29

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=మహాత్మా, తే=నీకు, స్వాగతమ్=స్వాగతము, తుభ్యమ్=నీ కొఱకు, నమః=నమస్కారము, తే=నీకు, కిమ్ కరవామ=ఏమి చేయుదుము. ఆర్య!=ఓ ఘనుడా!, బ్రహ్మర్షీణామ్=బ్రహ్మర్షుల యొక్క, వపుర్ధరమ్=శరీరము ధరించిన, సాక్షాత్=ప్రత్యక్షమైన, తపః=తపస్స్వరూపముగా, త్వా=నిన్ను, మన్యే=తలంచెదను.

**తాత్పర్యము :** ఓ విప్రోత్తమా! నీకు స్వాగతము, నీకు నమస్కారము. నీకు నేను జేయదగిన దేమి? నిన్ను మూర్తిమంతమై సాక్షాత్కరించిన బ్రహ్మర్షుల తపముగా దలంచుచున్నాను.

శ్లో॥ అద్య నః పితరస్తృప్తా-అద్య నః పావితం కులమ్।
అద్య స్విష్టః క్రతురయం-యద్భవానాగతో గృహాన్॥ 30

**ప్రతిపదార్థము :** యత్=ఏ కారణమున, భవాన్=నీవు, గృహాన్=మా గృహమును గూర్చి, ఆగతః=వచ్చితివో అందువలన, అద్య=నేడు, నః=మా యొక్క, పితరః=పితరులు, తృప్తాః =తృప్తిచెందిరి. అద్య=నేడు, నః=మా యొక్క, కులమ్=వంశము, పావితమ్=పావనమయ్యెను. అద్య=నేడు, అయమ్=ఈ, క్రతుః=యాగము, స్విష్టః=ఫలప్రదమయ్యెను.

**తాత్పర్యము :** నీవు మా గృహమునకుఁజనుదెంచుట వలన నేఁడు మా పితరులు సంతుష్టులైరి. మా వంశము పావనమాయెను. ఈ యాగము ఫలప్రదమయ్యెను.

శ్లో॥ అద్యాగ్నయో మే సుహుతా యథావిధి ద్విజాత్మజ త్వచ్చరణావనేజనైః।
హతాంహసో వార్భిరియం చ భూరహో తథా పునీతా తనుభిః పదైస్తవ॥ 31

**ప్రతిపదార్థము :** ద్విజ+ఆత్మజ=ఓ విప్రకుమారా!, అద్య=నేడు, మే=నాయొక్క, అగ్నయః =అగ్నులు, సుహుతాః=చక్కగా హుతములైనవి, త్వత్+చరణ+అవనేజనైః=నీ చరణ ప్రక్షాళనమైన, వార్భిః=జలముచే, హతాంహసః=పాపము నశించినది. అహో= ఏమాశ్చర్యము, తథా=అట్లే, ఇయమ్=ఈ, భూః=భూమి, తవ=నీ, తనుభిః=బుల్లివయిన, పదైః=పాదములచే, పునీతా=పునీతమైనది.

**తాత్పర్యము :** ఓ విప్రకుమారా! నేడు నాయగ్నులు శాస్త్రవిధానమున వ్రేల్వబడినవయినవి. నీ చరణ ప్రక్షాళనము చేసిన ఈ జలములచే పాపములు పోయినవి. అట్లే భూమియు నీ పాదస్పర్శచే పవిత్రమైనది.

శ్లో॥ యద్యద్భవాన్ వాఞ్ఛతి తత్ప్రతీచ్ఛ మే త్వామర్థినం విప్రసుతానుతర్కయే।
గాం కాఞ్చనం గుణవద్ధామ మృష్టం తథాన్నపేయముత వా విప్రకన్యామ్।
గ్రామాన్ సమృద్ధాంస్తురగాన్ గజాన్ వా రథాంస్తథార్హత్తమ సంప్రతీచ్ఛ॥ 32

**ప్రతిపదార్థము :** విప్రసుత!=ఓ విప్రకుమారా!, యత్+యత్=ఏది, ఏది, భవాన్=నీవు, వాంఛతి=కోరుదువో, తత్=దానిని, మే=నా వలన, ప్రతీచ్ఛ=గ్రహింపుము, త్వామ్=నిన్ను, అర్థినమ్=యాచకునిగా, అనుతర్కయే=ఊహింతును. గామ్ చ=గోవును, కాంచనమ్=

శ్లో॥ స తన్నికేతం పరిమృశ్య శూన్యమపశ్యమానః కుపితో ననాద।
క్ష్మాం ద్యాం దిశః ఖం వివరాన్ సముద్రాన్ విష్ణుమ్ విచిన్వన్న దదర్శ వీరః॥ 11

**ప్రతిపదార్థము :** సః=ఆ హిరణ్యకశిపుడు, శూన్యమ్=ఎవ్వరూలేని, నికేతమ్=విష్ణు నిలయమును, వైకుంఠమును, పరిమృశ్య=అంతట చుట్టి, తమ్ విష్ణుమ్=ఆ విష్ణువును, అపశ్యమానః=చూడనివాడై, కుపితః=కుపితుడై, ననాద=సింహనాదము గావించెను. వీరః =వీరుడు, క్ష్మామ్= భూమిని, ద్యామ్=స్వర్గమును, దిశః=దిక్కులను, ఖమ్=ఆకాశమును, వివరాన్=పాతాళ గుహలను, సముద్రాన్=సముద్రములను, విచిన్వన్=వెదకుచు, న దదర్శ=ఆ వెన్నుని చూడలేదు.

**తాత్పర్యము :** ఆ హిరణ్యకశిపుడు ఎవ్వరులేని వైకుంఠమునంతటను చూచి, ఆ వెన్నుని చూడనివాడై కోపమున పెద్దఅపఱచెను. మఱి యా వీరుడు భూమిని, స్వర్గమును, దిక్కులను, ఆకాశమును, పాతాళగుహలను, సముద్రములను వెదకియు వెన్నుని గాంచలేకపోయెను.

శ్లో॥ అపశ్యన్నితి హోవాచ-మయాన్విష్టమిదం జగత్।
భ్రాతృహా మే గతో నూనం-యతో నావర్తతే పుమాన్॥ 12

**ప్రతిపదార్థము :** అపశ్యన్=హరిని చూడనివాడై, ఇతి ఉవాచ హ=ఇట్లు వచించెను. మయా=నా చేత, ఇదం జగత్=ఈ జగము, అన్విష్టమ్=వెదుకబడినది, మే=నాయొక్క, భ్రాతృహా=అన్నను జంపిన విష్ణువు, పుమాన్=పురుషుడు, యతః=దేనినుండి, న+ఆవర్తతే=మరలిరాడో, ఆ చోటికి, గతః=పోయినాడు. నూనమ్=ఇది నిశ్చయము.

**తాత్పర్యము :** ఇట్లు హరిని జూడనివాడై ఇట్లనెను. నేను జగమంతయు వెదకితిని. మా అన్నను జంపినవాడు పురుషుడు పోయి మరలరానిచోటికి పోయినాడు (చనిపోయినాడు). ఇది నిజము. పురుషుడు దేనినుండి మరల రానిచోటు బ్రహ్మము. ఆ బ్రహ్మమును బొందినాడు.

శ్లో॥ వైరానుబన్ధ ఏతావానామృత్యోరిహ దేహినామ్।
అజ్ఞానప్రభవో మన్యు-రహంమానోపబృంహితః॥ 13

ఇట్లు మృత్యువు గలుగదు కనుక విష్ణువునందఖండమైన వైరమును సాధించుట ఆ హిరణ్యకశిపునికి దగినదే యగును. ఏలయన శిరోమణియై యుండిన విష్ణువు జీవించి యుంటేనేని పిఱికిపందవలె పగను సాధించక మిన్నకుండునా అను ఆశయమునఁ జెప్పుచున్నారు.

**ప్రతిపదార్థము :** వైర+అనుబన్ధః=పగయొక్క సంబంధము, దేహినామ్=దేహమునందు దిట్టముగా అభిమానముగల శూరులకు, ఇహ ఏతావాన్=ఇంతమాత్రమేయై, ఆమృత్యోః =మృత్యువుగలుగు వఱకు ఏర్పడును, అట్లే, అజ్ఞానప్రభవః=అజ్ఞానముచే జనించిన, మన్యుః =క్రోధము, అహంమాన+ఉపబృంహితః=అహంకారముచే అభిమానముచే విస్తరించుచున్నది.

**తాత్పర్యము :** దేహాభిమానము గాఢముగా గల శూరులకు పగసాధించుట పగవాడు చచ్చిన తోడనే దాటిపోవుచున్నది. ఆ వైరము ఇంతమాత్రమే యగును. అజ్ఞానమున జనించిన కోపము అహంకారమున విస్తరించియుండునది. ఆ యజ్ఞానము నివర్తించిన క్రోధము నివర్తించునని భావము.

## ఏకోనవింశోఽధ్యాయః

ఈ అధ్యాయమందు హరి యాచించిన పదత్రయమును బలి యీయ సమ్మతింప గాంచి యెఱింగి శ్రీ శుక్రాచార్యుడు నివారించుట – వర్ణింపబడును.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ ఇతి వైరోచనేర్వాక్యం ధర్మయుక్తం సుసూనృతమ్।
నిశమ్య భగవాన్ ప్రీతః-ప్రతినన్ద్యేదమబ్రవీత్॥ 1

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, వైరోచనేః=విరోచన కుమారుడైన బలియొక్క, ధర్మయుక్తమ్= ధర్మయుక్తమైన, సుసూనృతమ్=లెస్సగా సత్యమైన, వాక్యమ్=మాటను, నిశమ్య=విని, భగవాన్= భగవంతుడు హరి, ప్రీతః=సంతసించినవాడై, ప్రతినన్ద్య=బలినభినందించి, ఇదమ్=ఈ మాటను, అబ్రవీత్=చెప్పెను.

**తాత్పర్యము :** ఇట్లు బలి న్యాయసమ్మతమైన సత్యసంపన్నమైన వాక్కును వచింప విని, భగవంతుడు హరి సంతసమంది బలినభినందించి యిట్లు వాకొనెను.

**శ్రీ భగవానువాచ :** శ్రీ భగవానుడు పలికెను.

శ్లో॥ వచస్తవైతజ్జనదేవ సూనృతం కులోచితం ధర్మయుతం యశస్కరమ్।
యస్య ప్రమాణం భృగవః సామ్పరాయే పితామహః కులవృద్ధః ప్రశాన్తః॥ 2

**ప్రతిపదార్థము :** జనదేవ=ఓ రాజా!, ఏతత్=ఈ, తవ=నీయొక్క, వచః=మాట, సూనృతమ్= సత్యము, కుల+ఉచితమ్=మీ వంశమునకుఁదగినది, ధర్మయుతమ్=దర్మబద్ధము, యశస్కరమ్=కీర్తిని గలిగించునదియు, సాంపరాయే=పారలౌకికమగు ధర్మమునందు, యస్య= ఎవనికి, పితామహః=తాత (తండ్రి తండ్రి), కులవృద్ధః=కులవృద్ధుడు, ప్రశాన్తః=ప్రశాన్తుడు, భృగవః=మీ గురువులైన భృగువులు, ప్రమాణమ్=ప్రమాణమై యున్నారు.

**తాత్పర్యము :** ఓ జనపతీ! నీవు వచించిన మాట సత్యము. నీ వంశమునకు దగినది. ధర్మబద్ధము. కీర్తిని కలిగించునదైయున్న పారలౌకికమగు ధర్మమూ. తండ్రి తండ్రి కులవృద్ధుడు ప్రశస్తుడు అగు ప్రహ్లాదుడు మీ గురువులై ప్రమాణమై యున్నారు.

శ్లో॥ న హ్యేతస్మిన్ కులే కశ్చిన్నిస్సత్త్వః కృపణః పుమాన్।
ప్రత్యాఖ్యాతా ప్రతిశ్రుత్య యో వాదాతా ద్విజాతయే॥ 3

**ప్రతిపదార్థము :** ఏతస్మిన్=ఈ, కులే=మీ వంశమునందు, నిస్సత్త్వః=బలహీనుడు, కృపణః =లుబ్ధుడగు, పుమాన్=పురుషుడు, యః=ఎవడు, ద్విజాతయే=విప్రుని కొఱకు, ప్రతిశ్రుత్య= ఏదేనొకదానినిత్తునని వాగ్దానముచేసి, ప్రతిఖ్యాతా=తర్వాత నీయనని తిరస్కరించినవాడు, అదాతా వా=దాతగానివాడు, నహి=జన్మించడు గదా!

**తాత్పర్యము :** ఓ ప్రభూ! మీ వంశమునందు బలహీనుడును, లుబ్ధుడగు పురుషుడు విప్రునకిత్తునని వాగ్దానముచేసి యీయనను దాతగాని జన్మింపడు గదా!

**శ్లో॥ న సన్తి తీర్థే యుధి చార్థినార్థితాః పరాఙ్ముఖా యే త్వమనస్వినో నృప।**
**యుష్మత్కులే యద్యశసామలేన ప్రహ్లాద ఉద్భాతి యథోడుపః ఖే॥** 4

**ప్రతిపదార్థము :** నృప!=ఓ రాజా!, యత్=ఏ మీ వంశమున, తీర్థే=దానసమయమందు, యుధి=యుద్ధమునందును, అర్థినా=యాచకునిచే, అర్థితాః=యాచింపబడినవారు, యే=ఎవరు, పరాఙ్ముఖాః=వెనుమొగము వెల్లినవారు, అమనస్వినః=అభిమానములేనివారు, న సన్తి=లేరో, అట్టి, యుష్మత్కులే=మీ వంశమునందు, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, అమలేన=నిర్మలమైన, యశసా=కీర్తితో, ఖే=ఆకాశమునందు, యథా+ఉడుపః=నక్షత్రముల రాజగు చంద్రుడెట్లో, అట్లే, ఉద్భాతి=ఉన్నతస్థానమున బ్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :** ఓ రాజా! దానవేళ అర్థించిన యాచకులకు, యుద్ధము గోరి వచ్చినవారు నిరాశగా ఏ వంశమునందు వెనుమొగము పెట్టినవారును, అభిమానము గోలుపోయినవారు గలుగరో అట్టి మీ వంశమునందు జనించిన ప్రహ్లాదుడు నిర్మల యశముతో ఆకాశమునందు చంద్రుడెట్లు ఉన్నత స్థానమున మెఱయుచున్నాడో అట్లు మెఱయుచున్నాడని భావము.

**శ్లో॥ యతో జాతో హిరణ్యాక్షశ్చరన్నేక ఇమాం మహీమ్।**
**ప్రతివీరం దిగ్విజయే నావిన్దత గదాయుధః॥** 5

**ప్రతిపదార్థము :** యతః=ఏ వంశమున, జాతః=జనించిన, హిరణ్యాక్షః=హిరణ్యాక్షుడు, గదాయుధః=గదను ఆయుధముగా గలవాడు, ఏకః=ఒంటరిగా, ఇమామ్ మహీమ్=ఈ భూమండలమును గూర్చి, దిగ్విజయేన=దిగ్విజయముతో, చరన్=వెడలుచు, ప్రతివీరమ్=ప్రతివీరుని, అవిన్దత=బడయలేకపోయెనో

**తాత్పర్యము :** మీ వంశమున జనించిన హిరణ్యాక్షుడు గదను ఆయుధముగా గలవాడు ఒంటరిగా ఈ భూమండలమును గూర్చి దిగ్విజయము చేయుచు ప్రతివీరుని బడయలేకపోయెను.

**శ్లో॥ యం వినిర్జిత్య కృచ్ఛ్రేణ విష్ణుః క్ష్మోద్ధార ఆగతః।**
**నాత్మానం జయినం మేనే తద్వీర్యం భూర్యనుస్మరన్॥** 6

**ప్రతిపదార్థము :** విష్ణుః=వెన్నుడు, యమ్=ఏ హిరణ్యాక్షుని, కృచ్ఛ్రేణ=కష్టముచే, వినిర్జిత్య=జయించి, క్ష్మా+ఉద్ధారే=భూమిని లేవనెత్తునప్పుడు, ఆగతః=వచ్చినవాడు, భూరి=అధికమైన, తత్+వీర్యమ్=ఆ హిరణ్యాక్షుని బలమును, అనుస్మరన్=తలంచుచు, ఆత్మానమ్=తన్ను, జయినమ్=జయించినవానినిగా, న మేనే=తలంచలేదు.

**తాత్పర్యము :** విష్ణువు హిరణ్యాక్షుని గష్టము మీద జయించి భూమిని పైకి లేవనెత్తునప్పుడు హిరణ్యాక్షుని బలమును దలంచుచు, తన్ను జయించినవానినిగా తలంచలేదు.

**శ్లో॥ నిశమ్య తద్వధం భ్రాతా–హిరణ్యకశిపుః పురా।**
**హన్తుం భ్రాతృహణం క్రుద్ధో–జగామ నిలయం హరేః॥** 7

**ప్రతిపదార్థము :** పురా=పూర్వము, తత్+వధమ్=ఆ హిరణ్యాక్షవధమును, నిశమ్య=విని, భ్రాతా=సోదరుడైన, హిరణ్యకశిపుః=హిరణ్యకశిపుడు, క్రుద్ధః=క్రోధావేశుడై, భ్రాతృహణమ్=తన అన్నను జంపినవానిని (వెన్నుని), హంతుమ్=చంపుటకు, హరేః=విష్ణువు యొక్క, నిలయమ్=స్థానమైన వైకుంఠమును గూర్చి, జగామ=పోయెను.



**తాత్పర్యము :** పూర్వము హిరణ్యాక్షుని వధను విన్నవాడు, తమ్ముడు హిరణ్యకశిపుడు క్రోధమున మండిపడుచు తనయన్నను జంపిన విష్ణువునుఁజంపుటకై విష్ణు నిలయమైన వైకుంఠమునకుఁ బోయెను.

**శ్లో॥ తమాపతన్తమాలోక్య–శూలపాణిం కృతాన్తవత్।**
**చిన్తయామాస కాలజ్ఞో–విష్ణుర్మాయావినాం వరః॥** 8

**ప్రతిపదార్థము :** శూలపాణిమ్=శూలము కేలగలవాడై, కృతాన్తవత్=యముని వలె, ఆపతన్తమ్=పైబడవచ్చు, తమ్=ఆ హిరణ్యకశిపును, ఆలోక్య=చూచి, మాయావినామ్ వరః=మాయము చేయువారిలో శ్రేష్ఠుడును, విష్ణుః=విష్ణువు, కాలజ్ఞః=కాలము నెఱింగినవాడు, చింతయామాస=ఇట్లు చింతించెను.

**తాత్పర్యము :** కేలశూలమును ధరించి యముడువలె బైబడవచ్చు ఆ హిరణ్యకశిపుని జూచి మాయగావించువారిలో మిన్నయైన వెన్నుడు ఆ కాలమును గమనించి యిట్లు చింతించెను.

**శ్లో॥ యతో యతోఽహం తత్రాసౌ–మృత్యుః ప్రాణభృతామివ।**
**అతోఽహమస్య హృదయం–ప్రవేక్ష్యామి పరాగ్దృశః॥** 9

**ప్రతిపదార్థము :** ప్రాణభృతామ్=ప్రాణులకు, మృత్యుః ఇవ=మృత్యువు వలె, యతః యతః=ఎచ్చటెచ్చటికి, అహమ్=నేను చేరినను, తత్ర=అచ్చటికి, అసౌ=హిరణ్యకశిపుడు రాగలడు. అతః=అందువలన, అహమ్=నేను, పరాగ్దృశః=బాహ్యదృష్టిగల (అంతరదృష్టిలేని), అస్య=వాని యొక్క, హృదయమ్=హృదయమును, ప్రవేక్ష్యామి=ప్రవేశించెదను.

**తాత్పర్యము :** ప్రాణులను వెన్నాడు మృత్యువువలె వీడు నేనెక్కడికిబోయినను అక్కడికి వచ్చును. వీనికి వెలుపల చూపుగాని లోపలి చూపు లేదు. కాబట్టి నేను వీని హృదయమందు ప్రవేశించెదను.

**శ్లో॥ ఏవం స నిశ్చిత్య రిపోః శరీరమాధావతో నిర్వివిశే సురేన్ద్రః।**
**శ్వాసానిలాన్తర్హితసూక్ష్మదేహస్తత్ప్రాణరన్ధ్రేణ వివిగ్నచేతాః॥** 10

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఇందువలన నేను హృదయమునందుండు నన్ను వాడెఱుంగలేడని, ఇట్లు, సః=ఆ విష్ణువు, నిశ్చిత్య=నిశ్చయించి, సురేంద్రః=ఆ దేవతాప్రభువు, ఆధావతః=పరిగెత్తివచ్చు, రిపోః=ఆ హిరణ్యకశిపుని యొక్క, శ్వాస+అనిల+అన్తర్హితసూక్ష్మదేహః=శ్వాస యొక్క గాలిలోపల దాగిన సూక్ష్మదేహముగలవాడై, ప్రాణరన్ధ్రేణ=నాసికాద్వారమున, వివిగ్నచేతాః=కంపించు చిత్తముగలవాడై, నిర్వివిశే=ప్రవేశించెను.

**తాత్పర్యము :** ఇట్లు నిశ్చయించి దేవప్రభువగు నా విష్ణువు పరిగెత్తి వచ్చువాని శ్వాసవాయువునందు సూక్ష్మరూపమున అడగియుండి వాని నాసికాద్వారమున కంపించు చిత్తముతో హృదయమున ప్రవేశించెను.

**తాత్పర్యము :** తన కర్మానుగుణముగాఁబ్రాప్తించిన ధనాధికముచే దృప్తి జెందువాడు సుఖపడును. అట్లు తృప్తిచెందనివాడు తనకు మూడులోకముల సామ్రాజ్యం సంపద చేకూరినను దృప్తిపొందడు.

**శ్లో॥ పుంసోఽయం సంసృతేర్హేతురసన్తోషోఽర్థకామయోః।**
**యదృచ్ఛయోపపన్నేన-సన్తోషో ముక్తయే స్మృతః॥ 25**

**ప్రతిపదార్థము :** పుంసః=పురుషునికి, అర్థకామయోః=అర్థకామములందు, అసంతోషః=తృప్తి లేక సంతోషము లేకపోవుట, అయమ్=ఇది, సంసృతేః=సంసారమునకు, హేతుః =కారణమగుచున్నది. యదృచ్ఛయా=తనకుఁదానే, ఉపపన్నేన=లభించినదానితో, సంతోషః =సంతోషము పొందుట, ముక్తయే=ముక్తికి, స్మృతః=హేతువని చెప్పబడినది.

**తాత్పర్యము :** అర్థకామములందు సంతోషము లేకపోవుట పురుషునికి సంసార హేతువగు చున్నది. స్వయముగ లభించిన సంతోషము ముక్తికి హేతువని చెప్పబడినది.

**శ్లో॥ యదృచ్ఛాలాభతుష్టస్య తేజో విప్రస్య వర్ధతే।**
**తత్ప్రశామ్యత్యసన్తోషాదమ్భసేవాశుశుక్షణిః॥ 26**

**ప్రతిపదార్థము :** యదృచ్ఛాలాభతుష్టస్య=తనంతతానుగా లభించినదానిచే సంతుష్టుడగు, విప్రస్య=విప్రునియొక్క, తేజః=తేజస్సు, వర్ధతే=వృద్ధి చెందును. అసన్తోషాత్=అసంతోషము వలన, తత్=ఆ తేజస్సు, అమ్భసా=జలము చేత, ఆశుశుక్షణిః ఇవ=అగ్నివలె, ప్రశామ్యతి= శమించును.

**తాత్పర్యము :** తనంతతానుగా లభించిన దానిచే సంతుష్టుడగు విప్రునియొక్క తేజస్సు వృద్ధి చెందును. అసంతోషము వలన ఆ తేజస్సు జలముచేత అగ్నివలె శమించును.

**శ్లో॥ తస్మాత్త్రీణి పదాన్యేవ-వృణే త్వద్వరదర్షభాత్।**
**ఏతావతైవ సిద్ధోఽహం-విత్తం యావత్ప్రయోజనమ్॥ 27**

**ప్రతిపదార్థము :** తస్మాత్=అందువలన, వరదర్షభాత్=దాతలలో శ్రేష్ఠుడగు, త్వత్=నీవలన (నిన్ను), అహమ్=నేను, త్రీణి పదాని=మూడడుగుల నేలను, వృణే=అడిగితిని, ఏతావత్+ఏవ= దీని చేతనే, సిద్ధః=ఈడేఱెదను. యావత్ప్రయోజనమ్=ఏది ప్రయోజనముకు దగునో అదియే, విత్తమ్=విత్తము.

**తాత్పర్యము :** అందువలన దాతలలో శ్రేష్ఠువగు నిన్ను నేను మూడడుగుల నేలను అడిగితిని. దీనిచేతనే నా కోరిక ఈడేఱినదగును. ఏది ప్రయోజనమునకు దగునో అదియే విత్తము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇత్యుక్త స్స హసన్నాహ వాఞ్ఛాతః ప్రతిగృహ్యతామ్।**
**వామనాయ మహీం దాతుం-జగ్రాహ జలభాజనమ్॥ 28**

**ప్రతిపదార్థము :** ఇట్లు భగవానుడు పలుకగా, సః=ఆ బలిచక్రవర్తి, హసన్=నవ్వి, వాంఛాతః =నీ యిచ్చననుసరించి, ప్రతిగృహ్యతామ్ ఇతి=స్వీకరించుమని, ఆహ=వచించెను. అనంతరము, వామనాయ=వామనుని కొఱకు, మహీమ్=భూమిని, దాతుమ్=ఇచ్చుటకు, జలభాజనమ్=జలపాత్రను, జగ్రాహ=గ్రహించెను.



**శ్లో॥ పితా ప్రహ్లాదపుత్రస్తే-తద్విద్వాన్ విష్ణుతత్పరః।**
**స్వమాయుర్ద్విజలిఙ్గేభ్యో-దేవేభ్యోఽదాత్స యాచితః॥ 14**

అతడిట్లు పూర్వీకులను స్తుతించి బలి తండ్రిని స్తుతించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ప్రహ్లాదపుత్రః=ప్రహ్లాదపుత్రుడు, తే పితా=నీ తండ్రి, విష్ణుతత్పరః=విష్ణువు నందాసక్తి గలవాడు, సః=అతడు, యాచితః=యాచింపబడి, ద్విజలింగేభ్యః=విప్రవేషధారులైన, దేవేభ్యః=దేవతల కొఱకు, తత్+విద్వాన్=వారు దేవతలని తెలిసియు, స్వమ్+ఆయుః=తన యాయువును, అదాత్=ఇచ్చెను.

**తాత్పర్యము :** ఆ ప్రహ్లాదుని కుమారుడును, మీ తండ్రియునైన విరోచనుడు విష్ణుభక్తి గలవాడు, ఒకప్పుడు దేవతలు విప్రవేషధారులై తన్నుయాచింపగ వీరు దేవతలని తెలిసిన వాడయ్యు వారలకు తన యాయువును దానము చేసెను.

**శ్లో॥ భవానాచరితాన్ ధర్మానాస్థితో గృహమేధిభిః।**
**బ్రాహ్మణైః పూర్వజైః శూరై-రన్యైశ్చోద్దామకీర్తిభిః॥ 15**

**ప్రతిపదార్థము :** భవాన్=నీవు, గృహమేధిభిః=గృహస్థులైన, బ్రాహ్మణైః=బ్రాహ్మణులు, పూర్వజైః =నీకు ముందు జనించిన, శూరైః=శూరులగు ప్రభువులచేతను, ఉద్దామకీర్తిభిః=మిగుల యశముగల, అన్యైశ్చ=ఇతరులచేతను, ఆచరితాన్=ఆచరించబడిన, ధర్మాన్=యాగాది ధర్మములను, ఆస్థితః=ఆచరించితివి.

**తాత్పర్యము :** ఓ బలీ! నీవు గృహస్థులైన విప్రులు, మీ పూర్వీకులగు శూరులు, గొప్ప కీర్తిగల ఇతరులాచరించిన దానధర్మములను ఆచరించితివి.

**శ్లో॥ తస్మాత్త్వత్తో మహీమీష-ద్వృణేఽహం వరదర్షభాత్।**
**పదాని త్రీణి దైత్యేన్ద్ర-సమ్మితాని పదా మమ॥ 16**

**ప్రతిపదార్థము :** తస్మాత్=అట్టి ధర్మపరుడవగుట వలన, దైత్యేన్ద్ర=ఓ దైత్యరాజా!, వరద+ ఋషభాత్=వరదాతలలో మిన్నయైన, త్వత్తః=నీ వలన, అహమ్=నేను, మమ=నాయొక్క, పదా=పాదముచే, సమ్మితాని=కొలతకు సరిపోవునంత, త్రీణి పదాని=మూడడుగులు, ఈషత్= ఇంచుక, మహీమ్=భూమిని, వృణే=కోరుచున్నాను.

**తాత్పర్యము :** ఓ దైత్యరాజా! నీవు ధర్మపరుడవగుట వలన, కోరిన కోర్కెలొసంగు వారిలో శ్రేష్ఠుడవైన నీవలన నేనించుక భూమిని నాయడుగుతోఁగొలచిన సరిపోవునంత మూడడుగుల ప్రమాణముగల దానిని పొందవలెనని కోరుచున్నాను.

**శ్లో॥ నాన్యత్తే కామయే రాజన్-వదాన్యాజ్జగదీశ్వరాత్।**
**నైనః ప్రాప్నోతి వై విద్వాన్-యావదర్థప్రతిగ్రహః।**
**అధికం యోఽధికాంక్షేత-స స్తేనో దణ్డమర్హతి॥ 17**

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, వదాన్యాత్=దాతయైన, జగత్+ఈశ్వరాత్=లోక ప్రభుడైన, తే=నీవలన, అన్యత్=ఇతరమేమియు, న కామయే=కోరను. విద్వాన్=విజ్ఞుడు, యావత్=తన కెంతమాత్రమో, అర్థప్రతిగ్రహః=అంత ధనాధికము ప్రతిగ్రహముగలవాడు. ఏనః=పాపమును,

న ప్రాప్నోతివై=పొందనే పొందడు, యః=ఎవడు, అధికమ్=తనకు కావలసినదానికంటె అధికము, అధికాంక్షేత=కావలయునని కోరునో, సః=వాడు, స్తేనః=చోరుడు, దణ్డమ్=శిక్షను, అర్హతి=పొందదగినవాడు.

**తాత్పర్యము :** జగత్ప్రభువు, వదాన్యుడవగు నీ వలన నేను మతేమియుఁగోరువాడను గాను. విద్వాంసుడగువాడు తనకెంతవలయునో అంత ధనమును దాతను యాచించి దానముగొనునేని ఆ ప్రతిగ్రహపాపమును పొందనే పొందడు. ఎవడు తనకు అధికముగా గావలయునని కోరునో వాడు చోరుడు. వాడు దండమునకుఁబాత్రుడు.

**బలిరువాచ :** బలి వచించెను.

**శ్లో॥ అహో బ్రాహ్మణదాయాద వాచస్తే వృద్ధసమ్మతాః।**
**త్వం బాలో బాలిశమతిః స్వార్థం ప్రత్యబుధో యథా॥ 18**

**ప్రతిపదార్థము :** బ్రాహ్మణదాయాద=ఓ విప్రబంధువా!, అహో=ఆశ్చర్యము, తేవాచః=నీ మాటలు, వృద్ధసమ్మతాః=పెద్దలకు సమ్మతములైనవి. త్వమ్=నీవు, బాలః=బాలుడవు, బాలిశమతిః=అజ్ఞానులవలె బుద్ధిగలవాడవు, స్వార్థమ్ ప్రతి=నీ ప్రయోజనమును గూర్చి, యథా అబుధః=ఏమి యెఱుంగని బాలునివలె, అయిఉన్నావు.

**తాత్పర్యము :** ఓ విప్రకుమారా! నీ యాచన చాలా యచ్చెరువుగా నున్నది. నీ మాటలు పెద్దలు మెచ్చదగినవి. కాని పాపము నీవు బాలుడవు. అజ్ఞానుల వంటి బుద్ధిగలవాడవు. నీ స్వార్థము నీకుఁదెలియలేదు గదా!

**శ్లో॥ మాం వచోభిః సమారాధ్య-లోకానామేకమీశ్వరమ్।**
**పదత్రయం యో వృణీతే బుద్ధిమాన్ ద్వీపదాశిషమ్॥ 19**

**ప్రతిపదార్థము :** లోకానామ్=లోకములకు, ఏకమ్=ఒక్కడైన, ఈశ్వరమ్=ప్రభువును, ద్వీపదాశిషమ్=జంబూద్వీపాదులను దానముచేయువాడవు, అని, మామ్=నన్ను, వచోభిః =మంచి మాటలచే, సమారాధ్య=స్తుతించి, యః=ఏ, బుద్ధిమాన్=బుద్ధిమంతుడు, పదత్రయమ్=మూడడుగుల భూమిని, వృణీతే=వరించును.

**తాత్పర్యము :** జగములకెల్లనొక్కడే ప్రభువై జంబూద్వీపములోనగు ద్వీపములను సైతమిచ్చు దాతయైన నన్ను మంచి మాటలచే స్తుతించి యే బుద్ధిమంతుడు మూడడుగుల భూమిని దానమడుగును. బుద్ధిమంతుడలా అడుగడని ధ్వని.

**శ్లో॥ న పుమాన్ మాముపవ్రజ్య భూయో యాచితుమర్హతి।**
**తస్మాద్వృత్తికరీం భూమిం-వటో కామం ప్రతీచ్ఛ మే॥ 20**

**ప్రతిపదార్థము :** పుమాన్=యాచకుడగు పురుషుడు, మామ్=నన్ను, అనువ్రజ్య=యాచించ వచ్చి, భూయః=మరల ఇంకొకని కడ, యాచితుమ్=యాచించుటకు, న+అర్హతి=తగడు. తస్మాత్=అందువలన, వటో=ఓ బ్రహ్మచారీ, వృత్తికరీమ్=నీ జీవమునకు సరిపోవు, భూమిమ్= భూమిని, కామమ్=నీ ఇచ్ఛవచ్చినంత, మే=నావలన, ప్రతీచ్ఛ=గ్రహింపుము.

**తాత్పర్యము :** నా దగ్గఱకు వచ్చిన యాచకుడు మరల యాచించుటకు ఇంకొకని కడకు వెడల తగదు. ఓ బాలుడా! నీవు నీ జీవనమునకు సరిపోవు భూమిని నీ ఇచ్ఛవచ్చినంత నా వలన గ్రహింపుము. ఇచ్చెదననుట-



**శ్రీ భగవానువాచ :** శ్రీ భగవానుడు వచించెను.

**శ్లో॥ యావన్తో విషయాః ప్రే(శ్రే)ష్ఠా-స్త్రిలోక్యామజితేన్ద్రియమ్।**
**న శక్నువన్తి తే సర్వే-ప్రతిపూరయితుం నృప॥ 21**

వామనుడు మరల తన నిస్పృహత్వమునే ప్రకటించుచు జెప్పుచున్నాడు. ఏడు శ్లోకముల చేత.

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, త్రిలోక్యామ్=ముల్లోకములలో, విషయాః=దేశములు, శ్రేష్ఠాః=ఉత్తమములు, యావన్తః=ఏవి గలవో, తే సర్వే=అవి యన్నియు, అజిత+ఇంద్రియమ్= ఇంద్రియజయములేనివానిని, ప్రతిపూరయితుమ్=మనస్సును నిండించుటకు, తృప్తి పఱచుటకు, న శక్నువన్తి=సమర్థములు కావు.

**తాత్పర్యము :** ఓ రాజా! ముజ్జగములందు ఏయే దేశములుత్తమములు గలవో అవి యన్నియును ఇంద్రియజయము మనోనిగ్రహము లేనివానిని దృప్తిపఱచుటకు సమర్థములు కానేరవు.

**శ్లో॥ త్రిభిః క్రమైరసన్తుష్టో-ద్వీపేనాపి న పూర్యతే।**
**నవవర్షసమేతేన-సప్తద్వీపవరేచ్ఛయా॥ 22**

**ప్రతిపదార్థము :** త్రిభిః=మూడైన, క్రమైః=అడుగులచే, అసన్తుష్టః=తృప్తిపొందనివాడు, నవవర్షసమేతేన=నవవర్షసమేతమగు, ద్వీపేనాపి=ద్వీపముచే, తృప్తిపొందినను, మరల, సప్తద్వీపవర+ఇచ్ఛయా=ఏడు దీవులను వరముగా గోరుకోర్కెతో, న పూర్యతే=తృప్తిఁబొందడు.

**తాత్పర్యము :** ఈ మూడడుగుల చేత తృప్తిపొందనివాడు, నవవర్షసమేతమగు ద్వీపముచే తృప్తిపొందినను, మరల ఏడు దీవులను వరముగా గోరు కోర్కెతో తృప్తిబొందడు.

**శ్లో॥ సప్తద్వీపాధిపతయో నృపా వైన్యనృగాదయః।**
**అర్థైః కామైర్గతా నాన్తం-తృష్ణాయా ఇతి నః శ్రుతమ్॥ 23**

**ప్రతిపదార్థము :** సప్తద్వీప+అధిపతయః=ఏడు దీవులకు ప్రభువులైన, వైన్య నృగ+ఆదయః =పృథువు, నృగుడులోనగువారు, అర్థైః=ధనముల చేత, కామైః=కామ భోగముల చేత, తృష్ణాయాః=ఆశయొక్క, అంతమ్=తుదను, న గతాః=పొందనివారైరి. ఇతి=అని, నః=మనము, శ్రుతమ్=వినుచున్నాము.

**తాత్పర్యము :** ఏడు దీవులకుఁబ్రభువులైన పృథువు, నృగుడులోనగువారు ధనములచేతను, కామ భోగములచేతను ఆశయొక్క తుదను బొందలేకపోయిరని మనము వినుచున్నాము.

**శ్లో॥ యదృచ్ఛయోపపన్నేన-సన్తుష్టో వర్తతే సుఖమ్।**
**నాసన్తుష్టస్త్రిభిర్లోకై-రజితాత్మోపపాదితైః॥ 24**

**ప్రతిపదార్థము :** యదృచ్ఛయా=తనకుఁదానే, ఉపపన్నేన=ప్రాప్తించిన ధనాధికముచే, సన్తుష్టః =తృప్తిపొందినవాడు, సుఖమ్=సుఖముగా, వర్తతే=ఉండును. అసన్తుష్టః=అట్లు తృప్తిపొందని వాడు, అజితాత్మా=జయింపని బుద్ధిగలవాడు, ఉపపాదితైః=తనకు బ్రాప్తించిన, త్రిభిఃలోకైః =మూడు లోకములచేత, న=తృప్తిపొందడు.

స్యాత్=సంభవించవు, లభించవు, ఆత్మనః=దేహమునకు, అనృతమ్=అసత్యము, మూలమ్=కారణము.

**తాత్పర్యము :** దేహరూపమగు వృక్షమునకు సత్యము పుష్పము ఫలముగానున్నవి. శ్రుతి వచించుచున్నది కావున నట్లెఱుగునది. మఱియు శ్రుతి - 'వాచః సత్యం పుష్పఫలమ్' అని చెప్పినను వాక్కుచే నిర్వహింపబడునది దేహము గావున ఆత్మ వృక్షము అని ప్రస్తుతము ననుసరించియే చెప్పబడినదగును. పుష్పఫలస్థానముగా నుండునది సత్యము. వృక్షమగు దేహము జీవించియుండనిచో ఆ సత్యరూపమగు పుష్పఫలములు లభించవు. కావున అసత్యము చేతనైనను దేహమును రక్షించవలెననుచు దేహమునకు అనృతము మూలమను చున్నారు. ఈ విషయమునే దృష్టాంతముతోఁదెలుపుచున్నారు.

**శ్లో॥ తద్యథా వృక్ష ఉన్మూలః శుష్యత్యుద్వర్తతే஽చిరాత్।**
**ఏవం నష్టానృతః సద్య-ఆత్మా శుష్యేన్న సంశయః॥ 40**

**ప్రతిపదార్థము :** తత్=అది, యథా=ఏ ప్రకారము, వృక్షః=వృక్షము, ఉన్మూలః=పెళ్ళగించిన వేరుగలదైనచో, శుష్యతి=ఎండిపోవుచున్నది. అచిరాత్=కొంచెము కాలములోనే, ఉద్వర్తతే=పడిపోవుచున్నది. ఏవమ్=ఇట్లు, నష్ట+అనృతః=నశించిన అనృతముగలదైన, ఆత్మా=దేహము, సద్యః=అప్పుడే, శుష్యేత్ (విధిలిఙ్)=ఎండిపోవును. న సంశయః=సంశయము లేదు.

**తాత్పర్యము :** పెళ్ళగించిన యెడల వృక్షమెండిపోవును. కొంతకాలమునకే పడిపోవును. అట్లే నశించిన అనృతముగలదైన దేహము అప్పుడే ఎండిపోవును. ఇందెట్టి సందియము లేదు. "ఓమితిసత్యం...".

ఒక విషయమునంగీకరించుట సత్యమగును. అట్లు అంగీకరింపకుండుట అసత్యమగును. సత్యము పుష్పము, ఫలము. వాక్కే సత్యమైయున్నది. ఆ సత్యమును చాటించినవారు ప్రభువు. సత్కర్మ చేసినవాడు శుభమగు కీర్తిగలవాడగుచున్నాడు. వాక్కునకు (దేహమునకు) సత్యము పుష్పము, ఫలమునగుచున్నది. ఏది అనృతమో అది వాక్కునకు దేహమునకు మూలమందురు. అది యెట్లనగా, వృక్షము వేళ్ళులేనిదగునో ఎండిపోవును. పడిపోవుచున్నది. ఇట్లే అనృతమును వచించుచు దేహము ఆధారములేని దానిని చేయుచున్నది. అట్టివాడు నిర్జీవుడు, పడిపోవుచున్నాడు. అందువలన అనృతమును వచింపగూడదు. ఈ దేహమును దానిచే రక్షింపవలెను. అనగా ఈ అనృతము చేత సంకటములు సంభవించినపుడనృతముచే దేహమును రక్షించవలెనని శ్రుత్యర్థము.

**శ్లో॥ పరాగ్రిక్తమపూర్ణం వా అక్షరం యత్తదోమితి।**
**యత్కిఞ్చిదోమితి బ్రూయా-త్తేన రిచ్యేత వై పుమాన్॥ 41**

**ప్రతిపదార్థము :** ఓం ఇతి=అంగీకారసూచకమగు, యత్ అక్షరమ్=ఓంకారమగు అక్షరము ఏది గలదో అది, పరాక్=దూరముననున్న అర్థమును గ్రహించునదైయున్నది. రిక్తమ్=శూన్యమును గాని, అపూర్ణమ్‌వా=పూర్ణముకాదని కాని, కొంచెముగాని చెప్పునదై యున్నది. తత్=అందువలన యాచకునకు, యత్కించిత్=ఇంచుక, ఓమ్+ఇతి బ్రూయాత్= ఇత్తునని చెప్పవలయును, వై=అట్లు కాదేని, తేన=అట్టి దానముచే, పుమాన్=పురుషుడు, రిచ్యేత=శూన్యుడగును.



**తాత్పర్యము :** ఆ బలిచక్రవర్తి నీ యిచ్చుననుసరించి స్వీకరించుమని వచించెను. పిమ్మట వామనుని కొఱకు భూమిని ఇచ్చుటకు జలపాత్రను గ్రహించెను.

**శ్లో॥ విష్ణవే క్ష్మాం ప్రదాస్యన్తముశనా అసురేశ్వరమ్।**
**జానంశ్చికీర్షితం విష్ణోః-శిష్యం ప్రాహ విదాంవరః॥ 29**

**ప్రతిపదార్థము :** విష్ణోః=విష్ణువు యొక్క, చికీర్షితమ్=చేయ నిశ్చయింపబడినదానిని, విదాంవరః=జ్ఞానులలో శ్రేష్ఠుడగు, ఉశనాః=శుక్రాచార్యుడు, జానన్=ఎఱింగి, విష్ణవే=విష్ణువు కొఱకు, క్ష్మామ్=భూమిని, ప్రదాస్యన్తమ్=దానము చేయుట కుద్యుక్తుడగు, శిష్యమ్=శిష్యుడైన, అసురేశ్వరమ్=అసురపతియగు బలిని గూర్చి, ప్రాహ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము :** జ్ఞానులలో శ్రేష్ఠుడగు శుక్రాచార్యుడు విష్ణువు చేయనిశ్చయింపబడిన దానిని యెఱింగి, విష్ణువునకు భూమిని దానము చేయుటకుద్యుక్తుడగు శిష్యుడు, అసురపతియగు బలిని గూర్చి ఇట్లు పలికెను.

**శ్రీ శుక్ర ఉవాచ :** శ్రీ శుక్రాచార్యుడు వచించెను.

**శ్లో॥ ఏష వైరోచనే! సాక్షాద్భగవాన్ విష్ణురవ్యయః।**
**కశ్యపాదదితేర్జాతో-దేవానాం కార్యసాధకః॥ 30**

**ప్రతిపదార్థము :** వైరోచనే=ఓ విరోచననందనుడా!, ఏషః=ఈ బాలుడు, అవ్యయః=అవ్యయ స్వరూపుడగు, విష్ణుః భగవాన్=విష్ణు భగవానుడు, దేవానామ్=దేవతలకు, కార్యసాధకః=దేవతలకు కార్యసాధకుడుగా, కశ్యపాత్=కశ్యపుని వలన, అదితేః=అదితికి, జాతః=జన్మించెను.

**తాత్పర్యము :** ఓ బలిచక్రవర్తీ! ఈ బాలుడు అవ్యయ స్వరూపుడగు విష్ణువు. దేవకార్య సాధకుడుగా కశ్యపాదితులకు పుత్రుడై జన్మించెను.

**శ్లో॥ ప్రతిశ్రుతం త్వయైతస్మై యదనర్థమజానతా।**
**న సాధు మన్యే దైత్యానాం-మహానుపగతో஽నయః॥ 31**

**ప్రతిపదార్థము :** అనర్థమ్=అనర్థమును, అజానతా=ఎఱుంగనివాడై, యత్=మూడడుగుల భూమిని దానమిచ్చెదననునది, ఏది ఉన్నదో, త్వయా=నీచే, ప్రతిశ్రుతమ్=చేయబడిన ప్రతిజ్ఞ, న సాధు=సరియైనది కాదని, మన్యే=నేను తలంచుచున్నాను. దైత్యానామ్=దైత్యులకు, మహాన్ అనయః=గొప్ప అనిష్టము, ఉపగతః=తెచ్చునదగును.

**తాత్పర్యము :** మూడడుగుల భూమిని దానమిచ్చెదననునది యేది కలదో అది చేయు అనర్థమును ఎఱుంగనివాడవై నీచే చేయబడిన ప్రతిజ్ఞ సరియైనదికాదని తలంతును. దైత్యులకు గొప్ప అనిష్టముఁదెచ్చునదగును.

**శ్లో॥ ఏష తే స్థానమైశ్వర్యం-శ్రియం తేజో యశః శ్రుతమ్।**
**దాస్యత్యాచ్ఛిద్య శక్రాయ-మాయామాణవకో హరిః॥ 32**

**ప్రతిపదార్థము :** ఏషః=ఈ, మాయామాణవకః=కపట బాలుడగు, హరిః=హరి, తే=నీయొక్క, స్థానమ్=రాజ్యమును, ఐశ్వర్యమ్=ఐశ్వర్యమును, శ్రియమ్=శ్రీని, తేజః=తేజస్సు, యశః=యశస్సు, శ్రుతమ్=జ్ఞానము, ఆచ్ఛిద్య=హరించి, శక్రాయ=ఇంద్రుని కొఱకు, దాస్యతి=ఇచ్చును.

**తాత్పర్యము :** ఈ కపటబాలుడగు హరి నీయొక్క రాజ్యము, ఐశ్వర్యము, శ్రీని, తేజస్సు, యశస్సు, జ్ఞానము హరించి ఇంద్రునకు ఇచ్చును.

**శ్లో॥ త్రిభిః క్రమైరిమా ంల్లోకాన్-విశ్వకాయః క్రమిష్యతి।**
**సర్వస్వం విష్ణవే దత్త్వా-మూఢ! వర్తిష్యసే కథమ్॥** 33

**ప్రతిపదార్థము :** త్రిభిః=మూడు, క్రమైః=అడుగులతో, ఇమాన్=ఈ, లోకాన్=ముజ్జగములను, విశ్వకాయః=వామనుడు విరాడ్రూపమును ధరించి, క్రమిష్యతి=ఆక్రమించగలడు. మూఢ!=ఓ మూఢుడా!, సర్వస్వమ్=సర్వస్వమును, విష్ణవే=విష్ణు భగవానునికొఱకు, దత్త్వా=ఇచ్చి, కథమ్= ఎట్లు, వర్తిష్యసే=జీవింతువు.

**తాత్పర్యము :** మూడు అడుగులతో ఈ ముజ్జగములను వామనుడు విరాడ్రూపమును ధరించి ఆక్రమించగలడు. ఓ మూఢుడా! సర్వస్వమును విష్ణుభగవానుని కొఱకు ఇచ్చి ఎట్లు జీవింతువు.

**శ్లో॥ క్రమతో గాం పదైకేన ద్వితీయేన దివం విభోః।**
**ఖఞ్చ కాయేన మహతా-తార్తీయస్య కుతో గతిః॥** 34

**ప్రతిపదార్థము :** పదైకేన=ఒక పాదముతో, గామ్=భూమిని, ద్వితీయేన= రెండవ పాదముతో, దివమ్=స్వర్గమును, మహతా కాయేన=విరాట్ శరీరముతో, ఖఞ్చ=ఆకాశమును, క్రమతః =ఆక్రమించుచున్న, విభోః=ప్రభువు యొక్క, తార్తీయస్య=మూడవ పాదమునకు, కుతః గతి= గతియేది.

**తాత్పర్యము :** ఈయన యొకపాదముతో బృథివిని, రెండవ పాదముతో స్వర్గమును, విరాట్ దేహముతో ఆకాశమును ఆక్రమించును. మఱి మూడవ పాదమునకు గతియేది.

**శ్లో॥ నిష్ఠాం తే నరకే మన్యే-హ్యప్రదాతుః ప్రతిశ్రుతమ్।**
**ప్రతిశ్రుతస్య యోఽనీశః-ప్రతిపాదయితుం భవాన్॥** 35

**ప్రతిపదార్థము :** ప్రతిశ్రుతమ్=అంగీకరించిన దానిని, అప్రదాతుః=ఈయకపోయినచో, తే= నీకు, నరకే=నరకమున, నిష్ఠామ్=స్థానము, మన్యేహి=అని తలంతును. యః=ఏ, భవాన్= నీవు, ప్రతిశ్రుతస్య=అగీకరించినవానిని, ప్రతిపాదయితుమ్=ఇచ్చుటకు, అనీశః=అసమర్థుడవో!

**తాత్పర్యము :** అంగీకరించినదానినీయకపోయినచో నీకు నరకస్థానము సంభవించునని తలంచెదను. కాని ఈ అంగీకారమునిచ్చుటకు నీవు సమర్థుడవు గావు.

**శ్లో॥ న తద్దానం ప్రశంసన్తి యేన వృత్తిర్విపద్యతే।**
**దానం యజ్ఞస్తపః కర్మ-లోకే వృత్తిమతో యతః॥** 36

**ప్రతిపదార్థము :** యేన=దేనిచే, వృత్తిః=జీవనము, విపద్యతే=నాశమగునో, తత్+దానమ్=ఆ దానమును, న ప్రశంసన్తి=మంచిదని ప్రశంసించరు. యతః=ఎందువలన, లోకే=లోకము నందు, వృత్తిమతః=జీవనముగలవానికే, దానమ్=దానము, యజ్ఞః=యజ్ఞము, తపః=తపము, కర్మ=కర్మము చేయదగినవి.

**తాత్పర్యము :** దేనిచే జీవనము నాశమగునో ఆ దానమును మంచిదని పెద్దలు ప్రశంసించరు. జీవించి యున్నవానికే దానము, యజ్ఞము, చిత్తైకాగ్రమగు తపము, బావులు త్రవ్వించుట మొదలగు కర్మలు ధర్మహేతువులగుచున్నవి.



**శ్లో॥ ధర్మాయ యశసేఽర్థాయ కామాయ స్వజనాయ చ।**
**పఞ్చధా విభజన్ విత్త-మిహాముత్ర చ మోదతే॥** 37

**ప్రతిపదార్థము :** ధర్మాయ=ధర్మము కొఱకు, యశసే=కీర్తికొఱకు, అర్థాయ=అర్థముకొఱకు, కామాయ=భోగము కొఱకు, స్వజనాయ=తనవారి కొఱకు, పంచధా=ఐదు విధములుగ, విత్తమ్=ధనమును, విభజన్=విభాగించుచు ననుభవించువాడు, ఇహాముత్ర=ఇహలోకము నందును, పరలోకమునందును, మోదతే=సంతోషించును.

**తాత్పర్యము :** గృహస్థువగు పురుషుడు ధర్మమునకు, కీర్తికి, అర్థమునకు, భోగమునకు, తన బంధువులకు ఐదు విత్తములుగా ఁబంచియిచ్చుచు ననుభవించువాడు ఇహలోకమున, పరలోకమున సంతసించును.

**శ్లో॥ అత్రాపి బహ్వృచైర్గీతం శృణు మేఽసురసత్తమ।**
**సత్యమోమితి యత్ప్రోక్తం-యన్నేత్యాహానృతం హి తత్॥** 38

**ప్రతిపదార్థము :** అసురసత్తమ!=అసురోత్తమా!, అత్ర+అపి=ఈ విషయమున (ఇది సత్యము, ఇది అనృతము), బహ్వృచైః=బహ్వృచములను శ్రుతిమాత్రములచే, గీతమ్=చెప్పబడినది. మే=నా వలన, శృణు=వినుము. ఓమ్+ఇతి=సరియని, యత్+ప్రోక్తమ్=ఏది చెప్పబడినదో, సత్యమ్=సత్యమనియు, యత్=ఏది, న+ఇతి=లేదనుట, తత్=అది, అనృతమ్=అసత్యమని, ఆహ=చెప్పబడినది.

**తాత్పర్యము :** ఇది సత్యము, ఇది అనృతము అను విషయము బహ్వృచ శ్రుతి ఇట్లు చెప్పినది వినుము. సరియని యంగీకరించుట సత్యమని, కాదనుట అనృతమనియు చెప్పబడినది.

**బహ్వృచ శ్రుతి -** ప్రథమమున

ఓమితి సత్యం నేత్యనృతమ్ - ఓమనుట అంగీకరించుట సత్యము, కాదనుట అనృతము. అని ఇట్లు సత్యానృతముల లక్షణము వలన స్తుతినిందలచే సత్యముగా విహితము లేక విధిరూపమగు కర్మయనియు అనృతమనగా నిషిద్ధమగు కర్మయనియుఁజెప్పి అనంతరము...

'పరాగ్వా ఏ తద్రిక్తమక్షరమోమ్' - అను వాక్యము సత్యమునందు దోషములను, అనృతమునందు గుణములనుఁజెప్పి...

'తస్మాత్కాల ఏవ దద్యాత్కాలేన దద్యాత్సత్యానృతే...' అని ఉపసంహరించుచు... జీవనమునకు నాశమునుపద్రవము సంభవించు సమయములందు అనృతమును గూడఁ జెప్పవచ్చునని అనుమతింపబడినది అను నీ శ్రుత్యర్థమును దెలుపుచు చెప్పుచున్నాడు.

**శ్లో॥ సత్యం పుష్పఫలం విద్యాదాత్మవృక్షస్య గీయతే।**
**వృక్షేఽజీవతి తన్న స్యా-దనృతం మూలమాత్మనః॥** 39

సత్యము సైతము కొంచెము అనృతములేక సిద్ధించదను అభిప్రాయమున వచించుచున్నారు.

**ప్రతిపదార్థము :** ఆత్మవృక్షస్య=దేహమను వృక్షమునకు, సత్యమ్=సత్యమనునది, పుష్పఫలమ్= పుష్పము, ఫలము అని, విద్యాత్=ఎఱుంగవలెను. గీయతే=అట్లే శ్రుతిచే చెప్పబడినది. వృక్షే=వృక్షము, అజీవతి సతి=బ్రదుకకపోయినచో, తత్=ఆ పుష్పములు, ఫలములు, న

**ప్రతిపదార్థము :** ఏ యీ విప్రుడు సంతోషింపదేని అప్పుడీయగూడనే కూడదన్నచో చెప్పుచున్నాడు-దధ్యఙ్ శిబిప్రభృతయః=దధ్యజుడు,శిబిలోనగు, సాధవః=మహాత్ములు, దుస్త్యజాసుభిః=విడువఁగూడని ప్రాణములచే, భూతానామ్=ప్రాణులకు, శ్రేయః=ఉపకారములను, కుర్వన్తి=చేయుచున్నారు. ధరాదిషు=భూమిలోనగు వాటియందు, వికల్ప=పరిత్యజించుటకాలోచన యేల?

**తాత్పర్యము :** దధ్యజుడు, శిబిలోనగు మహాత్ములు విడువగూడని ప్రాణములచే ప్రాణులకు మేలు చేయుచుండ నిక భూమిలోనగువాని దానము చేయుట గూర్చి విచారమెందులకు.

**శ్లో॥ యైరియం బుభుజే యుద్ధే దైత్యేన్ద్రైరనివర్తిభిః।**
**తేషాం కాలోఽగ్రసీల్లోకా-న్న యశోఽధిగతం భువి॥ 8**

**ప్రతిపదార్థము :** యుద్ధే=యుద్ధమునందు, అనివర్తిభిః=వెనుదిరగని, యైః=ఏ, దైత్య+ఇన్ద్రైః = దైత్య ప్రభువులచే, ఇయమ్=ఈ భూమి, బుభుజే=అనుభవింపబడినదో, తేషామ్=వారి యొక్క, లోకాన్=ఇహలోకములను, పరలోకములను లేక భోగములను, కాలః=కాలము, అగ్రసీత్=సంహరించినది కాని, భువి=భూమియందు, అధిగతమ్=పొందబడిన, యశః=కీర్తిని, న=గ్రహించలేదు.

**తాత్పర్యము :** ఏ దైత్యప్రభువులు పూర్వము యుద్ధమునందు వెనుదిరగనివారైన వారిచే ఈ భూమిననుభవించిరో వారలను వారి ఇహపరలోకములను కాలము కబలించి వేసినది గాని, వారి యశస్సును మాత్రము కబళించలేదు.

**శ్లో॥ సులభా యుధి విప్రర్షే-హ్యనువృత్తాస్తనుత్యజః।**
**న తథా తీర్థ ఆయాతే-శ్రద్ధయా యే ధనత్యజః॥ 9**

దేహత్యాగమున కంటె ధనత్యాగమునందే కీర్తి కలుగుననుచున్నారు.

**ప్రతిపదార్థము :** విప్రర్షే=ఓ బ్రహ్మర్షీ!, యుధి=యుద్ధమునందు, అనువృత్తాః=అనువర్తించినవారు, పాల్గొన్నవారు, తనుత్యజః=తనువులను వీడువారు, సులభాః=పెక్కురు సులభముగా లభింతురు. తథా=ఆ ప్రకారము, తీర్థః=పాత్రుడగువాడు, ఆయాతే సతి=వచ్చినప్పుడు, యే=ఎవరు, శ్రద్ధయా=శ్రద్ధతో, ధనత్యజః=ధనము త్యాగము చేయువారు, న=సులభులు గారు.

**తాత్పర్యము :** ఓ బ్రహ్మర్షీ! యుద్ధమునందు శత్రువునకు వెన్నునీయక ప్రాణములవీడువారు పెక్కురు సులభముగా దొఱకుదురు కాని పాత్రుడగువాడేతెంచినపుడు శ్రద్ధతో ధనత్యాగము చేయువారు అట్లు సులభముగా లభింపరు.

**శ్లో॥ మనస్వినః కారుణికస్య శోభనం యదర్థికామోపనయేన దుర్గతిః।**
**కుతః పునర్బ్రహ్మవిదాం భవాదృశాం తతో వటోరస్య దదామి వాఞ్ఛితమ్॥ 10**

అట్లయిన నిర్ధనుడగుటచే దీనభావము ప్రార్థించునందువేని అన్నచో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యత్+అర్థికామోపనయేన=అర్థులెట్టివారైనను వారి యభీష్టములనొసంగుట వలన వచ్చిన, దుర్గతిః=దీనస్థితి, మనస్వినః=మానవంతుడగు, కారుణికస్య=కరుణాళువునకు, శోభనమ్=మంగళకరమే యగును. భవాదృశామ్=మీవంటి, బ్రహ్మవిదామ్=బ్రహ్మజ్ఞులకు,



**తాత్పర్యము :** అంగీకారసూచకమగు ఓంకారమగు నక్షరము పరాగర్థము. శూన్యమునుగాని, అపూర్ణమునుగాని చెప్పునదైయున్నది. అందువలన యాచకునకు ఏ కొంచెమో ఇత్తునని చెప్పవలయును. అట్లుకాక సర్వస్వమునిచ్చినచో పురుషుడు నిరర్థకుడై పోవును.

**శ్లో॥ భిక్షవే సర్వమోఙ్కుర్వన్నాలం కామేభ్య ఆత్మనే।**
**అథైతత్పూర్ణమభ్యాత్మం యచ్చ నేత్యనృతం వచః॥ 42**

**ప్రతిపదార్థము :** మఱియు, భిక్షవే=యాచకునకు, సర్వమ్=అంతయు, ఓం కుర్వన్=ఇచ్చెదనని అంగీకరించుచున్నవాడగుచు, ఆత్మనే=తనకొఱకైన, కామేభ్యః=వాంఛల కొఱకు, అలమ్=సమర్థుడు, న=కాడో వానికి భోగమేది సిద్ధించదో అనుట తనకున్నదంతయు యాచకుని కిచ్చినచో తాను రిక్తుడై జీవనమునకు కష్టపడవలసి వచ్చును. న+ఇతి=లేదను, అనృతమ్=అసత్య రూపమైన, వచః=మాట, అథ=మఱి, ఏతత్=ఇది, పూర్ణమ్=పూర్ణమై, అభ్యాత్మమ్=తన దేహాధికమును పోషించునదగుచున్నది.

**తాత్పర్యము :** ఒకానొక యాచకునకు తనకున్నదంతయునిత్తునని చెప్పినవాడు, తనకు జీవనమునకు ఏమియులేక దురవస్థపాలగుచున్నాడు. 'లేదను మాట' ధనమును వ్యయము చేయనిదై తన దేహాదికమునుఁబోషించుటకు వీలగుచున్నది. ఇతరుని అర్థము తనకభిముఖము చేసికొనుట అభ్యాత్మమని యర్థము.

ఎవడు నిత్యము నాకు గొంచెము గూడ లేదు, నేనేమియు ఈయలేను అని వచించువాడు ఆయనృతముచే ఇతరుల అర్థములు ఆకర్షించుచున్నాడనుట ప్రసిద్ధము.

**శ్లో॥ సర్వం నేత్యనృతం బ్రూయాత్-స దుష్కీర్తిః శ్వసన్మృతః।**
**స్త్రీషు నర్మవివాహే చ-వృత్త్యర్థే ప్రాణసఙ్కటే।**
**గోబ్రాహ్మణహితార్థాయ నానృతం స్యాజ్జుగుప్సితమ్॥ 43**

అట్లయిన అనృతమును సత్యమువలె సదా సేవించవలయునా ఏమి అన్నచో కాదనుచున్నాడు.

**ప్రతిపదార్థము :** న+ఇతి+అనృతమ్=లేదను నసత్యమును, సర్వమ్=సర్వవిశేషములయందు, బ్రూయాత్=పలికిన, సః=అతడు, ఆ పురుషుడు, దుష్కీర్తిః=అపకీర్తిగలవాడై, శ్వసన్ మృతః=బ్రతికియుండియు చచ్చినవాడగును. స్త్రీషు=స్త్రీలయందును, వారిని లోబఱచుకొను సమయములందు, నర్మవివాహే=పరిహాసములందు, వివాహమునందు, వృత్తి+అర్థే=జీవనము కొఱకు, ప్రాణసంకటే=ప్రాణాపాయమందు, గోబ్రాహ్మణ హితార్థాయ=గోవు, బ్రాహ్మణుల రక్షణము కొఱకు, అనృతమ్=అసత్యము, జుగుప్సితమ్=నింద్యము, న=కాదు.

**తాత్పర్యము :** తనకు సంపద సమృద్ధిగా నుండియు యాచకునికేమియు లేదనువాడు అపకీర్తిపాలగును. వాడు బ్రతికియు చచ్చినవాడు (జీవన్మృతుడు). స్త్రీల వశీకరణమందును, పరిహాసమునందు, వివాహమునందు, జీవనోపాయమునందు ప్రాణాపాయమునందును, గోబ్రాహ్మణుల రక్షణయందు అనృతము వచించుట దోషకారము కాదు.

**ఆ॥ వారిజాక్షులందు వైవాహికములందు బ్రాణవిత్తమానభంగమందు।**
**జకితగోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు నఘమునొందదధిప॥**

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కన్ధే ఏకోనవింశోఽధ్యాయః.
ఇది శ్రీమద్భాగవతమున అష్టమస్కంధమున ఏకోనవింశాధ్యాయము.

## వింశోఽధ్యాయః

ఈ అధ్యాయమందు బలి గురువాక్యమునుల్లంఘించి ఇచ్చిన భూమిని గొని విష్ణువు రెండడుగులతో పృథివిని, స్వర్గమును ఆక్రమించుట వర్ణింపబడును. లేదా విష్ణువు కపటమును దెలిసియు బలి అనృత దోషమునకు భయపడి భూమిని దానము చేసెను. విష్ణువు వెంటనే అద్భుతముగా పెరిగెను.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ బలిరేవం గృహపతిః-కులాచార్యేణ భాషితః।**
**తూష్ణీం భూత్వా క్షణం రాజ-న్నువాచావహితో గురుమ్॥** 1

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, ఏవమ్=ఇట్లు, కుల+ఆచార్యేణ=కులగురువగు శుక్రునిచే, భాషితః=చెప్పబడినవాడైన, గృహపతిః=యజమానుడగు, బలిః=బలిచక్రవర్తి, క్షణమ్=క్షణకాలము, తూష్ణీం భూత్వా=ఊరకుండి, అవహితః=జాగరూకతగలవాడై, గురుమ్=తన గురువు శుక్రుని గూర్చి, ఉవాచ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** ఇట్లు తన గురువు శుక్రుడు వచింప విని యజమానుడగు బలిచక్రవర్తి క్షణము సేపు మిన్నకుండి పిమ్మట మెలకువ బుద్ధితో నిట్లు వచించెను.

**శ్రీ బలిరువాచ :** బలి వచించెను.

**శ్లో॥ సత్యం భగవతా ప్రోక్తం-ధర్మోఽయం గృహమేధినామ్।**
**అర్థకామయశోవృత్తిర్యో న బాధేత కర్హిచిత్॥** 2

**ప్రతిపదార్థము :** యః=ఏది, కర్హిచిత్=ఒకప్పుడును, అర్థకామయశోవృత్తిః=అర్థమును, కామమును, యశమును, జీవనమును, న బాధేత=బాధించదో, నాశము చేయదో, అయమ్=ఈ, గృహమేధినామ్=గృహస్థుల యొక్క, ధర్మః=ధర్మము, భగవతా=భగవానులగు మీచే, ప్రోక్తమ్=చెప్పబడినది, సత్యమ్=సత్యమే యగును.

**తాత్పర్యము :** భగవానులగు మీరు వచించిన గృహస్థధర్మము తప్పక సత్యమే యగుచున్నది. ఏ కాలమందైనను అర్థమును, కామమును, యశమును, జీవనమును బాధింపని ధర్మమే గృహస్థ ధర్మము.

**శ్లో॥ స చాహం విత్తలోభేన-ప్రత్యాచక్షే కథం ద్విజమ్।**
**ప్రతిశ్రుతం దదామీతి-ప్రాహ్రాదిః కితవోయథా॥** 3

**ప్రతిపదార్థము :** ప్రాహ్రాదిః=ప్రహ్లాదుని వంశమువాడై, సః అహమ్ చ=ఆ నేనును, దదామి+ఇతి=నేను భూమినిత్తునని, ప్రతిశ్రుతమ్=అంగీకరించినదానిని, కితవః యథా=ధూర్తుడు వలె, విత్తలోభేన=ధనమునందాశచే, ద్విజమ్=విప్రుని, కథమ్ ప్రత్యాచక్షే=ఎట్లు నిరాకరింతును.

**తాత్పర్యము :** ప్రహ్లాదుని వంశమువాడనైన నేను భూమినిత్తునని వాగ్దానము చేసి మోసగానివలె నిప్పుడు ధనాశచే దానమీయనని ఎట్లు నిరాకరింతును.



**శ్లో॥ నహి సత్యాత్ పరోఽధర్మ-ఇతి హోవాచ భూరియమ్।**
**సర్వం వోఢుమహం మన్యే-ఋతేఽలీకపరం నరమ్॥** 4

**ప్రతిపదార్థము :** సత్యాత్=సత్యముకంటె, పరః ధర్మః=ఉత్తమ ధర్మము, నహి=లేదు, అహమ్=నేను, మన్యే=తలంచెదను. ఇయమ్ భూః=ఈ భూదేవి, అలీకపరమ్=అసత్యవంతుడైన, నరమ్ ఋతే=మనిషిని తప్ప, సర్వమ్=తక్కిన వారినందఱను, వోఢుమ్=భరించుటకు, మన్యే=ఒప్పునని, ఉవాచ హ=వచించెను.

**తాత్పర్యము :** సత్యముకంటె నుత్తమధర్మములేదని నాయభిప్రాయము. ఒకప్పుడు భూదేవి అసత్యవంతుని దప్పఁదక్కిన వారినందఱను భరించుననియందురు.

**శ్లో॥ నాహం బిభేమి నిరయాన్నాధన్యాదసుఖార్ణవాత్।**
**న స్థానచ్యవనాన్మృత్యోర్యథా విప్రప్రలమ్భనాత్॥** 5

అట్లు నిరాకరించకపోయినచోఁబెక్కు ఉపద్రవములు వాటిల్లును గదా అన్నచో చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అహమ్=నేను, విప్రప్రలంభనాత్ యథా=విప్రుని మోసగించుటకు భయపడినట్లు, నిరయాత్=నరకమువలనను, న బిభేమి=భయపడను. అధన్యాత్=దారిద్ర్యము వలన, న=వెఱవను, అసుఖ+అర్ణవాత్=దుఃఖసాగరమువలన, న=భీతిచెందను, స్థానచ్యవనాత్=స్థానభ్రంశము వలన, న=వెత పొందను, మృత్యోః=మృత్యువు వలన, న=వెత పొందను.

**తాత్పర్యము :** నేను ఈ విప్రుని మోసగించుటకు భయపడినట్లు నరకమునకు భయపడను. దారిద్ర్యమునకు భీతిచెందను. దుఃఖసాగరమునకు వెత చెందను, స్థానభ్రంశమువలన, మృత్యువు వలనను వెత పొందను.

**శ్లో॥ యద్యద్ధాస్యతి లోకేఽస్మిన్-సమ్పరేతం ధరాదికమ్।**
**తస్య త్యాగే నిమిత్తం కిం-విప్రస్తుష్యేన్న తేన చేత్॥** 6

**ప్రతిపదార్థము :** అస్మిన్ లోకే=ఈ లోకమందు, యత్ యత్=ఏయే, ధరాదికమ్=భూమిలోనగునది గలదో అదియంతయు, సంపరేతమ్=మృతుడైనవానిని, హాస్యతి=వదలుచున్నది. ఆపదవచ్చుచో నీయగూడదన్నచో చెప్పుచున్నాడు - తేన=ఆ దానముచే, విప్రః=విప్రుడు, న తుష్యేత్ చేత్=సంతోషింపకపోయినచో, తస్య=ఆ యర్థము యొక్క, త్యాగే=దానమునందు, కిం నిమిత్తమ్=ప్రయోజనమేమి?

**తాత్పర్యము :** ఏయే భూమిలోనగు సంపదలు గలవో అవియన్నియుఁజనిపోయిన పురుషుని వదలుచున్నవి. కావున జీవించియున్నప్పుడే దానినేల దానము చేయగూడదు. ఆ దానముచే విప్రుడు సంతోషపడడేని ఆ యర్థము వలని ప్రయోజనమేమి. యాచించినదానికంటె స్వల్పముగా నిచ్చినచో విప్రునికి సంతోషము లేకపోవుట వలన ఆ దానము వ్యర్థమేయగును. అందువలన అతడడిగినదంతయు నీయవలయును.

**శ్లో॥ శ్రేయః కుర్వన్తి భూతానాం-సాధవో దుస్త్యజాసుభిః।**
**దధ్యఙ్శిబిప్రభృతయః-కో వికల్పో ధరాదిషు॥** 7

కింపురుషులు, కిన్నరులు మనస్వియగు ఈ బలిచక్రవర్తి దుష్కరమగు కర్మ ఒనరించినాడు. ఎఱింగియు శ్రీవామనభగవానుని కొఱకు 3 అడుగుల నేలను దానమిచ్చెను.

**శ్లో॥ తద్వామనం రూపమవర్ధతాద్భుతం హరేరనన్తస్య గుణత్రయాత్మకమ్।**
**భూః ఖం దిశో ద్యౌర్వివరాః పయోధయస్తిర్యఙ్నృదేవా ఋషయో యదాసత॥ 21**

**ప్రతిపదార్థము :** తత్=ఆ సమయమున, అనన్తస్య=అనంతుడగు, హరేః=హరియొక్క, వామనమ్ రూపమ్=వామన రూపము, అద్భుతమ్=అద్భుతముగ, గుణత్రయాత్మకమ్=గుణత్రయాత్మకముగా, అవర్ధత=పెరగసాగెను. భూః=భూమి, ఖమ్=ఆకాశము, దిశః=దిక్కులు, ద్యౌః=సమస్త లోకములు, వివరాః=పాతాళగుహలు, పయోధయః=సముద్రములు, తిర్యఙ్=పశుపక్షులు, నృదేవాః=నరులు, దేవతలు, ఋషయః=మునులు, యదాసత=ఆ విరాడ్రూపమున నున్నారు.

**తాత్పర్యము :** ఆ సమయమున అనంతుడగు హరియొక్క వామన రూపమత్యద్భుతముగ పెరగసాగెను. సమస్తమూ ఆ విరాడ్రూపముననున్నవి.

**శ్లో॥ కాయే బలిస్తస్య మహావిభూతేః-సహర్త్విగాచార్యసదస్య ఏతత్।**
**దదర్శ విశ్వం త్రిగుణం గుణాత్మకే-భూతేన్ద్రియార్థాశయజీవయుక్తమ్॥ 22**

**ప్రతిపదార్థము :** ఏతత్=అప్పుడు, సహర్త్విగాచార్యసదస్యః=ఋత్విక్కులు, ఆచార్యులు, సదస్యులతోపాటు, బలిః=బలి చక్రవర్తి, మహావిభూతేః=మహావిభూతిశాలియగు, విరాట్స్వరూపుడగు భగవానుని, కాయే=షడైశ్వర్యాత్మకమగు శరీరమున, భూ...యుక్తమ్=భూతములు, వాగాదీంద్రియములు, శబ్దాదివిషయములు, చతుర్విధాంతఃకరణములు, జీవులతోబాటు, గుణాత్మకే=గుణత్రయకార్య స్వరూపమగు హరి శరీరమునందు, త్రిగుణమ్ విశ్వమ్=అఖిల విశ్వమును, దదర్శ=దర్శించెను.

**తాత్పర్యము :** అప్పుడు ఋత్విక్కులు, ఆచార్యులు, సదస్యులతోపాటు బలిచక్రవర్తి మహావిభూతిశాలి, విరాట్స్వరూపుడగు వామనభగవానుని శరీరమున భూతాది సర్వజీవులతోబాటు గుణత్రయకార్యస్వరూపమగు అఖిలవిశ్వమును దర్శించెను.

**శ్లో॥ రసామచష్టాఙ్ఘ్రితలేఽథ పాదయోర్మహీం మహీధ్రాన్ పురుషస్య జఙ్ఘయోః।**
**పతత్త్రిణో జానుని విశ్వమూర్తేరూర్వోర్గణం మారుతమిన్ద్రసేనః॥ 23**

**ప్రతిపదార్థము :** అథ=పిమ్మట, పురుషస్య=విరాట్స్వరూపుడగు, విశ్వమూర్తేః=ఆ వామన భగవానుని యొక్క, అఙ్ఘ్రితలే=పదతలమున, రసామ్=రసాతలములలోనగు సప్తలోకజాలమును, పాదయోః=పదయుగళమున, మహీమ్=పృథివిని, జఙ్ఘయోః=జంఘలయందు, మహీధ్రాన్=పర్వతములను, జానుని=జానువులయందు, పతత్త్రిణః=పక్షులను, ఊర్వోః=ఊరువులయందు, మారుతమ్ గణమ్=వాయువులను, ఆచష్టే=దర్శించెను.

**తాత్పర్యము :** పిమ్మట బలిచక్రవర్తి ఆ విరాట్ స్వరూపుడగు వామన భగవానుని పదతలమున రసాతలములోనగు సప్తలోకములను, పాదయుగళమున పృథివిని, జంఘలయందు పర్వతములను, జానువులయందు పక్షులను, ఊరువులయందు వాయువులను దర్శించెను.



కుతః పునః=అట్టి దానము శుభకరమైనదని వేఱుగాఁజెప్పనేల. తతః=అందువలన, అస్య=ఈ, వటోః=బ్రహ్మచారి యొక్క, వాంఛితమ్=కోరిన దానిని, దదామి=ఇచ్చెదను.

**తాత్పర్యము :** అర్థులెట్టివారైనను వారియభీష్టములనొసంగుట వలన వచ్చిన దీనస్థితి మానవంతుడగు కరుణాళువునకు మంగళకరమే యగును. మీవంటి బ్రహ్మవేత్తలకు అట్టి దానము శుభకరమైనదని వేఱుగాఁజెప్పనేల. కావున నేనీవామనుని వాంఛితము నొసగుదును.

**శ్లో॥ యజన్తి యజ్ఞైః క్రతుభిర్యమాదృతా భవన్త ఆమ్నాయవిధానకోవిదాః।**
**స ఏష విష్ణుర్వరదోఽస్తు వా పరో దాస్యామ్యముష్మై క్షితిమీప్సితాం మునే॥ 11**

**ప్రతిపదార్థము :** మునే!=ఓ మునిశ్రేష్ఠా!, ఆ ఇతడు వటువు కాదు, విష్ణువు. ఇతడు నీకు శత్రువు సుమా!, అందువా, అందువలన పూర్తిగా నీతడడిగిన దానినిత్తుననుచున్నాడు. ఆమ్నాయవిధానకోవిదాః=వేదోక్త కర్మలననుష్ఠించు పెద్దలు, యమ్=ఎవ్వని, యజ్ఞైః=పంచమహాయజ్ఞముల చేత, క్రతుభిః=జ్యోతిష్టోమాదియాగములచే, యజన్తి=పొందుచున్నారో, ఆదృతాః=ఆదరింపబడినవారు, భవన్తః=అగుచున్నారు. సఃఏషః=ఆ యీ, విష్ణుః=విష్ణువు, వరదః అస్తు=వరమునిచ్చువాడగుఁగాక, పరఃవా అస్తు=శత్రువగుగాక, అముష్మై=దీని కొఱకు, ఈప్సితామ్=కోరబడిన, క్షితిమ్=భూమిని, దాస్యామి=ఇచ్చెదను.

**తాత్పర్యము :** వేదోక్త కర్మనిష్ఠాపరులెవ్వని గూర్చి యజ్ఞములు, యాగములు చేసి సర్వోత్కర్షను బొంది గౌరవమునకుఁబాత్రులగుచున్నారో అట్టి విష్ణువితడు. నాకు వరమునిచ్చువాడగు గాక లేక శత్రువైననగు గాక, కాని నేను ఈ వటువునకుఁగోరిన భూమిని దానము చేయుదును.

**శ్లో॥ యద్యప్యసావధర్మేణ-మాం బధ్నీయాదనాగసమ్।**
**తథాప్యేనం న హింసిష్యే-భీతం బ్రహ్మతనుం రిపుమ్॥ 12**

**ప్రతిపదార్థము :** అసౌ=ఇతడు, యది+అపి=ఒకవేళ, అధర్మేణ=అధర్మ మార్గములో, అనాగసమ్=ఏ పాపమెఱుగని, మామ్=నన్ను, బధ్నీయాత్=బంధించినను, తథా+అపి=అట్లయినను, భీతమ్=భీతుడు, బ్రహ్మతనుమ్=బ్రాహ్మణవేషధారియగు, రిపుమ్=శత్రువగు విష్ణువును, న హింసిష్యే=హింసింపను.

**తాత్పర్యము :** ఇతడు ఒకవేళ అధర్మమార్గముతో ఏ పాపమెఱుగని నన్ను బంధించినను అట్లయినను భీతుడు, బ్రాహ్మణ వేషధారియగు శత్రువగు విష్ణువును హింసింపను.

**శ్లో॥ ఏష వా ఉత్తమశ్లోకో-న జిహాసతి యద్యశః।**
**హత్వా మైనాం హరేద్యుద్ధే-శయీత నిహతో మయా॥ 13**

**ప్రతిపదార్థము :** ఏషః వా=ఇతడన్నచో, ఉత్తమశ్లోకః=పవిత్రయశస్సుగలవాడు, యత్=ఏ, యశః=కీర్తిని, న జిహాసతి=వదలుకొనువాడు కాడు, యుద్ధే=యుద్ధమునందు, మా=నన్ను, హత్వా=చంపి, ఏనామ్=ఈ భూమిని, హరేత్=హరించును. లేకున్న మయా=నాచే, నిహతః=కొట్టబడి, శయీత=భూమిపై శయనించును.

నా చిత్తమునెఱింగి అందు చక్కగా శయనించునని వాస్తవమగు నర్థము.

**తాత్పర్యము :** ఇతడు పుణ్యశ్లోకుడు గావున తన కీర్తి నెట్లును వదలుకొనడు. నాతో యుద్ధము

చేసి నన్నుఁజంపి ఈ భూమిని గైకొనును. లేకున్న నాచే సంహరింపబడి భూమిని శయినించును. నా భక్తి నెఱింగి నా మనమున నిల్పునని భావము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఏవమశ్రద్ధితం శిష్య-మనాదేశకరం గురుః।**
**శశాప దైవప్రహితః-సత్యసన్ధం మనస్వినమ్॥** 14

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఇట్లు, అశ్రద్ధితమ్=తన మాటయందు శ్రద్ధపొందనివాడు, అనాదేశకరమ్=తన ఆజ్ఞను గావింపనివాడు, శిష్యమ్=తనకు శిష్యుడైన బలిచక్రవర్తిని, సత్యసన్ధమ్=సత్యమగు ప్రతిజ్ఞగలవాడు, మనస్వినమ్=మానవంతుడైనవానిని, దైవప్రహితః =విధి ప్రేరితుడై, శశాప=శపించెను.

**తాత్పర్యము :** ఇట్లు తన మాటపై శ్రద్ధఁజూపక తనయాజ్ఞ పాటింపక శిష్యుడగు బలి చక్రవర్తిని గురువగు శుక్రుడు తన్ను విధిప్రేరేపింప ఆ సత్యప్రతిజ్ఞుడైన మానవంతుడైన వానిని శపించెను.

**శ్లో॥ దృఢం పణ్డితమాన్యజ్ఞః-స్తబ్ధోఽస్యస్మదుపేక్షయా।**
**మచ్ఛాసనాతిగో య-స్త్వమచిరాద్భ్రశ్యసే శ్రియః॥** 15

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, పణ్డితమాన్యజ్ఞః=పండితమ్మన్యుడవు, అజ్ఞుడవు, స్తబ్ధః=వినయ రహితుడవు, అసి=అయితివి, మచ్ఛాసనాతిగః=నా యాజ్ఞను జవదాటుటకుద్యుక్తుడవైన, త్వమ్=నీవు, అస్మదుపేక్షయా=నన్నుపేక్షించుటచే, అచిరాత్=త్వరలోనే, శ్రియః=ఐశ్వర్యము నుండి, భ్రశ్యసే=జాఱిపోయెదవు.

**తాత్పర్యము :** నీవు పండితమ్మన్యుడవు, వినయరహితుడవు, నా యాజ్ఞను జవదాటుట కుద్యుక్తుడవైన నీవు నన్నుపేక్షించుటచే త్వరలోనే ఐశ్వర్యమును పోగొట్టుకొనినవాడవయ్యెదవు.

**శ్లో॥ ఏవం శప్తః స్వగురుణా-సత్యాత్ న చలితో మహాన్।**
**వామనాయ దదావేనామర్చిత్వోదకపూర్వకమ్॥** 16

**ప్రతిపదార్థము :** ఏవమ్=ఇట్లు, స్వగురుణా=తన గురువుచే, శప్తః=అభిశప్తుడైన మహాత్ముడగు బలిచక్రవర్తి, సత్యాత్=తానొనర్చిన ప్రతిజ్ఞనుండి, న చలితః=చలింపలేదు, వామదేవాయ= వామన భగవానుని కొఱకు, అర్చిత్వా=అర్చించి, ఏనామ్=తానన్న విధముగ భూమిని (3 అడుగుల), ఉదకపూర్వకమ్=ఉదక పూర్వకముగా, దదౌ=సమర్పించెను.

**తాత్పర్యము :** ఇట్లు తన గురువగు శుక్రాచార్యునిచే అభిశప్తుడైన మహాత్ముడగు బలి చక్రవర్తి తానొనర్చిన ప్రతిజ్ఞ నుండి చలింపలేదు. ఆ వామనభగవానుని నర్చించి తానన్నవిధముగ 3 అడుగుల భూమిని ఉదక పూర్వకముగ సమర్పించెను.

**శ్లో॥ విన్ధ్యావలిస్తదాగత్య-పత్నీ జాలకమాలినీ।**
**ఆనిన్యే కలశం హైమ-మవనేజన్యపాం భృతమ్॥** 17

**ప్రతిపదార్థము :** జాలకమాలినీ=ముత్యాల మాలను ధరించినదియు, పత్నీ=బలి చక్రవర్తి ధర్మపత్నియు అగు,విన్ధ్యావలిః=విన్ధ్యావలి, తదాగత్య=ఆ సమయమున వచ్చి, అవనేజన్యపామ్ =పాదప్రక్షాళనార్థమై జలముతో, భృతమ్=నిండిన, హైమమ్=బంగారు, కలశమ్=కలశమును, ఆనిన్యే=కొనివచ్చెను.



**తాత్పర్యము :** ముత్యాల మాలను ధరించినదియు, బలిచక్రవర్తి ధర్మపత్నియగు విన్ధ్యావళి ఆ సమయమున వచ్చి, పాదప్రక్షాళనార్థమై జలముతో నిండిన బంగారు కలశమును గొని దెచ్చెను.

**శ్లో॥ యజమానః స్వయం తస్య-శ్రీమత్పాదయుగం ముదా।**
**అవనిజ్యావహత్ మూర్ధ్ని-తదపో విశ్వపావనీః॥** 18

**ప్రతిపదార్థము :** యజమానః=యజమానియగు బలిచక్రవర్తి, స్వయమ్=స్వయముగా, తస్య=ఆ, శ్రీమత్పాదయుగమ్=శ్రీవామన భగవానుని పాదద్వయమును, ముదా= సంతోషముతో, అవనిజ్య=ప్రక్షాళనముచేసి, విశ్వపావనీః=విశ్వపావనమగు, తత్+అపః=ఆ ప్రక్షాళన జలమును, మూర్ధ్ని=శిరస్సునందు, అవహత్=చల్లుకొనెను.

**తాత్పర్యము :** యజమానియగు బలిచక్రవర్తి స్వయముగా ఆ శ్రీవామనభగవానుని పాద ద్వయమును బ్రక్షాళనమును చేసి విశ్వపావనమగు ఆ ప్రక్షాళన జలమును శిరస్సునందుఁ జల్లుకొనెను.

**శ్లో॥ తదాఽసురేన్ద్రం దివి దేవతాగణా గన్ధర్వవిద్యాధరసిద్ధచారణాః।**
**తత్కర్మ సర్వేఽపి గృణన్త ఆర్జవం ప్రసూనవర్షైర్వవృషుర్ముదాన్వితాః॥** 19

**ప్రతిపదార్థము :** తదా=అప్పుడు, దివి=స్వర్గమున నున్న, దేవతాగణాః=దేవతాగణములు, గన్ధర్వ-విద్యాధర-సిద్ధ-చారణాః=గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు, సర్వే - పి=అందఱూ, ముదాన్వితాః=ఆనందముతో గూడినవారై, తత్+కర్మ=ఆయన కర్మను, గృణన్త ఆర్జవమ్=నిష్కపటముగ పొగడుచు, అసురేన్ద్రమ్=ఆ అసురపతియగు బలిచక్రవర్తిపై, ప్రసూనవర్షైః=పుష్పజల్లులను, వవృషుః=కురిపించిరి.

**తాత్పర్యము :** ఆ సమయమున స్వర్గమునందున్న దేవతాగణములు, గంధర్వులు, విద్యాధరులు, సిద్ధులు, చారణులు అందఱూ ఆనందముతో ఆయన కర్మను నిష్కపటముగ పొగడుచు ఆ అసురపతియగు బలిచక్రవర్తిపై పుష్పజల్లులను గురిపించిరి.

**శ్లో॥ నేదుర్ముహుర్దున్దుభయః సహస్రశో గన్ధర్వకిమ్పూరుషకిన్నరా జగుః।**
**మనస్వినానేన కృతం సుదుష్కరం విద్వానదాద్యద్రిపవే జగత్త్రయమ్॥** 20

**ప్రతిపదార్థము :** (తదా=ఆ సమయమున) సహస్రశః=వేలకొలది, దున్దుభయః=దుందుభులు, ముహుః=మాటిమాటికి, నేదుః=మ్రోగసాగినవి. గన్ధర్వ-కిమ్పూరుష-కిన్నరాః=గంధర్వులు, కింపురుషులు, కిన్నరులు, జగుః=గానము చేసిరి, మనస్వినా=మనస్వియగు, అనేన=ఈ బలి చక్రవర్తిచే, సుదుష్కరమ్=దుష్కరమగు కర్మ, కృతమ్=చేయబడినది. విద్వాన్= ఎఱింగియు, రిపవే=శత్రువగు శ్రీ వామనభగవానుని కొఱకు, జగత్త్రయమ్=3 అడుగుల నేలను, అదాద్యత్=ఇచ్చెను.

**తాత్పర్యము :** అప్పుడు వేలకొలది దుందుభులు మాటిమాటికి మ్రోగసాగినవి. గన్ధర్వులు,

# ఏకవింశోఽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ సత్యం సమీక్ష్యాబ్జభవో నఖేన్దుభిర్హతస్వధామద్యుతిరావృతోఽభ్యగాత్।**
**మరీచిమిశ్రా ఋషయో బృహద్వ్రతాః సనన్దనాద్యా నరదేవ! యోగినః॥ 1**

**ప్రతిపదార్థము :** నరదేవ=మహారాజా!, అబ్జభవః=బ్రహ్మ, సత్యమ్=సత్యలోకమునకు వచ్చిన ఆ చరణమును, సమీక్ష్య=చూచి, నఖేందుభిః=నఖచంద్రులచే, హత=జయింపబడిన, స్వధామద్యుతిః=తన లోకకాంతులుగలవాడై, ఆవృతః=విష్ణు పాదనఖకాంతులచేత పరివృతుడై, అభ్యగాత్=వచ్చెను. మరీచి మిశ్రాః=మరీచి మొదలగు, ఋషయః=మహర్షులు, బృహద్వ్రతాః =గొప్ప వ్రతదీక్ష కల, సనందనాద్యాః=సనందనుడు మొదలగు, యోగినః=యోగులు, (వవందిరే=నమస్కరించిరి).

**తాత్పర్యము :** విష్ణుపాదము సత్యలోకం ప్రవేశించింది. ఆ పాదనఖ (గోళ్ళ) కాంతులు సత్యలోక కాంతిని ఆక్రమించినవి. బ్రహ్మనుగూడా చుట్టుముట్టినవి. బ్రహ్మ బయలుదేరి ఎదురు వచ్చాడు. మరీచి మొ॥ అయిన ఋషులు, సనందనాది మహాయోగులు ఆ విష్ణు పాదమునకు నమస్కరించిరి.

**శ్లో॥ వేదోపవేదా నియమా యమాన్వితాస్తర్కేతిహాసాఙ్గపురాణసంహితాః।**
**యే చాపరే యోగసమీరదీపితజ్ఞానాగ్నినా రన్ధితకర్మకల్మషాః॥ 2**

**ప్రతిపదార్థము :** వేద=వేదములు, ఉపవేదాః=ధనుర్వేదం మొ॥ ఉపవేదములు, యమాన్వితాః =యమములతో గూడిన, నియమాః=నియమములు, తర్క=తర్కము మొ॥ శాస్త్రములు, ఇతిహాస=ఇతిహాసములు, అంగ=ఉపపురాణములు, పురాణ=పురాణములు, సంహితాః =సంహితా గ్రంథములు (వవందిరే=నమస్కరించెను), యోగసమీర=యోగవాయువు చేత, దీపిత=వెలిగింపబడిన, జ్ఞానాగ్నినా=జ్ఞానాగ్నిచేత, రంధిత=దగ్ధమయిన, కర్మకల్మషాః=కర్మ కాలుష్యముగల, యే అపరే చ=ఇతర సత్పురుషులు ఎవరున్నారో వారందఱు (వవందిరే= నమస్కరించిరి.)

**తాత్పర్యము :** బ్రహ్మలోకమునందు కొలువుదీఱిన యమనియమ తర్కాదిశాస్త్ర, ఇతిహాస, పురాణ, ఉపపురాణ, సంహితాగ్రంథములన్నియు, ఆ విష్ణుపాదమునకు నమస్కరించినవి. యోగులు, జ్ఞానులు అయిన సత్పురుషులంతా విష్ణుచరణానికి వందనములు చేసిరి.

**శ్లో॥ వవన్దిరే యత్స్మరణానుభావతః స్వాయమ్భువం ధామ గతా అకర్మకమ్।**
**అథాఙ్ఘ్రయే ప్రోన్నమితాయ విష్ణోరుపాహరత్పద్మభవోఽర్హణోదకమ్॥ 3**

**ప్రతిపదార్థము :** యత్=ఏ పాదపద్మము యొక్క, స్మరణానుభావతః=స్మృతి వలన, అకర్మకమ్= కర్మ లభ్యముకాని, స్వాయంభువ=బ్రహ్మ సంబంధమయిన, ధామ=లోకమును, గతాః=చేరిన పై యోగులు, జ్ఞానులు మొ॥, వవందిరే=నమస్కరించిరి. అథ=తరువాత, ప్రోన్నమితాయ= పైకి సాచబడిన, విష్ణోః=విష్ణువు యొక్క, అంఘ్రయే=పాదమునకు, పద్మభవః=బ్రహ్మ, అర్హణోదకమ్=అర్ఘ్యజలమును, ఉపాహరత్=సమర్పించెను.



**శ్లో॥ సన్ధ్యాం విభోర్వాససి గుహ్య ఐక్షత్-ప్రజాపతీఞ్జఘనే ఆత్మముఖ్యాన్।**
**నాభ్యాం నభః కుక్షిషు సప్త సిన్ధూన్-ఉరుక్రమస్యోరసి చర్క్షమాలామ్॥ 24**

**ప్రతిపదార్థము :** విభోః=భగవానుడగు, ఉరుక్రమస్య=ఉరుక్రముని యొక్క, వాససి=వస్త్రము నందు, సన్ధ్యామ్=సన్ధ్యాదేవిని, గుహ్యే=గుహ్య ప్రదేశమునందు, ప్రజాపతీన్=ప్రజాపతులను, జఘనే=కటి ప్రదేశమునందు, ఆత్మముఖ్యాన్=తనతోపాటు అసురులను, ఐక్షత్=బలిదర్శించెను. నాభ్యామ్=నాభియందు, నభః=ఆకాశమును, కుక్షిషు=కుక్షియందు, సప్తసిన్ధూన్=సప్తసముద్రము లను, ఉరసి=వక్షస్థలమునందు, ఋక్షమాలామ్=నక్షత్రమాలను, ఐక్షత్=చూచెను.

**తాత్పర్యము :** ఆ బలిచక్రవర్తి భగవానుడగు ఉరుక్రముని యొక్క వస్త్రములందు సన్ధ్యాదేవిని, గుహ్యప్రదేశమునందు ప్రజాపతులను, కటి ప్రదేశమున తనతోబాటు అసురులను, నాభియందు ఆకాశమును, కుక్షియందు సప్తసముద్రములను, వక్షమునందు నక్షత్రమాలను దర్శించెను.

**శ్లో॥ హృద్యఙ్గ! ధర్మం స్తనయోర్మురారేరృతం చ సత్యం చ మనస్యథేన్దుమ్।**
**శ్రియఞ్చ వక్షస్యరవిన్దహస్తాం కణ్ఠే చ సామాని సమస్తరేఫాన్॥ 25**

**ప్రతిపదార్థము :** మురారేః=మురారి యొక్క, హృది=హృదయమునందు, ధర్మమ్=ధర్మమును, స్తనయోః=స్తనములయందు, ఋతమ్సత్యమ్=సత్యవాక్కును, మనసి=మనస్సునందు, ఇన్దుమ్= చంద్రుని, వక్షసి=వక్షమునందు, అరవిన్ద హస్తామ్=పద్మహస్తయగు లక్ష్మీదేవిని, కంఠే=కంఠము నందు సామములను, సమస్త రేఫాన్=సమస్త శబ్దజాలమును చూచెను.

**శ్లో॥ ఇన్ద్రప్రధానానమరాన్ భుజేషు తత్కర్ణయోః కకుభో ద్యౌశ్చ మూర్ధ్ని।**
**కేశేషు మేఘాఞ్ఛ్వసనం నాసికాయామక్ష్ణోశ్చ సూర్యం వదనే చ వహ్నిమ్॥ 26**

**ప్రతిపదార్థము :** భుజేషు=భుజములయందు, అమరాన్=అమరులగు, ఇన్ద్రప్రధానాన్= ఇంద్రుడులోనగు ముఖ్యులును, కర్ణయోః=కర్ణములయందు, కకుభః=దిక్కులను, మూర్ధ్ని= శిరస్సునందు, ద్యౌఃచ=స్వర్గమును, కేశేషు=కేశములయందు, మేఘాన్=మేఘములను, నాసికాయామ్=నాసికయందు, శ్వసనమ్=వాయువును, అక్ష్ణోః=నేత్రములయందు, సూర్యమ్= సూర్యుని, వదనే=వదనమునందు, వహ్నిమ్=అగ్ని భట్టారకుని చూచెను.

**శ్లో॥ వాణ్యాం చ ఛన్దాంసి రసే జలేశం భ్రువోర్నిషేధం చ విధిం చ పక్ష్మసు।**
**అహశ్చ రాత్రిఞ్చ పరస్య పుంసో మన్యుం లలాటేఽధర ఏవ లోభమ్॥ 27**

**ప్రతిపదార్థము :** పరస్య=పరముడు, పుంసః=భగవానుడగు వామనునికి, వాణ్యామ్=వాక్కుల యందు, ఛన్దాంసి=ఛందస్సులను, రసే=రసమునందు, జలేశమ్=వరుణ దేవుడను, భ్రువోః =భ్రూయుగళమునందు, నిషేధమ్ విధిమ్=నిషేధ విధిని, పక్ష్మసు=కనురెప్పల ఉన్మీలన నిమీలనములయందు, అహఃచ=పగలును, రాత్రిఃచ=రాత్రియును, లలాటే=లలాటమునందు, మన్యుమ్=క్రోధమును, అధరే=అధరమునందు, లోభమ్=లోభమును చూచెను.

**శ్లో॥ స్పర్శే చ కామం నృప రేతసామ్భః పృష్ఠే త్వధర్మం క్రమణేషు యజ్ఞమ్।**
**ఛాయాసు మృత్యుం హసితే చ మాయాం తనూరుహేష్వోషధిజాతయశ్చ॥ 28**

**ప్రతిపదార్థము :** నృప=ఓ రాజా!, స్పర్శే=స్పర్శయందు, కామమ్=మన్మథుడును, రేతసా - మ్బుః=రేతస్సునందు జలమును, పృష్ఠే=పృష్ఠభాగమున అధర్మమును, క్రమణేషు= పాదన్యాసమునందు, యజ్ఞమ్= యజ్ఞమును, ఛాయాసు=నీడలయందు, మృత్యుమ్= మృత్యువు, హసితే=నవ్వునందు, మాయామ్=మాయను, తనూరుహేషు= రోమరాజియందు, ఓషధిజాతయః చ=ఓషధులును.... మఱి,

శ్లో॥ **నదీశ్చ నాడీషు శిలా నఖేషు బుద్ధావజం దేవగణానృషీంశ్చ।**
**ప్రాణేషు గాత్రే స్థిరజఙ్గమాని సర్వాణి భూతాని దదర్శ వీరః॥** 29

**ప్రతిపదార్థము :** నాడీషు=నాడులయందు, నదీఃచ=నదులును, నఖేషు=గోళ్ళయందు, శిలాః =శిలలను, బుద్ధౌః=బుద్ధియందు, అజమ్=బ్రహ్మదేవుని, ప్రాణేషు=ఇంద్రియములందు, దేవగణాన్, ఋషీన్ చ=దేవగణములను, ఋషులను, గాత్రే=శరీరమునందు, స్థిరజఙ్గమాని= స్థావర జంగములను, సర్వాణి=సమస్త, భూతాని=జీవరాశిని, వీరః=వీరుడగు బలిచక్రవర్తి, దదర్శ=దర్శించెను.

శ్లో॥ **సర్వాత్మనీదం భువనం నిరీక్ష్య సర్వేఽసురాః కశ్మలమాపురఙ్గ।**
**సుదర్శనం చక్రమసహ్యతేజో ధనుశ్చ శార్ఙ్గం స్తనయిత్నుఘోషమ్॥** 30

**ప్రతిపదార్థము :** సర్వాత్మని=సర్వరూపుడైన హరియందు!, ఇదమ్=ఈ, భువనమ్=విశ్వమును, సర్వే+అసురాః=అసురులందఱు, స్తనయిత్ను ఘోషమ్=మేఘము వలె ధ్వనించునదియు, సుదర్శనం చక్రమ్=సుదర్శన చక్రమును, అసహ్యతేజః=సహింపరాని తేజస్సు గల్గిన, శార ఙ్గమ్ ధనుః=శార్ఙ్గమను ధనుస్సును, నిరీక్ష్య=చూచి, కశ్మలమ్=మూర్ఛను, ఆపుః=పొందిరి.

శ్లో॥ **పర్జన్యఘోషో జలజః పాఞ్చజన్యః కౌమోదకీ విష్ణుగదా తరస్వినీ।**
**విద్యాధరోఽసిః శతచన్ద్రయుక్తస్తూణోత్తమావక్షయసాయకౌ చ॥** 31

**ప్రతిపదార్థము :** పర్జన్యఘోషః=మేఘమువలె గంభీర నాదము గలది, జలజః=నీటి నుండి ఉద్భవించినదియగు, పాంచజన్యః=పాంచజన్యమను శంఖము, తరస్వినీ=అతి వేగముగలదైన, కౌమోదకీ=కౌమోదకి యను, విష్ణుగదా=విష్ణువు గద, విద్యాధరః+అసిః=విద్యాధరమను ఖడ్గము, శతచన్ద్రయుక్తః=శతచన్ద్రయుక్తమగు, తూణోత్తమావక్షయసాయకౌ=అక్షయ సాయకములను రెండు అమ్ములపొదులు, చ=మఱియు,

శ్లో॥ **సునన్దముఖ్యా ఉపతస్థురీశం పార్షదముఖ్యాః సహలోకపాలాః।**
**స్ఫురత్కిరీటాఙ్గదమీనకుణ్డలః శ్రీవత్సరత్నోత్తమమేఖలామ్బరైః॥** 32

**ప్రతిపదార్థము :** సహలోకపాలాః=లోకపాలురతో పాటు, సునన్దముఖ్యాః=సునందుడు లోనగు, పార్షదముఖ్యాః=పార్షదముఖ్యులు, ఈశమ్=శ్రీవామన భగవానుని, ఉపతస్థుః=స్తుతింపసాగిరి. స్ఫురత్+కిరీట+అఙ్గద-మీన కుణ్డలః=ప్రకాశించు కిరీటముతోను, భుజకీర్తులతోను, మత్స్యాకృతిగల కుండలములుగలవాడును శ్రీ... మేఖల+అమ్బరైః=శ్రీవత్స కౌస్తుభముతోను, పీతాంబరముతోను...మఱి



శ్లో॥ **మధువ్రతస్రగ్వనమాలయా వృతో రరాజ రాజన్ భగవానురుక్రమః।**
**క్షితం పదైకేన బలేర్విచక్రమే నభః శరీరేణ దిశశ్చ బాహుభిః॥** 33

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, మధువ్రతస్రగ్వనమాలయా=భ్రమరపంక్తిచే విరాజిల్లు వనమాలతోను, ఆవృతః=విభూషితుడై, రరాజ=దేదీప్యమానముగ ప్రకాశింపసాగెను. భగవాన్ =భగవానుడు, ఉరుక్రమః=విరాట్ స్వరూపుడగు శ్రీవామనుడు, పదైకేన=ఒకయడుగుతో, బలేః=బలిచక్రవర్తియొక్క, క్షితిమ్=భూమిని, శరీరేణ=శరీరముతో, నభః=ఆకాశమండల మును, బాహుభిః=భుజములచే, దిశఃచ=దిక్కులను కూడ, విచక్రమే=ఆక్రమించెను.

శ్లో॥ **పదం ద్వితీయం క్రమతస్త్రివిష్టపం న వై తృతీయాయ తదీయమణ్వపి।**
**ఉరుక్రమస్యాఙ్ఘ్రిరుపర్యుపర్యథో మహర్జనాభ్యాం తపసః పరం గతః॥** 34

**ప్రతిపదార్థము :** క్రమతః=క్రమముగా, పదమ్ ద్వితీయమ్=రెండవ పాదముతో, త్రివిష్టపమ్=స్వర్గమును ఆక్రమించెను. తదీయమ్=తనదగు, అణు+అపి=అణుమాత్రము, తృతీయమ్=మూడవ పద విన్యాసము కొఱకు, న వై=స్థానము కూడ లేకపోయెను. అథో=అటు పిమ్మట, ఉరుక్రమస్య=భగవానుని యొక్క, అంఘ్రిః=పాదము, ఉపరి+ఉపరి= పైపైకి, మహః =మహర్లోకమునకు, జనాభ్యామ్=జనలోకమునకు, తపసః=తపోలోకమునకు, పరమ్=పరమైన సత్యలోకమును గూర్చి, గతః=పోయినది.

*ఇతి శ్రీమద్భాగవతమహాపురాణే అష్టమస్కన్ధే విశ్వరూపదర్శనం నామ వింశో - ధ్యాయః*

*ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున*
*విశ్వరూపదర్శనమను వింశాధ్యాయము.*

శ్లో॥ తానభిద్రవతో దృష్ట్వా దితిజానీకపాన్ నృప। 15

శ్లో॥ ప్రహస్యానుచరా విష్ణోః ప్రత్యషేధన్నుదాయుధాః।
నన్దస్సునన్దోఽథ జయో విజయః ప్రబలోద్బలౌ॥ 16

శ్లో॥ కుముదః కుముదాక్షశ్చ విష్వక్సేనః పతత్త్రిరాట్।
జయన్తః శ్రుతదేవశ్చ పుష్పదన్తోఽథ సాత్వతః॥ 17

**ప్రతిపదార్థము :** నృప!=పరీక్షిణ్మహారాజా!, అభిద్రవతః=వామనునివైపుకు పరుగున వచ్చుచున్న, తాన్=ఆ, దితిజానీకపాన్=రాక్షస శ్రేష్ఠులను, దృష్ట్వా=చూచి, ప్రహస్య=నవ్వి, ఉదాయుధా=ఆయుధములను ఎత్తినవారై, విష్ణోః=విష్ణువునకు, అనుచరాః=అనుచరులయిన, నందః=నందుడను, సునందః=సునందుడు, అథ=తరువాత, జయః=జయుడు, విజయః =విజయుడు, ప్రబల=ప్రబలుడు, ఉద్బలౌ=ఉద్బలుడు, కుముదః=కుముదుడు, కుముదాక్షశ్చ =కుముదాక్షుడు, విష్వక్సేనః=విష్వక్సేనుడు, పతత్త్రిరాట్=గరుత్మంతుడు, జయంతః =జయంతుడు, శ్రుతదేవశ్చ=శ్రుతదేవుడు, పుష్పదంతః=పుష్పదంతుడు, అథ=మఱియు, సాత్త్వతః=సాత్త్వతుడు, ప్రత్యషేధన్=రాక్షసులను నివారించిరి.

**తాత్పర్యము :** వామనుని పైకి వచ్చుచున్న రాక్షసులను చూచి విష్ణువు పార్షదులు నందసునంద జయవిజయులు మొ॥వారు 14మంది ఆయుధధారులై ఎదుర్కొనిరి.

శ్లో॥ సర్వే నాగాయుతప్రాణాః చమూ స్తే జఘ్నురాసురీః।
హన్యమానాన్ స్వకాన్ దృష్ట్వా పురుషానుచరైర్బలిః॥ 18

శ్లో॥ వారయామాస సంరబ్ధాన్ కావ్యశాపమనుస్మరన్॥ 19

**ప్రతిపదార్థము :** నాగాయుత=పదివేల ఏనుగుల, ప్రాణాః=బలంకల, తే=ఆ, సర్వే=విష్ణు భటులందఱు, ఆసురీః=రాక్షస సంబంధమయిన, చమూః=సేనలను, జఘ్నుః=చంపిరి. బలిః =బలిచక్రవర్తి, పురుషానుచరైః=పురుషోత్తముని అనుచరుల చేత, హన్యమానాన్= చంపబడుచున్న, స్వకాన్=తనవారిని, దృష్ట్వా=చూచి, కావ్యశాపమ్=శుక్రాచార్య శాపమును, అనుస్మరన్=తలంచుచు, సంరబ్ధాన్=సన్నద్ధులయిన తమవారిని, వారయామాస=నివారించెను. (కావ్యః=పుంలింగమున శుక్రాచార్యుడని అర్థము.)

**తాత్పర్యము :** మహాబలులయిన విష్ణుపారిషదులు రాక్షస సేనలనుదునుమాడిరి. పురుషోత్తముని అనుచరులచేతిలో మరణించుచున్న తమవారిని చూచిన బలి చక్రవర్తి తనకు తగులుచున్న శుక్రశాపప్రభావమును తలచికొని రాక్షసవీరులను వారించెను.

**బలిరువాచ :** బలి వచించెను.

శ్లో॥ హే విప్రచిత్తే! హే రాహో! హే హేతే! శ్రూయతాం వచః।
మా యుధ్యత నివర్తధ్వం న నః కాలోఽయ మర్థకృత్॥ 20

**ప్రతిపదార్థము :** హే విప్రచిత్తే!=ఓ విప్రచిత్తీ, హే రాహో!=ఓ రాహూ, హే హేతే!=ఓ హేతీ!, వచః=నామాట, శ్రూయతామ్=వినబడుగాక!, మా యుధ్యత=యుద్ధము చేయవలదు. నివర్తధ్వమ్=మఱలండి, అయమ్=ఈ, కాలః=కాలము, నః=మనకు, అర్థకృత్=ప్రయోజనకారి అయినది, న=కాదు.



**తాత్పర్యము :** కర్మలభ్యముకాని బ్రహ్మలోకము శ్రీ విష్ణుపాదస్మరణ లభ్యము. అలా ఆ చరణానుగ్రహంతో బ్రహ్మలోకం చేరిన వారందరూ ఆ చరణానికి నమస్కరించారు. బ్రహ్మ స్వయంగా ఆ ఊర్ధ్వముఖమయిన విష్ణుపాదానికి అర్ఘ్యం ఇచ్చి స్వాగతం చెప్పాడు.

శ్లో॥ సమర్చ్య భక్త్యాభ్యగృణాత్ శుచిశ్రవా।
యన్నాభిపఙ్కేరుహసమ్భవః స్వయమ్॥ 4

**ప్రతిపదార్థము :** స్వయమ్=స్వయముగా, యత్=ఏ విష్ణువు యొక్క, నాభిపంకేరుహ=నాభి కమలమునందు, సంభవః=పుట్టిన, శుచిశ్రవాః=బ్రహ్మ, సమర్చ్య=ఆ పాదమును పూజించి, భక్త్యా=భక్తితో, అభ్యగృణాత్=స్తుతించెను.

**తాత్పర్యము :** స్వయంగా విష్ణునాభికమలగర్భసంభవుడయిన బ్రహ్మ విష్ణుచరణమును అర్చించి భక్తితో స్తుతించెను.

శ్లో॥ ధాతుః కమణ్డలుజలం తదురుక్రమస్య పాదావనేజనపవిత్రతయా నరేన్ద్ర!
స్వర్ధున్యభూన్నభసి సమ్ప్రతి నిర్మమార్ష్టి లోకత్రయం భగవతో విశదేవ కీర్తిః॥ 5

**ప్రతిపదార్థము :** నరేంద్ర!=పరీక్షిన్మహారాజా!, ఉరుక్రమస్య=ఆ త్రివిక్రముని యొక్క, పాద= పాదములను, అవనేజన=కడుగుటచే, పవిత్రతయా=పవిత్రమగుటచే, తత్=ఆ, ధాతుః=బ్రహ్మ యొక్క, కమండలుజలమ్=కమండలూదకము, నభసి=ఆకాశమున, స్వర్ధునీ=ఆకాశగంగగా, అభూత్=అయ్యెను. సంప్రతి=ఇప్పుడు, భగవతః=భగవానుని యొక్క, విశదా=స్వచ్ఛమయిన, కీర్తిః ఇవ=కీర్తివలె, లోకత్రయమ్=ముల్లోకములను, నిర్మమార్ష్టి=పవిత్రం చేస్తున్నది.

**తాత్పర్యము :** కమండలువుతో బ్రహ్మ కడిగిన పాదము నుంచి జాలువాఱిన ఆ పవిత్ర జలము ఆకాశగంగగా ప్రవహించి స్వచ్ఛమయిన విష్ణుకీర్తివలె లోకత్రయమును నేడు పవిత్రం చేస్తున్నది.

శ్లో॥ బ్రహ్మాదయో లోకనాథాః స్వనాథాయ సమాదృతాః।
సానుగా బలిమాజహ్రుః సంక్షిప్తాత్మవిభూతయే॥ 6

**ప్రతిపదార్థము :** బ్రహ్మాదయః=బ్రహ్మ మొదలగు, లోకనాథాః=లోకపాలకులు, సమాదృతాః =ఆదరంగలవారై, సానుగాః=అనుచర సమేతులై, సంక్షిప్త=ఉపసంహరించిన, ఆత్మవిభూతయే =త్రివిక్రమావతారంగల, స్వనాథాయ=తమ ప్రభువయిన వామనుని కొఱకు, బలిమ్=పూజను, ఆజహ్రుః=అర్పించిరి.

**తాత్పర్యము :** త్రివిక్రమావతారం ఉపసంహరించిన "వామనావతారుడయిన" హరికి బ్రహ్మాది లోకపాలకులు సమాదరంతో పూజను గావించిరి.

శ్లో॥ తోయైః సమర్హణైః స్రగ్భిః దివ్యగన్ధానులేపనైః।
ధూపదీపైః సురభిభిర్లాజాక్షతఫలోత్తమైః॥ 7

శ్లో॥ స్తవనైః జయశబ్దైశ్చ తద్వీర్యమహిమాఙ్కితైః।
నృత్తవాదిత్రగీతైశ్చ శఙ్ఖదున్దుభినిస్స్వనైః॥ 8

**ప్రతిపదార్థము :** తోయైః=నీటితోను, సమర్హణైః=పూజలతోను, స్రగ్భిః=దండలతోను,

దివ్యగంధ=చందనగంధముల యొక్క, అనులేపనైః=పూతలతోను, ధూపదీపైః=ధూప దీపములతోను, సురభిభిః=సుగంధద్రవ్యములతోను, లాజ=పేలాలతోను, అక్షత=అక్షతల తోను, ఫలోత్తమైః=మంచి పండ్లతోను, స్తవనైః=స్తోత్రములతోను, తద్వీర్య=హరిపరాక్రమము యొక్క, మహిమ=మహిమలతో, అంకితైః=గుర్తింపబడిన, జయశబ్దైఃచ=జయజయ ధ్వనులతోను, నృత్త=నృత్యములతోను, వాదిత్ర=వాద్యములతోను, గీతైశ్చ=పాటలతోను, శంఖ=శంఖములయొక్క, దుందుభి=దుందుభుల యొక్క, నిస్స్వనైః=ధ్వనులతోను పూజ చేసిరి.

**తాత్పర్యము :** బ్రహ్మాది లోకపాలకులు అర్ఘ్యపాద్యములతో, మాలికలతో, దివ్యచందన గంధాలతో, ధూపదీపాలతో, పేలాలతో, అక్షతలతో, ఫలములతో, జయజయధ్వనులతో, స్తోత్రములతో, నృత్యవాద్యగానములతో, శంఖదుందుభినాదాలతో వామనునికి అర్చన గావించిరి.

**శ్లో॥ జామ్బవానృక్షాధిపతిః భేరీశబ్దైర్మనోజవః।**
**విజయం దిక్షు సర్వాసు మహోత్సవమఘోషయత్॥** 9

**ప్రతిపదార్థము :** ఋక్షాధిపతిః=ఎలుగుబంటి నాయకుడైన, జాంబవాన్=జాంబవంతుడు, మనోజవః=మనోవేగం గలవాడయి, సర్వాసు=అన్ని, దిక్షు=దిక్కులయందు, భేరీశబ్దైః=భేరీ భాంకారములతో, విజయమ్=వామన విజయమును, మహోత్సవమ్=గొప్ప ఉత్సవముగా, అఘోషయత్=దండోరా వేయించెను.

**తాత్పర్యము :** ఋక్షరాజు జాంబవంతుడు మనోవేగంతో పర్యటించి సమస్తదిక్కులందు వామనవిజయోత్సవమును భేరీశబ్దములతో ఘోషించెను.

**శ్లో॥ మహీం సర్వాం హృతాం దృష్ట్వా త్రిపదవ్యాజయాచ్ఞయా।**
**ఊచుః స్వభర్తురసురా దీక్షితస్యాత్యమర్షితాః॥** 10

**ప్రతిపదార్థము :** అసురాః=రాక్షసులు, దీక్షతస్య=యజ్ఞదీక్షితుడయిన, స్వభర్తుః=తమ ప్రభువయిన 'బలి' చక్రవర్తి యొక్క, సర్వామ్=సమస్తమయిన, మహీమ్=భూమిని, త్రిపద="3" అడుగులు అనే, వ్యాజ=వంకగల, యాచ్ఞ(చ్న)యా=యాచనతో, హృతామ్=హరింపబడిన దానినిగా, దృష్ట్వా=చూచి, అత్యమర్షితాః=అతిరోషంగలవారయి, ఊచుః=ఇట్లనిరి.

**తాత్పర్యము :** '3' అడుగుల భూదానం అనే వంకతో సమస్తభూమిని హరించిన 'వామనుని' చూచి మహారోషంతో రాక్షసులు బలిచక్రవర్తితో ఇట్లనిరి.

**దైత్యా ఊచుః :** దైత్యులు ఇట్లనిరి.

**శ్లో॥ న వా అయం బ్రహ్మబన్ధుర్విష్ణుర్మాయావినాం వరః।**
**ద్విజరూపప్రతిచ్ఛన్నో దేవకార్యం చికీర్షతి॥** 11

**ప్రతిపదార్థము :** అయమ్=ఇతడు, బ్రహ్మబంధుః=బ్రాహ్మణుడు, నవా=కాడేమో?, మాయావినామ్=మాయావంతులలో, వరః=శ్రేష్ఠుడయిన, విష్ణుః=విష్ణువు కావచ్చును. ద్విజరూప=బ్రాహ్మణ రూపముతో, ప్రతిచ్ఛన్నః=కప్పివేయబడినవాడై, దేవకార్యమ్=దేవతల యొక్క పనిని, చికీర్షతి=చేయగోరు చున్నాడు.



**తాత్పర్యము :** ఈ బ్రాహ్మణుడు మాయావియైన విష్ణువు అయి ఉండును. సాధారణ బ్రాహ్మణ దుర్మార్గుడు కాడు. బ్రాహ్మణ వేషం దాల్చి విష్ణువే దేవకార్యం నెరవేర్చుటకు వచ్చినట్లున్నాడు.

**శ్లో॥ అనేన యాచమానేన శత్రుణా వటురూపిణా।**
**సర్వస్వం నో హృతం భర్తుః న్యస్తదణ్డస్య బర్హిషి॥** 12

**ప్రతిపదార్థము :** శత్రుణా=శత్రువు అయిన, వటురూపిణా=బ్రహ్మచారిరూపం దాల్చిన, అనేన=ఈ, యాచమానేన=యాచకుని చేత, బర్హిషి=దర్భయందు/యజ్ఞమునందు, న్యస్తదండస్య=దండాధి కారమును దించి ఉంచిన, నః=మన, భర్తుః=యజమాని అయిన బలిచక్రవర్తి యొక్క, సర్వస్వమ్=సమస్త ధనము, హృతమ్=హరింపబడినది.

**తాత్పర్యము :** మన శత్రువు అయిన 'హరి' బ్రహ్మచారి రూపముతో యాచన వంకతో మన ప్రభువు నుండి సర్వస్వం అపహరించాడు. ప్రభువు యజ్ఞం కారణంగా ఇతనిని దండించే స్థితిని సన్యసించి యున్నాడు.

**శ్లో॥ సత్యవ్రతస్య సతతం దీక్షితస్య విశేషతః।**
**నానృతం భాషితుం శక్యం బ్రాహ్మణస్య దయావతః।**
**తస్మాదస్య వధో ధర్మో భర్తుః శుశ్రూషణం చ నః॥** 13

**ప్రతిపదార్థము :** సతతమ్=నిత్యము, సత్యవ్రతస్య=సత్యవ్రతము చేపట్టినవాడును, విశేషతః =ప్రత్యేకముగా, దయావతః=దయగలవాడును, బ్రాహ్మణస్య=బ్రాహ్మణుడును అయిన మన చక్రవర్తికి, అనృతమ్=అబద్ధము, భాషితుమ్=పల్కుటకు, నశక్యమ్=శక్యము కాదు గదా! తస్మాత్=కనుక, అస్య=ఈ వటువు యొక్క, వధః=హత్య, నః=మనకు, ధర్మః=ధర్మము, భర్తృ=యజమాని యొక్క, శుశ్రూషణఇ్చ=సేవగూడా అగును.

**తాత్పర్యము :** మన ప్రభువు నిత్యసత్యవ్రతుడు, యజ్ఞ దీక్ష పూనినవాడు. పైగా దయావంతుడు. బ్రాహ్మణుడు (లేదా బ్రాహ్మణులపై దయగలవాడు). ఇతను అబద్ధమాడలేడు, కనుక మనమే ఈ వటువును వధించాలి. అదే మనకు ధర్మం. ప్రభుసేవ.

**శ్లో॥ ఇత్యాయుధాని జగృహుః బలేరనుచరాసురాః।**
**తే సర్వే వామనం హన్తుం శూలపట్టిశపాణయః।**
**అనిచ్ఛంతో బలే రాజ్ఞాం ప్రాద్రవఞ్జాతమన్యవః॥** 14

**ప్రతిపదార్థము :** ఇతి=అని, బలేః=బలి యొక్క, అనుచర=అనుచరులయిన, అసురాః =రాక్షసులు, ఆయుధాని=ఆయుధములను, జగృహుః=గ్రహించిరి. తే సర్వే=వారందఱు, బలేః=బలియొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, అనిచ్ఛంతః=కోరనివారై, శూల=శూలములు, పట్టిశ= పట్టాకత్తులు, పాణయః=చేపట్టినవారై, వామనమ్=వామనుని, హంతుమ్=చంపుటకు, జాతమన్యవః=క్రోధావేశపరులై, ప్రాద్రవన్=పరుగెత్తిరి.

**తాత్పర్యము :** బలి అనుచరులయిన రాక్షసులు ఆయుధాలు స్వీకరించారు. వారంతా శూలాలు, పట్టాకత్తులు చేపట్టి, బలి ఆజ్ఞతో పనిలేకుండా వామనుని చంపుటకు పరుగెత్తుకొని వచ్చిరి.

**తాత్పర్యము :** బలి చక్రవర్తీ! సూర్యచంద్రకిరణాలు సోకినంతమేఱ అగ్నిపర్జన్యులు వర్షించినంతమేఱ నీ భూమి మొత్తం నేను ఒక పాదముతో కొలిచితిని, దిక్కులు, ఆకాశము నా శరీరముతో నిండినవి. నీవు చూచుచుండగనే '2'వ పాదముతో స్వర్గమును కొలిచితిని.

**శ్లో॥ ప్రతిశ్రుతమదాతుస్తే నిరయం వాస ఇష్యతే।**
**విశ త్వం నిరయం తస్మాద్గురుణా చానుమోదితః॥** 33

**ప్రతిపదార్థము :** ప్రతిశ్రుతమ్=వాగ్దానము చేయబడినదానిని, అదాతుః=ఇవ్వని, తే=నీకు, నిరయమ్=నరకము, వాసః=నివాసముగా, ఇష్యతే=ఇష్టమగును, తస్మాత్=అందువలన, గురుణా చ=నీ గురువయిన శుక్రాచార్యుని చేత, అనుమోదితః=అంగీకరింపబడినవాడవై, నిరయమ్=నరకమును, త్వమ్=నీవు, విశ=ప్రవేశింపుము.

**తాత్పర్యము :** బలిరాజా! నీవు వాగ్దానము చేసిన '3'వ అడుగు కనబడుటలేదు. వాగ్దానం చేసి ఎగగొట్టిన పాపమునకు ఫలంగా నీవు నరకంలో ఉండవలసి యుండును. అందుకు నీ గురుశాపము గూడా ఆమోదించుచున్నది.

**శ్లో॥ వృథా మనోరథస్తస్య దూరః స్వర్గః పతత్యధః।**
**యోఽర్థినేఽర్థం ప్రతిశ్రుత్య నాలం తదుపపాదనే॥** 33

**ప్రతిపదార్థము :** యః=ఎవడు, అర్థినే=యాచకునకు, అర్థమ్=ధనమును, ప్రతిశ్రుత్య=అంగీకరించి, తత్=ఆ ధనము యొక్క ఉపపాదనే=చేకూర్చుట యందు, నాలమ్=శక్తుడు కాదో, తస్య=అతనియొక్క మనోరథః=కోరిక, వృథా=వ్యర్థము. స్వర్గః=స్వర్గము, దూరః =అతనికి దూరమగును. అధః=అధోలోకమునందు, పతతి=పడును.

**తాత్పర్యము :** యాచకునకు వాగ్దానము చేసిన విషయమున పూర్తిగా నెరవేర్చుటకు అశక్తుడయినవానికి కోరికలు వ్యర్థమగును. స్వర్గము దూరమగును. అతడు అధోలోకమున పడును.

**శ్లో॥ విప్రలబ్ధో దదామీతి త్వయాహం చాఢ్యమానినా।**
**తదలీకఫలం భుఙ్క్ష్వ నిరయే కతిచిత్సమాః॥** 35

**ప్రతిపదార్థము :** ఆఢ్యమానినా=ఐశ్వర్యగర్వి అయిన, త్వయా=నీచేత, అహమ్=నేను, దదామీతి=ఇచ్చెదనని, విప్రలబ్ధః=మోసగింపబడితిని. తత్=కనుక, నిరయే=నరకమునందు, కతిచిత్=కొన్ని, సమాః=సంవత్సరములు, అలీకఫలమ్=అసత్య ఫలమును, భుఙ్క్ష్వ=అనుభవింపుము.

**తాత్పర్యము :** ఏదో ఐశ్వర్యవంతుడనన్న నమ్మకంతో ఏమడిగినను ఇచ్చెదనని పలికి చివఱకు నేను గోరిన భూమి ఇవ్వలేక అశక్తుడవు అయితివి. ఈ వాగ్దానభంగమునకు నీవు కొన్ని సంవత్సరములు నరకమునందు గడపుము.

*ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున*
*ఏకవింశ(21) అధ్యాయము సమాప్తము.*



**తాత్పర్యము :** ఓ విప్రచిత్తీ! ఓ రాహూ, ఓ హేతీ! నా మాట వినండి. యుద్ధము వద్దు. వెనుకకు రండి. ఇది మనకు అనుకూలమయిన సమయము కాదు.

**శ్లో॥ యః ప్రభుః సర్వభూతానాం సుఖదుఃఖోపపత్తయే।**
**తం నాతివర్తితుం దైత్యాః పౌరుషైరీశ్వరః పుమాన్॥** 21

**ప్రతిపదార్థము :** దైత్యాః!=ఓ రాక్షసులారా!, సర్వభూతానామ్=సమస్తభూతములయొక్క సుఖదుఃఖ=సుఖదుఃఖముల యొక్క, ఉపపత్తయే=సంభవమునకు, యః=ఎవడు, ప్రభుః=సర్వాధికారియో, తమ్=ఆ ప్రభువును (కాలస్వరూపుని), పౌరుషైః=పురుషకారములతో, అతివర్తితుమ్=ఉల్లంఘించుటకు, పుమాన్=వ్యక్తి, న ఈశ్వరః=సమర్థుడు కాడు.

**తాత్పర్యము :** సమస్తజీవులసుఖదుఃఖాలకు కారణమయిన 'కాలపురుషుడు' మనకు ప్రస్తుతం ఎదురు తిరిగి ఉన్నాడు. పురుషకారంతో ఆతనిని మనం ఎవరము ఉల్లంఘింపలేము.

**శ్లో॥ యో నో భవాయ ప్రాగాసీదభావాయ దివౌకసామ్।**
**స ఏష భగవానద్య వర్తతే తద్విపర్యయమ్॥** 22

**ప్రతిపదార్థము :** యః=ఏ, భగవాన్=భగవానుడు, ప్రాక్=పూర్వం, నః=మన యొక్క, భవాయ=నిలుకడకు, దివౌకసామ్=దేవతల యొక్క, అభావాయ=లేకపోవుటకు, ఆసీత్=కారణమయ్యెనో, స ఏష భగవాన్=ఆ యీ భగవంతుడు, అద్య=నేడు, తద్విపర్యయమ్=అందుకు విరుద్ధముగా, వర్తతే=ఉన్నాడు.

**తాత్పర్యము :** పూర్వం మన విజయానికి, దేవతల పరాజయానికి ఏ మహాప్రభువు కారణమో ఆ కాలపురుషుడు నేడు అందుకు విరుద్ధముగా మన పరాజయానికి దేవతల విజయానికి అనుకూలంగా నిలిచి ఉన్నాడు.

**శ్లో॥ బలేన సచివైః బుద్ధ్యా దుర్గైః మన్త్రౌషధాదిభిః।**
**సామాదిభిరుపాయైశ్చ కాలం నాత్యేతి వై జనః॥** 23

**ప్రతిపదార్థము :** బలేన=బలముచేత, సచివైః=మంత్రుల చేత, బుద్ధ్యా=బుద్ధిచేత, దుర్గైః =దుర్గముల చేత, మంత్ర=మంత్రముల చేత, ఔషధాదిభిః=ఔషధము మొ॥వానిచేత, సామాదిభిః=సామము మొ॥, ఉపాయైశ్చ=ఉపాయముల చేతను, జనః=వ్యక్తి, కాలమ్=కాలమును, నాత్యేతి వై=అతిక్రమింపలేడు గదా!

**తాత్పర్యము :** బలంకాని, బుద్ధికాని, మంత్రులుకాని, దుర్గమంత్ర ఔషధములు కాని సామాది ఉపాయములు కాని ఆసరా చేసుకొని దురదృష్టకాలమును దాటలేము. అది అనుభవించి తీఱవలసినదే.

**శ్లో॥ భవద్భిః నిర్జితా హ్యేతే బహుశోఽనుచరా హరేః।**
**దైవేనేద్ధైః త ఏవాద్య యుధి జిత్వా నదన్తి నః॥** 24

**ప్రతిపదార్థము :** హరేః=విష్ణువునకు, అనుచరాః=అనుచరులయిన, ఏతే=ఈ నందసునందాదులు, బహుశః=చాలాసార్లు, దైవేన=అదృష్టము చేత, ఇద్ధైః=బలపడిన, భవద్భిః =మీచేత, నిర్జితాహి=జయింపబడినవారే కదా!, త ఏవ=అటువంటివారే, అద్య=నేడు, నః =మనలను, యుధి=యుద్ధమునందు, జిత్వా=జయించి, నదంతి=గర్జించుచున్నారు.

**తాత్పర్యము :** ఇంతకు ముందు అదృష్టం అనుకూలించినపుడు మీచేతిలో పలుమార్లు ఓడిన యీ విష్ణుసేన నేడు మిమ్ములను జయించి గర్జిస్తున్నది. ఇది కాల మహిమ.

**శ్లో॥ ఏతాన్ వయం విజేష్యామో యది దైవం ప్రసీదతి।**
**తస్మాత్కాలం ప్రతీక్షధ్వం యో నోఽర్థత్వాయ కల్పతే॥ 25**

**ప్రతిపదార్థము :** దైవమ్=అదృష్టము, యది ప్రసీదతి=అనుగ్రహించినట్లయితే, వయమ్=మనము, విజేష్యామః=గెలువగలము, తస్మాత్=కనుక, యః=ఏ కాలము, నః=మనకు, అర్థత్వాయ=ప్రయోజనం అగుటకు, కల్పతే=సరిపోవునో, కాలమ్=అటువంటి కాలమును గూర్చి, ప్రతీక్షధ్వమ్=ఎదురు చూడండి.

**తాత్పర్యము :** అదృష్టం కలసివస్తే తప్పక మనం వీరిని జయించగలము. కనుక మనకు ప్రయోజనదాయకమయిన కాలం కోసం ఎదురుచూడండి.

**శ్రీ శుక ఉవాచ :** శుకమౌని వచించెను.

**శ్లో॥ పత్యుర్నిగదితం శ్రుత్వా దైత్యదానవయూథపాః।**
**రసాన్నివివిశూ రాజన్ విష్ణుపారిషదార్దితాః॥ 26**

**ప్రతిపదార్థము :** రాజన్!=మహారాజా!, పత్యుః=ప్రభువయిన బలియొక్క, నిగదితమ్=వచనమును, శ్రుత్వా=విని, దైత్యదానవ యూథపాః=రాక్షస సేనాపతులు, విష్ణు=విష్ణువు యొక్క, పారిషద=పార్షదుల చేత, అర్దితాః=బాధింపబడినవారై, రసామ్=పాతాళమును, నివివిశూః=ప్రవేశించిరి.

**తాత్పర్యము :** దైత్యదానవ సైనికులు సేనాపతులు విష్ణుభటులచేతిలో ఓడి, తమ ప్రభువాజ్ఞను శిరసావహించి పాతాళమునకు చేరిరి.

**శ్లో॥ అథ తార్క్ష్యసుతో జ్ఞాత్వా విరాట్ ప్రభుచికీర్షితమ్।**
**బబన్ధ వారుణైః పాశైః బలిం సుత్యేఽహని క్రతౌ॥ 27**

**ప్రతిపదార్థము :** అథ=తరువాత, తార్క్ష్యసుతః=తార్క్ష్యవంశీయుడయిన, విరాట్=పక్షి నాయకుడయిన గరుత్మంతుడు, ప్రభు=విష్ణువు యొక్క, చికీర్షితమ్=సంకల్పమును, జ్ఞాత్వా=తెలిసికొని, క్రతౌ=యజ్ఞమునందు, సుత్యే అహని=సోమహోమము చేయు రోజున, వారుణైః=వరుణ సంబంధమయిన, పాశైః=పాశముల చేత, బలిమ్=బలిని, బబంధ=బంధించెను.

**తాత్పర్యము :** గరుత్మంతుడు విష్ణుసంకల్పమును అర్థము చేసుకొన్నవాడయి బలి చక్రవర్తిని సోమ హోమము రోజున వారుణ పాశములతో బంధించెను. (విష్ణు సంకల్పం ఇది=సమస్తం అపహరించి యితని మమకారం పోగొట్టాను. ఇక దేహాన్ని అవమానపఱచి బంధించి దేహంలో ఉండే అహంకారాన్ని గూడా పోగొట్టి పరమానుగ్రహం చూపాలి. వీనివంటి సత్యసంధుడు, ధైర్యశాలి మఱొకడు లేడనిపించాలి అని వ్యాఖ్యానంలో ఉంది.)

**శ్లో॥ హాహాకారో మహానాసీత్ రోదస్యోస్సర్వతోదిశమ్।**
**నిగృహ్యమాణేఽసురపతౌ విష్ణునా ప్రభవిష్ణునా॥ 28**

**ప్రతిపదార్థము :** ప్రభవిష్ణునా=ప్రభువయిన, విష్ణునా=విష్ణువుచేత, అసురపతౌ=రాక్షస నాథుడు, నిగృహ్యమాణే=నిగ్రహింపబడుచుండగా, సర్వతోదిశమ్=అన్ని దిక్కుల, రోదస్యోః=భూమ్యాకాశములందు, మహాన్=గొప్ప, హాహాకారః='హా! హా!' అనే ధ్వని, ఆసీత్=అయ్యెను.



**తాత్పర్యము :** శ్రీ మహావిష్ణువు బలిచక్రవర్తిని వారుణపాశములతో నిర్బంధింపజేయగా భూమ్యాకాశములంతటా అన్ని దిక్కులా 'అయ్యో! అయ్యో!' అని ఆక్రోశములు వెలువడినవి.

**శ్లో॥ తం బద్ధం వారుణైః పాశైః భగవానాహ వామనః।**
**నష్టశ్రియం స్థిరం ప్రాజ్ఞముదారయశసం నృప!॥ 29**

**ప్రతిపదార్థము :** నృప!=మహారాజా!, నష్ట=పోయిన, శ్రియమ్=సంపదగలవాడును, స్థిరమ్=అయినను స్థిరచిత్తంగా ఉన్నవాడును, ప్రాజ్ఞమ్=కనుకనే జ్ఞాని అయినవాడును, ఉదారయశసమ్=ఉదార కీర్తిగలవాడును, వారుణైః=వరుణసంబంధమయిన, పాశైః=పాశముల చేత, బద్ధమ్=కట్టివేయబడిన, తమ్=ఆ బలిచక్రవర్తిని గూర్చి, భగవాన్=భగవంతుడయిన వామనుడు, ఆహ=పలికెను.

**తాత్పర్యము :** సంపదపోయినా స్థిరచిత్తంతో జ్ఞానిగా ఉన్న కీర్తిమంతుడయిన వారుణపాశ బద్ధుడయిన ఆ బలి చక్రవర్తితో వామనుడు ఇట్లనెను.

**శ్లో॥ పదాని త్రీణి దత్తాని-భూమేర్మహ్యం త్వయాసుర!।**
**ద్వాభ్యాం క్రాన్తా మహీ సర్వా-తృతీయముపకల్పయ॥ 30**

**ప్రతిపదార్థము :** అసుర!=రాక్షసా!, త్వయా=నీచేత, మహ్యమ్=నా కొఱకు, భూమేః=భూమి యొక్క, పదాని=అడుగులు, త్రీణి='3', దత్తాని=ఇవ్వబడినవి. ద్వాభ్యామ్='2' అడుగుల చేత, సర్వా=సమస్తమయిన, మహీ=భూమి, క్రాంతా=ఆక్రమింపబడినది, తృతీయమ్=మూడవ అడుగు భూమిని, ఉపకల్పయ=సమకూర్చుము.

**తాత్పర్యము :** బలి రాక్షసా! నీవు నాకు 3 అడుగుల నేల యిచ్చెదనని వాగ్దానము చేసితివి. కాని నీ రాజ్యమంతయు 2 అడుగులకు సరిపోయినది. ఇక '3'వ అడుగుకు అవకాశము కల్పింపుము.

**శ్లో॥ యావత్తపత్యసౌ గోభిః యావదిన్దుస్సహోడుభిః।**
**యావదగ్నిస్సపర్జన్యః తావతీ భూరియం తవ॥ 31**

**శ్లో॥ పదైకేన మయా క్రాన్తో భూర్లోకః ఖం దిశస్తనోః।**
**స్వర్లోకస్తు ద్వితీయేన పశ్యతస్తే స్వమాత్మనా॥ 32**

**ప్రతిపదార్థము :** అసౌ=ఆ సూర్యుడు, గోభిః=కిరణములతో, యావత్=ఎంతదాక, తపతి=వెలుగునో, ఇందుః=చంద్రుడు, ఉడుభిః సహ=నక్షత్రములతో, యావత్=ఎంతదాకా వెలుగునో, సపర్జన్యః=పర్జన్యునితో గూడిన, అగ్నిః=అగ్ని, యావత్=ఎంతవఱకు వెలుగునో, తావతీ=అంతవఱకు, తవ=నీయొక్క, ఇయమ్=ఈ, భూః=భూమి కలదు. భూర్లోకః=ఈ భూలోకము, మయా=నాచేత, ఏకేన=ఒకే, పదా=పాదముచేత, క్రాంతః=ఆక్రమింపబడినది, తనోః=శరీరము వలన, ఖమ్=ఆకాశము, దిశః=దిక్కులు ఆక్రమింపబడినవి. తే=నీవు, పశ్యతః=చూచుచుండగా, ఆత్మనా=నాచేత, స్వమ్=నీదయిన, స్వర్లోకస్తు=స్వర్గలోకము గూడా, ద్వితీయేన=రెండవ పాదముచే ఆక్రమింపబడినది.

శ్లో॥ ఇత్థం స నిశ్చిత్య పితామహో మహానగాధబోధో భవతః పదామ్బుజమ్।
ధ్రువం ప్రపేదే హ్యకుతోభయం జనాద్భీతః స్వపక్షక్షపణస్య సత్తమ॥ 10

**ప్రతిపదార్థము :** సత్తమ!=సత్పురుషశ్రేష్ఠా!, ఇత్థమ్=ఈ ప్రకారము, నిశ్చిత్య=నిశ్చయించి, సః=ఆ, పితామహః=మా తాత, మహాన్=దొడ్డవాడు, అగాధబోధః=లోతైన జ్ఞానము గలవాడు, జనాత్=సంసార జనమువలన, భీతః=భయపడి, స్వపక్షక్షపణస్య=తన పక్షమైన దైత్యులను హతమార్చు, భవతః=నీయొక్క, అకుతోభయమ్=అభయప్రదములగు, పదాంబుజమ్=పాద కమలమును, ధ్రువమ్=నిశ్చయముగా, ప్రపేదే=పొందెను.

**తాత్పర్యము :** ఇట్లు నిశ్చయించి మాతాత ప్రహ్లాదుడు దొడ్డవాడు, అపరిమితజ్ఞానము గలవాడు, సంసారజనమువలన భయపడి స్వజనమగు దైత్యులను దునుమాడువాడవైనను అభయ ప్రదమగు నీ పాదకమలమును నిశ్చయముగా శరణుపొందెను.

శ్లో॥ అథాహమప్యాత్మరిపోస్తవాన్తికం దైవేన నీతః ప్రసభం త్యాజితశ్రీః।
ఇదం కృతాన్తాన్తికవర్తి జీవితం యయాధ్రువం స్తబ్ధమతిర్న బుధ్యతే॥ 11

**ప్రతిపదార్థము :** అథ=అందువలన, అహమ్+అపి=నేను గూడ, దైవేన=ఆ ప్రహ్లాదుని అనుగ్రహముచే, ప్రసభమ్=బలాత్కరముగా, త్యాజితశ్రీః=విడిపించిన రాజ్యలక్ష్మిగలవాడనై, ఆత్మరిపోః=స్వజనశత్రువైన, తవ=నీయొక్క, అన్తికమ్=సమీపమునకు, నీతః=కొని రాబడితిని. యయా=ఏ రాచసిరిచే, స్తబ్ధమతిః=మొద్దుబడిన బుద్ధిగలవాడై, ఇదమ్=ఈ, కృతాన్త+అన్తికవర్తి జీవితమ్=మృత్యుసన్నిహితమై వర్తించు తన జీవనమును, ధ్రువమ్=నిశ్చయముగ, న బుధ్యతే= ఎఱుంగనేరదో-

**తాత్పర్యము :** అందువలన నేను గూడ మా తాత అనుగ్రహరూప భాగ్యముచే, రాజ్యలక్ష్మిని గోలుపోయి బలాత్కరముగా మా కులమునకు శత్రువైన నీ చెంతకు చేర్చబడితిని. ఏ రాచసిరిచే బురుషుడు మందమతియై మృత్యువు పొందనున్న ఈ తన జీవితమును గూర్చి నిజముగా నెఱుంగలేకుండును.

శ్రీ శుక ఉవాచ : శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ తస్యేత్థం భాషమాణస్య ప్రహ్లాదో భగవత్ప్రియః।
ఆజగామ కురుశ్రేష్ఠ! రాకాపతిరివోత్థితః॥ 12

**ప్రతిపదార్థము :** కురుశ్రేష్ఠ!=ఓ కురువంశ శ్రేష్ఠుడా!, ఇత్థమ్=ఇట్లు, భాషమాణస్య= సంభాషించుచున్న, తస్య=ఆ బలియున్న చోటికి, భగవత్+ప్రియః=విష్ణు భక్తుడైన, భగవంతునికి ప్రియుడగు, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, ఉత్థితః=ఉదయించిన, రాకాపతిః+ఇవ=పూర్ణచన్ద్రుడు వలె, ఆజగామ=వచ్చెను.

**తాత్పర్యము :** ఇట్లు మాట్లాడుచున్న ఆ బలియున్న చోటికి భగవంతునికి ప్రియుడు, భక్తుడగు ప్రహ్లాదుడు ఉదయించిన పూర్ణచంద్రుడు వలె వచ్చెను.

శ్లో॥ తమిన్ద్రసేనః స్వపితామహం శ్రియా విరాజమానం నలినాయతేక్షణమ్।
ప్రాంశుం పిశఙ్గామ్బరమఞ్జనత్విషం ప్రలమ్బబాహుం సుభగం సమైక్షత॥ 13

**ప్రతిపదార్థము :** ఇంద్రసేనః=ఇంద్రునిసేనవంటి సేనగలవాడైన బలి, తమ్=ఆ వచ్చిన,

## ద్వావింశోఽధ్యాయః

ఈ 22వ అధ్యాయమందు హరి ప్రసన్నుడై బలిని సుతలమున నిలిపి వరముల నొసగి నిశ్చయముగాఁబోయి యతని ద్వారపాలకుడాయెను. బలి తన తనువు విత్తమును నిర్మలమైన అచంచలమైన భక్తిచే తనకు సమర్పించినందున మనశ్చలనము పొంది అవ్యయుడు తన్నే బలికి సమర్పించెను అను విషయము వర్ణింపబడును.

శ్రీ శుక ఉవాచ : శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ ఏవం విప్రకృతో రాజన్-బలిర్భగవతాసురః।
భిద్యమానోఽప్యభిన్నాత్మా-ప్రత్యాహావిక్లబం వచః॥ 1

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, ఏవమ్=ఇట్లు, భగవతా=భగవంతునిచే, అసురః =అసురుడగు, బలిః=బలి, విప్రకృతః=అపకృతి చేయబడినవాడై, భిద్యమానః+అపి=సత్యము నుండి చలింపజేయబడినవాడయ్యు, అభిన్న+ఆత్మా=నిశ్చలచిత్తుడై, అవిక్లబమ్=గంభీరమగు, వచః=వచనమును, ప్రత్యాహ=బదులు చెప్పెను.

**తాత్పర్యము :** భగవంతుడిట్లు తనకపకృతి గావించి సత్యము నుండి చలింపజేయఁజూచినను బలి నిశ్చలచిత్తుడై గంభీరమగు మాటను బదులు చెప్పెను.

శ్రీ బలిరువాచ : బలి వచించెను.

శ్లో॥ యద్యుత్తమశ్లోక! భవాన్మమేరితం వచో వ్యలీకం సురవర్య మన్యతే।
కరోమ్యృతం తన్న భవేత్ప్రలమ్భనం పదం తృతీయం కురు శీర్ష్ణి మే నిజమ్॥ 2

**ప్రతిపదార్థము :** ఉత్తమశ్లోక!=ఓ పుణ్యశ్లోకుడా!, సురవర్య!=ఓ దేవతాశ్రేష్ఠా!, యది=ఒకవేళ, భవాన్=మీరు, మమేరితమ్ వచః=నా ప్రతిజ్ఞను, మిథ్యగ ఇచ్చెదనన్న 3 అడుగుల భూమిని ఇచ్చుట, వ్యలీకమ్=అసత్యముగ, మన్యతే=తలంచినచో, తత్=దానిని, ఋతమ్ =సత్యముగ, కరోమి=చేయుదును. ప్రలంభనమ్=వంచనము, న భవేత్=కాదు, మే=నాయొక్క, శీర్ష్ణి=శీర్షమున, పదమ్ తృతీయమ్=మూడవ పాదమును, నిజమ్=శాశ్వతముగ, కురు= ఉంచుము.

**తాత్పర్యము :** ఓ ఉత్తమశ్లోకుడా! ఓ దేవతాశ్రేష్ఠా! ఒకవేళ మీరు నా ప్రతిజ్ఞను లేనిదిగ, అసత్యముగ, మిథ్యగ తలంచినచో దానిని సత్యముగ చేయుదును. వంచనము కాదు. నా యొక్క శిరస్సున మూడవ పాదమును శాశ్వతముగ ఉంచుము.

శ్లో॥ బిభేమి నాహం నిరయాత్పదచ్యుతో న పాశబన్ధాద్వ్యసనాద్దురత్యయాత్।
నైవార్థకృచ్ఛ్రాద్భవతో వినిగ్రహా దసాధువాదాద్భృశముద్విజే యథా॥ 3

"ఆపదర్థే ధనం రక్షేద్దారాన్..." ఆపదల కొఱకు ధనమును రక్షింపవలెను. ధనము చేత దారలను రక్షింపవలెను. దారలచేతను, ధనముచేతను తన్ను రక్షించుకొనవలెను అను ఆర్యోక్తి వలన ఆత్మభయపరిహారము కొఱకు సర్వస్వమును విడవబడుచున్నది. నీవు మాత్రము కేవల భీతుడవై నిన్ను నీవు రక్షించుకొనకున్నావు. అనగా చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** అసాధువాదాత్=అపకీర్తి వలన, యథా=ఏ ప్రకారము, అహమ్=నేను, భృశమ్=అధికముగా, ఉద్విజే=క్షోభనొందుదునో, అట్లు నేను, నిరయాత్=నరకము వలన, న బిభేమి=భయపడను, పదచ్యుతః=పదభ్రంశము వలన, న బిభేమి=భయపడను, పాశబన్ధాత్=పాశబంధము వలన, న బిభేమి=భయపడను, దురత్యయాత్=దాటరానిదగు, వ్యసనాత్=దుఃఖము వలన, న బిభేమి న ఏవ+అర్థకృచ్ఛ్రాత్=ధనము లేమి వలన భీతిపొందను, భవతః=నీ, వినిగ్రహాత్=నిగ్రహము వలన, న బిభేమి=భీతినొందను.

**తాత్పర్యము :** ఓ భగవంతుడా! నేను అపకీర్తికి భయపడినట్లు నరకమునకుగాని, పదభ్రంశమునకు గాని, పాశబంధమునకు గాని, దాటరానిదగు దుఃఖము వలనగాని, ధనలేమి వలనగాని, నీ నిగ్రహము వలన గాని భీతి నొందను.

**శ్లో॥ పుంసాం శ్లాఘ్యమహం మన్యే-దణ్డమర్హత్తమార్పితమ్।**
**యం న మాతా పితా భ్రాతా-సుహృదశ్చాదిశన్తి హి॥ 4**

ఓయి! నా చేత వలన నీకు అపకీర్తి కలిగినది గదా యందువేని, కలుగలేదను చున్నాడు.

**ప్రతిపదార్థము :** పుంసామ్=పురుషులకు, అర్హత్తమ+అర్పితమ్=అత్యంతము యోగ్యులైన వారిచే విధింపబడిన, దణ్డమ్=శిక్ష, శ్లాఘ్యమ్=ఉత్తమము అని, అహమ్=నేను, మన్యే=తలంచెదను, యమ్=ఏ దండము, మాతా=తల్లి, పితా=తండ్రి, భ్రాతా=సోదరుడు, సుహృదః=మిత్రుడు, న+ఆదిశన్తి=విధింపరో-

**తాత్పర్యము :** పురుషులకు మిక్కిలి యోగ్యులైన వారికి విధింపబడిన శిక్ష ఉత్తమమని నేను తలంచెదను. శాపదండనమును తల్లి, తండ్రి, సోదరుడు, మిత్రుడు విధింపరో అట్టి నీ యీ దండనమును శ్లాఘ్యమనియే తలంతును.

**శ్లో॥ త్వం నూనమసురాణాం నః పారోక్ష్యః పరమో గురుః।**
**యో నోఽనేకమదాన్ధానాం-విభ్రంశం చక్షురాదిశత్॥ 5**

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, అసురాణామ్=అసురులమైన, నః=మాకు, పారోక్ష్యః=పరోక్షముగా, దూరముగా దెలియరాకుండు, పరమః గురుః=పరమ హితకారివి, నూనమ్=నిశ్చయము, యః=ఎవడు, అనేకమదాన్ధానామ్=పెక్కు మదములచే అంధులైన, నః=మా వారికి, విభ్రంశమ్=కోలుపోయిన, చక్షుః=కన్నును, ఆదిశత్=ఇచ్చెనో-

**తాత్పర్యము :** నీవు అసురులకుఁబరోక్షముగా నుండు పరమ గురుతముడవు. మదాంధులై కన్నుగానని పెక్కురసురులకుఁగన్నుల నొసగినవాడవు నీవు.

**శ్లో॥ యస్మిన్ వైరానుబన్ధేన రూఢేన విబుధేతరాః।**
**బహవో లేభిరే సిద్ధిం-యాముహైకాన్తయోగినః॥ 6**

**ప్రతిపదార్థము :** యామ్=ఏ, సిద్ధిమ్=ముక్తిసిద్ధిని, ఏకాన్తయోగినః=అనన్యభక్తులైన యోగులు పొందుదురో, ఆసిద్ధినే యస్మిన్=ఎవనియందు, రూఢేన=నెలకొని, వైర+అనుబన్ధేన=పగ సంబంధముచే, విబుధ+ఇతరాః=సురల కంటె భిన్నులైన అసురులు, బహవః=పెక్కురు, లేభిరే=పొందిరో-



**తాత్పర్యము :** ఏ నీ యందుఁబగంబూని సాధించుచు సురేతరులైన అసురులు, ఏకాంత భక్తులగు యోగులు పొందు మోక్షసిద్ధిని వారు గూడ పొందగలిగిరి.

**శ్లో॥ తేనాహం నిగృహీతోఽస్మి-భవతా భూరికర్మణా।**
**బద్ధశ్చ వారుణై పాశై-ర్నాతివ్రీడే న చ వ్యథే॥ 7**

**ప్రతిపదార్థము :** తేన=ఆ, భవతా=నీ, భూరికర్మణా=గురుతర కర్మచే, అహమ్=నేను, నిగృహీతః=నిగృహీతుడను, అస్మి=అయితిని, వారుణైః పాశైః=వరుణపాశములచే, బద్ధః=బద్ధుడనైన, అహమ్=నేను, న అతివ్రీడే=మిక్కిలి లజ్జను పొందను, న చ వ్యథే=మఱియు వ్యథనుగాని పొందను.

**తాత్పర్యము :** ఆ నీ గురుతర కర్మచే నేను నిగ్రహీతుడనయితిని. వరుణపాశములచే బద్ధుడనైన నేను మిక్కిలి లజ్జను గాని మఱియు వ్యథనుగాని పొందుటలేదు.

**శ్లో॥ పితామహో మే భవదీయసమ్మతః ప్రహ్రాద ఆవిష్కృతసాధువాదః।**
**భవద్విపక్షేణ విచిత్రవైశసం సమ్ప్రాపితస్త్వత్పరమః స్వపిత్రా॥ 8**

ఈ దండన రూపము నీవు నాకు అనుగ్రహించి గావించినదే యగును. కాని నేను నీయనుగ్రహమునకు పాత్రుడను గాను అను ఆశయముతోఁజెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** భవదీయసంమతః=నీకు నీవారికి నీ భక్తులకు సంమతుడు, మే=నాయొక్క, పితామహః=తండ్రి తండ్రి, తాత, ప్రహ్రాదః=ప్రహ్లాదుడు, ఆవిష్కృతసాధువాదః=ప్రకటించిన సద్భక్తిగలవాడు, త్వత్+పరమః=నీవే ఆశ్రయముగా గలవాడు, అతః=ఇందువలన, భవత్+విపక్షేణ=నీకు పగతుడైన, స్వపిత్రా=తన తండ్రియైన హిరణ్యకశిపునిచే, విచిత్రవైశసమ్=సహింపరాని విధమైన హింసను, సంప్రాపితః=పొందినాడు.

**తాత్పర్యము :** నీకును, నీ భక్తులకు సంమతుడైన మా తాత ప్రహ్లాదుడు ప్రకటించిన సద్భక్తి గలవాడై నిన్నే ఆశ్రయముగా గలవాడైనందున నీకు శత్రువైన, తనకు తండ్రియైన హిరణ్యకశిపునిచే సహింపరాని హింసలను బొందినాడు.

**శ్లో॥ కి మాత్మనానేన జహాతి యోఽన్తతః కిం రిక్థహారైః స్వజనాఖ్యదస్యుభిః।**
**కిం జాయయా సంసృతిహేతుభూతయా మర్త్యస్య గేహైః కిమిహాయుషో వ్యయః॥ 9**

**ప్రతిపదార్థము :** మర్త్యస్య=మానవునకు, యః=ఏది, అన్తతః=కడపట, ఆయుర్దాయము చివర, జహాతి=వదలుచున్నదో, అనేన=ఈ, ఆత్మనా=దేహముచే, కిమ్=ఏమి ప్రయోజనము, రిక్థహారైః=ధనమును హరించు పుత్రులతో, స్వజనాఖ్యదస్యుభిః=తన బంధువులను పేరుగల చోరులచే, కిమ్=ఏమి ప్రయోజనము, సంసృతిహేతుభూతయా=సంసార కారణమైయుండు, జాయయా=భార్యతో, కిమ్=ఏమి ప్రయోజనము, గేహైః=గృహములతో, కిమ్=ఏమి ప్రయోజనము, ఇదియంతయు, ఆయుషః వ్యయః=కేవలము ఆయువు వ్యయమే యగును.

**తాత్పర్యము :** ఆయుర్దాయము తీరిన తోడనే విడిపోవు ఈ దేహముచే మానవునకేమి ప్రయోజనము. ధనమును హరించు పుత్రులతో, తన బంధువులను చోరులచేత నేమి ప్రయోజనము. సంసారకారణమై యుండు భార్యతో నేమి ప్రయోజనము. ఈ గృహములచే నేమి ప్రయోజనము. ఇదియంతయు ఆయువును వ్యయము చేయునవి యగును.

లోకములును ఈయబడి, సర్వస్వమ్=సర్వస్వమును, నివేదితమ్=సమర్పింపబడినది. అవిక్లబయా=అమలినమయిన, ధియా=చిత్తముతో, ఆత్మా=దేహము సైతము సమర్పించెను.

**తాత్పర్యము :** ఈ బలి నీకు భూమండలమంతయు నొసగినాడు. తాను పరాక్రమముతో సంపాదించిన లోకములనిచ్చినాడు. తన ధనమంతయు సమర్పించినాడు. చేష్టలుడిగిన బుద్ధితో తన దేహము సయితం సమర్పించినాడు.

**శ్లో॥ యత్పాదయోరచలధీః సలిలం ప్రదాయ దూర్వాఙ్కురైరపి విధాయ సతీం సపర్యామ్।**
**అప్యుత్తమాం గతిమసౌ భజతే త్రిలోకీం దాశ్వానవిక్లవమనాః కథమార్తిమృచ్ఛేత్॥ 23**

**ప్రతిపదార్థము :** అచలధీః=నిశ్చలబుద్ధిగలవాడు, యత్+పాదయోః=ఎవ్వని పాదముల యందు, సలిలమ్=జలమును, ప్రదాయ=సమర్పించి, దూర్వా+అఙ్కురైః+అపి=పచ్చిగరిక మొలకలచే, సతీమ్=ఉత్తమమైన, సపర్యామ్=పూజను, విధాయ=చేసి, అసౌ=ఈ పురుషుడు, అపి+ఉత్తమామ్=మిగుల శ్రేష్ఠమైన, గతిమ్=స్థానము, లభతే=పొందుచున్నాడు. అవిక్లవమనాః =వెఱపులేని మనస్సుగలవాడై, త్రిలోకీమ్=ముల్లోకములను, దాశ్వాన్=ఇచ్చినవాడు, కథమ్= ఎట్లు, ఆర్తిమ్=దుఃఖమును, ఋచ్ఛేత్=పొందును.

**తాత్పర్యము :** నిశ్చల బుద్ధితో నెవడొనొక పురుషుడు నీ పాదములను జలముతోఁగడిగి పచ్చిగరిక మొలకలచే సైతము పూజచేసినవాడు ఉత్తమ స్థానము పొందుచుండగా, ధీరుడై ముల్లోకములను నీకు ధారవోసిన బలిచక్రవర్తి దుఃఖమునెట్లు పొందును.

**శ్రీ వామన ఉవాచ :** శ్రీ వామనుడు వచించెను.

**శ్లో॥ బ్రహ్మన్ యమనుగృహ్ణామి-తద్విశో విధునోమ్యహమ్। (విశః=అర్థాన్)**
**యన్మదః పురుషః స్తబ్ధో-లోకం మాం చావమన్యతే॥ 24**

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=ఓ మహాత్మా!, అహమ్=నేను, యమ్=ఎవని, అనుగృహ్ణామి= అనుగ్రహింతునో, తత్+విశః=వాని ధనమును, విధునోమి=అపహరింతును. యత్+మదః =ఏ అర్థములచే మదముగలవాడైన, పురుషః=పురుషుడు, స్తబ్ధః=బుద్ధిహీనుడై, లోకమ్= లోకమును, మాఞ్చ=నన్నును, అవమన్యతే=అవమానించుచున్నాడు.

**తాత్పర్యము :** ఓయి బ్రహ్మా! నేనెవరిననుగ్రహింతునో వాని ధనము హరింతును. ఏలయన ఏ పురుషుడు ధనముచే మదించినవాడై మందమతియై లోకమును, నన్నును అవమానించు చున్నాడు.

**శ్లో॥ యదా కదాచిజ్జీవాత్మా సంసరన్నిజకర్మభిః।**
**నానాయోనిష్వనీశోऽయం పౌరుషీం గతిమావ్రజేత్॥ 25**

దుర్లభమైన పురుషజన్మమును ఎట్లో కష్టముమీద పొందిన జీవునికి జన్మాది నిమిత్తమైన (వంశాదికము) గర్వము మహా హానికరము. వాని నాశము నాయనుగ్రహము వలననే కలుగుచున్నదనుచున్నాడు - రెండు శ్లోకములలో.

**ప్రతిపదార్థము :** అయమ్=ఈ, జీవాత్మా=జీవుడు, నిజకర్మభిః=తన కర్మలచే, అనీశః =పరతంత్రుడు, నానాయోనిషు=నానా విధములైన క్రిమికీటకాది యోనులయందు, సంసరన్= పుట్టుచుఁజచ్చుచు, యదా కదాచిత్=ఎప్పుడో ఒకప్పుడు, పౌరుషీమ్ గతిమ్=పురుష జన్మమును, ఆవ్రజేత్=పొందుచున్నాడు.



స్వపితామహమ్=తన తాతయగు ప్రహ్లాదుని, శ్రియా=జ్ఞానలక్ష్మిచే, విరాజమానమ్=ప్రకాశించు చున్నవాడు, నలిన+ఆయత+ఈక్షణమ్=తామరరేకులవలె విశాలములైన నేత్రములు గలవాడు, ప్రాంశుమ్=ఉన్నత శరీరియు, పిశంగ+అంబరమ్=పసుపు వన్నె వలువ గలవాడు, అంజనత్విషమ్=కాటుక కాంతిగల మేనువాడు, ప్రలంబబాహుమ్=వ్రేలాడు బాహువులు గలవాడు, సుభగమ్=సుందరుడైన వానిని, సమైక్షత=చూచెను.

**తాత్పర్యము :** ఇంద్రసేనవంటి సేన గలవాడైన బలి, జ్ఞానలక్ష్మిచే విరాజిల్లువాడు, తామర రేకులవలె విశాలములైన కన్నులు గలవాడు, పొడవైన శరీరియు, పసుపువన్నె వలువ గలవాడును, కాటుక ఛాయ మేనివాడు, ఆజానుబాహువులు గలవాడు, సుందరుడైన ప్రహ్లాదుని తన తాతను గాంచెను.

**శ్లో॥ తస్మై బలిర్వారుణపాశయన్త్రితః సమర్హణం నోపజహార పూర్వవత్।**
**ననామ మూర్ధ్నాశ్రువిలోలలోచనః సవ్రీడనీచీనముఖో బభూవ హ॥ 14**

**ప్రతిపదార్థము :** బలిః=బలి, వారుణపాశయన్త్రితః=వరుణపాశములచే కట్టబడినవాడై, పూర్వవత్=ముందుమాదిఱి, తస్మై=ఆ ప్రహ్లాదుని కొఱకు, సమర్హణమ్=పూజను, న+ఉపజహార=సమర్పించలేకపోయెను. మూర్ధ్నా=శిరముతో, ననామ=నమస్కరించెను. అశ్రువిలోలలోచనః=కన్నీటిచే చలించునేత్రములు గలవాడు, సవ్రీడ=తానొనర్చిన అహంకారాది రూపమైన అపరాధముచే సిగ్గుతో గూడి, నీచీనముఖః=క్రిందికి మొగము వంచుకొన్నవాడు, బభూవ హ=ఆయెను గదా!

**తాత్పర్యము :** వరుణపాశములచే బంధితుడైన బలి ఆ వచ్చిన తన తాతకు ప్రహ్లాదునకు పూర్వమువలె పూజాదులు చేయలేకపోయి కేవలము శిరమువంచి నమస్కరించెను. మఱి రెండు కన్నులయందు నీరు క్రమ్ముటచే సిగ్గుపొంది మొగము క్రిందికి వంచినవాడయ్యెను.

**శ్లో॥ స తత్ర హాసీనముదీక్ష్య సత్పతిం హరిం సునన్దాద్యనుగైరుపాసితమ్।**
**ఉపేత్య భూమౌ శిరసా మహామనా ననామ మూర్ధ్నా పులకాశ్రువిక్లవః॥ 15**

**ప్రతిపదార్థము :** సః=ఆ ప్రహ్లాదుడు, తత్ర హ=అచటనే, ఆసీనమ్=కూర్చొన్నవాడును, సత్+పతిమ్=సాధువుల ప్రభువును, హరిమ్=హరిని, విష్ణువును, సునన్ద+ఆది+అనుగైః =సునన్దుడు లోనగు ననుచరులచే, ఉపాసితమ్=చక్కగ పూజితుడగుచు, ఉపేత్య= సమీపించి, మూర్ధ్నా=శిరస్సుతో, భూమౌ=భూమియందు, శిరసా=తలతో, ననామ=నమస్కరించెను. మహామనాః=దొడ్డమనస్సు గలవాడగు ప్రహ్లాదుడు, పులక+అశ్రు+విక్లవః=గగుర్పాటు చేత అశ్రువులచేత విహ్వలుడయ్యెను.

**తాత్పర్యము :** ప్రహ్లాదుడు అచటనే కూర్చున్నవాడును, సాధువుల ప్రభువును, హరిని, విష్ణువును సునందుడు లోనగుననుచరులచే చక్కగ పూజితుడగుచు సమీపించి శిరస్సుతో భూమియందు నమస్కరించెను. ప్రధానముగా దొడ్డమనస్సుగలవాడగు ప్రహ్లాదుడు గగుర్పాటు చేత అశ్రువులచేత విహ్వలుడయ్యెను.

**శ్రీ ప్రహ్లాద ఉవాచ :** ప్రహ్లాదుడు వచించెను.

**శ్లో॥ త్వయైవ దత్తం పదమైన్ద్రమచ్యుతం హృతం తదేవాద్య తథైవ శోభనమ్।**
**మన్యే మహానస్య కృతో హ్యనుగ్రహో విభ్రంశితో యచ్ఛ్రియ ఆత్మమోహనాత్॥ 16**

**ప్రతిపదార్థము :** అచ్యుతమ్=భ్రష్టముగాని, ఇంద్రమ్=ఇంద్రసంబంధమైన, పదమ్=స్థానము, త్వయా+ఏవ=నీ చేతనే, దత్తమ్=ఈయబడినది. తథా+ఏవ=ఆ ప్రకారమే, అద్య=నేడు, హృతమ్=గ్రహింపబడినది. తత్=అది, శోభనమ్+ఏవ=మిగులమేలే. అస్య=ఈ బలికి, మహాన్ అనుగ్రహః=గొప్ప అనుగ్రహము, కృతః=చేయబడినది అని, మన్యే=తలంతును, యత్=ఏ, ఆత్మమోహనాత్=తన్ను మోహింపజేయు, శ్రియః=సిరివలన, విభ్రంశితః=తొలగించబడినాడో-

**తాత్పర్యము :** దేవా! నీవే ఈ బలికి భ్రంశముగాని ఇంద్రపదవి నొసంగితివి. మరల నీవే దానిని గైకొంటివి. ఇది ఇతనికిఁజాల శుభము. నీవు ఈ బలిపై మిగుల ననుగ్రహము చూపితివని తలంతును. తన్ను మైమఱవఁజేసి వివేకమును బోగొట్టు రాచసిరినుండి భ్రష్టుడైనాడు.

**శ్లో॥ యయా హి విద్వానపి ముహ్యతే యతస్తాం కో విచష్టే గతిమాత్మనో యథా।**
**తస్మై నమస్తే జగదీశ్వరాయ వై నారాయణాయాఖిలలోకసాక్షిణే॥** 17

**ప్రతిపదార్థము :** విద్వాన్+అపి=విద్వాంసుడయ్యును, యయా=ఏ సిరిచే, ముహ్యతే=వివేక శూన్యుడుగ జేయబడుచున్నాడు. యతః=అట్టి, తామ్=సిరి ఉండగా, కః=ఏ వ్యక్తి, ఆత్మనః=ఆత్మ యొక్క, గతిమ్=యదార్థతత్త్వమును, యథా=ఎట్లు, విచష్టే=ఎఱుంగునో, తస్మై=అట్టి భగవంతుడవు, జగదీశ్వరాయ=జగదీశ్వరుడవు, నారాయణాయ=నారాయణుడవు, అఖిల లోకసాక్షిణే=సమస్త జీవులుచేయు కర్మలకు సాక్షివి అగు, తే=నీ కొఱకు, నమః=నమస్కారము.

**తాత్పర్యము :** విద్వాంసుడును సిరిచే వివేకశూన్యుడుగ జేయబడుచున్నాడు. అట్టి సిరి ఉండగా ఏ వ్యక్తి ఆత్మయొక్క యథార్థతత్త్వము నెట్లెఱుంగును. అట్టి భగవంతుడవు, జగదీశ్వరుడవు, నారాయణుడవు, సమస్త జీవులు చేయు కర్మలకు సాక్షివి అగు నీ కొఱకు నమస్కారము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ తస్యానుశృణ్వతో రాజన్! ప్రహ్లాదస్య కృతాఞ్జలేః।**
**హిరణ్యగర్భో భగవానువాచ మధుసూదనమ్॥** 18

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, కృత+అంజలేః=చేతులు దోయిలించుకొన్న, తస్య=ఆ, ప్రహ్లాదస్య=ప్రహ్లాదునకు, అనుశృణ్వతః=వినుచుండ, హిరణ్యగర్భః భగవాన్=బ్రహ్మదేవుడు, మధుసూదనమ్=విష్ణువును గూర్చి, ఉవాచ=ఇట్లు చెప్పెను.

**తాత్పర్యము :** ఓ రాజా! చేతులు దోయిలించుకొన్న ప్రహ్లాదునకు వినుచుండ బ్రహ్మదేవుడు మహావిష్ణువును గూర్చి(తో) నిట్లు వచించెను.

**శ్లో॥ బద్ధం వీక్ష్య పతిం సాధ్వీ-తత్పత్నీ భయవిహ్వలా।**
**ప్రాఞ్జలిః ప్రణతోపేన్ద్రం-బభాషేఽశ్రుముఖీ నృప!॥** 19

**ప్రతిపదార్థము :** నృప!=ఓ రాజా!, బద్ధమ్=కట్టబడిన, పతిమ్=భర్తయగు బలిచక్రవర్తిని, వీక్ష్య=చూచి, తత్పత్నీ=ఆ బలిభార్య, భయవిహ్వలా=భయముచే నివ్వెరవోయి, ప్రాంజలిః=చేతులు జోడించినదై, ఉపేన్ద్రమ్=ఇంద్రుని తరువాత జనించిన వామనుని గూర్చి, ప్రణతా=వినమ్రయై, అశ్రుముఖీ=కన్నీరుతోడి ముఖముగలదై, బభాషే=భాషించెను.



**తాత్పర్యము :** బంధితుడైన తన భర్తను చూచి ఆ బలిపత్ని భయమున నేమియుఁదోచనిదై చేతులు జోడించి వినమ్రయై కన్నీరుతోడి ముఖముగలదై వామనుని గూర్చి నిట్లు వచించెను.

**శ్రీ విన్ధ్యావళిరువాచ :** విన్ధ్యావళి వచించెను.

**శ్లో॥ క్రీడార్థమాత్మన ఇదం త్రిజగత్కృతం తే స్వామ్యం తు తత్ర కుధియోఽపర! ఈశ! కుర్యుః।**
**కర్తుః ప్రభోస్తవ కిమస్యత ఆవహన్తి త్యక్తహ్రియస్త్వదవరోపితకర్తృవాదాః॥** 20

**ప్రతిపదార్థము :** పర!=ఓ పరమాత్మా!, ఈశ!=ఓ పరమేశ్వరా!, ఇదమ్=ఈ, త్రిజగత్=ముల్లోకములు, ఆత్మనః=పరమాత్మవైన, తే=నీకు, క్రీడార్థమ్=ఆటకొఱకు, కృతమ్=సృజించితివి. తత్ర=ఈ జగత్త్రయమందు, కుధియః=కుత్సితబుద్ధులు, స్వామ్యమ్=ప్రభుభావము, కుర్యుః=తాము ప్రభువులమని భావింతురు. కర్తుః=జగత్కర్తయు, ప్రభోః=పాలకుడవు, అస్యతః=సంహర్తయునగు, తవ=నీకు, త్వత్+అవరోపితకర్తృవాదాః=నీచే ఆరోపింపబడిన కర్తృవాదములుగలవారు మేము స్వతంత్రులమనుకొనువారు, త్యక్తహ్రియః=విడువబడిన లజ్జగలవారు, కిమ్ ఆవహన్తి=ఏమి సమర్పింపగలరు.

**తాత్పర్యము :** ఓ పరమాత్మా! ఓ పరమేశ్వరా! ఈ ముల్లోకములను నీవు నీ కొఱకు సృజించుచున్నావు. అట్టి ఈ జగమునకు దాము ప్రభువులమని కుత్సితబుద్ధులు భావింతురు. ఈ జగత్త్రయమునకు గర్తవు, పాలకుడవు, సంహర్తయునగు నీకు మాయచే ఆరోపించుకొని మేమే కర్తలము, స్వతన్త్రులము అని భావించువారు సిగ్గులేనివారు నీకేమి సమర్పింపగలరు.

**దీని భావము : నీవే సర్వమునకు ప్రభుడవు, అందువలన మందబుద్ధియగు నితనిని (తన భర్తయగు బలిని) కేవలము కృపచే బంధవిముక్తుని గావించి రక్షింపుము.**

**బ్రహ్మోవాచ :** బ్రహ్మ వచించెను.

**శ్లో॥ భూతభావన! భూతేశ! దేవదేవ! జగన్మయ।**
**ముఞ్చైనం హృతసర్వస్వం-నాయమర్హతి నిగ్రహమ్॥** 21

ఇట్లు ప్రహ్లాదుని యొక్కయు, విన్ధ్యావళి యొక్కయు, పరమార్థవచనముచేత భగవానుడగు శ్రీ వామనమూర్తి ప్రసన్నుడయ్యెను. మఱి బ్రహ్మ లోక దృష్టిననుసరించి మూడు శ్లోకములు వచించుచున్నాడు.

**ప్రతిపదార్థము :** ఏనమ్=ఈ బలిచక్రవర్తిని, ముఞ్చ=విడువుము. హృత సర్వస్వమ్=సర్వమును హరించితివి. అయమ్=ఇతడు, నిగ్రహమ్=దండనమును గూర్చి, న అర్హతి=యోగ్యుడు కాడు.
**తాత్పర్యము :** భూతభావనా! భూతేశా! దేవదేవా! జగన్మయా! ఈ బలిచక్రవర్తిని బంధ విముక్తుడను చేయుము. సర్వమును హరించితివి. ఇతడు దండమునకు యోగ్యుడు కాడు.

**శ్లో॥ కృత్స్నా తేఽనేన దత్తా భూ-ర్లోకాః కర్మార్జితాశ్చ యే।**
**నివేదితం చ సర్వస్వమాత్మావిక్లవయా ధియా॥** 22

శిక్షింపనర్హుడు కాడనుదానికి హేతువు చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** యే=ఏ, అనేన=ఈ బలిచే, కృత్స్నా=సమస్తమైన, భూః=భూమి, దత్తా=ఈయబడి, కర్మ+ఆర్జితాః=పరాక్రమముచే సంపాదింపబడినదో, లోకాః=ఆ స్వర్గాది

## త్రయోవింశోऽధ్యాయః

**శ్రీ శుక ఉవాచ :** శుకుడు వచించెను.

**శ్లో॥** **ఇత్యుక్తవన్తం పురుషం పురాతనం మహానుభావోऽఖిలసాధుసమ్మతః।**
**బద్ధాఞ్జలిర్బాష్పకళాకులేక్షణో భక్త్యుద్గతో గద్గదయా గిరాऽబ్రవీత్॥** 1

**ప్రతిపదార్థము :** ఇతి=ఈ ప్రకారముగా, ఉక్తవంతమ్=చెప్పిన, పురాతనమ్=పురాణుడయిన, పురుషమ్=పురుషుని గూర్చి, అఖిలసాధు=సమస్తసత్పురుషులకు, సమ్మతః=ఇష్టుడు అయిన, మహానుభావః=బలి మహాశయుడు, బద్ధాంజలిః=దోసిలి యొగ్గినవాడై, బాష్పకళా=కన్నీటి బిందువులచే, ఆకుల=వ్యాకులమయిన, ఈక్షణః=కన్నులు కలవాడై, భక్తి=భక్తితో, ఉద్గతః =లేచినవాడై, గద్గదయా=బొంగురుపోయిన, గిరా=వాక్యముతో, అబ్రవీత్=పలికెను.

**తాత్పర్యము :** ఈ విధంగా పలికిన ఆ పురాణపురుషునితో సకలసత్పురుష సమ్మతుడయిన బలి మహాశయుడు సాంజలియై కన్నీళ్ళతో గద్గద స్వరముతో భక్తియుక్తుడై యిట్లు విన్నవించెను.

**బలిరువాచ :** బలి చక్రవర్తి వచించెను.

**శ్లో॥** **అహో ప్రణామస్య కృతస్సముద్యమః ప్రపన్నభక్తార్థవిధౌ సమాహితః।**
**యల్లోకపాలైః త్వదనుగ్రహోऽమరైరలబ్ధపూర్వోऽపశదేऽసురేऽర్పితః॥** 2

**ప్రతిపదార్థము :** ప్రణామస్య=నమస్కారం కొఱకు, కృతః=చేయబడిన, సముద్యమః=నా ప్రయత్నము, అహో!=ఆశ్చర్యకరమయినది, యత్=దేనివలన, ప్రపన్న=శరణాగతులయిన, భక్త=భక్తుల యొక్క, అర్థవిధౌ=ప్రయోజనాచరణయందు, సమాహితః=ఏకాగ్రంగా ఉన్నదియు, లోకపాలైః=లోకపాలకులయిన, అమరైః=దేవతల చేత, అలబ్ధపూర్వః=ఎన్నడు పొందబడని, త్వదనుగ్రహః=నీయనుగ్రహము, అపశదే=హీనుడయిన, అసురే=రాక్షసుడయిననాయందు, అర్పితః=సమర్పింపబడినదో ఆ నీ నమస్కారప్రయత్నము మిగుల ప్రభావశాలి.

**తాత్పర్యము :** పరమాత్మా! పరమేశ్వరా! నీకు కనీసం నమస్కారం గూడా సరిగా చేయలేదు. నమస్కార ప్రయత్నం మాత్రమే చేశాను. అంతమాత్రం చేతనే కేవలం భక్తులకోసం సిద్ధంగా ఉండే నీ అనుగ్రహం లోకపాలకులకు గూడా లభ్యంకాని నీ అనుగ్రహం ఈ గుణహీనుడైన రాక్షసునకు లభించింది.

**శ్రీ శుక ఉవాచ :** శుక మహర్షి వచించెను.

**శ్లో॥** **ఇత్యుక్త్వా హరిమానమ్య బ్రహ్మాణం సభవం తతః।**
**వివేశ సుతలం ప్రీతో బలిర్ముక్తస్సహానుగైః॥** 3

**ప్రతిపదార్థము :** ఇతి=ఈ విధంగా, ఉక్త్వా=పలికి, బలిః=బలిచక్రవర్తి, హరిమ్=విష్ణువును, సభవమ్=శివసమేతుడయిన, బ్రహ్మాణమ్=బ్రహ్మను, ఆనమ్య=నమస్కరించి, తతః=తరువాత, అనుగైఃసహ=అనుచరులతో సహా, ముక్తః=విడువబడినవాడై, ప్రీతః=సంతోషంగలవాడై, సుతలమ్=సుతలలోకమును, వివేశ=ప్రవేశించెను.

**తాత్పర్యము :** బలి శ్రీహరితో ఇట్లు మనవి చేసి త్రిమూర్తులకు నమస్కరించి తన అనుచరులతో సహా విముక్తుడై సంతోషముగా సుతలమున ప్రవేశించెను.



**తాత్పర్యము :** ఈ జీవుడు తన కర్మలచే క్రిమికీటకాదులయందుఁజనించుచు ఒకానొకప్పుడు పుణ్యవశమున పురుషుడుగా జన్మించుచున్నాడు.

**శ్లో॥** **జన్మకర్మవయోరూప-విద్యైశ్వర్యధనాదిభిః।**
**యద్యస్య న భవేత్ స్తమ్భ-స్తత్రాయం మదనుగ్రహః॥** 26

**ప్రతిపదార్థము :** అస్య=ఈ పురుషునికి, జన్మ...భిః, జన్మ=వంశములచే, కర్మ=యాగాది కర్మలచే, వయః=యవ్వనమున, రూప=సౌందర్యముచే, విద్యా=విద్యచే, ఐశ్వర్య= అధికారముచే, ధనాదిభిః=ధనములోనగువానిచే, స్తమ్భః=అభిమానము, న భవేత్=కలుగని యెడల, తత్ర=ఆ పురుషునియందు, మత్+అనుగ్రహః=నాయనుగ్రహము కలుగును.

**తాత్పర్యము :** ఏ పురుషుడు వంశముచే యాగాదికర్మలచే యౌవనము చేతను, సౌందర్యము చేతను, విద్య చేతను, అధికారము చేతను, ధనాదుల చేతను గర్వించడో వానియందు నాయనుగ్రహము కలుగును.

**శ్లో॥** **మానస్తమ్భనిమిత్తానాం-జన్మాదీనాం సమన్తతః।**
**సర్వశ్రేయః ప్రతీపానాం-హన్త ముహ్యేన్న మత్పరః॥** 27

అట్లయిన ప్రహ్లాదుడు, ధ్రువుడులోనగువారికి సంపదనిచ్చితిని. దానికి చెప్పుచున్నాడు.

**ప్రతిపదార్థము :** సమన్తతః=అంతట, మానస్తంభనిమిత్తానామ్=అహంకార, అవిధేయతకు కారణములైన, సర్వశ్రేయః ప్రతీపానామ్=ఎల్ల శ్రేయస్సులకు, భక్తిజ్ఞానాదులకు ప్రతికూలములైన, జన్మాదీనామ్=వంశములోనగు వాటిచే, హన్త=ఓ బ్రహ్మ, ముహ్యేత్= పురుషుడు మోహమును పొందుచున్నాడు. న మత్పరః=నా భక్తుడు కాడు.

**తాత్పర్యము :** గర్వమునకు నమ్రత లేకపోవుటకు (అడకువ లేకుండుట) కారణములును, అన్ని విధములనన్ని శ్రేయస్సులకు కర్మ భక్తిజ్ఞానాదులకు బ్రతికూలములగు జన్మాదులచేఁ బురుషుడు మోహమును పొందుచున్నాడు. నా భక్తుడు కాడు. ఎవడు మోహమును బొందడో వానికి సంపదలను ఇచ్చెదను.

**శ్లో॥** **ఏష దానవదైత్యానామగ్రణీః కీర్తివర్ధనః।**
**అజైషీదజయాం మాయాం సీదన్నపి న ముహ్యతి॥** 28

**ప్రతిపదార్థము :** ఏషః=ఈ బలి, దానవదైత్యానామ్=దానవులకు దైత్యులకు, అగ్రణీః=శ్రేష్ఠుడు, కీర్తివర్ధనః=కీర్తిచేఁబ్రసిద్ధికెక్కినవాడు, అజయామ్=జయింపరాని, మాయామ్=నా మాయను, అజైషీత్=జయించెను. సీదన్+అపి=తాను నలుగుచుఁగూడ, న ముహ్యతి=మోహమునుఁ బొందడు.

**తాత్పర్యము :** ఈ బలి దానవులకు దైత్యులకు మేటియై యున్నాడు. కీర్తిచేఁబ్రసిద్ధికెక్కినవాడు, నా మాయను జయించినాడు. తన కష్టస్థితియందును మోహమునుఁబొందడు.

**శ్లో॥** **క్షీణరిక్థశ్చ్యుతఃస్థానాత్-క్షిప్తో బద్ధశ్చ శత్రుభిః।**
**జ్ఞాతిభిశ్చ పరిత్యక్తో-యాతనామనుయాపితః॥** 29

**ప్రతిపదార్థము :** క్షీణరిక్థః=ధనశూన్యుడు, చ్యుతఃస్థానాత్=పదవి నుండి తొలగినవాడు, శత్రుభిః

=శత్రువులచే, క్షిప్తః=తిరస్కృతుడైనవాడు, బద్ధశ్చ=కట్టుబడినవాడు, జ్ఞాతిభిః=బంధువుల చేత, పరిత్యక్తః=విడువబడినవాడు, యాతనామ్=నరక బాధను, అనుయాపితః=పొందింపబడిన వాడు –

**తాత్పర్యము :** ఇతడిప్పుడు ధనమును గోలుపోయినవాడు, పదచ్యుతుడు, శత్రువులచే తిరస్కృతుడైనవాడు, వరుణపాశములచే కట్టబడినవాడు, బంధువులచేత విడువబడినవాడు, నరక బాధను పొందింపబడినవాడు...

**శ్లో॥ గురుణా భర్త్సితః శప్తో–జహౌ సత్యం న సువ్రతః।**
**ఛలైరుక్తో మయాధర్మో–నాయం త్యజతి సత్పథమ్॥ 30**

**ప్రతిపదార్థము :** గురుణా=గురువగు శుక్రునిచేత, భర్త్సితః=భయపెట్టబడినవాడు, శప్తః =శపింపబడినవాడు, సువ్రతః=చక్కని నియమము గలవాడును, సత్యమ్=సత్యమును, న జహౌ=వీడలేదు, ఛలైః=కపట వాక్యములచే, మయా=నేను, అధర్మః ఉక్తః=అధర్మమును చెప్పితిని, అయమ్=ఇతడు, సత్పథమ్=మంచి మార్గమైన ధర్మము, న త్యజతి=వీడలేదు.

**తాత్పర్యము :** గురువగు శుక్రుడు భయపెట్టి శపించినను తన వ్రతమును వీడలేదు. నేను కపట వాక్యములచే (ముఖస్తుతిచేసి) అధర్మమును బోధించినను ఇతడు ధర్మమును వీడలేదు.

**శ్లో॥ ఏష మే ప్రాపితం స్థానం–దుష్ప్రాపమమరైరపి।**
**సావర్ణేరన్తరస్యాయం భవితేన్ద్రో మదాశ్రయః॥ 31**

**ప్రతిపదార్థము :** ఏషః=ఈ బలి, మత్+ఆశ్రయః=నేను ఆశ్రయముగలవాడు, మే=నాచే, అమరైః అపి=దేవతల చేతను, దుష్ప్రాపమ్=పొందరాని, స్థానమ్=పదమును, ప్రాపితమ్= ప్రాప్తింపబడెను. అయమ్=ఇతడు, అస్య సావర్ణేః=సావర్ణి మనువు యొక్క, అంతః=మధ్య కాలములో, ఇంద్రః=ఇంద్రుడు, భవితా=కాగలడు.

**తాత్పర్యము :** నన్నాశ్రయించిన ఈ బలి దేవతలు సైతము పొందరాని స్థానము పొందు చున్నాడు. మఱి యతడు ఆ సావర్ణిమన్వంతరమున ఇంద్రుడు కాగలడు.

**శ్లో॥ తావత్సుతలమధ్యాస్తాం–విశ్వకర్మవినిర్మితమ్।**
**యన్నాధయో వ్యాధయశ్చ–క్లమస్తన్ద్రా పరాభవః।**
**నోపసర్గా నివసతాం–సమ్భవన్తి మమేక్షయా॥ 32**

**ప్రతిపదార్థము :** తావత్=ఆ సావర్ణి మన్వంతరము వచ్చువఱకు, విశ్వకర్మవినిర్మితమ్= విశ్వకర్మ నిర్మించిన, సుతలమధ్యాస్తామ్=సుతలలోకమందు వసించి యుండుగాక. మమ+ఈక్షయా=నా దృష్టి ప్రభావముచే, యత్ = దానియందు, ఆధయః=మనోవ్యథలుగాని, వ్యాధయఃచ=వ్యాధులు గాని, క్లమః=బడలిక గాని, తన్ద్రా=కునికిపాటుగాని, పరాభవః =అవమానముగాని, ఉపసర్గాః=ఉత్పాతములుగాని, న సమ్భవన్తి=సంభవించవు.

**తాత్పర్యము :** ఆ సావర్ణి మన్వన్తరము వచ్చువఱకు ఇతడు విశ్వకర్మ నిర్మితమగు సుతలలోక మందు వసించియుండుగాక. ఆ లోకమందు నా దృష్టి ప్రభావముచే మనోవ్యథలుగాని, వ్యాధులుగాని, బడలిక, కునికిపాటులుగాని, అవమానములుగాని, ఆపదలోనగునేవియు కలుగవు.



**శ్లో॥ ఇన్ద్రసేన మహారాజ యాహి భో భద్రమస్తు తే।**
**సుతలం స్వర్గిభిః ప్రార్థ్యం–జ్ఞాతిభిః పరివారితః॥ 33**

**ప్రతిపదార్థము :** భో! మహారాజ!=ఓ మహారాజా!, ఇంద్రసేన=ఓ బలిచక్రవర్తీ!, జ్ఞాతిభిః =జ్ఞాతులచే, పరివారితః=పరివేష్టితుడవై, స్వర్గిభిః=దేవతలచే, ప్రార్థ్యమ్=ప్రార్థనీయమగు, సుతలమ్=నా సుతలమును గూర్చి, యాహి=పొమ్ము, తే=నీకు, భద్రమ్=శుభము, అస్తు= అగుగాక.

**తాత్పర్యము :** ఓ మహారాజా! బలిచక్రవర్తీ! జ్ఞాతులచే పరివేష్ఠితుడై దేవతలచే ప్రార్థనీయమగు నా సుతలమును గూర్చి పొమ్ము. నీకు శుభము అగుగాక.

**శ్లో॥ న త్వామభిభవిష్యన్తి లోకేశాః కిముతాపరే।**
**త్వచ్ఛాసనాతిగాన్ దైత్యాంశ్చక్రం మే సూదయిష్యతి॥ 34**

**ప్రతిపదార్థము :** త్వామ్=నిన్ను, లోకేశాః=ఇంద్రాది దిక్పాలురు, న అభిభవిష్యన్తి=తిరస్కరింప జాలరు, అపరే=ఇతర దేవతలను గూర్చి, కిముత=ఏల?, త్వత్+శాసన+అతిగాన్=నీ ఆజ్ఞను ఉల్లంఘించిన, దైత్యాన్=దైత్యులను, మే చక్రమ్=నా చక్రము, సూదయిష్యతి=చంపును.

**తాత్పర్యము :** నిన్ను ఇంద్రాది దిక్పాలురు తిరస్కరింపజాలరు, ఇతర దేవతలను గూర్చి ఏల? నీ ఆజ్ఞనుల్లంఘించిన దైత్యులను నా చక్రము చంపును.

**శ్లో॥ రక్షిష్యే సర్వతోఽహం త్వాం–సానుగం సపరిచ్ఛదమ్।**
**సదా సన్నిహితం వీర–తత్ర మాం ద్రక్ష్యతే భవాన్॥ 35**

**ప్రతిపదార్థము :** వీర!=ఓ వీరుడా!, అహమ్=నేను, స+అనుగమ్=అనుచరులతో గూడిన వానిని, సపరిచ్ఛదమ్=సమస్తభోగోపకరణ సహితుని, త్వామ్=నిన్ను, సర్వతః=సర్వ విధముల, రక్షిష్యే=రక్షించుచుందును. భవాన్=నీవు, తత్ర=అచట, మామ్=నన్ను, సదా=ఎల్లప్పుడు, సన్నిహితమ్=సమీపమునందే, ద్రక్ష్యతే=చూడగలవు.

**తాత్పర్యము :** ఓ వీరుడా! నేను అనుచరులతోను, స్వయముగాను, ఉపకరసపరివారుని, సమస్తభోగోపకరణసహితుని నిన్ను రక్షించుచుందును. నీవు అచ్చట నన్ను ఎల్లప్పుడు సమీపమునందే చూడగలవు.

**శ్లో॥ తత్ర దానవదైత్యానాం–సఙ్గాత్తే భావ ఆసురః।**
**దృష్ట్వా మమానుభావం–వై సద్యః కుణ్ఠో వినఙ్క్ష్యతి॥ 36**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ సుతలమందు, దానవదైత్యానామ్=దానవులయొక్క, దైత్యుల యొక్క, సంగాత్=సాంగత్యము వలన, తే=నీయొక్క, ఆసురః భావః=అసుర సంబంధభావము, మమ=నా యొక్క, అనుభావమ్=ప్రభావమును, దృష్ట్వా=చూచి, సద్యః=అప్పుడే, కుణ్ఠః వై=ప్రతిహతమై, వినఙ్క్ష్యతి=నశింపగలదు.

**తాత్పర్యము :** ఆ సుతలమందు దైత్యదానవులసంపర్కము వలన నీయాసుర భావము నా ప్రభావమునుఁ గాంచిన వెంటనే ప్రతిహతమై నశింపఁగలదు.

ఇతి శ్రీమద్భాగవతే అష్టమస్కన్ధే ద్వావింశో – ధ్యాయః
ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున *22*వ అధ్యాయము.

యందు, యత్=ఏ, వైషమ్యమ్=లోపముగలదో, తత్=అది, బ్రహ్మ=బ్రాహ్మణులచే, దృష్టమ్=సరిచూడబడినదై, సమమ్=సరి అయినది, భవేత్=అగును.

**తాత్పర్యము :** బ్రాహ్మణోత్తమా! శుక్రాచార్యా! యజ్ఞము చేయుచున్న నీ శిష్యుని కర్మ ఛ్ఛిద్రమును నీవు పూరింపుము. ఇటువంటి కర్మ వైషమ్యములు బ్రాహ్మణ దృష్టితో సరియగును.

**శ్రీ శుక్ర ఉవాచ :** శుక్రుడు వచించెను.

**శ్లో॥ కుతస్తత్కర్మవైషమ్యం యస్య కర్మేశ్వరో భవాన్।**
**యజ్ఞేశో యజ్ఞపురుషః సర్వభావేన పూజితః॥** 15

**ప్రతిపదార్థము :** యజ్ఞేశః=యజ్ఞేశ్వరుడు, యజ్ఞపురుషః=యజ్ఞస్వరూపుడు అయిన, భవాన్=నీవు, యస్య=ఎవనికి, కర్మేశ్వరః=కర్మప్రవర్తకుడవో, సర్వభావేన=సంపూర్ణభావము చేత, పూజితః=పూజింపబడితివో, తత్=వానియొక్క, కర్మ=కర్మకు సంబంధించిన, వైషమ్యమ్=లోపము, కుతః=ఎక్కడిది?

**తాత్పర్యము :** యజ్ఞరూపుడు యజ్ఞపతి అయిన నిన్ను సర్వభావముతో కర్మేశ్వరునిగా పూజించిన వాని కర్మలో వైషమ్యం ఎట్లు సంభవించును.

**శ్లో॥ మన్త్రతస్తన్త్రతశ్ఛిద్రం దేశకాలార్హవస్తుతః।**
**సర్వం కరోతి నిశ్ఛిద్రం అనుసఙ్కీర్తనం తవ॥** 16

**ప్రతిపదార్థము :** మంత్రతః=మంత్రము వలన, తంత్రతః=తంత్రము వలన, దేశ=దేశము వలన, కాల=కాలము వలన, అర్హ=పాత్ర వలన, వస్తుతః=దక్షిణ మొ॥ ద్రవ్యము వలన, అయిన, ఛిద్రమ్=శూన్యమును/లోపమును, తవ=నీయొక్క, అనుసంకీర్తనమ్=నామస్మరణము, సర్వమ్=అంతటిని, నిశ్ఛిద్రమ్=శూన్యము కాని దానినిగా, కరోతి=చేయును.

**తాత్పర్యము :** మంత్రహీనం, క్రియాహీనం, దేశహీనం, కాలహీనం, పాత్రహీనం, ద్రవ్యహీనం ఏ హీనమయినా నా నామ సంకీర్తన వలన పరిహారము కాగలదు.

**శ్లో॥ తథాపి వదతో భూమన్-కరిష్యామ్యనుశాసనమ్।**
**ఏతచ్ఛ్రేయః పరం పుంసాం యత్తవాజ్ఞానుపాలనమ్॥** 17

**ప్రతిపదార్థము :** భూమన్=ఓ బ్రహ్మమా?, తథాపి=లోప పరిహారమయినప్పటికీ, వదతః=చెప్పుచున్న నీయొక్క, అనుశాసనమ్=ఆజ్ఞను, కరిష్యామి=చేయగలను. యత్=ఎందుకంటే, ఏతత్=ఈ, తవ=నీ, ఆజ్ఞా=ఆజ్ఞల యొక్క, అనుపాలనమ్=నెరవేర్చుట, పుంసామ్=జీవులకు, పరమ్=గొప్ప, శ్రేయః=శ్రేయస్కరము కదా!

**తాత్పర్యము :** ఓ బ్రహ్మస్వరూపా! నీ నామ కీర్తన వలన యజ్ఞదోషపరిహారము తథ్యమే. అయినా నీ ఆజ్ఞాపాలన సర్వజీవులకు శ్రేయస్కరము కదా! కనుక తప్పక యజ్ఞచ్ఛిద్రమును పూరించెదను.

**శ్రీ శుక ఉవాచ :** శుకమౌని వచించెను.

**శ్లో॥ ప్రతినన్ద్య హరేరాజ్ఞాముశనా భగవానితి।**
**యజ్ఞచ్ఛిద్రం సమాధత్త బలేర్విప్రర్షిభిస్సహ॥** 18

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడైన, ఉశనాః=శుక్రుడు, హరేః=విష్ణువు యొక్క, ఆజ్ఞామ్=



**శ్లో॥ ఏవమిన్ద్రాయ భగవాన్ ప్రత్యానీయ త్రివిష్టపమ్।**
**పూరయిత్వాఽదితేః కామం-అశాసత్సకలం జగత్॥** 4

**ప్రతిపదార్థము :** భగవాన్=విష్ణు భగవానుడు, ఏవమ్=ఇలా, ఇంద్రాయ=ఇంద్రుని కొఱకు, త్రివిష్టపమ్=స్వర్గమును, ప్రత్యానీయ=తిరిగి చేకూర్చి, అదితేః=అదితియొక్క, కామమ్=కోరికను, పూరయిత్వా=నెఱవేర్చి, సకలమ్=సమస్తమయిన, జగత్=ప్రపంచమును, అశాసత్=శాసించెను.

**తాత్పర్యము :** ఈ విధంగా వామనావతారంతో హరి ఇంద్రునకు పోయిన రాజ్యమును తిరిగి చేకూర్చి అదితి కోరికను నెఱవేర్చి ఉపేంద్రుడుగా లోకమును పాలించెను.

**శ్లో॥ లబ్ధప్రసాదం నిర్ముక్తం పౌత్రం వంశధరం బలిమ్।**
**నిశమ్య భక్తిప్రవణః ప్రహ్లాద ఇదమబ్రవీత్॥** 5

**ప్రతిపదార్థము :** లబ్ధ=పొందబడిన, ప్రసాదమ్=అనుగ్రహముగలవాడును, నిర్ముక్తమ్=ముక్తి పొందినవాడును, వంశధరమ్=వంశమును నిలిపినవాడును, పౌత్రమ్=పౌత్రుడును అయిన, బలిమ్=బలిచక్రవర్తిని, నిశమ్య=గమనించి, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, భక్తిప్రవణః=భక్తిమంతుడై, ఇదమ్=ఈ వచనమును, అబ్రవీత్=పలికెను.

**తాత్పర్యము :** తన మనుమనికి శ్రీహరి అనుగ్రహము లభించిన సంగతిని గమనించి ప్రహ్లాదుడు భక్తితో శ్రీహరితో ఇట్లు అనెను.

**ప్రహ్లాద ఉవాచ :** ప్రహ్లాదుడు వచించెను.

**శ్లో॥ నేమం విరిఞ్చో లభతే ప్రసాదమ్ న శ్రీర్న శర్వః కిముతాపరే యే।**
**యన్నోఽసురాణామపి దుర్గపాలో విశ్వాభివన్ద్యైరభివన్దితాఙ్ఘ్రిః॥** 6

**ప్రతిపదార్థము :** ఇమమ్=ఈ, ప్రసాదమ్=అనుగ్రహమును, విరించః=బ్రహ్మ, న లభతే=పొంద లేదు, శ్రీః=లక్ష్మీమాత, న=పొందలేదు, శర్వః=ఈశ్వరుడు, న=పొందలేదు, యే అపరే=మిగిలినవారివిషయం, కిముత=ఏమిచెప్పవలెను. యత్=ఏమంటే, విశ్వాభివంద్యైః=ప్రపంచ వందనీయులైన మహాపురుషులచేత, అభివందిత=నమస్కరింపబడిన, అంఘ్రిః=పాదములుగల నీవు, అసురాణామపి=రాక్షసులమయినప్పటికి, నః=మాకు, దుర్గపాలః=దుర్గరక్షకుడవుగా ఉన్నావు.

**తాత్పర్యము :** పరమాత్మా! పూర్వము బ్రహ్మగాని, రుద్రుడుగాని, ఆఖరుకు లక్ష్మీమాతగాని పొందని అనుగ్రహము మా మనుమనికి లభించింది. మహాప్రభూ! సర్వలోక వందనీయులయిన బ్రహ్మాదులకే వందనీయుడవయిన నీవు మాకు దుర్గ రక్షకుడవుగా నిలువదలచినావు.

**శ్లో॥ యత్పాదపద్మమకరన్దనిషేవణేన బ్రహ్మాదయః శరణదాశ్నువతే విభూతిమ్।**
**కస్మాద్వయం కుసృతయః ఖలయోనయస్తే దాక్షిణ్యదృష్టిపదవీం భవతః ప్రణీతాః॥** 7

**ప్రతిపదార్థము :** శరణద=శరణ్య చరణా!, నారాయణా!, యత్=ఏ నీయొక్క, పాదపద్మ=పాదాంబుజముల యొక్క, మకరంద=మధువును, నిషేవణేన=సేవించుట చేత, బ్రహ్మాదయః=బ్రహ్మాది దేవతలు, విభూతిమ్=ఐశ్వర్యమును, అశ్నువతే=పొందెదరో, భవతః=నీనుండి,

దాక్షిణ్య=బహుమానముతో గూడిన కారుణ్యముగల, దృష్టి=వాత్సల్య దృష్టియొక్క, పదవీమ్=మార్గమును, కుసృతయః=దుష్టప్రవృత్తులము, ఖలయోనయః=దుష్టజాతులము అయిన, తే=అ, వయమ్=మేము, కస్మాత్=ఎందువలన, ప్రణీతాః=పొందింపబడితిమి?

**తాత్పర్యము :** పరమేశ్వరా! ఆపన్న శరణ్యా! నారాయణా! నీ పాదకమలమకరందసేవతో బ్రహ్మాదులు గూడా ఐశ్వర్యమును పొందుదురు. అట్టి నీ అనుగ్రహదృష్టి మావంటి దుష్టవర్తనులు, దుష్టజాతుల మీద ప్రసరించటానికి కారణం ఏమిటి? నీయనుగ్రహమే కారణము. అది నిర్హేతుక జాయమానం.

**శ్లో॥ చిత్రం తవేహితమహోఽమితయోగమాయాలీలావిసృష్టభువనస్య విశారదస్య।**
**సర్వాత్మనస్సమదృశో విషమస్వభావో భక్తప్రియో యదసి కల్పతరుస్వభావః॥ 8**

**ప్రతిపదార్థము :** అమిత=అనంతమయిన, యోగమాయా=యోగమాయాసంబంధమయిన, లీలా=విలాసముల చేత, విసృష్ట=సృష్టించబడిన, భువనస్య=లోకములు గలవాడవును, విశారదస్య=నిపుణుడవున్ను అయిన, తవ=నీయొక్క, ఈహితమ్=సంకల్పము, చిత్రమ్=విచిత్ర మయినది, అహో!=ఆశ్చర్యము. సర్వాత్మనః=సర్వస్వరూపుడవు, సమదృశః=సమదృష్టిగల వాడవు అయిన నీకు, విషమస్వభావః=భక్తప్రియుడవగుట అనే పక్షపాత స్వభావము గలదు. యత్=ఏలయనగా, కల్పతరు=కల్పవృక్షము యొక్క, స్వభావః=స్వభావము వంటి స్వభావము గలవాడవయి, భక్తప్రియః=భక్తులపై ప్రేమగలవాడవు, అసి=అగుచున్నావు.

**తాత్పర్యము :** వైకుంఠనాథా! అనంత యోగమాయా విలాసంతో ఈ ప్రపంచాన్ని కల్పించిన నీకు అందఱు సములే. అన్ని రూపాలు నీవే. అయినా మావంటి భక్తులయందు ప్రత్యేక వాత్సల్యం కనబఱచటం పక్షపాతంగా కనబడ్తున్నది. కాని అది పక్షపాతము కాదు. కల్పవృక్ష స్వభావము. కల్పవృక్షము అందఱికి అన్ని ఇవ్వగలదు. కాని అడిగిన వారికే ఇస్తుంది. అలానే నీది సమదృష్టి. అయినా ఆశ్రయించిన మావంటి ఆపన్నులకు రక్షకుడవు.

**శ్రీ భగవానువాచ :** భగవంతుడు వచించెను.

**శ్లో॥ వత్స ప్రహ్లాద భద్రం తే ప్రయాహి సుతలాలయమ్।**
**మోదమానః స్వపౌత్రేణ జ్ఞాతీనాం సుఖమావహ॥ 9**

**ప్రతిపదార్థము :** వత్స=బిడ్డా!, ప్రహ్లాద!=ప్రహ్లాదా!, తే=నీకు, భద్రమ్=క్షేమమగుగాక!, సుతలాలయమ్=పాతాళమును గూర్చి, ప్రయాహి=పొమ్ము, స్వ=తన (నీ), పౌత్రేణ=మనుమనితో సహా, మోదమానః=సంతోషించుచు, జ్ఞాతీనామ్=దాయాదులకు, సుఖమ్=సుఖమును, ఆవహ=కలిగించుము.

**తాత్పర్యము :** వత్సా! ప్రహ్లాదా! నీవు నీ మనుమనితో సహా సుతలమునకు పోయి నీ వారితో సుఖముగా బ్రతుకుము. క్షేమమగుగాక!

**శ్లో॥ నిత్యం ద్రష్టాసి మాం తత్ర గదాపాణిమవస్థితమ్।**
**మద్దర్శనమహాహ్లాదధ్వస్తకర్మనిబన్ధనః॥ 10**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ సుతలమున, గదాపాణిమ్=గదాహస్తుడనై, అవస్థితమ్=నిలిచి ఉన్న, మామ్=నన్ను, నిత్యమ్=ఎల్లపుడు, ద్రష్టాసి=చూడగలవు. మత్=నాయొక్క, దర్శన=దర్శన



భాగ్యము చేత వచ్చిన, మహాహ్లాద=గొప్ప ఆనందముచేత, ధ్వస్త=ధ్వంసం చేయబడిన, కర్మ నిబంధనః=కర్మ బంధములు గలవాడవై ఉండుము.

**తాత్పర్యము :** నేను సుతలాలయమున గదాపాణినై కావలివాడుగా నీకు నిత్యదర్శనమును అనుగ్రహించెదను. నా దర్శనానందముతో నీ సమస్త కర్మబంధములు తొలగును.

**శ్రీ శుక ఉవాచ :** శుక మునీంద్రుడు వచించెను.

**శ్లో॥ ఆజ్ఞాం భగవతో రాజన్ ప్రహ్లాదో బలినా సహ।**
**బాఢమిత్యమలప్రజ్ఞో మూర్ధ్న్యాధాయ కృతాఞ్జలిః॥ 11**

**ప్రతిపదార్థము :** రాజన్!=పరీక్షిత్ మహారాజా!, ప్రహ్లాదః=ప్రహ్లాదుడు, బలినా సహ=బలి చక్రవర్తితో గూడా కలసి, భగవతః=భగవానుని యొక్క, ఆజ్ఞామ్=ఆజ్ఞను, బాఢం ఇతి=సరేనని, మూర్ధ్ని=శిరస్సునందు, ఆధాయ=ఉంచి, కృతాంజలిః=దోసిలి కట్టినవాడై, అమల=నిర్మల మయిన, ప్రజ్ఞః=జ్ఞానముగలవాడై...

**తాత్పర్యము :** నిర్మలబుద్ధి అయిన ప్రహ్లాదుడు బలిచక్రవర్తితో కల్సి భగవంతుని ఆనతిని శిరసావహించి, సాంజలియై,

**శ్లో॥ పరిక్రమ్యాదిపురుషం-సర్వాసురచమూపతిః।**
**ప్రణతస్తదనుజ్ఞాతః-ప్రవివేశ మహాబిలమ్॥ 12**

**ప్రతిపదార్థము :** సర్వాసుర=సమస్త రాక్షసుల యొక్క, చమూపతిః=సేనాపతి అయిన ప్రహ్లాదుడు, ఆదిపురుషమ్=పురాణపురుషుని, పరిక్రమ్య=ప్రదక్షిణం చేసి, ప్రణతః=నమస్కరించినవాడై, తత్=ఆ భగవంతుని చేత, అనుజ్ఞాతః=అనుమతింపబడినవాడై, మహాబిలమ్=పాతాళబిలమార్గమును, ప్రవివేశ=ప్రవేశించెను.

**తాత్పర్యము :** సమస్తరాక్షససేనానాయకుడయిన ప్రహ్లాదుడు ఆ పురాణపురుషునకు ప్రదక్షిణము చేసి నమస్కరించి అనుమతి గైకొని సుతల ద్వారమున ప్రవేశించెను.

**శ్లో॥ అథాహోశనసం రాజన్-హరిర్నారాయణోఽన్తికే।**
**ఆసీనమృత్విజాం మధ్యే సదసి బ్రహ్మవాదినామ్॥ 13**

**ప్రతిపదార్థము :** రాజన్=పరీక్షన్మహారాజా!, అథ=తర్వాత, నారాయణః=నారాయణుడయిన, హరిః=విష్ణువు, బ్రహ్మవాదినామ్=వేదపాఠకులయిన, ఋత్విజామ్=ఋత్విక్కుల, మధ్యే=మధ్యన, సదసి=సభలో, అంతికే=తన సమీపమున, ఆసీనమ్=కూర్చొనియున్న, ఉశనసమ్=శుక్రాచార్యుని గూర్చి, ఆహ=ఇట్లనెను.

**తాత్పర్యము :** బలిచక్రవర్తి వెళ్ళిన తరువాత శ్రీమన్నారాయణుడు సభలో ఋత్విక్కుల మధ్యన ఉన్న శుక్రాచార్యుని పిలిచి యిట్లనెను.

**శ్రీ భగవానువాచ :** భగవంతుడిట్లనెను.

**శ్లో॥ బ్రహ్మన్ సన్తను శిష్యస్య కర్మచ్ఛిద్రం వితన్వతః।**
**యత్తత్కర్మసు వైషమ్యం బ్రహ్మదృష్టం సమం భవేత్॥ 14**

**ప్రతిపదార్థము :** బ్రహ్మన్=శుక్రాచార్యా!, కర్మ=యజ్ఞకర్మను, వితన్వతః=చేయుచున్న, శిష్యస్య=శిష్యుడయిన బలియొక్క, ఛిద్రమ్=కర్మలోపమును, సన్తను=సరిజేయుము. కర్మసు=కర్మల

## చతుర్వింశోఽధ్యాయః

**రాజోవాచ** : రాజు వచించెను.

**శ్లో॥** **భగవచ్ఛ్రోతుమిచ్ఛామి హరేరద్భుతకర్మణః।**
**అవతారకథామాద్యాం మాయామత్స్యవిడమ్బనమ్॥** 1

**ప్రతిపదార్థము :** రాజా=పరీక్షన్మహారాజు, ఉవాచ=పలికెను, భగవన్=ఓ దేవా!, అద్భుత కర్మణః=అద్భుతములగు కర్మలుచేయు, హరేః=శ్రీ మహావిష్ణువు యొక్క, మాయామత్స్య విడమ్బనమ్=మాయామయమగు చేపగా అభినయించుట అను, ఆద్యామ్=మొట్టమొదటిది అగు, అవతారకథామ్=అవతారకథను, శ్రోతుమ్=వినుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

**తాత్పర్యము :** పరీక్షిన్మహారాజు శుకమహర్షిని ఇట్లు అడిగెను. ఓ దేవా! శ్రీమహావిష్ణువు చరిత్రములన్నియు అద్భుతముగ నుండును. అట్టి శ్రీహరి మొట్టమొదటిసారిగ మాయామయ మగు మత్స్యమువలె అవతరించెనని వింటిని. ఆ అవతారకథను మీనుండి సంపూర్ణముగ వినవలెనని నేను కోరుకొనుచున్నాను.

**శ్లో॥** **యదర్థమదధాద్రూపం మాత్స్యం లోకజుగుప్సితమ్।**
**తమః ప్రకృతి దుర్మర్షం కర్మగ్రస్త ఇవేశ్వరః॥** 2

**శ్లో॥** **ఏతన్నో భగవన్ సర్వం యథావద్వక్తుమర్హసి।**
**ఉత్తమశ్లోకచరితం సర్వలోకసుఖావహమ్॥** 3

**ప్రతిపదార్థము :** హే భగవన్=ఓ దేవా!, ఈశ్వరః=శ్రీమహావిష్ణువు తాను స్వతంత్రుడు అయినపుటికి, తమః ప్రకృతి దుర్మర్షమ్=తామస ప్రకృతి సంపన్నమును, లోక జుగుప్సితమ్= లోకనిందితమును అగు, మాత్స్యమ్=చేపకు సంబంధించిన, రూపమ్=రూపమును, కర్మగ్రస్తః ఇవ=ప్రారబ్ధకర్మకు అధీనమైనవాని వలె, యదర్థమ్=ఎందుకొఱకు, అదధాత్=ధరించెను?

సర్వలోకసుఖావహమ్=సర్వలోకములకు ప్రీతికరమగు, ఏతత్=ఈ, ఉత్తమశ్లోక చరితమ్=గొప్ప కీర్తిగల శ్రీమహావిష్ణువు యొక్క చరిత్రమును, సర్వమ్=సమస్తమును, యథావత్=ఉన్నది ఉన్నట్లుగ, వక్తుమ్=చెప్పుటకు, అర్హసి=తగియున్నావు.

**తాత్పర్యము :** ఓ దేవా! జగన్నియంతయగు శ్రీ మహావిష్ణువు తాను కర్మపరతంత్రుడు కాక స్వతంత్రుడు అయినప్పటికి ప్రారబ్ధకర్మాధీనునివలె తామసప్రకృతిసంపన్నము, లోక నిందితమును అగు చేప రూపమును ఏ ప్రయోజనమును ఉద్దేశించి ధరించెను? సమస్త లోకములకు ఆనందమును కలుగజేయు ఆ ఉత్తమశ్లోకుని చరిత్రమునంతటిని ఉన్నది ఉన్నట్లుగ సంపూర్ణముగ నాకు తెలియజెప్పు ప్రార్థించుచున్నాను.

**సూత ఉవాచ** : సూతుడు వచించెను.

**శ్లో॥** **ఇత్యుక్తో విష్ణురాతేన భగవాన్ బాదరాయణిః।**
**ఉవాచ చరితం విష్ణోర్మత్స్యరూపేణ యత్కృతమ్॥** 4

**ప్రతిపదార్థము :** శ్రీ సూతః=సూతమహాముని, ఉవాచ=పలికెను. విష్ణురాతేన=పరీక్షిన్మహారాజు చేత, ఇతి+ఉక్తః=ఇట్లు అడుగబడినవాడై, భగవాన్=భగవంతుడగు, బాదరాయణిః=వ్యాస



ఆజ్ఞను, ప్రతినంద్య=అభినందించి, ఇతి=ఆ ప్రకారమే, విప్రర్షిభిస్సహ=బ్రహ్మర్షులతో కల్సి, బలేః=బలిచక్రవర్తి యొక్క, యజ్ఞచ్ఛిద్రమ్=యజ్ఞలోపమును, సమాధత్త=పూరించెను.

**తాత్పర్యము :** శుక్రాచార్యుడు హరియాజ్ఞ ప్రకారము ఋషులతో కల్సి తన శిష్యుని యజ్ఞచ్ఛిద్రమును పూరించెను.

**శ్లో॥** **ఏవం బలేర్మహీం రాజన్ భిక్షిత్వా వామనో హరిః।**
**దదౌ భ్రాత్రే మహేన్ద్రాయ, త్రిదివం యత్పరైః హృతమ్॥** 19

**ప్రతిపదార్థము :** రాజన్!=రాజా!, ఏవమ్=ఈ విధముగా, వామనః=వామనుడైన, హరిః =విష్ణువు, బలేః=బలి నుంచి, మహీమ్=భూమిని, భిక్షిత్వా=యాచించి, యత్=ఏ, త్రిదివమ్= స్వర్గము, పరైః=శత్రువులచే, హృతమ్=కాజేయబడినదో, తత్=దానిని, భ్రాత్రే=సోదరుడయిన, మహేంద్రాయ=ఇంద్రునికొఱకు, దదౌ=ఇచ్చెను.

**తాత్పర్యము :** రాజా! విష్ణువు వామనుడై బలి చక్రవర్తిని యాచించి, మహేంద్రుని స్వర్గరాజ్యమును తిరిగి మహేంద్రునికి సంపాదించి పెట్టెను.

**శ్లో॥** **ప్రజాపతిపతిర్బ్రహ్మా-దేవర్షిమనుభూమిపైః।**
**దక్షభృగ్వఙ్గిరోముఖ్యైః కుమారేణ భవేన చ॥** 20

**శ్లో॥** **కశ్యపస్యాదితేః ప్రీత్యై సర్వభూతసుఖాయ చ।**
**లోకానాం లోకపాలానామకరోద్వామనం పతిమ్॥** 21

**ప్రతిపదార్థము :** ప్రజాపతిపతిః=ప్రజాపతిశ్రేష్ఠుడైన, బ్రహ్మా=బ్రహ్మ, దేవ=దేవతలతోను, ఋషి=మునులతోను, మను=మనువులతోను, భూమిపైః=రాజులతోను, దక్ష=దక్షునితోను, భృగు=భృగువులతోను, అంగిరోముఖ్యైః=అంగీరసుడు మొ॥వారితోను, కుమారేణ=కుమారు డయిన, భవేన చ=శివునితోను, కశ్యపస్య=కశ్యపునికి, అదితేః=అదితికి, ప్రీత్యై=సంతోషము కొఱకు, సర్వభూత=సమస్త భూతముల యొక్క, సుఖాయచ=సుఖము కొఱకు, లోకానామ్= లోకములకు, లోకపాలానామ్=లోకపాలకులకు, వామనమ్=వామనుని, పతిమ్= ప్రభువునుగా, అకరోత్=చేసెను.

**తాత్పర్యము :** బ్రహ్మదేవుడు ప్రజాపతులతో, దేవ, ఋషి, మను, మహీపతులతోను, దక్ష, భృగు, అంగిరసుడు మొ॥వారితోను, శివునితోను కలసి అదితి కశ్యపులు సంతోషించునట్లు సర్వజీవులకు సుఖము కలుగునట్లుగా వామనుని లోకపతిగా అభిషేకించెను.

**శ్లో॥** **దేవానాం సర్వవేదానాం ధర్మస్య తపసశ్శ్రియః**
**మఙ్గళానాం వ్రతానాం చ కల్పం స్వర్గాపవర్గయోః।**
**ఉపేన్ద్రం కల్పయాఞ్చక్రే ఇతి సర్వవిభూతయే**
**సదా సర్వాణి భూతాని భృశం ముముదిరే నృప!॥** 22

**ప్రతిపదార్థము :** నృప!=మహారాజా!, దేవానామ్=దేవతలకు, సర్వ=సమస్తమయిన, వేదానామ్ =వేదములకు, ధర్మస్య=ధర్మమునకు, తపసః=తపస్సునకు, శ్రియః=సంపదకు, మంగళానామ్ =శుభములకు, వ్రతానాంచ=వ్రతములకు, స్వర్గ=స్వర్గమునకు, అపవర్గయోః=మోక్షమునకు, ఉపేంద్రమ్=వామనుని, కల్పమ్=పరిపాలకునిగా, సర్వవిభూతయే=అందరి ఐశ్వర్యము కొఱకు, కల్పయాంచక్రే=కల్పించెను. ఇతి=అని, సదా=ఎల్లపుడు, సర్వాణి=సమస్తమయిన,

భూతాని=జీవులు, భృశమ్=మిక్కిలి, ముముదిరే=సంతోషించిరి.

**తాత్పర్యము :** దేవతలకు సమస్త వేదాలకు, తపస్సునకు, సంపదకు, శుభములకు, వ్రతములకు, స్వర్గాపవర్గములకు, సమస్త ఐశ్వర్యముల వృద్ధి చెందునట్లు వామనుని పరిపాలకుడుగా బ్రహ్మ నియమించినందుకు సమస్త జీవులు సంతోషించిరి.

**శ్లో॥ తతస్త్విన్ద్రః పురస్కృత్య-దేవయానేన వామనమ్।**
**లోకపాలైర్దివం నిన్యే-బ్రహ్మణా చానుమోదితః॥ 24**

**ప్రతిపదార్థము :** తతఃతు=తరువాత, ఇంద్రః=ఇంద్రుడు, వామనమ్=వామనుని, పురస్కృత్య=గౌరవించి, దేవయానేన=దేవతామార్గముచేత, లోకపాలైః=లోకపాలుల చేత, బ్రహ్మణాచ=బ్రహ్మచేతనున్ను, అనుమోదితః=ఆమోదింపబడినవాడై, దివమ్=స్వర్గమును గూర్చి, నిన్యే=తీసికొని పోయెను.

**తాత్పర్యము :** తరువాత ఇంద్రుడు బ్రహ్మ, లోకపాలకుల యొక్కయు అనుమతితో వామనుని స్వర్గమునకు తీసికొని పోయెను.

**శ్లో॥ ప్రాప్య త్రిభువనం చేన్ద్ర ఉపేన్ద్రభుజపాలితమ్।**
**శ్రియా పరమయా జుష్టో ముముదే గతసాధ్వసః॥ 25**

**ప్రతిపదార్థము :** ఇంద్రః=ఇంద్రుడు, ఉపేంద్ర=ఉపేంద్రుని యొక్క, భుజ=భుజముల చేత, పాలితమ్=పరిపాలింపబడిన, త్రిభువనంచ=లోకత్రయమును, ప్రాప్య=తిఱిగిపొంది, పరమయా=గొప్పదైన, శ్రియా=ఐశ్వర్యముతో, జుష్టః=సేవింపబడినవాడై, గతసాధ్వసః=నిర్భయుడై, ముముదే=సంతోషించెను.

**తాత్పర్యము :** ఇంద్రుడున్ను ఉపేంద్ర భుజశక్తి అండగా తన త్రిలోక రాజ్యమును తిరిగి పొంది మహాసంపదతో నిర్భయముగా సంతోషముగా నుండెను.

**శ్లో॥ బ్రహ్మ శర్వః కుమారశ్చ భృగ్వాద్యా మునయో నృప।**
**పితరస్సర్వభూతాని సిద్ధా వైమానికాశ్చ యే॥ 26**

**శ్లో॥ సుమహత్కర్మ తద్విష్ణోః గాయన్తః పరమాద్భుతమ్।**
**ధిష్ణ్యాని స్వాని తే జగ్మురదితిం చ శశంసిరే॥ 27**

**ప్రతిపదార్థము :** నృప!=రాజా!, బ్రహ్మ=బ్రహ్మయు, శర్వః=శివుడు, కుమారశ్చ=కుమారుడును, భృగ్వాద్యాః=భృగువు మొ॥, మునయః=మునులు, పితరః=పితృదేవతలు, సర్వభూతాని=సమస్త జీవులు, సిద్ధాః=సిద్ధులు, వైమానికాశ్చ=విమాన వాహనులు, యే=ఎవరు గలరో, తే=వారందఱు, విష్ణోః=విష్ణువు యొక్క, తత్=ఆ, సుమహత్=గొప్ప, పరమాద్భుతమ్=పరమాశ్చర్యకరమయిన, కర్మ=పనిని, గాయంతః=కొనియాడుచు, స్వాని=తమతమ, ధిష్ణ్యాని=నివాసములను గూర్చి, జగ్ముః=వెళ్ళిరి. అదితిఇఞ్చ=అదితిని గూడా, శశంసిరే=పొగడిరి.

**తాత్పర్యము :** బ్రహ్మ, శివుడు, కుమారస్వామి, భృగువు మొ॥ మునులు, పితృదేవతలు, సమస్త జీవులు, సిద్ధులు, వైమానికులు అందఱూ మహాద్భుతమైన విష్ణు పరాక్రమమునకు ఆశ్చర్యపడుచు తమ నివాసములకు చేరిరి. దీనికి కారణమయిన 'అదితి'ని ప్రశంసించిరి.

**శ్లో॥ సర్వమేతన్మయాఖ్యాతం భవతః కురునన్దన।**
**ఉరుక్రమస్య చరితం శ్రోతౄణామఘమోచనమ్॥ 28**



**ప్రతిపదార్థము :** కురునందన!=పరీక్షన్మమారాజా!, శ్రోతౄణామ్=శ్రోతలకు, అఘ=పాపములను, మోచనమ్=విడిపించునట్టి, ఉరుక్రమస్య=త్రివిక్రముని యొక్క, చరితమ్=చరిత్ర, ఏతత్=ఇది, సర్వమ్=అంతయు, మయా=నాచేత, భవతః=నీకు, ఖ్యాతమ్=చెప్పబడినది.

**తాత్పర్యము :** పరీక్షిన్మహారాజా! శ్రోతల పాపములను నాశము చేయు త్రివిక్రముని యొక్క చరిత్ర అంతయు నా చేత నీకు చెప్పబడినది.

**శ్లో॥ పారం మహిమ్న ఉరువిక్రమతో గృణానో యః పార్థివాని విమమే స రజాంసి మర్త్యః।**
**కిం జాయమాన ఉత జాత ఉపైతి మర్త్య ఇత్యాహ మన్త్రదృగృషిః పురుషస్య యస్య॥ 29**

**ప్రతిపదార్థము :** ఉరువిక్రమతః=త్రివిక్రముని పక్షమున ఉన్న, మహిమ్నః=మహిమ యొక్క, పారమ్=అంతును, యః=ఏ మానవుడు, గృణానః=కీర్తించునో, సః=ఆ, మర్త్యః=మనుష్యుడు, పార్థివాని=భూసంబంధమయిన, రజాంసి=ధూళికణములను, విమమే=పూర్తిగా లెక్కపెట్టెను. జాయమానః=పుట్టుచున్న, ఉత=లేదా, జాతః=పుట్టిన, మర్త్యః=మానవుడు, ఉపైతి కిమ్=శ్రీహరి గుణసముద్రపారమును పొందగలడా?, ఇతి=అని, యస్య=ఏ, పురుషస్య=పురుషుని యొక్క, మంత్రదృక్=మంత్రద్రష్ట అయిన, ఋషిః=వశిష్ఠమహర్షి, ఆహ=పలికెను.

**తాత్పర్యము :** త్రివిక్రముని గుణగణసముద్రమును ఎవరు అంతు చూడగలరు. అట్లా చూడగలనన్న మనిషి ఎవడయినా భూమియందలి ధూళికణములను పూర్తిగా లెక్క పెట్టినట్లే. ఈ '2' సాధ్యము కాదని అర్థము. పుట్టినవాడు, పుట్టుచున్నవాడు గాని ఏ మనిషి అయినను విష్ణుగుణసముద్రమును తుదకంటా చేరలేడని వశిష్ఠ మహర్షి ఒక మంత్రములో చెప్పెను.

**శ్లో॥ య ఇదం దేవదేవస్య హరేరద్భుతకర్మణః।**
**అవతారానుచరితం శృణ్వన్ యాతి పరాం గతిమ్॥ 30**

**ప్రతిపదార్థము :** దేవదేవస్య=దేవాధిదేవుడు, అద్భుతకర్మణః=ఆశ్చర్య పరాక్రముడైన, హరేః=విష్ణువు యొక్క, ఇదమ్=ఈ, అవతార=అవతారముల యొక్క, అనుచరితమ్=చరిత్రను, యః=ఎవడు, శృణ్వన్=వినునో, సః=వాడు, పరామ్=ఉత్తమమయిన, గతిమ్=గతిని, యాతి=పొందును.

**తాత్పర్యము :** దేవాధిదేవుడయిన శ్రీమన్నారాయణుని ఆశ్చర్యకర్మభరితమయిన ఈ చరిత్రను విన్నవారు పరమగతిని పొందును.

**శ్లో॥ క్రియమాణే కర్మణీదం దైవే పిత్ర్యేఽథ మానుషే।**
**యత్ర యత్రానుకీర్త్యేత తత్తేషాం సుకృతం విదుః॥ 31**

**ప్రతిపదార్థము :** దైవే=దేవతాసంబంధమయినది, పిత్ర్యే=పితృసంబంధమయినది, అథ=మఱియు, మానుషే=మానవ సంబంధమయిన, కర్మణి=కర్మ, క్రియమాణే=చేయబడుచుండగా, ఇదమ్=ఈ చరిత్ర, యత్ర యత్ర=ఎచ్చటెచ్చట, అనుకీర్త్యేత=పఠింపబడునో, తత్=ఆ కర్మను, తేషామ్=వారియొక్క, సుకృతమ్=మంచిగా చేయబడిన పనినిగా, విదుః=ఎఱుగుదురు (అందురు).

**తాత్పర్యము :** దేవ పితృమానవకర్మలు ఆచరించినపుడు ఈ వామనావతార కథను చదివినచో ఆ కర్మలు లోపరహితంగా జరిగినవి అగును.

*ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున '23'వ అధ్యాయము సమాప్తము.*

దీనవత్సల!=దీనులయందు వాత్సల్యము కలిగినవాడా!, రాజన్!=ఓ రాజా!, జ్ఞాతి ఘాతిభ్యః=జ్ఞాతిహింసకులగు, యాదోభ్యః=జలజంతువుల వలన, భీతామ్=భయపడిన దానను, దీనామ్=దీనమైనదానను అగు, మామ్=నన్ను, అస్మిన్=ఈ, సరిజ్జలే=నదీజలము నందు, కథమ్=ఎట్లు, విసృజసే=విడచిపెట్టెదవు?

**తాత్పర్యము :** అప్పుడు ఆ చేప అతిదీనముగ రాజుతో ఇట్లు పలికెను.

ఓ రాజా! జలజంతువులు జ్ఞాతిహింసకులు. వాటినుండి భయపడి నేను నిన్ను ఆశ్రయించితిని. అట్టి నన్ను ఆ నదీజలమునందే ఏల విడచిపెట్టుచున్నావు?

**శ్లో॥ తమాత్మనోఽనుగ్రహార్థం ప్రీత్యా మత్స్యవపుర్ధరమ్।**
**అజానన్ రక్షణార్థాయ శఫర్యాః స మనో దధే॥** 15

**ప్రతిపదార్థము :** ఆత్మనః=తనయొక్క, అనుగ్రహార్థమ్=అనుగ్రహము కొరకు, ప్రీత్యా=సంతోషముతో, మత్స్యవపుర్ధరమ్=చేప శరీరమును ధరించిన, తమ్=ఆ శ్రీమహావిష్ణువును, అజానన్=ఎఱుంగనివాడై, శఫర్యాః=చేపయొక్క, రక్షణార్థాయ=రక్షణ కొఱకు, సః=ఆ సత్యవ్రతుడు, మనః=మనస్సును, దధే=లగ్నము చేసెను.

**తాత్పర్యము :** అప్పుడు సత్యవ్రతుడు ఆ చేపను తనను అనుక్రమించుటకై ఆనందముతో చేపరూపమును ధరించి వచ్చిన శ్రీమన్నారాయణునిగా నెఱుంగక ఆ చేపను రక్షించుట యందు తన మనస్సును లగ్నము చేసెను.

**శ్లో॥ తస్యా దీనతమం వాక్యమాశ్రుత్య స మహీపతిః।**
**కలశాప్సు నిధాయైనాం దయాలుర్నిన్య ఆశ్రమమ్॥** 16

**ప్రతిపదార్థము :** దయాళుః=దయ కలిగిన, సః మహీపతిః=ఆ రాజు, తస్యాః=ఆ చేపయొక్క, దీనతమమ్=అత్యన్తము దీనమగు, వాక్యమ్=వాక్యమును, ఆశ్రుత్య=విని, తామ్=ఆ చేపను, కలశాప్సు=కలశపు నీటియందు, నిధాయ=ఉంచి, ఆశ్రమమ్=ఆశ్రమమును గురించి, నిన్యే=తీసుకొని వెళ్ళెను.

**తాత్పర్యము :** అతిదీనమగు ఆ చేప మాటలను విని దయామయుడైన ఆ మహారాజు కలశపు నీటిలో ఆ చేపను ఉంచి ఆశ్రమమునకు తీసుకొనిపోయెను.

**శ్లో॥ సా తు తత్రైకరాత్రేణ వర్ధమానా కమండలౌ।**
**అలబ్ధ్వాత్మావకాశం వా ఇదమాహ మహీపతిమ్॥** 17

**ప్రతిపదార్థము :** సా తు=ఆ చేప, వర్ధమానా=పెరుగుచున్నదియగుచు, ఏకరాత్రేణ=ఒక్క రాత్రితో, తత్ర కమణ్డలౌ=ఆ కమణ్డలమునందు, ఆత్మావకాశమ్=తనకు చోటును, అలబ్ధ్వా=పొందక, మహీపతిమ్=రాజును గురించి, ఇదమ్=ఈ మాటను, ఆహ=పలికెను.

**తాత్పర్యము :** ఆ చేప క్రమముగ పెరుగుచు ఒక రాత్రికే ఆ కమణ్డలమునందు తనకు చోటు చాలక రాజుతో ఇట్లు పలికెను.

**శ్లో॥ నాహం కమణ్డలావస్మిన్ కృచ్ఛ్రం వస్తుమిహోత్సహే।**
**కల్పయౌకః సువిపులం యత్రాహం నివసే సుఖమ్॥** 18



మహర్షి కుమారుడైన శుక మహర్షి, మత్స్యరూపేణః=చేపగా అవతరించిన శ్రీమహా విష్ణువు చేత, యత్=ఏపని, కృతమ్=చేయబడినదో, విష్ణోః=విష్ణువు యొక్క చరితమ్=ఆ చరిత్రను, ఉవాచ=ఇట్లు పలికెను.

**తాత్పర్యము :** సూతుడు శౌనకాది మహామునులతో ఇట్లు పలికెను. ఓ మునులారా! పరీక్షిన్మహారాజుతో ఇట్లు అడుగబడిన శుకమహర్షి శ్రీమహావిష్ణువు చేప రూపమును ధరించి ఏమేమి చేసెనో ఆ చరితమునంతటిని ఇట్లు చెప్పదొడంగెను.

**శ్రీ శుక ఉవాచ**

**శ్లో॥ గోవిప్రసురసాధూనాం ఛందసామపి చేశ్వరః।**
**రక్షామిచ్ఛంస్తనూర్ధత్తే ధర్మస్యార్థస్య చైవ హి॥** 5

**ప్రతిపదార్థము :** శ్రీ శుకః=శ్రీ శుక మహర్షి, ఉవాచ=పలికెను, ఈశ్వరః=ప్రభువగు శ్రీమహావిష్ణువు, గోవిప్రసురసాధూనామ్=గోవుల యొక్కయు, బ్రాహ్మణుల యొక్కయు, దేవతల యొక్కయు, సత్పురుషుల యొక్కయు, ఛన్దసామపి=వేదముల యొక్కయు, ధర్మస్య=ధర్మము యొక్కయు, అర్థస్య చైవ హి=అర్థము యొక్కయు, రక్షామ్=రక్షణను, ఇచ్ఛన్=కోరుచున్నవాడై, తనూః=శరీరములను, ధత్తే=ధరించుచున్నాడు.

**తాత్పర్యము :** జగత్ప్రభువగు శ్రీమహావిష్ణువు గోవులను, బ్రాహ్మణులను, దేవతలను, సత్పురుషులను, వేదములను, ధర్మమును, అర్థమును రక్షించునభిలాషతోనే పలురకములగు శరీరములతో అవతరించుచుండును.

**శ్లో॥ ఉచ్చావచేషు భూతేషు చరన్ వాయురివేశ్వరః।**
**నోచ్చావచత్వం భజతే నిర్గుణత్వాద్ధియో గుణైః॥** 6

**ప్రతిపదార్థము :** ఈశ్వరః=ప్రభువగు శ్రీహరి, ఉచ్చావచేషు=గొప్పవి, తక్కువవి అగు, భూతేషు=ప్రాణులయందు, వాయుః+ఇవ=గాలి వలె, చరన్=సంచరించువాడైనప్పటికి, నిర్గుణత్వాత్=తాను సహజముగ నిర్గుణుడు అగుట వలన, ధియః=బుద్ధికి సంబంధించిన, గుణైః=గుణములతో, ఉచ్చావచత్వమ్=గొప్పతనమునుగాని, తక్కువదనమును గాని, న భజతే=పొందుట లేదు.

**తాత్పర్యము :** ప్రాణుల యొక్క గొప్పతనము గాని తక్కువదనమును గాని సత్త్వరజస్తమో గుణములను బట్టి వచ్చుచుండును. ఎట్లనగా సత్త్వగుణము ప్రధానముగా కలవారు దేవతలు. అందువలన వారు గొప్పవారు. రజోగుణము ప్రధానముగా కలవారు మనుష్యులు. అందువలన వారు దేవతల కంటే తక్కువవారు. తమోగుణము ప్రధానముగా గలవారు పశుపక్ష్యాదులు. అందువలన వారు మరింత తక్కువ వారుగ మనము చెప్పుకొనుచున్నాము. కాని ఈ సత్త్వరజస్తమోగుణములు బుద్ధికి సంబంధించినవియే కాని ఆత్మకు సంబంధించినవి కావు. పరమాత్మ సహజముగ నిర్గుణుడు. బుద్ధికి సంబంధించిన ఈ గుణములు ఆయనను అంటవు. అందువలననే పరమాత్మ దేవతలలోను, మనుష్యులలోను, పశుపక్ష్యాదులలోను వాయువువలె సంచరించుచున్నను వాటి గొప్పతనముగాని, వాటి తక్కువదనముగాని పరమాత్మను అంటవు.

**శ్లో॥ ఆసీదతీతకల్పాన్తే బ్రాహ్మో నైమిత్తికో లయః।**
**సముద్రోపప్లుతాస్తత్ర లోకా భూరాదయో నృప॥ 7**

**ప్రతిపదార్థము :** నృప!=ఓ పరీక్షిన్మహారాజా!, అతీతకల్పాన్తే=గడచిన కల్పము యొక్క చివరి భాగమున, బ్రాహ్మః=బ్రహ్మదేవునికి సంబంధించిన, నైమిత్తికః=నైమిత్తికమగు, లయః =ప్రళయము, ఆసీత్=ఆయెను. తత్ర=ఆ ప్రళయమునందు, భూరాదయః=భూమి మొదలుగా కల, లోకాః=లోకములు, సముద్రోపప్లుతాః=సముద్రమునందు మునిగినవి.

(కృతత్రేతాద్వాపరకలియుగములను చతుర్యుగమని అందురు. అట్టి చతుర్యుగములు వేయి అయిన అది బ్రహ్మకు ఒక పగలు. దానినే ఒక బ్రహ్మకల్పము అనియు అందురు. మరల అంతే సమయము రాత్రియుండును. ఈ విధమైన అహోరాత్రములు 365 అయిన అది బ్రహ్మకు ఒక సంవత్సరము. అట్టి సంవత్సరములు నూరు బ్రహ్మకు ఆయుష్కాలము. పగటిపూట బ్రహ్మ సృష్టించును. రాత్రి ప్రళయము అగును.)

**తాత్పర్యము :** ఓ పరీక్షిన్మహారాజా! గడచిన కల్పపు చివరిభాగమున బ్రహ్మదేవునికి సంబంధించిన నైమిత్తికమగు ప్రళయము సంభవించెను. ఆ సమయమునందు భూమి మొదలుగా గల లోకములన్నియు సముద్రమునందు మునిగినవి.

**శ్లో॥ కాలేనాగతనిద్రస్య ధాతుః శిశయిషోర్బలీ।**
**ముఖతో నిస్సృతాన్ వేదాన్ హయగ్రీవోऽన్తికేऽహరత్॥ 8**

**ప్రతిపదార్థము :** కాలేన=నిద్రించుకాలము అగుటచే, ఆగతనిద్రస్య=నిద్రవచ్చినవాడును, శిశయిషోః=నిద్రించనిచ్చకలవాడునుఅగు, ధాతుః=బ్రహ్మదేవుని యొక్క, ముఖతః=నోటినుండి, నిస్సృతాన్=బయలువెడలిన, వేదాన్=వేదములను, అంతికే=ఆయన సమీపమునుండి, బలీ=బలవంతుడగు, హయగ్రీవః=హయగ్రీవుడు అను రాక్షసుడు, అహరత్=దొంగిలించెను.

**తాత్పర్యము :** బ్రహ్మదేవునకు రాత్రికాలమగుటచే నిద్రవచ్చెను. అప్పుడు శయనించగోరిన ఆయన నోటినుండి వేదములు బయటికి రాగా ఆ వేదములను మహాబలవంతుడగు హయగ్రీవుడు అను రాక్షసుడు బ్రహ్మదేవుని నుండి దొంగిలించెను.

**శ్లో॥ జ్ఞాత్వా తద్దానవేన్ద్రస్య హయగ్రీవస్య చేష్టితమ్।**
**దధార శఫరీరూపం భగవాన్ హరిరీశ్వరః॥ 9**

**ప్రతిపదార్థము :** భగవాన్=భగవంతుడు, ఈశ్వరః=జగత్ప్రభువును అగు, హరిః =నారాయణుడు, దానవేంద్రస్య=రాక్షస శ్రేష్ఠుడగు, హయగ్రీవస్య=హయగ్రీవుని యొక్క, తత్=ఆ, చేష్టితమ్=పనిని, జ్ఞాత్వా=తెలిసికొని, శఫరీరూపమ్=చేపరూపమును, దధార=ధరించెను.

**తాత్పర్యము :** భగవంతుడు, జగదీశ్వరుడు అగు హరి రాక్షసశ్రేష్ఠుడైన హయగ్రీవుని చేష్టను ఎఱింగినవాడై ఆ వేదములను రక్షించుటకు చేపరూపమును ధరించెను.

**శ్లో॥ తత్ర రాజఋషిః కశ్చిన్నామ్నా సత్యవ్రతో మహాన్।**
**నారాయణపరోऽతప్యత్తపః స సలిలాశనః॥ 10**

**ప్రతిపదార్థము :** తత్ర=ఆ కల్పమునందు, నామ్నా సత్యవ్రతః=సత్యవ్రతుడు అను పేరుగల, మహాన్=గొప్పవాడగు, కశ్చిత్=ఒకానొక, రాజఋషిః=రాజర్షి, సలిలాశనః=జలమే ఆహారముగ స్వీకరించువాడై, నారాయణపరః=నారాయణపరుడై, తపః=తపస్సును, అతప్యత్=చేసెను.

**తాత్పర్యము :** ఆ కల్పమునందు సత్యవ్రతుడు అను పేరుగల గొప్ప రాజర్షి ఉండెను. అతడు నిత్యము జలమునే ఆహారముగా స్వీకరించుచు నిరంతరము నారాయణ ధ్యానపరుడై గొప్ప తపస్సును చేసెను.



**శ్లో॥ యోऽసావస్మిన్ మహాకల్పే తనయః స వివస్వతః।**
**శ్రాద్ధదేవ ఇతి ఖ్యాతో మనుత్వే హరిణార్పితః॥ 11**

**ప్రతిపదార్థము :** యః=పూర్వకల్పము నందు ఏ సత్యవ్రతుడు కలడో, సః అసౌ=ఆ ఈ సత్యవ్రతుడే, అస్మిన్ మహాకల్పే=ఈ మహాకల్పమునందు, వివస్వతః=సూర్యునియొక్క, తనయః =కుమారుడై, శ్రాద్ధదేవః ఇతి=శ్రాద్ధదేవుడు అని, ఖ్యాతః=ప్రసిద్ధిచెందినవాడై, మనుత్వే= మనువుగా, హరిణా=విష్ణువు చేత, అర్పితః=ఉంచబడినాడు.

**తాత్పర్యము :** ఆ సత్యవ్రతుడే ఈ కల్పమునందు శ్రాద్ధదేవుడు అను పేర సూర్యుని కుమారునిగ పుట్టి హరిచేత మనువుగా నుంచబడినాడు.

**శ్లో॥ ఏకదా కృతమాలాయాం కుర్వతో జలతర్పణమ్।**
**తస్యాఞ్జల్యుదకే కాచిచ్ఛఫర్యేకాభ్యపద్యత॥ 12**

**ప్రతిపదార్థము :** ఏకదా=ఒకప్పుడు, కృతమాలాయామ్=కృతమాల అను పేరుగల నది యందు, జలతర్పణమ్=జలతర్పణమును, కుర్వతః=చేయుచున్నటువంటి, తస్య=ఆ సత్యవ్రతుని యొక్క, అంజల్యుదకే=దోసిటి నీటియందు, కాచిత్ ఏకా=ఒకానొక, శఫరీ=చేప, అభ్యపద్యత=కనబడెను.

**తాత్పర్యము :** ఒకనాడు కృతమాలా నదియందు జలతర్పణము చేయుటకై దోసిలితో నీటిని తీసుకొనగా ఆ నీటియందు అతనికి ఒక చేప కనబడెను.

**శ్లో॥ సత్యవ్రతోऽఞ్జలిగతాం సహ తోయేన భారత।**
**ఉత్ససర్జ నదీతోయే శఫరీం ద్రవిడేశ్వరః॥ 13**

**ప్రతిపదార్థము :** భారత=భరత కులశ్రేష్ఠా!, ద్రవిడేశ్వరః=ద్రవిడ దేశాధిపతియగు, సత్యవ్రతః =సత్యవ్రతుడు, అంజలిగతామ్=దోసిలిలోయున్న, శఫరీమ్=చేపను, తోయేన సహ=నీటితో గూడ, నదీతోయే=నదీజలమునందు, ఉత్ససర్జ=విడిచిపెట్టెను.

తాత్పర్యము : భరతకులశ్రేష్ఠా! ద్రవిడ దేశాధిపతియగు సత్యవ్రతుడు తన దోసిలిలో యున్న చేపను నీటితో గూడ నదిలోనికి వదలెను.

**శ్లో॥ తమాహ సాతికరుణం మహాకారుణికం నృపమ్।**
**యాదోభ్యో జ్ఞాతిఘాతిభ్యో దీనాం మాం దీనవత్సల।**
**కథం విసృజసే రాజన్ భీతామస్మిన్ సరిజ్జలే॥ 14**

**ప్రతిపదార్థము :** సా=ఆ చేప, మహాకారుణికమ్=చాలా దయకలవాడగు, తం నృపమ్=ఆ రాజును గురించి, అతికరుణమ్=చాల దీనముగ, ఆహ=పలికెను.

**తాత్పర్యము :** నీ లీలావతారములన్నియు ప్రాణులకు మేలు చేకూర్చునటువంటివియే. అందువలన ఈ మత్స్యరూపమును ఏల ధరించితివో తెలిసికొనగోరుచున్నాను.

**శ్లో॥ న తేఽరవిందాక్ష పదోపసర్పణం మృషా భవేత్సర్వసుహృత్ప్రియాత్మనః।**
**యథేతరేషాం పృథగాత్మనాం సతామ్ అదీదృశో యద్వపురద్భుతం హి నః॥30**

**ప్రతిపదార్థము :** అరవిందాక్ష=పుండరీకాక్షా!, పృథగాత్మనాం సతామ్=దేహాభిమానులగు, ఇతరేషామ్=ఇతర దేవతల యొక్క, పదోపసర్పణమ్=పాదసేవ, యథా=ఏ విధముగా, మృషా=వ్యర్థము, భవేత్=అగునో, సర్వసుహృత్ప్రియాత్మనః=అందరకు ఆత్మభూతుడవగు, తే=నీ యొక్క పాదసేవ, న=అట్లుకాదు, హి=ఏలయనగా, నః=నాకు, అద్భుతమ్=అద్భుతమగు, యద్వపుః=ఈ మత్స్యరూపమును, అదీదృశః=ప్రదర్శించితివి.

**తాత్పర్యము :** పుండరీకాక్షా! దేహాభిమానులగు ఇతర దేవతల పాదసేవ వ్యర్థమగునట్లుగా సర్వభూతములకు అంతరాత్మభూతుడవు అగు నీ పాదసేవ ఎప్పుడును వ్యర్థము కాదు, ఏలయన నాకు నీవీ విచిత్రమగు మత్స్యరూపమును ప్రదర్శించితివి.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

**శ్లో॥ ఇతి బ్రువాణం నృపతిం జగత్పతిః సత్యవ్రతం మత్స్యవపుర్యుగక్షయే।**
**విహర్తుకామః ప్రళయార్ణవేఽబ్రవీత్ చికీర్షురేకాన్తజనప్రియః ప్రియమ్॥ 31**

**ప్రతిపదార్థము :** ఇతి=ఇట్లు, బ్రువాణమ్=పలుకుచున్న, నృపతిమ్=రాజు అయిన, ప్రియమ్=ప్రియమైన, సత్యవ్రతమ్=సత్యవ్రతుని గురించి, మత్స్యవపుః=చేపరూపమును ధరించియున్న, జగత్పతిః=లోకపాలకుడగు శ్రీహరి, యుగక్షయే=యుగాన్తమునందు, ప్రళయార్ణవే=ప్రళయ కాలపు సముద్రమునందు, విహర్తుకామః=విహరించగోరిక గలవాడును, ప్రియమ్=సత్యవ్రతునకు మేలును, చికీర్షుః=చేయకోరిక కలవాడును అయి, అబ్రవీత్=ఇట్లు పలికెను.

తాత్పర్యము : ఇట్లు పలుకుచున్న రాజును గురించి మత్స్యరూపమును ధరించిన శ్రీహరి ప్రళయకాలమునందలి సముద్రమునందు విహరించదలచినవాడును, అతనికి మేలు చేయదలచినవాడును అయి ఇట్లు పలికెను.

**శ్రీ భగవానువాచ :** శ్రీ భగవంతుడు వచించెను.

**శ్లో॥ సప్తమేఽద్యతనాదూర్ధ్వమహన్యేతదరిన్దమ।**
**నిమఙ్క్ష్యత్యప్యయామ్భోధౌ త్రైలోక్యం భూర్భువాదికమ్॥ 32**

**ప్రతిపదార్థము :** అరిన్దమ!=శత్రువులను నశింపజేయువాడా!, అద్యతనాత్=ఈ రోజు నుండి, ఊర్ధ్వమ్=తరువాతది అగు, సప్తమే అహని=ఏడవ రోజునందు, భూర్భువాదికమ్=భూలోకము మొదలుగాగల, త్రైలోక్యమ్=మూడు లోకములు, అప్యయామ్భోధౌ=ప్రళయ కాలపు సముద్రము నందు, నిమంక్ష్యతి=మునిగిపోవును.

**తాత్పర్యము :** ఓ శత్రునాశకా! నేటినుండి ఏడవ దినమున భూలోకము మొదలుగా కల మూడు లోకములు ప్రళయకాలపు సముద్రము నందు మునిగిపోవును.

**శ్లో॥ త్రిలోక్యాం లీయమానాయాం సంవర్తామ్భసి వై తదా।**
**ఉపస్థాస్యతి నౌః కాచిద్విశాలా త్వాం మయేరితా॥ 33**



**ప్రతిపదార్థము :** అహమ్=నేను, ఇహ అస్మిన్ కమణ్డలౌ=ఈ కమణ్డలమునందు, కృచ్ఛ్రమ్=కష్టముగా, వస్తుమ్=నివసించుటకు, న ఉత్సహే=ఇష్టపడుటలేదు, యత్ర=ఎక్కడైతే, అహమ్=నేను, సుఖమ్=సుఖముగ, నివసే=నివసించగలనో, సువిపులమ్=విశాలమైన, ఓకః=అట్టి నివాసస్థానమును, కల్పయ=కల్పించుము.

**తాత్పర్యము :** ఓ రాజా! కమణ్డలము నాకు సరిపోవుట లేదు. ఇచట నివసించుట నాకు కష్టముగానున్నది. కాన నేను ఇచట నివసించలేను. నేను సుఖముగా నివసించుటకు వీలుగ నాకు మరియొక నివాసస్థలమును చూపుము.

**శ్లో॥ స ఏనాం తత ఆదాయ న్యధాదౌదఞ్చనోదకే।**
**తత్ర క్షిప్తా ముహూర్తేన హస్తత్రయమవర్ధత॥ 19**

**ప్రతిపదార్థము :** సః=ఆ రాజు, ఏనామ్=ఈ చేపను, తతః=ఆ కలశము నుండి, ఆదాయ=తీసి, ఔదంచనోదకే=పెద్దగంగాళము నీటియందు, న్యధాత్=ఉంచెను. తత్ర=ఆ గంగాళమునందు, క్షిప్తా=ఉంచబడిన ఆ చేప, ముహూర్తేన=ఒక నిమిషమునకే, హస్తత్రయమ్=మూడు చేతుల పరిమాణమంతగా, అవర్ధత=పెరిగెను.

**తాత్పర్యము :** రాజు చేపను ఆ కలశమునుండి తీసి పెద్ద కటాహములో ఉంచెను. వెంటనే ఆ చేప ఒక నిమిషములోనే మూడు చేతుల పరిమాణముగా పెరిగెను.

**శ్లో॥ న మ ఏతదలం రాజన్ సుఖం వస్తుముదఞ్చనమ్।**
**పృథు దేహి పదం మహ్యం యత్త్వాహం శరణం గతా॥ 20**

**ప్రతిపదార్థము :** రాజన్!=రాజా!, మే=నాకు, ఏతత్ ఉదంచనమ్=ఈ కటాహము, సుఖమ్=సుఖముగా, వస్తుమ్=నివసించుటకు, న అలమ్=తగినది కాదు, మహ్యామ్=నాకు, పృథు=విశాలమగు, పదమ్=స్థానమును, దేహి=ఇమ్ము, యత్=ఏలయనగా, అహమ్=నేను, త్వా=నిన్ను, శరణమ్=శరణమును, గతా=పొందితిని.

**తాత్పర్యము :** ఓ రాజా! ఈ కటాహము కూడ నేను సుఖముగా నివసించుటకు సరిపోదు. నాకు మఱియొక విశాలమగు స్థానమును చూపుము. ఏలయనగా నేను నిన్నే శరణమును వేడితిని.

**శ్లో॥ తత ఆదాయ సా రాజ్ఞా క్షిప్తా రాజన్ సరోవరే।**
**తదావృత్యాత్మనా సోఽయం మహామీనోఽన్వవర్ధత॥ 21**

**ప్రతిపదార్థము :** రాజన్!=ఓ రాజా!, తతః=ఆ కటాహము నుండి, ఆదాయ=తీసికొని, రాజ్ఞా=సత్యవ్రతమహారాజు చేత, సా=ఆ చేప, సరోవరే=చెఱువునందు, క్షిప్తా=ఉంచబడినది, ఆత్మనా=తనతో, తత్=ఆ చెఱువును, ఆవృత్య=కప్పివేయుచు, సో - యం మహామీనః=ఆ ఈ పెద్ద చేప, అన్వవర్ధత=పెరిగెను.

**తాత్పర్యము :** ఓ పరీక్షిన్మహారాజా! సత్యవ్రతుడు చేపను కటాహమునుండి తీసి ఒక సరోవరము లోనికి చేర్చెను. అయినను ఆ మహా మత్స్యము ఆ సరోవరమును కూడ తన శరీరముతో కప్పివేయుచు పెరిగెను.

శ్లో॥ నైతన్మే స్వస్తయే రాజన్నుదకం సలిలౌకసః।
నిధేహి రక్షాయోగేన హ్రదే మామవిదాసిని॥ 22

**ప్రతిపదార్థము :** రాజన్=ఓ రాజా!, సలిలౌకసః=నీటియందు నివసించు, మే=నాకు, ఏతత్ ఉదకమ్=ఈ నీరు, న స్వస్తయే=నా సుఖమునకు సరిపోవునది కాదు, రక్షాయోగేన=నన్ను రక్షించు ఉపాయముతో, అవిదాసిని=క్షీణించని, హ్రదే=గొప్ప చెఱువునందు, నిధేహి=నన్ను ఉంచుము.

**తాత్పర్యము :** పిమ్మట మత్స్యము ఇంకను ఇట్లు పలికెను. రాజా! జలచరమగు నాకు ఈ సరోవరము కూడ చాలుట లేదు. నాకు సరిపోవు మరియొక పెద్ద చెఱువునందు ఉంచి నన్ను రక్షింపుము.

శ్లో॥ ఇత్యుక్తః సోఽనయన్మత్స్యం తత్ర తత్రావిదాసిని।
జలాశయే సమ్మితం తం సముద్రే ప్రాక్షిపజ్ఝషమ్॥ 23

**ప్రతిపదార్థము :** ఇతి+ఉక్తః=అని పలుకబడినవాడై, సః=ఆ రాజు, మత్స్యమ్=ఆ చేపను, తత్ర తత్ర అవిదాసిని=ఆ మా అనుపక్షయమైన చెఱువులకు, అనయత్=తీసికొని వెళ్ళెను, జలాశయే=జలాశయమునందు, అసమ్మితమ్=చోటుచాలని, తం ఝషమ్=ఆ చేపను, సముద్రే=సముద్రమునందు, ప్రాక్షిపత్=పడవైచెను.

శ్లో॥ క్షిప్యమాణస్తమాహేదమిహ మాం మకరాదయః।
అదన్త్యతిబలా వీర మాం నేహోత్స్రష్టుమర్హసి॥ 24

**ప్రతిపదార్థము :** క్షిప్యమాణః=సముద్రమునందు విడచిపెట్టబడుచున్న ఆ చేప, తమ్=ఆ రాజును గురించి, ఇదమ్=ఈ మాటను, ఆహ=పలికెను, వీర!=ఓ వీరుడా!, ఇహ=ఈ సముద్రమునందు, మామ్=నన్ను, మకరాదయః=మొసలి మొదలుగాకల, అతిబలాః=గొప్ప బలముగల జంతువులు, అదన్తి=తినును, ఇహ=ఇచట, మామ్=నన్ను, ఉత్స్రష్టుమ్=విడచి పెట్టుటకు, న అర్హసి=తగవు.

**తాత్పర్యము :** అట్లు సముద్రమునందు విడచిపెట్టబడుచున్న ఆ చేప రాజుతో ఇట్లు పలికెను. ఓ వీరా! ఇచట అత్యన్తము బలము కల మొసలి మొదలగు జంతువులు ఉండును. అవి నన్ను భక్షించగలవు. కాన నన్ను ఇచట విడచిపెట్టవలదు.

శ్లో॥ ఏవం విమోహితస్తేన వదతా వల్గుభారతీమ్।
తమాహ కో భవానస్మాన్ మత్స్యరూపేణ మోహయన్॥ 25

**ప్రతిపదార్థము :** వల్గు=రమణీయమైన, భారతీమ్=వాక్కును, వదతా=పల్కుచున్న, తేన=ఆ చేప చేత, ఏవమ్=ఇట్లు, విమోహితః=విమోహితుడైన రాజు, తమ్=ఆ చేపను గురించి, ఆహ=పలికెను, అస్మాన్=మమ్ములను, మత్స్యరూపేణ=చేపరూపముతో, మోహయన్= భ్రమింప చేయుచున్న, భవాన్=నీవు, కః=ఎవడవు?

**తాత్పర్యము :** ఈ విధమైన రమణీయమైన వాక్కులను పలుకుచున్న చేపచేత విమోహితుడైన రాజు చేపతో ఇట్లు పలికెను. ఓయీ! చేపరూపములో మమ్ములను భ్రమింపజేయుచున్న నీవు సామాన్యుడవు కావు. నీవు ఎవరవు?



శ్లో॥ నైవం వీర్యో జలచరో దృష్టోఽస్మాభిః శ్రుతోఽపి వా।
యో భవాన్ యోజనశతమహ్నాభివ్యానశే సరః॥ 26

**ప్రతిపదార్థము :** యః భవాన్=ఏ నీవు, యోజనశతమ్=నూరు యోజనములు కల, సరః =సరస్సును, అహ్నా=ఒక్క పగలుతోనే, అభివ్యానశే=ఆక్రమించితివి. ఏవం వీర్యః=ఇట్టి పరాక్రమము కల, జలచరః=జలచరము, అస్మాభిః=మాచేత, న దృష్టః=చూడబడలేదు, నాపి శ్రుతః=వినబడలేదు.

**తాత్పర్యము :** నీవు ఒక రోజులోనే నూరు యోజనముల పరిమాణము కల చెఱువును ఆక్రమించితివి. నీవంటి బలముగల జంతువును నేను ఎప్పుడును చూడలేదు, వినలేదు గూడ.

శ్లో॥ నూనం త్వం భగవాన్ సాక్షాద్ధరిర్నారాయణోఽవ్యయః।
అనుగ్రహాయ భూతానాం ధత్సే రూపం జలౌకసామ్॥ 27

**ప్రతిపదార్థము :** నూనమ్=నిశ్చయముగా, త్వమ్=నీవు, సాక్షాత్=కంటికి కనబడుచున్న, భగవాన్=భగవంతుడవైన, అవ్యయః=నాశనములేని, హరిః=హరివి, నారాయణః =నారాయణుడవు, భూతానామ్=ప్రాణులను, అనుగ్రహాయ=అనుగ్రహించుటకు, జలౌకసామ్ =జలచరముల యొక్క, రూపమ్=రూపమును, ధత్సే=ధరించుచున్నావు.

**తాత్పర్యము :** నిశ్చయముగా నీవు మా కంటికి కనబడుచున్న భగవానుడవు, హరివి, నారాయణుడవు, అవ్యయుడవు, ప్రాణులను అనుగ్రహించుటకై ఈ జలచర రూపమును ధరించియున్నావు.

శ్లో॥ నమస్తే పురుషశ్రేష్ఠ స్థిత్యుత్పత్త్యప్యయేశ్వర।
భక్తానాం నః ప్రపన్నానాం ముఖ్యో హ్యాత్మగతిర్విభో॥ 28

**ప్రతిపదార్థము :** స్థిత్యుత్పత్త్యప్యయేశ్వర!=సృష్టి స్థితిలయములకు కారణభూతమైనవాడా!, పురుష శ్రేష్ఠ=పురుషులలో శ్రేష్ఠమైనవాడా!, తే=నీకు, నమః=నమస్కారము, విభో!=ఓ ప్రభూ!, ప్రపన్నానామ్=ఆశ్రయించిన, భక్తానామ్=భక్తులమగు, నః=మాకు, ముఖ్యః=ముఖ్యమైన, ఆత్మగతిః=ఆత్మ దిక్కువు నీవే!

**తాత్పర్యము :** ఓ దేవా! పురుషోత్తమా! నీవే సృష్టిస్థితిలయములకు కారణభూతుడవు. నిన్ను శరణుపొందిన నాబోటి భక్తులకు నీవే ముఖ్యమైన ఆత్మవు, నీవే దిక్కు అగుదువు, పురుషోత్తమా! నీకు నమస్కారము.

శ్లో॥ సర్వే లీలావతారాస్తే భూతానాం భూతిహేతవః।
జ్ఞాతుమిచ్ఛామ్యదో రూపం యదర్థం భవతా ధృతమ్॥ 29

**ప్రతిపదార్థము :** తే=నీయొక్క, లీలావతారాః=లీలతో స్వీకరించిన అవతారములు, సర్వే= అన్నియు, భూతానామ్=ప్రాణులకు, భూతిహేతవః=క్షేమమునకు కారణములు, యదర్థమ్=ఏ ప్రయోజనమును ఉద్దేశించి, అదః రూపమ్=ఈ రూపము, భవతా=నీచేత, ధృతమ్=ధరింప బడినదో, జ్ఞాతుమ్=తెలిసికొనుటకు, ఇచ్ఛామి=కోరుచున్నాను.

**తాత్పర్యము :** అంతకుముందు శ్రీహరి చెప్పినట్లుగా ఆ చేప కొమ్మునందు నౌకను వాసుకితో బంధించి సంతసించినవాడై శ్రీహరిని స్తుతించెను.

**రాజోవాచ :** సత్యవ్రతుడు వచించెను.

**శ్లో॥ అనాద్యవిద్యోపహతాత్మసంవిదః తన్మూలసంసారపరిశ్రమాతురాః।**
**యదృచ్ఛయేహోపసృతా యమాప్నుయుః విముక్తిదో నః పరమో గురుర్భవాన్॥ 46**

**ప్రతిపదార్థము :** అనాద్యవిద్యోపహతాత్మసంవిదః=అనాదియగు అజ్ఞానముతో ఆత్మజ్ఞానము నశించిన వారును, తన్మూలసంసారపరిశ్రమాతురాః=తన్మూలకమగు సంసారశ్రమతో అలసి పోయినవారును, యదృచ్ఛయా=స్వేచ్ఛగా, ఇహ=ఈ లోకమునందు, ఉపసృతాః= సంచరించు చున్నవారును అగు జనులు, యమ్=ఏ విష్ణువును, ఆప్నుయుః=పొందుదురో, విముక్తిదః =మోక్షమును ఇచ్చు, భవాన్=నీవే, నః=మాకు, పరమః=గొప్ప, గురుః=గురుడవు.

**తాత్పర్యము :** అనాదియగు అజ్ఞానముచే ఆత్మజ్ఞానము నశించి ఆ కారణముగా సంసారములో పడి కొట్టుమిట్టాడుచున్న జనులకు ఎప్పటికైనను ఆత్మజ్ఞానము బోధించి స్వస్వరూపమును పొందించగలుగు నీవే దిక్కు. అట్టి నీవే మాకు గురుడవు.

**శ్లో॥ జనోఽబుధోఽయం నిజకర్మబన్ధనః సుఖేచ్ఛయా కర్మ సమీహతేఽసుఖమ్।**
**యత్సేవయా తాం విధునోత్యసన్మతిం గ్రన్థిం స భిన్ద్యాద్ధృదయం స నో గురుః॥ 47**

**ప్రతిపదార్థము :** అబుధః=అజ్ఞానియగు, అయం జనః=ఈ జనుడు, నిజకర్మబన్ధనః=తన కర్మచే బంధింపబడినవాడగచు, సుఖేచ్ఛయా=సుఖమునందలి కోరికచే, అసుఖమ్=దుః ఖకరమగు, కర్మ=కర్మను, సమీహతే=కోరుచున్నాడు. యత్సేవయా=ఎవని సేవచే, తామ్ అసన్మతిమ్=ఆ చెడు బుద్ధిని, విధునోతి=నశింపజేసికొనుచున్నాడో, సః=అట్టి, నః=మా యొక్క, గురుః=గురువగు శ్రీ మహావిష్ణువు, హృదయం గ్రన్థిమ్=హృదయగ్రన్థిని, భిన్ద్యాత్=భేదించుగాక!

తాత్పర్యము : కర్మబద్ధుడు, అజ్ఞానిఅగు ఈ జనుడు సుఖమునందలి వ్యామోహములో దుఃఖకరమగు కర్మలను ఆచరించుచున్నాడు. ఎవని పాదపద్మసేవచే ఆ అజ్ఞానమును నశింప జేసి కొనుచున్నాడో ఆ శ్రీహరియే మాకు దిక్కు. అతడు మా హృదయగ్రన్థులను భేదించుగాక!

**శ్లో॥ యత్సేవయాగ్నేరివ రుద్రరోదనం పుమాన్ విజహ్యాన్మలమాత్మనస్తమః।**
**భజేత వర్ణం నిజమేష సోఽవ్యయో భూయాత్స ఈశః పరమో గురుర్గురుః॥ 48**

**ప్రతిపదార్థము :** రుద్రరోదనమ్=వెండి, అగ్నేః=అగ్ని వలన, ఇవ=వలె, నిజమ్=తనదియగు, వర్ణమ్=రంగును, భజేత=పొందునో, యత్సేవయా=ఎవని సేవచే, పుమాన్=పురుషుడు, ఆత్మనః=తనయొక్క, తమః=అజ్ఞానరూపమగు, మలమ్=దోషమును, విజహ్యాత్=విడచి పెట్టునో, సః=అట్టి, అవ్యయః=నాశరహితుడైన, ఈశః=పరమేశ్వరుడు, నః=మాకు, పరమః =గొప్ప, గురుః=గురువుగా, భూయాత్=అగుగాక!

**తాత్పర్యము :** బంగారము, వెండి మొదలగు లోహములు అగ్నిచే కాల్చబడి తమ మాలిన్యములను విడచునట్లుగా జనుడు ఏ శ్రీమహావిష్ణువును సేవించుటచే తనలోని అజ్ఞానమనెడి మాలిన్యమును తొలగించుకొనునో అట్టి శ్రీహరియే నాకు గురువు అగుగాక!



**ప్రతిపదార్థము :** తదా=అప్పుడు, సంవర్తామ్భసి=ప్రళయకాలపు సముద్రమునందు, త్రిలోక్యామ్ =మూడు లోకములు, లీయమానాయామ్=మునిగిపోవుచుండగా, మయా=నా చేత, ఈరితా= ప్రేరేపించబడిన, కాచిత్=ఒకానొక, విశాలా=పెద్దదియగు, నౌః=నౌక, ఉపస్థాస్యతి=నిన్ను చేరికొనగలదు.

**తాత్పర్యము :** ప్రళయకాలపు సముద్రమునందు మూడు లోకములు అప్పుడు మునిగి పోవును. అదే సమయమునందు నాచే పంపబడిన ఒక విశాలమగు నౌక నీ కడకు వచ్చును.

**శ్లో॥ త్వం తావదోషధీః సర్వా బీజాన్యుచ్చావచాని చ।**
**సప్తర్షిభిః పరివృతః సర్వసత్త్వోపబృంహితః॥ 34**

**శ్లో॥ ఆరుహ్య బృహతీం నావం విచరిష్యస్యవిక్లవః।**
**ఏకార్ణవే నిరాలోకే ఋషీణామేవ వర్చసా॥ 35**

**ప్రతిపదార్థము :** త్వం తావత్=నీవు మాత్రము, సర్వాః=సమస్తములగు, ఓషధీః=ఓషధులను, ఉచ్చావచాని=పలురకములగు, బీజాన్=విత్తనములను (గృహీత్వా=తీసుకొని), సప్తర్షిభిః=సప్త మహర్షులతో, పరివృతః=పరివేష్టితుడవై, సర్వసత్త్వోపబృంహితః=సమస్త జంతుసహితుడవై, అవిక్లబః=దైన్యములేనివాడవై, బృహతీమ్=గొప్పదియగు, నావమ్=నౌకను, ఆరుహ్య=ఎక్కి, నిరాలోకే=వెలుతురు లేని, ఏకార్ణవే=ఒకే ఒక సముద్రమునందు, ఋషీణామ్=సప్తర్షుల యొక్క, వర్చసా ఏవ=తేజస్సుతోనే, విచరిష్యసి=సంచరించగలవు.

**తాత్పర్యము :** అనంతరము నీవు సమస్తములగు ఓషధులను, బీజములను తీసుకొని, సప్త మహర్షులతోను, సమస్తజంతువులతోను కూడినవాడవై విచారములేక ఆ నౌకను ఎక్కి వెలుతురు లేని ఆ సముద్రమునందు సప్త మహర్షుల తేజస్సుతో విహరించగలవు.

**శ్లో॥ దోధూయమానాం తాం నావం సమీరేణ బలీయసా।**
**ఉపస్థితస్య మే శృఙ్గే నిబధ్నీహి మహాహినా॥ 36**

**ప్రతిపదార్థము :** బలీయసా=బలమైన, సమీరేణ=గాలితో, దోధూయమానామ్=మిక్కిలి కంపించుచున్న, తాం నావమ్=ఆ నౌకను, ఉపస్థితస్య=నీ వద్దకు వచ్చిన, మే=నాయొక్క, శృంగే=కొమ్మునందు, మహాహినా=వాసుకి అను పాముతో, నిబధ్నీహి=బంధించుము.

**తాత్పర్యము :** బలమైన ఈదురుగాలులతో విసరిగొట్టబడుచున్న ఆ నావ యొద్దకు నేను వచ్చెదను. నా శిరస్సు మీద ఒక కొమ్ము ఉండును. ఆ కొమ్ము నందు వాసుకి అను సర్పముతో నీ నావను కట్టివేయుము.

**శ్లో॥ అహం త్వామృషిభిః సాకం సహనావముదన్వతి।**
**వికర్షన్ విచరిష్యామి యావద్బ్రాహ్మీ నిశా ప్రభో॥ 37**

**ప్రతిపదార్థము :** ప్రభో=ఓ రాజా!, యావత్ బ్రహ్మ నిశా=బ్రహ్మ సంబంధమైన నిద్ర యున్నంత వరకు, ఉదన్వతి=సముద్రమునందు, ఋషిభిః=ఋషులతో, సాకమ్=కూడ, సహనావమ్= నౌకతో కూడ, త్వామ్=నిన్ను, అహమ్=నేను, వికర్షన్=లాగుచు, విచరిష్యామి=సంచరించు చుండగలను.

**తాత్పర్యము :** ఓ రాజా! నేను బ్రహ్మసంబంధమైన రాత్రి యున్నంతవరకు, ఋషులతో కూడియున్న నిన్ను నౌకతో గూడ లాగుచు సంచరించుచుండగలను.

**శ్లో॥ మదీయ మహిమానం చ పరబ్రహ్మేతి శబ్దితమ్।**
**వేత్స్యస్యనుగృహీతం మే సంప్రశ్నైర్వివృతం హృది॥ 38**

**ప్రతిపదార్థము :** మే=నాయొక్క, అనుగృహీత=అనుగ్రహముచే నొసంగబడినదియు, సంప్రశ్నైః =నీ ప్రశ్నములతో, హృది=హృదయమునందు, వివృతమ్=వివరించబడినదియు, పరబ్రహ్మ ఇతి=పరబ్రహ్మము అను పేరుతో, శబ్దితమ్=చెప్పబడినదియునగు, మదీయమహిమానం చ=నా మహిమను గూడ, వేత్స్యసి=తెలిసి కొనగలవు.

**తాత్పర్యము :** అప్పుడు నీవు రకరకములగు ప్రశ్నలతో అడుగుచుండగా నేను అనుగ్రహించి పరబ్రహ్మ అను పేరు చెప్పబడు నా మహిమను నీ హృదయమునకు వివరించగలను.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు పచించెను.

**శ్లో॥ ఇత్థమాదిశ్య రాజానం హరిరన్తరధీయత।**
**సోఽన్వవైక్షత తం కాలం యం హృషీకేశ ఆదిశత్॥ 39**

**ప్రతిపదార్థము :** ఇత్థమ్=ఇట్లు, రాజానమ్=రాజును, ఆదిశ్య=ఆదేశించి, హరిః=విష్ణువు, అన్తరధీయత=అంతర్ధానము చెందెను. యమ్=ఏ కాలమును, హృషీకేశః=విష్ణువు, ఆదిశత్= ఆదేశించెనో, తం కాలమ్=ఆ కాలమును గురించి, సః=ఆ సత్యవ్రత మహారాజు, అన్వవైక్షత= నిరీక్షించెను.

**తాత్పర్యము :** రాజును ఈ విధముగ ఆదేశించి హరి అన్తర్ధానము చెందెను. సత్యవ్రత మహారాజును హరి చెప్పిన కాలమునకై నిరీక్షించుచుండెను.

**శ్లో॥ ఆస్తీర్య దర్భాన్ ప్రాక్కూలాన్ రాజర్షిః ప్రాగుదఙ్ముఖః।**
**నిషసాద హరేః పాదౌ చిన్తయన్ మత్స్యరూపిణః॥ 40**

**ప్రతిపదార్థము :** రాజర్షిః=రాజర్షియగు సత్యవ్రతుడు, ప్రాక్కూలాన్=పూర్వాగ్రములైన, దర్భాన్= దర్భలను, ఆస్తీర్య=పరచి, ప్రాగుదఙ్ముఖః=ఈశాన్యాభిముఖుడై, మత్స్యరూపిణః=మత్స్యరూపి యగు, హరేః=విష్ణువు యొక్క, పాదౌ=పాదములను, చింతయన్=ధ్యానించుచు, నిషసాద= కూర్చుండెను.

**తాత్పర్యము :** రాజు దర్భలను తూర్పువైపు అగ్రములుండునట్లుగ పరచి మత్స్యరూపధారియగు శ్రీమహావిష్ణువు పాదములను ధ్యానించుచు ఆ దర్భలయందు ఈశాన్యదిక్కునకు అభిముఖముగ తాను కూర్చొండెను.

**శ్లో॥ తతః సముద్ర ఉద్వేలః సర్వతః ప్లావయన్మహీమ్।**
**వర్ధమానో మహామేఘైర్వర్షద్భిః సమదృశ్యత॥ 41**

**ప్రతిపదార్థము :** తతః=అనంతరము, వర్షద్భిః=వర్షించుచున్న, మహామేఘైః=గొప్ప మేఘములతో, వర్ధమానః=పెరుగుచున్నదియగుచు, ఉద్వేలః=చెలియలు కట్టలు తెంచుకున్నది యగుచు, సముద్రః=సముద్రము, మహీమ్=భూమిని, సర్వతః=అన్ని వైపుల, ప్లావయన్= ముంచుచూ, సమదృశ్యత=కనబడెను.



**తాత్పర్యము :** అనంతరము హరిచెప్పిన కాలమునకు మహామేఘములు వర్షించుచుండగా ప్రవర్ధమానమైన సముద్రము భూమిని అన్నివైపులా ముంచుచూ సత్యవ్రతునకు కనిపించెను.

**శ్లో॥ ధ్యాయన్ భగవదాదేశం దదృశే నావమాగతామ్।**
**తామారురోహ విప్రేన్ద్రైరాదాయౌషధివీరుధః॥ 42**

**ప్రతిపదార్థము :** రాజా=రాజు, భగవదాదేశమ్=భగవంతుని ఆదేశమును, ధ్యాయన్= ధ్యానించుచు, ఆగతామ్=తన వద్దకు వచ్చిన, నావమ్=నౌకను, దదృశే=చూచెను, ఓషధివీరుధః =ఓషధీలతలను, ఆదాయ=తీసుకుని, విప్రేన్ద్రైః=ద్విజశ్రేష్ఠులైన సప్తమహర్షులతో కలసి, తామ్= ఆ నౌకను, ఆరోరుహ=ఎక్కెను.

**తాత్పర్యము :** భగవదాదేశానుసారము తన కడకు వచ్చిన నావను రాజు చూచెను. ఓషధీలతలను తీసుకొని సప్తమహర్షులతో కలసి ఆ నౌకను ఎక్కెను.

**శ్లో॥ తమూచుర్మునయః ప్రీతా రాజన్ ధ్యాయస్వ కేశవమ్।**
**స వై నః సఙ్కటాదస్మాదవితా శం విధాస్యతి॥ 43**

**ప్రతిపదార్థము :** ప్రీతాః=సంతసించిన, మునయః=మహర్షులు, తమ్=ఆ సత్యవ్రతుని గురించి, ఊచుః=పలికిరి, రాజన్=ఓ రాజా!, కేశవమ్=విష్ణుమూర్తిని, ధ్యాయస్వ=ధ్యానించుము, నః =మన యొక్క, అస్మాత్=ఈ, సంకటాత్=కష్టము నుండి, సః=ఆ విష్ణువు, అవితా=రక్షించ గలడు, శమ్=మంగళమును, విధాస్యతి=చేయగలడు.

**తాత్పర్యము :** మునులు సంతసించినవారై రాజుతో ఇట్లు పలికిరి. ఓ రాజా శ్రీహరిని ధ్యానించుము. ఆ శ్రీహరియే మనకు వచ్చిన కష్టములను తొలగించి మనకు సుఖము చేకూర్చగలడు.

**శ్లో॥ సోఽనుధ్యాతస్తతో రాజ్ఞా ప్రాదురాసీన్మహార్ణవే।**
**ఏకశృఙ్గధరో మత్స్యో హైమో నియుతయోజనః॥ 44**

**ప్రతిపదార్థము :** తతః=అనంతరము, రాజ్ఞా=సత్యవ్రత మహారాజుచే, అనుధ్యాతః=ధ్యానించ బడినవాడైన, సః=ఆ విష్ణువు, నియుతయోజనః=నాలుగు లక్షల క్రోసుల పరిమాణము కలదియు, హైమః=బంగారుమయమైనదియు, ఏక శృంగః=ఒక కొమ్ముకలదియు అగు, మత్స్యః=చేపగా, మహార్ణవే=గొప్ప సముద్రమునందు, ప్రాదురాసీత్=ప్రాదుర్భవించెను.

**తాత్పర్యము :** అనంతరము రాజు ధ్యానించుచుండగా శ్రీమహావిష్ణువు నాలుగు లక్షల క్రోసుల పరిమాణము గలదియు, ఒక కొమ్ము కలదియు, బంగారు కాంతి కలదియు అగు చేపగా ప్రళయకాలపు సముద్రమునందు ఆవిర్భవించెను.

**శ్లో॥ నిబధ్య నావం తచ్ఛృఙ్గే యథోక్తో హరిణా పురా।**
**వరత్రేణాహినా తుష్టస్తుష్టావ మధుసూదనమ్॥ 45**

**ప్రతిపదార్థము :** పురా=పూర్వము, హరిణా=విష్ణువు చేత, యథోక్తః=చెప్పబడినట్లుగా, నావమ్ =నౌకను, తచ్ఛృంగే=ఆ చేప కొమ్మునందు, వరత్రేణ అహినా=వాసుకి అను సర్పముతో, నిబధ్య=బంధించి, తుష్టః=సంతసించినవాడై, మధుసూదనమ్=మధుసూదనుని, తుష్టావ= స్తోత్రము చేసెను.

**తాత్పర్యము :** సత్యవ్రతుని యొక్కయు, మత్స్యరూపధారియగు శ్రీమహావిష్ణువు యొక్కయు సంభాషణ రూపమగు ఈ గొప్పచరిత్రను వినినవారు సకల పాపములనుండి విముక్తు లగుదురు.

**శ్లో॥ అవతారం హరేర్యోఽయం కీర్తయేదన్వహం నరః।**
**సఙ్కల్పాస్తస్య సిద్ధ్యన్తి స యాతి పరమాం గతిమ్॥ 60**

**ప్రతిపదార్థము :** యః అయం నరః=ఏ మానవుడు, అన్వహమ్=ప్రతిదినము, హరేః=విష్ణువు యొక్క, అవతారమ్=మత్స్యావతారమును, కీర్తయేత్=కీర్తించునో, తస్య=అతని యొక్క, సంకల్పాః=కోరికలు, సిద్ధ్యన్తి=నెరవేరును, సః=ఆ మానవుడు, పరమామ్=గొప్పదియగు, గతిమ్=గతిని, యాతి=పొందును.

**తాత్పర్యము :** ఏ మానవుడు ప్రతిదినము శ్రీహరియొక్క మత్స్యావతారచరిత్రమును పఠించునో అతని కోరికలు అన్నియును ఈ లోకమునందు నెరవేరును. అంతియేగాక మరణించిన పిమ్మట సద్గతిని పొందును.

**శ్లో॥ ప్రళయపయసి ధాతుః సుప్తశక్తేర్ముఖేభ్యః శ్రుతిగణమపనీతం ప్రత్యుపాదత్త హత్వా।**
**దితిజమకథయద్యో బ్రహ్మ సత్యవ్రతానాం తమహమఖిలహేతుం జిహ్మమీనం నతోఽస్మి॥61**

**ప్రతిపదార్థము :** యః=మత్స్యరూపమును ధరించిన ఏ విష్ణువు, దితిజమ్=హయగ్రీవుడు అను రాక్షసుని, హత్వా=చంపి, సుప్తశక్తేః=నిద్రాభిభూతుడగు, ధాతుః=బ్రహ్మదేవుని యొక్క ముఖేభ్యః=ముఖములనుండి, అపనీతమ్=దొంగిలించబడిన, శ్రుతిగణమ్=నాలుగు వేదములను, ప్రళయపయసి=ప్రళయజలమునందు, ప్రత్యుపాదత్త=మరల బ్రహ్మదేవునకు యొసంగెనో, సత్యవ్రతానామ్=సత్యవ్రతుడు మొదలుగా కలవారికి, బ్రహ్మ=బ్రహ్మతత్త్వమును, అకథయత్=చెప్పెనో, అఖిలహేతుమ్=చరాచరప్రపంచమునకు కారణభూతుడును, జిహ్మమీనమ్=మాయామత్స్యవేషధారియును అగు, తమ్=అట్టి శ్రీమహావిష్ణువును, అహమ్=నేను, నతో – స్మి=నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :** ఏ శ్రీమహావిష్ణువు తాను ప్రళయకాలమునందలి జలమునందు మత్స్య రూపముతో విహరించుచు, నిద్రించుచున్న బ్రహ్మదేవుని నోటినుండి బయలువెడలిన వేదసమూహమును దొంగిలించిన హయగ్రీవుడను రాక్షసేన్ద్రుని వధించి వేదములను బ్రహ్మకు తిరిగి యొసంగెనో, సత్యవ్రతుడు మొదలుగాగలవారికి పరమాత్మతత్త్వమును ఎఱింగించెనో అట్టి శ్రీమన్నారాయణుని నేను నమస్కరించుచున్నాను.

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే అష్టమస్కంధే మత్స్యావతారచరితానువర్ణనం నామ
చతుర్వింశో – ధ్యాయః

ఇది శ్రీమద్భాగవతమహాపురాణమున అష్టమస్కంధమున *24వ* అధ్యాయము.



**శ్లో॥ న యత్ప్రసాదాయుతభాగలేశమన్యే చ దేవా గురవో జనాః స్వయమ్।**
**కర్తుం సమేతాః ప్రభవన్తి పుంసః తమీశ్వరం త్వాం శరణం ప్రపద్యే॥ 49**

**ప్రతిపదార్థము :** పుంసః=పురుషునకు, సమేతాః=కలసినటువంటి, అన్యే=ఇతరులగు, దేవాః=దేవతలు, గురవః=గురువులు, జనాః=జనులు, స్వయమ్=స్వయముగా, యత్ప్రసాదాయుత భాగలేశమ్=ఎవని అనుగ్రహములో పదివేలవ వంతులో స్వల్పభాగమైనను, కర్తుమ్=చేయుటకు, న ప్రభవన్తి=సమర్థులు కారో, తమ్=అటువంటి, ఈశ్వరమ్=లోకపాలకుడవగు, త్వామ్=నిన్ను, శరణమ్=శరణముగా, ప్రపద్యే=పొందుచున్నాను.

**తాత్పర్యము :** విష్ణువు కంటె ఇతరులగు దేవతలు, గురువులు, జనులు అందరు కలసినను ఎవని అనుగ్రహము యొక్క పదివేలవవంతులో స్వల్ప భాగమైనను అందించుటకు సమర్థులు కారో అట్టి శ్రీహరిని నేను శరణు వేడుచున్నాను.

**శ్లో॥ అచక్షురన్ధస్య యథాగ్రణీః కృతస్తథా జనస్యావిదుషోఽబుధో గురుః।**
**త్వమర్కదృక్ సర్వదృశాం సమీక్షణో వృతో గురుర్నః స్వగతిం బుభుత్సతామ్॥50**

**ప్రతిపదార్థము :** అన్ధస్య=గుడ్డివానికి, అచక్షుః=కనులు లేనివాడు, యథా=ఎట్లు, అగ్రణీః=నాయకుడుగా, కృతః=చేయబడెనో, అవిదుషః=అవిద్వాంసుడగు, జనస్య=జనునకు, అబుధః=అజ్ఞానియగు, గురుః=గురువు, తథా=అట్లే అగుచున్నాడు. సర్వదృశామ్=సర్వేన్ద్రియములకు, సమీక్షణః=ప్రకాశకుడవు, అర్కదృక్=సూర్యునివంటివాడవు అయిన, త్వమ్=నీవు, స్వగతిమ్=ఆత్మజ్ఞానమును, బుభుత్సతామ్=తెలిసికొనగోరిక గల, నః=మాకు, గురుః=గురువుగ, వృతః=వరింపబడితివి.

**తాత్పర్యము :** ఒక గ్రుడ్డివానికి మరొక గ్రుడ్డివాడు మార్గమును చూపించినట్లుగా అజ్ఞాని అగు శిష్యునికి మరొక అజ్ఞానియగు గురువు అట్లే అగుచున్నాడు. నీవు సర్వేన్ద్రియములను ప్రకాశింపజేయునట్టివాడవు. సూర్యునివంటివాడవు, ఆత్మజ్ఞానమును తెలిసికొనగోరిన మేము నిన్ను గురువుగా వరించితిమి. మాకు జ్ఞానమును ఉపదేశించుము.

**శ్లో॥ జనో జనస్యాదిశతేఽసతీం గతిం యయా ప్రపద్యేత దురత్యయం తమః।**
**త్వం త్వవ్యయం జ్ఞానమమోఘమఞ్జసా ప్రపద్యతే యేన జనో నిజం పదమ్॥51**

**ప్రతిపదార్థము :** యయా=పగలుచే, దురత్యయమ్=దాటుటకు శక్యముకాని, తమః=అజ్ఞానమును చీకటిని, ప్రపద్యేత=పొందునో, జనః=ప్రాకృతమగు గురువు, జనస్య=తన శిష్యునకు, అసతీమ్=చెడుదియగు, గతిమ్=అట్టి మార్గమును, ఆదిశతే=ఉపదేశించును, యేన=ఏ మార్గముతో, అఞ్జసా=శీఘ్రముగ, జనః=జనుడు, అవ్యయమ్=నాశరహితమగు, నిజం పదమ్=తన స్వరూపమును, ప్రపద్యతే=పొందునో, త్వమ్=నీవు (తాం గతిమ్=అట్టి మార్గమును, ఆదిశసే=ఉపదేశించెదవు.)

**తాత్పర్యము :** ప్రాకృతమగు గురువు అర్థకామాది బుద్ధిని యొసంగును. దానిచే అతడు దుస్తరమగు అజ్ఞానాంధకారమునే పొందును. కాని నీవు మాత్రము నాశరహితమగు స్వస్వరూపమును పొందుటకు అనువైన ఆత్మజ్ఞానమును ఉపదేశించెదవు.

శ్లో॥ త్వం సర్వలోకస్య సుహృత్ప్రియేశ్వరో హ్యాత్మా గురుర్జ్ఞానమభీష్టసిద్ధిః।
తథాపి లోకో న భవన్తమన్ధధీర్జానాతి సన్తం హృది బద్ధకామః॥ 52

**ప్రతిపదార్థము :** త్వమ్=నీవు, సర్వలోకస్య=సమస్త లోకమునకు, సుహృత్=మిత్రుడవు, ప్రియేశ్వరః=ప్రియుడవు, ప్రభుడవు, ఆత్మా=ఆత్మవు, గురుః=గురుడవు, జ్ఞానమ్=జ్ఞానము, అభీష్టసిద్ధిః=కోరికలు తీర్చువాడవు, తథాపి=అయినప్పటికి, అన్ధధీః=మూఢమగు, లోకః =లోకము, హృది=హృదయమునందు, బద్ధకామః=కోరికలతో బంధింపబడినదియగుచు, సన్తమ్=సత్యస్వరూపుడవగు, భవన్తమ్=నిన్ను, న జానాతి=ఎఱుంగకున్నది.

తాత్పర్యము : నీవు సమస్తలోకమునకు మిత్రుడవు, ప్రియుడవు, ఈశ్వరుడవు, ఆత్మవు, గురుడవు, జ్ఞానమువు, ఆత్మవు, కోరికలు తీర్చువాడవు. అయినను నిన్ను గుర్తించ లేకున్నది.

శ్లో॥ త్వం త్వామహం దేవవరం వరేణ్యం ప్రపద్య ఈశం ప్రతిబోధనాయ।
ఛిన్ధ్యర్థదీపైర్భగవన్ వచోభిః గ్రన్థీన్ హృదయ్యాన్ వివృణు స్వమోకః॥ 53

**ప్రతిపదార్థము :** దేవవరమ్=దేవతలలో శ్రేష్ఠుడవు, ఈశమ్=జగత్ప్రభువు అయిన, త్వామ్= నిన్ను, ప్రతిబోధనాయ=జ్ఞానముకొరకు, ప్రపద్యే=ఆశ్రయించుచున్నాను. భగవన్=ఓ భగవంతుడా!, త్వమ్=నీవు, అర్థదీపైః=పరమార్థము ఎరింగించు, వచోభిః=మాటలతో, హృదయ్యాన్=హృదయమునకు సంబంధించిన, గ్రన్థీన్=గ్రన్థులను, ఛిన్ధి=ఛేదించుము, స్వమోక్ష =నీ స్థానమును, వివృణు=వివరించుము.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! నీవు దేవతలలో శ్రేష్ఠుడవు. లోకపాలకుడవు. అట్టి నిన్ను జ్ఞానము కొరకై శరణువేడుచున్నాను. నీవు పరమార్థప్రకాశకములగు వాక్కులతో నా హృదయ గ్రన్థులను ఛేదించి నాకు నీ స్థానమును వివరించుము.

**శ్రీ శుక ఉవాచ :** శ్రీ శుకుడు వచించెను.

శ్లో॥ ఇత్యుక్తవన్తం నృపతిం భగవానాదిపూరుషః।
మత్స్యరూపీ మహామ్భోధౌ విహరంస్తత్త్వమబ్రవీత్॥ 54

**ప్రతిపదార్థము :** ఇతి=ఈ విధముగ, ఉక్తవన్తమ్=పలికిన, నృపతిమ్=రాజును గురించి, మత్స్యరూపీ=మత్స్యరూపమును ధరించిన, భగవాన్=భగవంతుడైన, ఆదిపూరుషః =శ్రీమన్నారాయణుడు, మహామ్భోధౌ=మహాసముద్రమునందు, విహరన్=విహరించుచు, తత్త్వమ్=పరమాత్మతత్త్వమును, అబ్రవీత్=చెప్పెను.

**తాత్పర్యము :** ఈ విధముగ స్తోత్రము చేయుచున్న రాజునకు మత్స్యరూపధారియగు శ్రీమన్నారాయణుడు ప్రళయ సముద్రమునందు విహరించుచు తత్త్వజ్ఞానమును బోధించెను.

శ్లో॥ పురాణసంహితాం దివ్యాం సాఙ్ఖ్యయోగక్రియావతీమ్।
సత్యవ్రతస్య రాజర్షేరాత్మగుహ్యమశేషతః॥ 55

**ప్రతిపదార్థము :** రాజర్షేః=రాజర్షియగు, సత్యవ్రతస్య=సత్యవ్రతునికి, దివ్యామ్=దివ్యమైనది యగు, సాంఖ్యయోగక్రియావతీమ్=సాంఖ్యయోగ కర్మలతో కూడినదియునగు, పురాణ సంహితామ్=పురాణ సంహితను, ఆత్మగుహ్యతామ్=ఆత్మజ్ఞానమును, అశేషతః=సంపూర్ణముగ చెప్పెను.



**తాత్పర్యము :** భగవంతుడైన శ్రీహరి సత్యవ్రతునకు సంపూర్ణముగ ఆత్మతత్త్వమును, సాంఖ్యయోగక్రియలతో కూడిన పురాణసంహితను చెప్పెను.

శ్లో॥ అశ్రౌషీదృషిభిః సాకమాత్మతత్త్వమసంశయమ్।
నావ్యాసీనో భగవతా ప్రోక్తం బ్రహ్మ సనాతనమ్॥ 56

**ప్రతిపదార్థము :** నావి=నౌకయందు, ఆసీనః=కూర్చునియున్న సత్యవ్రతుడు, ఋషిభిః సాకమ్ =ఋషులతో కూడ, భగవతా=నారాయణునిచేత, ప్రోక్తమ్=చెప్పబడిన, సనాతనమ్= పురాతనమైన, బ్రహ్మ=పరబ్రహ్మస్వరూపమైన, ఆత్మతత్త్వమ్=ఆత్మతత్త్వమును, అసంశయమ్= సంశయములు లేనట్లుగ, అశ్రౌషీత్=వినెను.

**తాత్పర్యము :** నౌకయందు కూర్చున్న సత్యవ్రత మహారాజు ఋషులతో కలసి భగవంతునిచే చెప్పబడుచున్న పరబ్రహ్మతత్త్వజ్ఞానమును సంశయరహితముగ వినెను.

శ్లో॥ అతీతప్రళయాపాయ ఉత్థితాయ సవేధసే।
హత్వాసురం హయగ్రీవం వేదాన్ ప్రత్యాహరద్ధరిః॥ 57

**ప్రతిపదార్థము :** అతీతప్రళయాపాయే=స్వాయంభువ మన్వంతర ప్రళయావసానము నందు, ఉత్థితాయ=నిదురనుండి మేల్కొనిన, వేధసే=బ్రహ్మకొఱకు, సః హరిః=మత్స్యరూపియగు శ్రీమన్నారాయణుడు, హయగ్రీవమ్=హయగ్రీవుడు అను పేరుగల, అసురమ్=రాక్షసుని, హత్వా=చంపి, వేదాన్=వేదములను, ప్రత్యాహరత్=తిరిగి ఇచ్చెను.

**తాత్పర్యము :** స్వాయంభువమన్వన్తరప్రళయావసానమునందు నిదురనుండి మేల్కొనిన బ్రహ్మకు హయగ్రీవాసురుని సంహరించి వేదములను తిరిగి ఇచ్చెను.

శ్లో॥ స తు సత్యవ్రతో రాజా జ్ఞానవిజ్ఞానసంయుతః।
విష్ణోః ప్రసాదాత్ కల్పేఽస్మిన్నాసీద్వైవస్వతో మనుః॥ 58

**ప్రతిపదార్థము :** జ్ఞానవిజ్ఞానసంయుతః=జ్ఞానవిజ్ఞానములతో కూడిన, సత్యవ్రతః =సత్యవ్రతుడను పేరుగల, సః రాజా=ఆరాజు, విష్ణోః=విష్ణువు యొక్క, ప్రసాదాత్= అనుగ్రహము వలన, అస్మిన్ కల్పే=ఈ కల్పమునందు, వైవస్వతః=వైవస్వతుడు అను పేరుగల, మనుః=మనువుగా, ఆసీత్=ఆయెను.

**తాత్పర్యము :** సత్యవ్రతుడును ఐహికాముష్మిక జ్ఞానములు కలవాడై విష్ణువు యొక్క అనుగ్రహముచే ఈ కల్పమునందు వైవస్వతమనువుగా ఆయెను.

శ్లో॥ సత్యవ్రతస్య రాజర్షేర్మాయామత్స్యస్య శార్ఙ్గిణః।
సంవాదం మహదాఖ్యానం శ్రుత్వా ముచ్యేత కిల్బిషాత్॥ 59

**ప్రతిపదార్థము :** రాజర్షేః=రాజర్షియగు, సత్యవ్రతస్య=సత్యవ్రతుని యొక్కయు, మాయా మత్స్యస్య=మాయామత్స్యము అగు, శార్ఙ్గిణః=విష్ణువు యొక్కయు, సంవాదమ్=సంభాషణ రూపమగు, మహత్=గొప్పదియగు, ఆఖ్యానమ్=ఈ చరిత్రను, శ్రుత్వా=విని, కిల్బిషాత్= పాపమునుండి, ముచ్యేత=విముక్తులగుదురు.